జోషి, పి. సి.

# అంతిమ పోరాటానికి కదలిరండు!

బెజవాడ, 1946

Record no. 72

Jōṣī, Pi. Si.

Aṃtima pōrāṭāniki kadaliraṇḍu!

Bejavāḍa, 1946

Record no. 72

## Bibliographic Record Target

జోషీ, పి. సి.

అంతిమ పోరాటానికి కదలిరండు! / పి. సి. జోషీ. - బెజవాడ : ప్రజాశక్తి ప్రచురణాలయం, 1946.

112 p. (1) leaf of plate. ;15 cm.

Record no. 72

Jōṣī, Pi. Si.

Aṃtima pōrāṭāniki kadaliraṇḍu! / Pi. Si. Jōṣī. - Bejavāḍa : Prajāśakti Pracuraṇālayaṃ, 1946.

112 p. (1) leaf of plate. ;15 cm.

Record no. 72

# అంతిమ పోరాటానికి కదలిరండు

—|—

పి. సి. జోషి

—|—

ప్రజాశక్తి ప్రచురణాలయం,
మొగల్రాజపురం :: బెజవాడ





ప్రజాశక్తి ప్రెస్, మొగల్‌రాజ పురం, బెజవాడ.

పర్మిట్ నెం. క. 18/సి.—10,000 — 29—1—46

# ప్ర వే శి క

ఇవాళటి ప్రధాన సమస్య భారత స్వాతంత్ర్యం,

ప్రపంచమంతటా స్వాతంత్ర్యప్రియులు ముందుకు నడుస్తున్నారు. ఇవాళ ప్రపంచంలో భారతదేశం స్వతంత్రదేశం కాగూడదనే పెద్దమనిషి ఒక్కడుకూడా లేడు. ఐతే, భారతదేశం ఇంకా ఎందుకు స్వతంత్ర దేశం కాలేదు? అని అందరూ ప్రశ్నిస్తున్నారు.

ప్రతి భారతీయుడి హృదయంలోను బ్రిటిష్ పరిపాలకులమీద వేడున్నంత ద్వేషం, స్వాతంత్ర్య పిపాస మరెన్నడూ లేవు. మన విశాల దేశంలో ప్రతి వర్గంలోను, ప్రతి తరంవారిలోను, స్త్రీలలోను, పురుషుల్లోను స్వాతంత్ర్యాగ్ని పొగలు గ్రక్కుతున్నది.

మన దేశంమీద వారు పెత్తనంచేసే రోజులు గతించాయని సామ్రాజ్యవాదులకు తెలుసు. ఇది వారి ధోరణిలోనే స్పష్టమవుతూంది.

వాళ్లు మన దేశాన్ని జయించిన తర్వాత, రెండు తరాలవరకు భారతీయులం నాగరికులం కామనీ. మనల్ని నాగరికుల్నిచేసే బాధ్యత తమదేననీ వారు గప్పాలు కొట్టేవారు. ఈ విధంగా వాళ్లు తమ పేరాసకు నల్లముసుగువేసి, ప్రపంచంఎదుటమనల్నిపనికిరానివాళ్ళంగా చిత్రించారు

కొంతకాలం గడిచింది. మిమ్మల్ని స్వపరిపాలనకు సమర్థుల్ని చేస్తున్నామంటూ వాళ్లు మన తాత ముత్తాతలకు చెప్పారు. తమ పాత సంప్రదాయాలు వదిలేశారు. మన సంస్కృతి గొప్పదేనట కాని, తగినంత ఉత్తమ

మైంది కాదట. కొత్త ప్రపంచంలో మనం ఎలా జీవించవలసిందీ తమ నుంచి నేర్చుకోవాలట!

కాని ఇవాళ అలాంటి మాటలు చెప్పడానికి వాళ్లకు సాహసంలేదు. టోరీ, లిబరల్, లేబర్ — ఏ పార్టీకి చెందినవారైనా, స్వతంత్రంగాఉండే హక్కు మనకు ఉన్నదని వాళ్లంతా ఒప్పుకుంటారు. కాని, స్వాతంత్ర్య భారతదేశంయొక్క స్వరూపం ఎలావుండాలో మీలోమీరు తేల్చుకోండని సవాలు చేస్తున్నారు.

దేశంలో ఎక్కువ పలుకుబడిగల పార్టీలు ప్రజల్లో స్వాత[illegible] పిపాసను రేకెత్తించిన ప్రధాన రాజకీయపార్టీలు కాంగ్రెసు, లీగులు. రెండుపార్టీలు తమలో తాము సమాధానపడకుండా, విభేదాలు పెట్టుకొని పరస్పరం కత్తులు దూసుకుంటున్నాయి. ఈ రెండు సంస్థలూ స్వాతంత్ర్యం పేరిటనే, న్యాయం పేరిటనే, ప్రజల పేరిటనే మాట్లాడుతున్నాయి. ఇవి స్వాతంత్ర్[illegible] పార్టీలు కావనీ, వీటి కోరికల్లో కొంచెంకూడా న్యాయం లేదనీ, ఇవి ప్రజలకోసం పోరాడడం లేదనీ - ఎవ్వడూ అనడు. కాని ఇంతమాత్రమే తెలిస్తే చాలదు. ముందుకు అడుగువేయాలంటే, ఇంకా తెలుసుకోవాలి.

## దేశభక్తికి సాధారణ సూత్రాలు

ఇక మా పార్టీ మూడవది, వయసులో చిన్నది. ప్రజల్లో [illegible] పలుకుబడిగల పార్టీ. కొన్ని సూత్రాలతో నడుపబడుతూ, అ[illegible] మీదనే ప్రజల్లో ఇప్పుడున్న పలుకుబడిని సంపాదించినపార్టీ. [illegible] పుట్టినవాడే బ్రిటిష్ ప్రభుత్వంమీద కత్తిగట్టింది. మా పార్టీ స[illegible] 64 గురు యావజ్జీవశిక్ష ననుభవిస్తున్నారు. ఇప్పటికే వీరు 800[illegible] రాల జైలుశిక్ష ననుభవించారు.

మా నాయకత్వం క్రింద ఉన్న ప్రజలకేకాక, ప్రతివా[illegible] పక్షంకూ మా పార్టీ ఒక్కటే ఎలుగెత్తి చెబుతున్నది,

1. ఒక బానిసదేశంలో ప్రజలు అన్యోన్యం పోరాడుకోవడమంటే అందర్నీ బానిసలుగా చేసినవాడితో పోరాడడం కాదు; ఒక భారతీయుడు ఇంకొక భారతీయుడితో పోరాడడంవల్ల ఇండియానుంచి బ్రిటిష్‌వాణ్ణి వెళ్లగొట్టడం ఎలా సాధ్యమవుతుంది?

2. ఒక బానిస, ఇంకో బానిసతో పోరాడితే యజమాని జోక్యం కల్పించుకొని లాభం పొందుతాడు; అలాగే భారతీయుల్లో భారతీయులు పోరాడుకోడం బ్రిటిష్ పరిపాలకులకు మాత్రమే లాభం.

3. అరవై సంవత్సరాల జాతీయ చైతన్యం పొందిన పిదప, నేరమంతా ఏ ఒక్కపార్టీ మీదనో వెయ్యడమంటే అర్థం మనసమిష్టి జాతీయ కుటుంబంలో కొందరిపట్ల అపచారం చెయ్యడమన్నమాట. ఇదే ఒక సమిష్టి కుటుంబంలో జరిగేటట్లయితే, ఆ కుటుంబం నాశన మవుతుందని ప్రతివారూ చెబుతారు. తన పక్షంలోవున్న న్యాయాన్నీ ఎదుటిపక్షంలోవున్న అన్యాయాన్ని మాత్రమే చూచి, కుటుంబాని కంతటికీ అంగీకారయోగ్యమైన ఒక తీర్మానానికి రాజాలనప్పుడు ఇలాంటిది తటస్థిస్తుంది.

4. స్వాతంత్ర్యమంటే భారతీయులందరికీ ఒకేవిధంగా అర్థమైనవాడు, ఇతరులు తమమీద పెత్తనం చేస్తారనే భయం కొద్దిమందికీ, కొద్దిమంది తమకు ద్రోహం చేస్తారనే అనుమానం ఎక్కువమందికీ, లేకుండా పోయిననాడే బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా మనప్రజలు భుజం భుజం [illegible] స్వాతంత్ర్య పోరాటం సాగిస్తారు.

అధిక సంఖ్యాకులు తమమీద పెత్తనం చేస్తారని అల్పసంఖ్యాకులు భయపడుతూ, అల్పసంఖ్యాకులు దేశానికి ద్రోహం తలపెడతారేమోనని అధిక సంఖ్యాకులు అనుమానపడుతూ, ఉన్నంతకాలం ఏ బానిస దేశానికీ విముక్తిలేదు. దీని ఫలితమల్లా—ఒకరిమీదకొకర్ని ఉసికొల్పి, ఇద్దరిమీదా బానిసయజమాని పెత్తనం చేస్తాడు.

దేశమే చీలిపోయివున్న నేడు నాయకులు నిర్వహించవలసిన కర్తవ్యం ఎంతోవుంది. ప్రజాభిమానాన్ని చూరగొన్న దేశనాయకులు

తమ ప్రజల్ని ఉత్తేజపరచకుండా ఒకరి విజాయితీని ఒకరు నమ్మకుండా ఉన్నందున శత్రువు చేతుల్లోకి మనజుట్టు అందించినవార మవుతున్నాం,

## కాంగ్రెసు. లీగు, కమ్యూనిస్టు పార్టీలు

అసలు, మన విభేదాలేమిటో తరచి చూద్దాం.

కాంగ్రెస్ సమస్త భారతదేశంయొక్క స్వాతంత్ర్యానికి నిలబడుతున్నది. కాంగ్రెస్ భారతదేశానికి స్వయం నిర్ణయ సూత్రం కావాలంటుంది. కాని భారతీయుల్లో భారతీయులకు ఆ సూత్రాన్ని అంగీకరించదు. భారతదేశ స్వాతంత్ర్యమనే నినాదంచాటున, కాంగ్రెస్ హిందూ ఆధిపత్యం కోసం చూస్తున్నదనే ముస్లింలీగు అనుమానానికిదే కారణం.

ముస్లింలీగు, ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు స్వయం నిర్ణయ సూత్రం కావాలంటున్నది. కాని ముస్లింలు మెజారిటీగాలేని కొన్ని ప్రాంతాలను కూడా కోరుతున్నది. తతిమ్మా భారతదేశంతో ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు ఎలాంటిసంబంధం వుంటుందో చెప్పడానికి లీగ్ నిరాకరిస్తున్నది. ముస్లింల స్వయం నిర్ణయ సూత్రమనే నినాదంచాటున దేశద్రోహానికి, లీగుసిద్ధమవుతున్నదనే కాంగ్రెస్ అనుమానానికి కారణం యిదే.

కాంగ్రెస్ ఐక్యభారత దేశంకోసం నిలబడుతున్నది. కాని స్వాతంత్ర్య ప్రియులైన భారతీయులందరినీ ఐక్యం చెయ్యలేకపోతున్నది. అందరికీ స్వాతంత్ర్యం ఉండాలనే సూత్రంమీద ఆధారపడిన భారత సమాఖ్యను (Indian Union) గూర్చి కాంగ్రెస్ సూచనలేమీ చెయ్యలేదు. ఇందువల్ల, స్వాతంత్ర్యపోరాటానికి నానాటికీ కాంగ్రెస్ ముస్లింల బలాన్ని సంపాదించడానికి బదులు, ఉన్న బలాన్నికూడా కోల్పోతున్నది.

లీగు విజాతికి న్యాయమైనస్వయంనిర్ణయ సూత్రాన్నే కోరుతున్నది. కాని. తెగదెంపులు చేసుకోడమే మంచిదనే ధోరణిలో చెబుతున్నది. తనకుచెందని ప్రాంతాలనుకూడా కోరుతున్నది. ఇలాంటిపని, ముస్లిమేతరులను, ముఖ్యంగా ముస్లింమెజారిటీ ప్రాంతాల్లోని వారిని, లీగుకు వ్యతిరేకంగా తయారుచేస్తుంది.



బ్రిటన్‌నుంచి కాంగ్రెస్‌కోరే స్వయంనిర్ణయసూత్రాన్ని మా పార్టీ బలపరుస్తుంది. కాని భవిష్యద్భారత రాజ్యాంగంలో అన్నిజాతులకూ అదే సూత్రాన్ని అమలుపరచాలని కోరుతుంది. కాని ఇలాఅన్న వెంటనే, కాంగ్రెస్ నాయకులు మేము దేశద్రోహులమయామనీ, లీగును బలపరుస్తున్నామనీ, మామీద విరుచుకు పడతారు.

స్వయంనిర్ణయ సూత్రంకోసం ముస్లింలీగ్‌కోరే కోర్కెను మాపార్టీ బలపరుస్తుంది. కాని. న్యాయమైన సరిహద్దులకోసం పోరాడుతూ చీలికలు పేలికలైపోయిన భారతదేశానికి మారుగా, ఐచ్ఛికంగా అన్ని జాతులూ కలిసిఉన్న స్వతంత్రభారత సమాఖ్యకోసం సూచనలు చేస్తుంది. దీనితో, మేము ముస్లింల ఐక్యతను భగ్నపరుస్తున్నామని అనుమానించి, లీగునాయకులు కాంగ్రెస్‌కు తాళంవేస్తున్నామని మామీద పడతారు.

భారతదేశంలోని అన్నిజాతులకు స్వాతంత్ర్యం ఉండాలనేసూత్రం మీద ఆధారపడిన భారతదేశ స్వాతంత్ర్యానికి మా పార్టీ ఎన్నికల ప్రణాళికలో ఒక మార్గం చూపింది. ఆ మార్గాన్ని స్పష్ట పరచడంకోసమే ఈ పుస్తకం.

# 1. పాతకాలపు భ్రమలు

మనదేశంలో వివిధరాజకీయపక్షాలు ఒకదానితో మరొకటి పోరాడే కొలదీ, ప్రజల్లో చీలికలెక్కువవుతాయి; మన మాతృభూమిలో బ్రిటిష్ పరిపాలకులు పెత్తనం చెలాయిస్తూ ఎక్కువకాలం వుంటారు.

మన రాజకీయపార్టీలు పరస్పరం ఎంతగా పోట్లాడుకుంటూ వుంటాయో, అంతగా మన అంతరంగిక వ్యవహారాలను పరిష్కరించ వలసిందంటూ అవి బ్రిటిష్‌ప్రభుత్వాన్ని అర్థిస్తూ ఉంటాయి.

కాంగ్రెస్ నాయకులు, తామిప్పుడు దేశంలోని జాతీయ విద్రోహ శక్తులతో పోరాడుతున్నామనీ, ఈపోరాటం అయినాక, బ్రిటిష్‌ప్రభుత్వం తమతో రాజీకిరాకపోతే అప్పుడు బ్రిటిష్‌ప్రభుత్వంతో పోరాడుతామని చెప్పుకొంటున్నారు. కాని, వారు చెప్పేదానిలో అంతా యదార్థంకాదు. అసలు సంగతేమంటే — వారు ఇతర పార్టీలతో పోరాడేది తమశక్తిని ప్రదర్శించి బ్రిటిష్ ప్రభుత్వం తమతో మాత్రమే రాజీకి వచ్చేలా చేసుకోడానికే. బ్రిటిష్‌వాళ్ళతో తాము ప్రత్యేకంగా రాజీకిరాగలమనే పాతకాలపు భ్రమలను పట్టుకొని వాళ్ళిలా దేవులాడుతున్నారు. కాని ఈ భ్రమలు ఎప్పుడూ సఫలం కావు.

ఇలాగే లీగునాయకులు కూడా, తామిప్పుడు హిందువుల్లో వున్న పాకిస్థాన్ వ్యతిరేకతను అణచడానికే పోరాడుతున్నామనీ, పాకిస్థాన్ కోసం తర్వాత బ్రిటిషువాళ్ళతో పోరాడుతామనీ, చెప్పుకొంటున్నారు. హిందూ సోదరులకంటే బ్రిటిష్‌వాళ్ళే త్వరగా ముస్లింల కోర్కెల సంతృప్తి పరచగలరని వారనుకొంటున్నారు. వారుకూడా, కాంగ్రెస్‌వారి లాగానే, బ్రిటిషువాళ్ళతో ప్రత్యేక రాజీకోసం కలలు గంటున్నారు; అది కేవలం పిచ్చిభ్రమ తప్ప మరొకటి కాదు.

ఒక సమిష్టికుటుంబంలో కలతలువచ్చి అన్నదమ్ములు పరాయివాళ్ల సహాయంకోసం ఎదురుచూస్తే, ఆ కుటుంబం అంతటితో నాశనమయి పోతుంది. పరాయివాళ్లు అందర్నీ బానిసలుగా చేస్తారు. అప్పుడు ఇక చెప్పేదేముంది.

సాధారణంగా వెనుకబడ్డ గ్రామాల్లోనే యిలాజరుగుతుంది. సమిష్టి కుటుంబం విడిపోయి, ఒక్కొక్కళ్ళే న్యాయంకోసం భూస్వామి దగ్గరికి వేర్వేరుగా పోతారు. అంతటితో ఈ కుటుంబంపని అయిపోయిందని తక్కిన కుటుంబాల వాళ్ళందరూ అంటారు.

జమీందారీ గ్రామాల్లోని అమాయక రైతుల్లాగానే మన ప్రధాన రాజకీయపక్షాల నాయకులుకూడా ఎందుకు ప్రవర్తించాలి ?

ఎందుకంటే - ప్రభుత్వాన్నిగూర్చి వారిలోవున్న పాతమితవాదపు భ్రమలింకా అంతరించలేదు. వారికి తమ ప్రజల్లో కలిగిన పలుకుబడివల్ల ఎక్కువ ఆత్మవిశ్వాసం ఏర్పడింది. కాని, దురదృష్టవశాత్తు వకళ్ళనుచూస్తే ఒకళ్ళకు పడకుండాపోతున్నది. ఇద్దరూ బ్రిటిష్‌ప్రభుత్వంమీద ఇంకా ఆశలు పెట్టుకున్నారు. వారింకా పాతలోకంలోనేఉండి ఆలోచిస్తున్నారు. అందువల్లనే మన దేశంలోని స్వాతంత్ర్యశక్తులను ఐక్యపరచి బ్రిటిష్ పరిపాలనను అంతమొందించుటకు మహత్తరమైన ఒక భారత స్వాతంత్ర్య సైన్యాన్ని సమీకరించలేక పోతున్నారు. అందుకు తగిన స్వాతంత్ర్య మాత్రాలనుకూడా కనిపెట్టలేక పోతున్నారు. "స్వతంత్రభారత్" ఏరూపములోఉంటుందో వివరించిచెబితే, యీనాడు భారతదేశంలోని ప్రతి ఒక్కరూ ఉత్తేజితులు కావాలి. స్వతంత్రభారత్‌లో తన స్వాతంత్ర్యం

రక్షింపబడుతుందని ప్రతిఒక్కరూ నమ్మాలి. తనయొక్క, తన సోదరులయొక్క స్వాతంత్ర్యంకోసం జరిగే పోరాటంలో తాను పాల్గొనక పోవడం తన బాధ్యతనుంచి తప్పించుకోవడమేనని భారతదేశంలోని ప్రతిఒక్కరూ గుర్తించాలి. స్వతంత్రభారత్ నిర్వచనం అంత చక్కగా వుండాలి

## ప్రమాదకరమైన భ్రమలు

మన స్వాతంత్ర్యోద్యమచరిత్ర చూసినా, బ్రిటిష్ ప్రభుత్వ ప్రకటనలు ాసినా బ్రిటిష్‌వాళ్లు కాంగ్రెస్‌తోగానీ, లీగుతోగానీ ప్రత్యేకంగా రాజీ పడతారనుకోడాని కేమీ అవకాశం లేదు.

ఇండియాలోని బ్రిటిష్ వ్యాపారస్తుల సంస్థఅయిన అసోసియేటెడ్ ఛేంబర్ ఆఫ్ కామర్సులో ఉపన్యసిస్తూ వేవెలు ప్రభువు ఇలా అన్నాడు :

"ఏదైనా పరిష్కారం కావాలనుకుంటే భారత దేశంలోని ప్రధాన రాజకీయ పక్షమైన కాంగ్రెసూ, అల్పసంఖ్యాకులూ (ఇందులో ముస్లింలే ఎక్కువమంది; వారే ముఖ్యమైనవారు) భారతసంస్థానాధిపతులూ, బ్రిటిష్ ప్రభుత్వమూ ముందుగా తమలోతాము ఒక అంగీకారానికిరావాలి, అందరి లక్ష్యమూ ఒక్కటే—భారత స్వాతంత్ర్యమూ, సౌభాగ్యమూ" ।

(టైమ్సు ఆఫ్ ఇండియా, డిసెం. 11—45)

బ్రిటిష్ లేబరు ప్రభుత్వంయొక్క ప్రధానమంత్రి అట్లీ మాన్షన్ హౌస్‌లో ఉపన్యసిస్తూ ఇలా అన్నాడు,

"1942 లో క్రిప్సు సూచనల అనంతరం ఎప్పుడూ భారతస్వాతంత్ర్యాన్ని అంగీకరిస్తూనే వున్నాం; కాని భారతీయులు దాన్ని స్వీకరించడమే తరువాయి. ఇంతవరకూ ఉన్న అడ్డంకి—చాలా పెద్ద అడ్డంకి—ఏమిటంటే భారతదేశంలోని వివిధజాతులు (Communities) తమలో తాము ఒక అంగీకారానికి రాలేక పోవడం"

(టైమ్సు ఆఫ్ ఇండియా నవం. 10—1945)

ఈ ప్రకటనలు, సిమ్లాసమావేశాన్ని ఏర్పాటుచేస్తూ వేవెలు ప్రభువు చేసిన రేడియో ఉపన్యాసానికి నకలుగానే ఉన్నాయి, అప్పుడుకూడా కాంగ్రెస్ లీగునాయకులు తమ ఇరువురికీ సంబంధించిన ఆ మాటల్లో యిమిడి వున్న స్పష్టమైన అర్థాన్ని తెలుసుకోకుండా, వాటి వెనుక తమ కిష్టమైన అర్థం ఏదో ఉన్నదని వెతుకులాడారు.



ఇవాళకూడా వారదేపని చేస్తున్నారు. సిమ్లాలో మాదిరిగానే ఇప్పుడుకూడా ఉభయపక్షాల నాయకులూ బ్రిటిష్‌వాళ్లు తమతోనే పరిష్కారం చేసుకుంటారనీ, రెండవపక్షం నిరోధించినప్పటికీ తమ ఆశయమే సిద్ధిస్తుందనీ ఎవరికివారు లేనిపోని భ్రమలు పెట్టుకొనివున్నారు.

రెండుపక్షాల నాయకులూ, తమంతట తాము ముందుకు పోతున్నామనీ, బ్రిటిష్ ప్రభుత్వానికేమీ ప్రత్యేకమైన ప్లాను లేదనీ తలుస్తున్నారు. ఎవరికి వారు అజేయులమనీ, సర్వ శక్తిమంతులమనీ. రెండవపక్షం కేవలం చెడ్డదనీ అపోహపడుతున్నారు.

బ్రిటిషు సామ్రాజ్యవాదుల్ని శత్రువులుగా ద్వేషించేవారికీ, సాటి భారతీయులను నిజమైన సోదరులుగా ప్రేమించేవారికీ, వాస్తవ పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని ఆలోచించేవారికీ ఈ ఉభయపక్షాల నాయకులూ ఏ ఒక్క విషయంలోకూడా సక్రమంగా ప్రవర్తించడంలేదని స్పష్టం అవుతుంది.

నాయకులు తమలో తాము పోరాడుకొంటున్నది దేశభక్తిలేక కాదు. ఉన్నసమస్యల్లా ఏమిటంటే, ఎవరికి వారు తామే ఒప్పుచేస్తున్నామనీ, రెండోవారు తప్పుచేస్తున్నారనీ భావించడం ।

నిజానికి, ఇద్దరూ కొంతయదార్థాన్ని మాత్రమే ప్రతిబింబిస్తున్నారు. ఎవ్వరూ సంపూర్ణసత్యాన్ని ప్రతిబింబించడం లేదు.

## భారతదేశం - ఒకేజాతి

భారతదేశమంతా ఒకేజాతి అని చెప్పినప్పుడు బ్రిటిష్‌పెత్తనానికి వ్యతిరేకంగా భారతీయుల్లో ఐక్యత ఉండాలని కాంగ్రెస్ స్పష్టపరుస్తున్నది. స్వతంత్రభారతదేశం ఐక్యంగా వుండాలని కోరినప్పుడుకూడా కాంగ్రెస్ మంచివుద్దేశాన్నే వెలిబుచ్చుతున్నది. కాని 'ఇండియా - ఒకే

' అనే దృక్పథం మన అంతరంగిక విభేదాలను త్రోసిపుచ్చడానికి దియై, అంతర్యుద్ధానికి దారితీసినప్పుడు మాత్రం ఆ నిర్వచనంలో లోపమున్నట్లు స్పష్టంగా తెలుస్తున్నది.

'భారతదేశం ఒక జాతి' అనే నిర్వచనంవల్ల, ముస్లింలు కాంగ్రెసు చి నానాటికీ ఎందుకు దూరమైపోతున్నారో కాంగ్రెసునాయకులు చెప్ప న్నారు. కాకపోతే, ముస్లింలు హిందువులంత స్వాతంత్ర్యప్రియులు నాలి. ఇలాగేచెబితే ఇది పచ్చిఅబద్ధం. అంతేకాదు; భారతస్వాతంత్ర్య మ చరిత్రనూ, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ముస్లింలు ంగ్రెస్ జెండాక్రింద, తమ జెండాక్రింద, నిర్వహించిన మహత్తరమైన త్రనూ, త్రోసిరాజనడమవుతుంది.

'భారతజాతి ఒకజాతి' అనే దృక్పథం తీసుకోవడంవల్ల కాంగ్రెస్ యకులు తమలో తమకే వస్తున్న విభేదాలను విడమర్చి చెప్పజాలరు.

ఉదాహరణకు — కాంగ్రెస్ స్వయంనిర్ణయసూత్రాన్ని అంగీక ంచాలని చెప్పే మౌలానా ఆజాద్‌కూ, అలాంటి ఆలోచనకే వ్యతిరే ంగా కత్తులు నూరుకు కూర్చున్న పటేల్, కృపలానీలకూ, తీవ్ర భేదాభి ప్రాయాలున్నమాట అందరికీ తెలిసినగుట్టే. ఆజాద్ మతావేశపరుడన నికి ఎవరికీ సాహసంలేదు. మరి అలాంటి విభేదాలు ఎందుకు రావాలి?

క్రిందటిసారి తమిళుడైన రాజాజీ మద్రాస్‌ప్రధానమంత్రి అయినాడు. కనుక, ఈసారి ఆంధ్రుడు ప్రధాని కావలసిందేనని ఆంధ్ర కాంగ్రెస్ నాయ కులు గట్టిగా కోరుతున్నారు. భారతదేశమంతా ఒకేజాతి అనుకుంటే దీని అంతర్యమేమిటి?

కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడైన పట్టాభికి, ఒరియా కాంగ్రెసు వాదులు నల్ల జెండాలు చూపారు. ఆయనమీద రాళ్లువిసిరారు. "ఓ ఒరిస్సా విరోధీ, వెనక్కు పో"మ్మని నినాదాలిచ్చారు. భారతదేశమంతా ఒకేజాతి అనుకుంటే. ఈ ఘటనకూడా మనకు అర్థముకాదు.

ఇలాంటి ఉదాహరణలు ఎన్నైనా చూపవచ్చు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా మనమంతా ఒకటిగా నిలవాలని చెప్పడానికి ఇండియాఅంతా

ఒకే జాతి అని చెప్పనవసరంలేదు. అలాంటి దృక్పథం మన సమ పరిష్కారానికి గాక వాటిని అధికం చెయ్యడానికి తోడ్పడుతుంది. వాన్ని మభ్యపెడుతుంది. హిందూ ఆధిపత్యాన్ని గూర్చిన అనుమానా రేకెత్తిస్తుంది.

## ముస్లింలు—ఒకేజాతి

ఇలాగే 'ముస్లింలంతా ఒకేజాతి' అనే లీగు నినాదంకూడా చేదికాదు. బ్రిటిష్ వారినుంచి స్వాతంత్ర్యం సంపాదించాలనే పిపాస స్వతంత్ర భారతదేశం సామాన్య మెజారిటీ పరిపాలన సిద్ధాంతం ఆధారపడితే అందులో హిందూ ఆధిపత్యమే ఉంటుందనే భయ వ్యక్తపరచే నినాదంగానే, ముస్లింప్రజలు దీన్ని అర్థంచేసుకుంటున్నా

కాని, హిందూ ముస్లింల జన్మభూములకు కొన్ని సమిష్టి ఆ రాలూ, ప్రయోజనాలూ లేనే లేవనేదానికి ఈ దృక్పథం పునాది అ ప్పుడు ఇందులో ఏదో పెద్దలోపం వున్నదన్నమాట.

నిజానికి, లీగునాయకులు ముస్లింలంతా ఒకజాతి అనే సూ మీద ఆధారపడడంవల్ల ముస్లింప్రజాచైతన్యంయొక్క పూర్వచరిత్రనుగ మనకళ్ళముందు కన్పడుతున్న ప్రస్తుత చరిత్రను గానీ విశదపరచలేద

బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా బలవత్తరమైన విప్లవ మాన్ని నిర్మించుకొన్న పఠాన్లు, లీగుతోగాక, కాంగ్రెస్‌తోనే ఎం చేతులుకలుపుతున్నారు? ఎందుకంటే, కాంగ్రెస్‌తో కలిసినప్పుడే బ్రి పరిపాలనను అంతమొందించి స్వతంత్ర పఠాన్‌భూమిని నిర్మించుకో మనుకున్నారు.

షేక్ అబ్దుల్లా నాయకత్వాన కాశ్మీర్‌జాతీయ మహాసభ రూపొందిన కాశ్మీర్ ప్రజల (వీరిలో నూటికి 82 రు ముస్లింలు) జాతీ చైతన్యాన లీగునాయకులు ముస్లింలు ఒక జాతిఅనే సూత్రంతో అ చేసుకోగలరా? ఈ మహాసభ కాశ్మీర్ ప్రజలకు స్వయంనిర్ణయ హక కావాలన్నది; ముస్లిం మెజారిటీ ప్రాంతాలకుకూడా స్వయంనిర్ణ

సూత్రం అవసరమేనని బలపరుస్తున్నది. అయినప్పటికీ ఈ మహాసభ లీగుకంటే కాంగ్రెసుతో ఎక్కువ ఆత్మీయంగా వుంది.

'ముస్లింలు ఒక జాతి' అనే వినాదంవల్ల లీగులో జరిగే విషయాలను కూడా అర్థం చేసుకోడానికి ఉపయోగపడదు.

ఉదాహరణకు— బెంగాలంతా ఒకే రాష్ట్రంగావుంది. తమకు ఇష్టమయితే పాకిస్థానులోగానీ, హిందూస్థాన్‌లోగానీ చేరేలాగను, లేకపోతే విడిగా సంపూర్ణ స్వతంత్ర రాష్ట్రంగా వుండేలాగాను కోరుతూ బెంగాల్ రాష్ట్ర ముస్లింలీగు గాంధీ—జిన్నా సమావేశ సమయంలో ఎందుకు తీర్మానించింది ? ఇంతేకాక ఈ విషయంలో ఆలోచించవలసిందిగా రాష్ట్రలీగు కాంగ్రెస్ నాయకుడైన కిరణశంకర రాయ్‌కి తన తీర్మానాన్ని ఎందుకు పంపింది ? ఇంతేకాదు, బెంగాల్ సమస్యమీద గాంధీజీతో తెగతెంపులు చేసుకోవద్దనీ, తమ భవిష్యత్తును బెంగాలీలే నిర్ణయించుకోగలరనీ జనాబ్ జిన్నాకు బెంగాల్‌లీగు ఎందుకు తెలియజేసింది ?

1943 జులైలో జిన్నాగారు క్వెట్టా వెళ్ళినప్పుడు బెలూచీస్థాన్ ముస్లింలీగు ఆయనయందు విశ్వాసాన్ని ప్రకటిస్తూనే, (పశ్చిమోత్తర పాకిస్థాన్‌లో భాగాలైన సింధు, పంజాబ్, సరిహద్దు రాష్ట్రాలతో బెలూచీస్థానునుకూడా కలిపివేశాక) బెలూచీస్థానును ఒక ప్రత్యేక రాష్ట్రంగా" నిర్మించేటందుకు కృషి చేయడానికి ఒక కమిటీని నియమిస్తూ ఎందుకు తీర్మానించింది? (హిందూ, జులై 3, 1945) కనుక, ఇండియా ఒక జాతి అనే దృక్పథంగానీ, ముస్లింలు ఒక జాతి అనే దృక్పథంగాని మన పూర్వచరిత్రను అర్థంచేసుకోవడానికి ఉపయోగించవు: ప్రస్తుతం మన తక్షణ కర్తవ్యమైన భారత జాతీయైక్యతను సాధించడానికికూడా అవి ఉపయోగించవు. పైపెచ్చు, కాంగ్రెసు లీగులమధ్య ఇంకా అగాధంపెంచడానికీ, అంతిమ పోరాటానికి మనలో ఐక్యత లేకుండా చేయడానికీ మాత్రమే తోడ్పడుతాయి.

## స్వతంత్రజాతుల సమిష్టి కుటుంబం

భారతదేశం స్వతంత్ర జాతులయొక్క సమిష్టి కుటుంబమని కమ్యూనిస్టుపార్టీ దృక్పథం, ఇదే మన చరిత్రకు సరియైన అర్థమనీ, ఇదే మన దేశానికి ఉజ్జ్వల భవిష్యత్తును చేకూర్చుతుందనీ మా నమ్మకం.

బ్రిటిష్‌వాళ్ళకు వ్యతిరేకంగా మన స్వాతంత్ర్య పిపాసనూ, బ్రిటిష్ పరిపాలనకు వ్యతిరేకంగామనఐక్యతనూ,ఈనిర్వచనంతేటతెల్లంచేస్తుంది. మన దేశాన్ని స్వతంత్రంగాను, నూతన ప్రపంచంలో బలవత్తరమైన ఒక శక్తిగాను నిర్మించడానికి; ప్రపంచ శాంతికి పునాదులు వేయడానికి; బానిస దేశాల విముక్తికోసం పోరాడ్డానికి; ప్రజాభ్యుదయంకొరకు కృషి చేయడానికీ—ఈ దృక్పథమే సరియైన మార్గదర్శి. మన ప్రజలు స్వతంత్రంగా తమ ఇష్టప్రకారం అభివృద్ధి చెందడానికి ఇదే చక్కని హామీ ఇస్తుంది.

మనం చిన్నచిన్న ముఠాలుగా ఉండేదశనుంచి మారి, ప్రజలుగా అభివృద్ధిచెందిన తరువాతనే బ్రిటిష్‌వాళ్ళు మనల్ని జయించారు, కాని అప్పటికి మనం ఇంకా ఆధునిక జాతులుగా పరిణామం చెందలేదు. వాళ్ల మన స్వదేశీరాజులను ఉపయోగించుకొని, మనలో మనకు పోరాటాలు పెట్టి, ఒకరితర్వాత మరొకరినీ, ఒకప్రాంతం తర్వాత మరొకప్రాంతాన్నీ ఒకప్రజతర్వాత మరొక ప్రజనూ వరసగా అందర్నీ జయించారు.

బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి స్వాతంత్ర్యం సంపాదించుకోడానికి, మనం కళ్లు తెరవగానే మన సంస్కృతిలోను, స్వాతంత్ర్యోద్యమంలోను, వివిధభావాలు పొడసూపాయి.

ఈ వివిధ భావాల్లో రెండు దృక్పథాలేర్పడ్డాయి—ఒకటి సనాతన దృక్పథం; రెండవది నవీన దృక్పథం, ఇవి రెండూ హిందువులలోను ముస్లింలలోనుకూడా ఏర్పడ్డాయి.

అప్పటి రాజులక్రింద, మఠాధిపతులక్రింద మనమతం శిథిలమైపోయిందికాబట్టే మనల్ని బ్రిటిష్‌వాళ్లు జయించగలిగారని సనాతనులు

చెప్పేవారు. స్వాతంత్ర్య పోరాటానికి తగిన నైతికశక్తిని పునరుద్ధరించ గల మతసంస్కారం కావాలని వారు చెప్పేవారు.

ఈ సనాతనులు మన పురాతన చరిత్రను పేర్కొని, మనలో జాతీయాభిమానాన్ని రేకెత్తించారు; మనదేశంలో బ్రిటిష్‌వాళ్ల నైతిక పతనాన్ని బట్టబయలుచేసి, బ్రిటిష్ వ్యతిరేకద్వేషాన్ని రగుల్కొలిపారు. దీని స్వరూపం ఆధ్యాత్మికంగావున్నా, అంతర్యంమాత్రం సామ్రాజ్యవాద వ్యతిరేకతే। ఇలాగే మొదట ముస్లింలలో స్వాతంత్ర్యపోరాటనినాదం వాహబీలనుంచీ, తర్వాత దేవ్‌బంద్ ఉలేమానుంచీ, వచ్చింది. హిందువుల్లో మాకు బంకిం, స్వామి వివేకానంద మొదలైనవారున్నారు. 'వందేమాతర' గీతంలోకూడా మత సంబంధమైన స్వరూపమూ, భావనాఉన్నాయి.

ఇక ఆధునిక వాదులు నవీన భావాలను బలపరిచారు; జీవితాన్ని అర్థంచేసుకోడానికి మూఢ విశ్వాసాలుకాక, హేతువాదం అవసర మన్నారు; నవీన విద్యావిధానాన్ని ప్రోత్సహించారు. అంతకుముందు రాచరికాలతోవున్న మనదేశం భవిష్యత్తులో ప్రజాస్వామికంగా ఉండాలని ప్రచారంచేశారు; బ్రిటిష్ వాళ్ళలోవున్న ప్రతి కొత్త విషయాన్నీ, మంచిని మనంనేర్చుకొని మనదేశంలోని పురాతన ధోరణలను మార్చుకొంటూ దేశాన్ని ఆధునికంగాచేయాలనివారుకోరారు. ముస్లింలలోసర్ సయ్యద్ అహ్మద్ హిందువుల్లో రాజారామమోహన్‌రాయ్, ఈ దృక్పధాన్ని ప్రచారంచేశారు. దీని ఆకారం నవీనం; అంతర్యం ప్రజాస్వామికం. కాని, ఆచరణలో మాత్రం వీరు మన ప్రజలను విద్యావంతులుగా చేస్తూ, బ్రిటిష్‌ప్రభుత్వం సక్రమంగా ప్రవర్తించేలా చెయ్యమని బ్రిటిష్‌ప్రజలకు విజ్ఞప్తిచేసేవారు. అంటే, చట్టసమ్మత విధానం [Constitutionalism] అవలంబించేవా రన్నమాట. వీరే మితవాదపార్టీకి చెందినవారు,

మనల్ని పూర్వస్థితినుండి నేటి ఉన్నతస్థితికి తీసుకొనివచ్చినవారే ఇవాళ జారిపోయి, తమ సాంప్రదాయాలనే విడనాడి మనల్ని ముందుకు

లీగు పక్షానచూస్తే — మౌల్వీల మౌలానాల మతమౌఢ్యం నుంచి ముస్లింలను తప్పించి, వారిలో పాకిస్థాన్ ప్రజాస్వామ్యాన్ని ప్రచారం చేసిన జిన్నాగారు ఇవాళ మళ్ళీ వెనక్కు చూస్తున్నాడు. పాకిస్థాన్ అంటే ఇస్లాంమత రాజ్యమని ప్రచారం చేయడానికి, జాతీయముస్లింలకు వ్యతిరేకంగా మతావేశపరులైన అభివృద్ధి నిరోధకులను నిలబెట్టడానికి, హిందువులమీద తీవ్రవిద్వేషం రెచ్చగొట్టడానికి ఆయన ఇవాళ లీగు ప్రచారకులకు అనుమతి యిస్తున్నాడు,

ఉదాహరణకు — 1938 లో కలకత్తాలో జరిగిన లీగు ప్రత్యేక సమావేశంలో జిన్నాగారిలాఅన్నాడు ;

"అభివృద్ధి నిరోధకులనుంచి మన ప్రజల్ని కొంతవరకు స్వతంత్రుల్ని చేశాం. మౌల్వీలుగా, మౌలానాలుగా ఎంచబడుతున్నవారి పలుకుబడినీ, వారంటే ప్రజల్లో వుండే భయాన్ని రూపుమాపాం........ముస్లిం లీగుయొక్క పంథాను కార్యక్రమాన్ని మనం ఇంకా ముందుకు రాజకీయంగా తీసుకుపోవాలి," (ఏప్రిల్ 17, 1938,)

కాని, ఆ జిన్నాగారే 1945 అక్టోబరులో అభివృద్ధి నిరోధకులతోను గవర్నమెంటు గులాములైన మౌల్వీలతోను, ఏర్పడ్డ 'జమయత్ ఉల్ ఉలేమా - ఇ - ఇస్లాం' కు అభినందన సందేశం పంపాడు. వాళ్ళ ప్రధాన నినాదం ఖురాన్ రాజ్యస్థాపన; ప్రధాన కార్యక్రమం, మత మౌఢ్యాన్ని వినియోగించుకొని పాత ఉలేమాలతోను జాతీయ ముస్లింలతోను పోరాడడం,

కాంగ్రెస్ పక్షానచూస్తే—తమ జీవితమంతా హిందూ ముస్లిం ఐక్యతకోసం కృషిచేసిన నాయకులు, ఈనాడు కాంగ్రెసు పేరిట స్వతంత్రంగా ముస్లింస్థానాలకు పోటీచేయడానికి సాహసించలేని స్థితికివచ్చారు. పైగా హిందూ ముస్లిం ఐక్యతకోసం నిలబడిన మమ్మల్ని లీగు ఏజంట్లని తిట్టి, అంతకంతకూ హిందూ మహాసభకు దాసోహమంటున్నారు. వెనుక ముస్లిం మెజారిటీరాష్ట్రాల స్వయంనిర్ణయసూత్రం విషయంలోతాము చేసినప్రకటననుంచికూడా దిగజారిపోతున్నారు. పాకిస్థాన్ సమస్యమీద గట్టిగా పోరాడాలంటే, హిందువుల హక్కులు రక్షింపబడాలంటే, మీరు

కాంగ్రెసును బలపరచాలని ఇవాళ కాంగ్రెసు నాయకులు యివాళ హిందూ నియోజకవర్గాల్లో చెబుతున్నారు. ముస్లిం మెజారిటీ ప్రాంతాల్లో కాంగ్రెస్ ప్రధాన నినాదం ఇదే.

ఈవిధంగా కాంగ్రెస్-లీగునాయకత్వాలు యివాళ సనాతనప్రచారానికి తయారైనాయి. కాని, వాళ్ళుపని చేస్తున్నది తమఅనుచరుల్ని బ్రిటిష్‌వాళ్ళ మీదికి రెచ్చగొట్టడానికికాదు. ఒకళ్ళమీదికొకళ్ళను పురికొల్పడానికి.

ఉన్న అరిష్టమలా ఏమంటే, పాత హిందూముస్లిం మితవాదుల్లాగానే కాంగ్రెస్ లీగు నాయకులు బ్రిటిష్ ప్రభుత్వంమీద ఆశలు పెట్టుకున్నారు.

సిమ్లాసమావేశం విఫలమైన తర్వాతకూడా, ముస్లింలీగు ముస్లింల కందరికీ ప్రాతినిధ్యం వహించదనీ కాంగ్రెస్ కొంతమంది ముస్లింలకైనా ప్రాతినిధ్యం వహించదనీ, వైస్రాయి వేవెలు తెలియజేసిన తర్వాతకూడా ఇంకా సామ్రాజ్యవాదంమీద కాంగ్రెస్ నాయకుల విశ్వాసం చెక్కుచెదర లేదు. ఆ మర్నాడే కాంగ్రెస్ అధ్యక్షుడు మౌలానా అజాద్ వైస్రాయి కిలా వ్రాశాడు.

"ఇప్పటికొక అధ్యాయం ముగిసింది. కనుక, మా హృదయాలూ, మీ హృదయం ఇకముందు అందరికీ గౌరవప్రదమైన భారత స్వాతంత్ర్య గమ్యస్థానంవైపు దారితీసే ఒక పరిష్కార మార్గాన్ని అన్వేషించాలి. పరస్పర సహకారానికి ఇప్పుడున్న ఆటంకాలను త్రోసిరాజనడానికి వీలులేదు." (1945 జులై 15 న మౌలానా అజాద్ వైస్రాయికి వ్రాసిన ఉత్తరంలో నుంచి) ఈ ఉత్తరప్రత్యుత్తరాలు ఏ. ఐ. సి. సి. సమావేశంలో పంచిపెట్టారు. ఇంకా ప్రచురించలేదు.)

లీగు అధ్యక్షుడైన జిన్నాగారి ధోరణికూడా ఇలాగేవుంది 1944 డిసెంబరులో వైస్రాయి ఒకరాజకీయ వైద్యునివేషం వేసుకొని పాకిస్థాన్‌అనే 'ఆపరేషన్' పనికిరాదని ఉపన్యసించిన తర్వాతకూడా, లీగు హక్కును సిమ్లాలో తిరస్కరించిన తర్వాతకూడా, జిన్నాగారికి బ్రిటిష్‌వాళ్ళ నిజాయతీలో విశ్వాసం మొక్కవోలేదు. ఏమైనా మార్పుంటే ఆ విశ్వాసం మరింత పెరిగిందనే చెప్పాలి.



1945 డిసెంబరు 10 వ తేదీ 'అసోసియేటెడ్ ఛేంబర్సు ఆఫ్ కామర్సు' సభలో ఉపన్యసిస్తూ వైస్రాయి "భారత ప్రజలు రాజకీయ స్వాతంత్ర్యం పొందాలనీ, ఒక ప్రభుత్వాన్నిగానీ లేక ప్రభుత్వాలనుగానీ ఏర్పరచుకోవాలనీ" బ్రిటిష్ ప్రభుత్వం కోరుతున్నదన్నాడు. ఈ ఉపన్యాసం జిన్నాగారి విశ్వాసాన్ని మరింత బలపరిచింది. దీనికి ఆయన స్వాగతమిస్తూ ఇలా అన్నాడు: రెండో విషయంవల్ల నాకు అర్థమవుతున్న దేమంటే వైస్రాయి యిప్పుడే భారతరాజకీయ పరిస్థితిని అర్థం చేసుకోవడ మారంభిస్తున్నాడు...... ఆయన ఇకముందు భారతదేశ విభజన ఆవశ్యకమనీ, అదొక్కటే భారతరాజకీయ సమస్యకు పరిష్కార మార్గమనీ; స్పష్టపరుస్తాడని ఆశిస్తాను.... వివిధ అల్పసంఖ్యాకవర్గాలు (మైనారిటీలు) భారత రాజకీయ జీవితంలో ముఖ్యపాత్ర వహిస్తాయనీ, భారతదేశంలో జరిగే ఏ పరిష్కారంలోనయినా వారి వాక్కును ప్రకటించాలనీ, వారికి న్యాయం జరగాలనీనేను మొదటనుంచీ చెబుతున్నాను". (హిందూ డి. 18.1945)

'నాయకులు ఈ విధంగా వాస్తవప్రపంచంలో తమకు తగులుతున్న దెబ్బల నన్నిటినీ మరిచిపోయి, వేవెల్ చెప్పే తియ్యనిమాటలమీద ఎలా ఆధారపడుతున్నారో చూడండి! ఇద్దరికీ వేవెలు అంటే నమ్మకం. వైస్రాయి 'గౌరవప్రదమైన పరిష్కారం' చేస్తాడని కాంగ్రెస్ అధ్యక్షుడూ, 'న్యాయమైన పరిష్కారం' చేస్తాడని లీగు అధ్యక్షుడూ—ఇద్దరికళ్ళూ వేవెలు మీదనే!

ఒకళ్ళకు వ్యతిరేకంగా ఒకళ్ళు ఆందోళన చెయ్యడమూ. రెండో వాళ్ళను త్రోసివేసి తమతో బ్రిటిష్ ప్రభుత్వం రాజీకి వస్తుందని నమ్మకోడమూ—అంటే; అర్థం మితవాద రాజకీయాలకు తిరిగి రావడం అన్న మాట. ఇంపీరియలిస్టు పాలకుల చేతుల్లో చిక్కడం అన్నమాట. ఇది భారత స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడమే అయితే, ఇది నిష్ప్రయోజకం. ఇది మన లక్ష్యాన్ని చేరుకోడానికి తోడ్పడదు. మన అపజయానికి నిరంతర దాస్యానికి మాత్రమే దారితీస్తుంది. ఈ పని చెయ్యడమంటే మన పాత చరిత్ర నంతటినీ విస్మరించటమన్న మాట!

# 2. హిందూ ముస్లిం విభేదాలు - సామ్రాజ్యవాదుల యెత్తులు

హిందూ ముస్లిం విభేదాలు, ప్రధానంగా కాంగ్రెస్ లీగు విభేదాలు ఇవాళ భారతదేశంలో ఒక గడ్డుసమస్యగా తయారైనాయి.

వాటివంక చూడకుండా కళ్లు మూసుకుంటే లాభంలేదు. "ఇవన్నీ మత విభేదాలు, ఆర్థిక, రాజకీయ సమస్యలమీద ప్రజలను ఐక్యపరచుకొంటూ నవీన జీవిత విధానం పెంపొందినకొద్దీ అవే పోతాయి" అని చెప్పి లాభంలేదు.

ఈ విభేదాల రాజకీయ స్వభావ మేమిటో వివిధ జాతులు నివసించే మన దేశంలో, నవీన జీవిత విధానంలో అవి ఎలా రూపొందాయో అర్థం చేసుకోడం స్వాతంత్ర్య కాముకుల విధి. ఈ విభేదాలను న్యాయమైన విధంగా పరిష్కరించి, స్వాతంత్ర్య లక్ష్యమూ, దానికి అనువైన కార్యక్రమమూ అందరికీ సంతృప్తికరమైన విధంగా నిర్వచించి, ప్రజల్లో ఉన్న ప్రతి వర్గం స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనేలా చెయ్యడమే మనవిధి.

మనం ఈవిధిని ఎప్పుడైతే నిర్వర్తించలేక పోయామో, అప్పుడల్లా సామ్రాజ్య వాదులు మనవిభేదాలను వినియోగించుకొని. వాటినింకా ఎక్కువచెయ్యడానికి ప్రయత్నించారు. మన ప్రజల్లో ఇంకా చీలికలు పెట్టడానికి, మన స్వాతంత్ర్య పైవిరుల మ ఒందొరులనుంచి ఇంకా వేరు



చెయ్యడానికీ వారు ఆ విభేదాలను వినియోగించుకున్నారు. ఇలా అయితేనే సురక్షితంగా తాము మనమీద ఎక్కువకాలం పెత్తనం చేయవచ్చు. ఇలా మనల్ని విభజించాలని బ్రిటిష్‌వాళ్లు చేసే ప్రయత్నాల నెదుర్కోడానికి దేశంలోని స్వాతంత్ర్య శక్తులనన్నిటినీ మనం సమీకరించ గలుగుతూ వచ్చామా? — చాలవరకు సమీకరించ లేకపోయామనే చెప్పాలి, ఇది మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రను చూస్తే తెలుస్తుంది.

దీనిఫలితం—ఇవాళ శక్తివంతమైన మన స్వాతంత్ర్యోద్యమం అంతిమ పోరాటానికి సిద్ధం కావలసిన సమయాన, దేశమంతా పరస్పర ద్వేషంతో రెండుక్యాంపులుగా చీలిపోయివుంది. ముస్లింలలో అత్యధిక సంఖ్యాకులు లీగుజెండా క్రింద ఐక్యమై వున్నారు. తతిమ్మా దేశమంతా కాంగ్రెస్ వెనుక నిలబడి వుంది.

పరస్పర విరుద్ధమైనభావాలే ఈ రెండు క్యాంపులను విడదీస్తున్నాయి. ప్రతిఒకరూ రెండోవారి ఆశయం స్వాతంత్ర్యోద్యమానికి విద్రోహకరమనీ, తమ ఆధిపత్యంకోసం రెండోవారి స్వాతంత్ర్యాన్ని నిరాకరిస్తున్నారనీ అంటున్నారు.

## విభేదాలెందుకు వచ్చాయి?

మన స్వాతంత్ర్యోద్యమం వెనుకటికంటే ఎంతో బలవత్తరంగాను, శక్తివంతంగాను ఉన్న ఈ నాడు ఇలాంటివిచ్ఛిన్న పోకడలు ఎందుకు వచ్చాయి? ఈ హిందూముస్లిం సమస్య వెనుకటికంటె యీ నాడు ఎందుకు గడ్డువారింది?

సాధారణంగా, మన స్వాతంత్ర్యోద్యమంయొక్క ప్రతిదశలోను బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మన విభేదాలను వినియోగించుకున్నారన్నది వాస్తవం. కాని, ఇక్కడ ప్రధానమైన విషయం ఏమంటే స్వాతంత్ర్యోద్యమ నాయకులు హిందూముస్లిం విభేదాలను ఎందుకు నిర్మూలించ లేకపోయారు? సమిష్టి స్వాతంత్ర్యంకోసం న్యాయంయొక్క, ప్రజాస్వామికంయొక్క, సామాన్య సూత్రాలను ఎందుకు నిర్వచించలేకపోయారు?

ఎందుకంటే — భారత స్వాతంత్ర్యోద్యమంయొక్క ప్రాథమిక సూత్రాలను, కార్యవిధానాన్ని నిర్మించడానికత్యవసరమైన సమిష్టి భావాలకే మనం ఇంకా రాలేకపోయాం.

బ్రిటిష్ పరిపాలనపట్ల ద్వేషాన్ని వెల్లడించే ఒక బలమైన కోరికగా మాత్రమే నేడు మన స్వాతంత్ర్యాశయంవుంది. మనమందరం కోరే స్వాతంత్ర్యంయొక్క స్వరూపం ఎలా వుండాలో నిర్వచించగల నూతన ప్రజాస్వామిక చైతన్యం ఇంకా రాలేదు.

అందుకనే మన స్వాతంత్ర్యోద్యమం చీలికలు పేలికలుగావుంది. అది మన ప్రజల స్వాతంత్ర్య వాంఛను వెల్లడిస్తుంది కాని, ప్రజలనందరినీ అంతకంతకూ ఐక్యపరచి, స్వాతంత్ర్య శక్తుల్ని నానాటికీ పెంపొందింపజేయగల ప్రజాస్వామిక సూత్రాలతో నడుపబడడంలేదు.

అందుకనే మనం బ్రిటిష్ ప్రభుత్వంతో తలపడిఓడిపోయి నప్పుడల్లా మనలో మనం ఒక అంగీకారానికి రాజాలనప్పుడల్లా - అన్యోన్యంగా నిందించు కొంటున్నాం.

మన దేశాన్ని విభజించి స్వాతంత్ర్యోద్యమాన్ని విచ్ఛిన్నంచేసి, మన బానిసత్వాన్ని చిరస్థాయిగా చేసే మూడో కమ్యూనల్ అవార్డు వచ్చే ప్రమాదాన్ని తప్పించుకోడం కోసం హిందూ ముస్లిం విభేదాలను పరిష్కరించాలని మనప్రజలు కోరుతున్నారు. అందుకనే, మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో పూర్వం ఎప్పుడెప్పుడు, ఎక్కడెక్కడ ఐక్యతను ఎందువల్ల నిర్మించలేక పోయామో, ఎందువల్ల సామ్రాజ్యవాదుల ప్రయత్నాలను ఓడించలేక పోయామో - మేము ఎత్తి చూపుతున్నాం

## కాంగ్రెస్ లీగ్ విభేదాల పునాది

హిందూముస్లిం సమస్యలో ఇంత గందరగోళానికి చాలవరకు కారణం కాంగ్రెస్ లీగు నాయకులు ఇంకా పంథొమ్మిదో శతాబ్దపు మితవాద బూర్జువా ప్రజాస్వామిక ధోరణిలో వుండడమేనని చెప్పాలి. మరొక కారణం: మన వృద్ధ నాయకులు, మన దేశాన్నీ మన ప్రజల్నీ వారివారి



ప్రత్యేకతల్నీ నూతనాభివృద్ధినీ అర్థంచేసుకోడానికి బదులు, తమకు పూర్వంనుంచీ ఉన్న అపోహలమీద, ఇతరదేశాలనుంచి తీసుకున్న తప్పుడు సాదృశ్యాలమీద ఆధారపడ్డారు.

మన స్వాతంత్రోద్యమం యొక్క మొదటిదశలో కాంగ్రెస్ - లీగ్ విభేదాలకిదే పునాదిగా కన్పిస్తుంది. ఈ శతాబ్దం మొదట్లో, మన స్వాతంత్రోద్యమం చదువుకున్న మధ్యతరగతి పట్టణ ప్రజలకు మాత్రమే సంబంధించి ఉన్నప్పుడు, బ్రిటిష్ యాజమాన్యంక్రింద బాధ్యతాయుత ప్రభుత్వంకంటె మనలక్ష్యం ముందుకు పోనప్పుడు, మన నాయకులకు బ్రిటిష్‌వాళ్ళ న్యాయబుద్ధిమీద బ్రిటిష్ ప్రజాస్వామిక సూత్రాలమీద నమ్మకం వుండేది. అప్పుడు మనకు ప్రజా ప్రతినిధి సంస్థలు కావాలని కోరుతుండే వాళ్ళం. మన కోరికకు ప్రాతిపదికగా, తమ వోటును తెలివి తేటలతో వినియోగించుకోగలవారికే (ధనికులకూ, విద్యావంతులకూ) వోటుహక్కు లుండాలనే బ్రిటిష్ బూర్జువా సూత్రాన్ని అంగీకరించాం! ఆనాటి మన కాంగ్రెస్ ముస్లిం నాయకులు బ్రిటిష్ ఎన్నికల విధానం న్యాయసమ్మతమైనదనీ, మంచిదనీ ఆమోదించారు. కాని ఈ సూత్రం తమకు వ్యతిరేకమవుతుందని త్వరలోనే ముస్లిములు కనుక్కున్నారు.

ఆరోజుల్లో ఇండియాలోని వివిధ ప్రాంతాల్లో ప్రజల నూతన వికాసం ఇప్పటికంటేకూడా చాలా హెచ్చుతగ్గులుగా వుండేది. వర్తక వ్యాపారాలు, విద్య ముందుగా బొంబాయి కలకత్తా మద్రాసులలో అభివృద్ధి చెందాయి. అంటే ఉత్తరాది ముస్లిం ప్రాంతాల్లోకంటె ముందుగా హిందూ ప్రాంతాల్లో నూతన జీవితం ప్రారంభమైంది, సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ రోజుల్లో యూనివర్సిటీ విద్య నభ్యసించేవారిలో ముస్లింలు నూటికి నలుగురు మాత్రమే (1882 హంటర్ కమీషన్.)

ముస్లిం సంస్కృతికి నిర్మాతయైన సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ ఆ రోజుల్లో కాంగ్రెస్ కోరే ప్రజాప్రతినిధి సంస్థల నినాదాన్ని వ్యతిరేకించాడు. "వోటును తెలివితేటలతో, స్వతంత్రంగా వినియోగించుకోగల వారికే" వోటుహక్కు వుండాలనే బ్రిటిష్ బూర్జువా సూత్రాన్ని ఆయన

కూడా అప్పటి కాంగ్రెస్ నాయకుల్లాగానే బలపరిచేవాడు. (సుప్రీం లెజిస్లేటివు కౌన్సిల్లో స్థానిక స్వపరిపాలన చట్టంమీద 1883 లో ఆయన ఉపన్యాసం.) కాని, ఈ సూత్రాన్ని భారతదేశ పరిస్థితుల కనుగుణ్యంగా మార్పుచెయ్యకపోతే విద్యాసంపదలు తక్కువగావున్న ముస్లింలకు, ముస్లిం మెజారిటీ ప్రాంతాల్లోకూడా సక్రమ ప్రాతినిధ్యం ఉండదని సర్ సయ్యద్ అభిప్రాయపడ్డాడు. అందువల్లనే సర్ సయ్యద్ అహ్మద్ ఖాన్ తక్కిన ముస్లిం నాయకులు బ్రిటిష్ గవర్నమెంటునుండి మొదట నామినేషన్లరూపంలోను, తర్వాత ప్రత్యేక నియోజకవర్గాల రూపంలోను రక్షణ కోరారు.

కాంగ్రెస్ నాయకులు, హిందూనాయకులు ఆస్తి - విద్య - యోగ్యతల ప్రాతిపదికమీద "ప్రజాస్వామికం"గా ఎన్నికలు జరగాలని, శక్తిసామర్థ్యాలు మాత్రమే పరీక్షింపబడాలికాని జాతి, మతాలుకావనీ వాదించేవారు. సమిష్టి నియోజకవర్గాలకోసం వారు పోరాడారు. దీంతో నియోజకవర్గాలు సమిష్టిగా వుండాలా, ప్రత్యేకంగా వుండాలా అనే సమస్యమీద అభిప్రాయభేదం వచ్చింది.

## సమిష్టి నియోజకవర్గాలా ? ప్రత్యేక నియోజకవర్గాలా ?

ప్రజలు నూతన జీవితాన్ని నిర్మించుకోడానికి సమిష్టి నియోజకవర్గాలే నిజమైన ప్రజాస్వామిక పద్ధతి. సమిష్టి నియోజకవర్గాల ప్రకారం ఏర్పడిన ఎన్నికల పద్ధతివల్ల చిన్న చిన్న విభేదాలుగాక అందరికీ సంబంధించిన విషయాలు స్పష్టపడతాయి.

కాని, అసలు తగాయిదాకుమూలం సమిష్టి నియోజక వర్గాలుకాదు. ఆస్తినిబట్టి విద్యనుబట్టి నిర్ణయించబడ్డ సంకుచిత ఎన్నికల విధానంలో వుంది. వెనుకబడిన ప్రాంతాల్లో ముస్లింలకు తగిన ప్రాతినిధ్యంలేకుండా చేసింది యీ సమిష్టి నియోజక వర్గాలే. ఈసంకుచిత ఎన్నికల పద్ధతివల్ల కలిగే నష్టాలను వారించడానికి, వోటుహక్కు ఇంకా ఎక్కువమందికి ఏర్పడేందుకు కాంగ్రెస్ లీగు నాయకులు కలిసి బ్రిటిషు ప్రభుత్వాన్ని



చుట్టుముట్టవలసింది. కాంగ్రెస్‌వారూ, హిందువులు, ముస్లింలకు జరిగిన ఈ అన్యాయాన్ని అర్థంచేసుకోకుండా, 'ప్రజాస్వామ్యం' పేరిట ఆ సంకుచిత ఎన్నికవిధానాన్నే సమర్థించారు, ఆస్తి, విద్యా యోగ్యతలనే ఆమోదించిన ముస్లింలు నామినేషన్లకోసం, ప్రత్యేక నియోజక వర్గాలకోసం, బ్రిటిష్‌వాళ్ళ వంక తిరిగారు.

వోటు హక్కును విస్తృతం చేయడంకోసం, పరస్పరాను గుణమైన ప్రాతిధ్యంకోసం కాంగ్రెసువారు, ముస్లింలు కలిసి ప్రభుత్వంమీద ఒత్తిడి తెచ్చినట్లయితే, అసలు సమిష్టి నియోజకవర్గాలతోనే సరిపొయ్యేది కాని, కాంగ్రెసూ, మధ్యతరగతి హిందూనాయకులూ ఆస్తి, విద్యాయోగ్యతలతో కూడిన వోటు హక్కువల్ల తమకు వచ్చే అవకాశాన్ని వదలుకోదలచలేదు. ఇక నామినేషన్లద్వారా, ప్రత్యేక నియోజక వర్గాలద్వారా బ్రిటిష్ రక్షణలకోసం ముస్లింలుచూశారు. కనుక, బ్రిటిష్‌వాళ్ళ సంకుచిత ఎన్నికల పద్ధతిని హిందూ ముస్లింలు కలిసి ఎదుర్కొనే దానికి బదులు, మనలో మనకే చీలికవచ్చింది. మనలో మనకు ప్రత్యేక నియోజకవర్గాలు ఏర్పరచే అవకాశం బ్రిటిష్ ప్రభుత్వానికి కలిగింది.

1906 లో ముస్లింలీగు నిర్మాతలు తమ రాయబారవర్గంద్వారా వైస్రాయికి తెలిపిన కోర్కెల ఆధారంమీద, బ్రిటిష్‌వాళ్లు ప్రత్యేకనియోజకవర్గాలను ఏర్పరచడంతోటే, భారతదేశంలో మత కలహాలకు బీజాలు నాటబడ్డాయని ఇప్పటికీ నిజాయితీగల కాంగ్రెసువాదులు చెప్పుతారు. అందుకని అది "ఆంగ్లో ముస్లింకుట్ర" అని అంటారు, కాని ఇదిపూర్తి యదార్థంకాదు; సగంమాత్రమే. తక్కినసగం ఏమంటే కాంగ్రెసుగాని, హిందూ నాయకులుగాని సంకుచితమైన ఆస్తి యోగ్యతా నియోజకవర్గ పద్ధతివల్ల తమ ముస్లిం సోదరులకు జరిగిన అన్యాయాన్ని తొలగించే ప్రయత్నం చేయలేదు.

తర్వాత, స్వాతంత్ర్యోద్యమంయొక్క ప్రతి దశలో మనం ఇలాగే అపజయాలు పొందుతూ వచ్చాం. ఈ మొదటి దశలో, బ్రిటిషు యాజమాన్యంక్రింద బాధ్యతాయుత ప్రభుత్వమే మన లక్ష్యంగా వున్నప్పుడు,

శాసనసభల్లో ఎవరికెంత ప్రాతినిధ్యం వుండాలనేదే హిందూ ముస్లిం విభేదాలకు మూలకారణం అయింది. అది సమిష్టి నియోజక వర్గాల ద్వారానా? లేక ప్రత్యేక నియోజకవర్గాలద్వారానా? బ్రిటిషుప్రభుత్వం ప్రత్యేక నియోజకవర్గాల నేర్పరచింది. కాని దాంతో హిందూ ముస్లిం విభేదాలేమీ పరిష్కారం కాలేదు. కాంగ్రెస్‌వాదు లీనాటికీ 'కమ్యూనల్ అవార్డును' దూషిస్తారు. ముస్లింలు దాన్ని ఒక వరప్రసాదంగా చూస్తారు, అన్యోన్య న్యాయం, సమిష్టి జీవితం, నిజమైన ప్రజా స్వామ్యం—వీటిమీద మన స్వాతంత్ర్యోద్యమం ఒక పరిష్కారానికి రాలేకపోయింది. ఈనాటికీ కూడా ఈ సమస్యమీద మనకు స్పష్టమైన పరిజ్ఞానంలేదు.

ఆరోజుల్లో హిందువులు ఇప్పటిలాగానే, ప్రత్యేకత కోరుతున్నందుకూ బ్రిటిష్‌వాళ్లవైపు చూస్తున్నందుకూ ముస్లింలను నిందించేవారు. కాంగ్రెస్‌లో హిందూ ఆధిపత్యం వుందని ముస్లింలు ఆరోపించేవారు. ఇక్కడ బ్రిటిష్‌వాళ్లు తమ 'చీలదీసి పాలించే' విధానంలో విజయం పొందారు. ఎందువల్ల? అన్యోన్యన్యాయాన్నీ నిజమైన ప్రజాస్వామికాన్ని, ఆధారంగా చేసుకొని కాంగ్రెస్‌నాయకులు ముస్లింనాయకులు సమిష్టిగా ఒక పరిష్కారానికి రాలేకపోయారు కాబట్టి.

వయోజన వోటింగు పద్ధతి వచ్చినట్టయితే, ఈ సమిష్టి ప్రత్యేక నియోజక వర్గాల సమస్య మరో విధంగా వుండేది. వయోజన వోటింగిస్తే, కొన్నిసీట్ల రిజర్వేషన్‌తో సమిష్టి నియోజక వర్గాలను ముస్లింలు అంగీకరించే వున్నారు. కాని. జాతి మతాల దృష్టితో చేసిన ఈ సీట్ల రిజర్వేషనుకూడ జాతి మత విభేదాలకు దారితీస్తుంది. జాతి, మత విభేదాలకు దారితీయకుండా వుండే పద్ధతి ఏదంటే - ప్రతి గ్రూపునూ వారు తెచ్చుకోగలిగిన వోట్లనుబట్టి తగిన ప్రపోర్షనల్ ప్రాతినిధ్యం వుండేలాగా చూడాలి.

ఈ విధంగా వయోజన వోటింగు సమిష్టి నియోజక వర్గాలు, (ప్రపోర్షనల్ రిప్రెజెంటేషన్) వుండడమనేది వివిధ ప్రజలున్న మన దేశంలో న్యాయమైన మార్గం అన్ని జాతులకు, అన్ని గ్రూపులకు పాలక



సంస్థల్లో తగిన ప్రాతినిధ్యం కలిగించగల ప్రజా స్వామికమయిన పద్ధతి యిదే. సీట రిజరేషన్‌తో సమిసి నియోజక వరాలుగాని. ప్రత్యేక నియో

చూడు :—

26 వ పేజీ చివరి పేరాలో ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ ద్వారా అన్ని పా లకు పాలకసంస్థల్లో తగిన ప్రాతినిధ్యం వస్తుందనీ, అదే సరయిన ప్రజాస్వామి పద్ధతి అని చెప్పబడి ఉంది.

ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ అంటే ఏమిటి? దానిద్వారా ప్రజలందరి అన్ని పార్టీలకు న్యాయం ఎలాజరుగుతుందో చూద్దాం. వయోజన ఓటింగును ప్రవేశపెట్టి ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ పద్ధతిద్వారా ఎన్నికలు జరిపితే అన్నిపా లకు, గ్రూపులకు వారి బలాన్నిబట్టి ప్రాతినిధ్యం వస్తుంది. అంటే ఎన్నికలలో ప్రతి పార్టీకి వచ్చిన ఓట్ల దామాషాప్రకారం సీట్లుకూడా యివ్వబడుతాయి. ఉదహరణకు. వయోజన ఓటింగు ప్రవేశపెడితే కృష్ణాజిల్లాలో 10 లక్షలమంది ఓటర్లు ఉన్నారనుకుందాం. అసెంబ్లీకి 10 మంది ప్రతినిధులను పంపాలనుకుందాం. ఎన్నికలలో కాంగ్రెసు, కమ్యూనిస్టుపార్టీ, నిమ్నజాతుల ఫెడరేషన్, ముస్లింలీగు పోటీచేస్తున్నాయనుకుందాం. అప్పుడు ఈ నాలుగుపార్టీలుకూడా తమ తమ అభ్యర్థులను ప్రకటించుతాయి. ప్రతి పార్టీకూడా తమ అభ్యర్థులను ఒక వరుసలో ప్రకటించుతాయి. ఎన్నికలలో 5 లక్షల ఓట్లు కాంగ్రెసుకు, 3 లక్షల ఓట్లు కమ్యూనిస్టు పార్టీకి, 1 లక్ష నిమ్నజాతుల ఫెడరేషన్‌కు వచ్చాయనుకుందాం. అప్పుడు కాంగ్రెసు లిస్టులోని మొదటి ఐదుగురు, కమ్యూనిస్టుపార్టీ లిస్టులోని మొదటి ముగ్గురు, లీగు, నిమ్నజాతుల ఫెడరేషన్ లిస్టులలో మొదటివారు ఎన్నుకోబడతారు.

ఈ పద్ధతిద్వారా ప్రజలకోసం పాటుబడుతూ ప్రజలకు ప్రాతినిధ్యంవహించే ప్రతి పార్టీకి తమ ప్రతినిధులను అసెంబ్లీకి పంపుకోవచ్చు. ఆయాపార్టీలకు ప్రజలలోవున్న పలుకుబడి, బలాన్నిబట్టి సీట్లువస్తాయి. ఇది చక్కనైన ప్రజాస్వామిక పద్ధతి. యూరప్‌లోఏర్పడిన నూతనప్రభుత్వాలన్నీ ఈపద్ధతినే అవలంబిస్తున్నాయి.

సంస్థల్లో తగిన ప్రాతినిధ్యం కలిగించగల ప్రజా స్వామికమయిన పద్ధతి యిదే. సీట్ల రిజర్వేషన్‌తో సమిష్టి నియోజక వర్గాలుగాని. ప్రత్యేక నియోజకవర్గాలుగాని ఒక మత స్వరూపం దాల్చి వెనుకటి లాగానే ఇప్పుడున్న విభేదాలమీద మన ప్రజల్ని చీలదీస్తాయి. ఈ పని చేయడానికి సహజంగా బ్రిటిష్‌వాళ్ళు తయారుగానే వున్నారు. వాళ్ళు మింటోమోర్లేయాక్టుద్వారా మనకు ప్రత్యేక నియోజక వర్గాలు ప్రవేశపెట్టారు.

కాని వయోజన వోటింగు, ప్రపోర్షనల్ రిప్రజంటేషన్ బ్రిటిష్ రాజ్యాంగ విధానానికే కొత్త విషయం. అలాంటి బ్రిటిష్ రాజ్యాంగాన్ని మన నాయకులు ప్రజాస్వామికానికి నమూనాక్రింద తీసుకున్నారు! వారి నాయకత్వం బ్రిటిష్ మితవాద భావాలమీద ఆధారపడివుంది. మన కాంగ్రెస్, లీగు దాదాలు వారి చిన్నతనంలో "ఒకే ప్రజ. ఒకే జాతి, ఒకే దేశం" అనే సూత్రాన్ని ప్రబోధించే పుస్తకాలు చదువుకున్నారు. కాని. ఆ భావాలనే ఒకరు మన జాతీయ జీవితానికి సమన్వయింపజూసేటప్పటికి రెండోవారు సహజంగా వెనక్కు తగ్గేవారు. ముస్లిం నాయకులుకూడా ఈ సూత్రం న్యాయమైనదే అనుకున్నప్పటికీ, ఆ సమయంలో అది తమ ప్రయోజనాలకు వ్యతిరేకంగావుందని వాదించేవారు.

## బ్రిటిష్ భావాలు - భారతదేశం

కాబట్టి కాంగ్రెస్, లీగు నాయకులు తాము బ్రిటిష్‌వాళ్ళ పుస్తకాల్లో నేర్చుకున్న ప్రజాస్వామిక భావాలను మన దేశానికి అన్వయించ పూనుకున్నారు; లేదా, మార్పుచేసి అన్వయించ పూనుకున్నారు. కాని, భారత జీవితాన్ని ఆధారంచేసుకొని, ప్రజాస్వామికాభివృద్ధికోసం, భారత స్వాతంత్ర్యంకోసం. న్యాయమైన నూతనసూత్రాలను నిర్మించడానికి ప్రయత్నించలేదు.

మన రాజకీయనాయకుల్లో వెనుకటి తరంవారు 19వ శతాబ్దపు భావాలను తమ హృదయాలనుంచి తుడిచివెయ్యాలి. యువకులు భారత ప్రజాజీవితం ఎలా అభివృద్ధి చెందిందో తెలుసుకోవాలి. 'ఒకే ప్రజ—ఒకే

జాతి' అనే సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొన్న బ్రిటిష్ ప్రజాస్వామికోద్యమాన్నే కాక, అన్నదమ్ముల్లాగా అనేక జాతులను కలుపుకొని నూతన ప్రజాస్వామికాలను నిర్మించిన సోవియట్ రష్యా యుగొస్లావియాల ప్రజాస్వామికోద్యమ చరిత్రనుకూడా యువకులు నేర్చుకోవాలి. మనం ఈపని చెయ్యకపోతే నిజమైన స్వాతంత్ర్య సూత్రాలను అన్వయించుకోలేము. నిజమైన భారత ప్రజాస్వామికానికి పునాదులు నిర్మించలేము. మన ఆశయానికి నానాటికీ దూరమైపోయి మనలోమనం తిట్టుకుంటూ ఉండవలసి వస్తుంది.

ఏ సమస్యనైనా బుద్ధి సరిగా అర్థంచేసుకోలేకపోతే, హృదయం కూడా సరిగా కొట్టుకోదు. కొట్టగూడని వ్యక్తిమీదికి చెయ్యివేస్తుంది. ఎప్పుడైతే క్లిష్టపరిస్థితులేర్పడుతాయో, ఎప్పుడైతే కాంగ్రెస్ లీగులు ఏకం కాలేకపోతాయో, అప్పుడు ప్రతిసంస్థా, క్రిందటి యుద్ధమైనతర్వాత మాదిరిగానే, తన సమస్యల్ని పరిష్కరించుకోడానికి బ్రిటిషు ప్రభుత్వం వంక చూస్తుంది. బ్రిటిష్‌వాళ్ళు న్యాయమూర్తుల వేషంతో ఆతగాదాను ఇంకా పెంచుతారు. మైనారిటీరక్షణల పేరిట ప్రతిదాంట్లోను జోక్యం కలిగించుకొనే నియంతృత్వాధికారాలను తమ చేతుల్లో పెట్టుకుంటారు. ఇవి మనం పూర్వం నేర్చుకొన్న పాఠాలు. ప్రస్తుత ఘటనలుకూడా వీటినే ధ్రువపరుస్తున్నాయి.

## హిందూ ముస్లిం ఐక్యత - లక్నో ఒడంబడిక

1916 లో రాజకీయ జ్యోతిష్కులు యుద్ధం ఆఖరయే సూచనలు కనిపిస్తున్నాయని చెప్పేవారు. కాంగ్రెసు, ముస్లిం ప్రజానీకంలో సాధారణ రాజకీయ చైతన్యం పెంపొందుతూ వచ్చింది.

విదేశాలకు వెళ్లిన విప్లవకారులు హిందువులు, ముస్లింలు కొందరు బ్రిటిష్‌వారితో పోరాడి స్వాతంత్ర్యం సంపాదించడానికని కాబూల్‌లో ఒక తాత్కాలికభారతప్రభుత్వాన్ని ఏర్పరచారు. రాజామహేంద్రప్రతాప్, మౌల్వీ అబీదుల్లా సింధీ. మౌల్వీ, బర్కతుల్లా, వి. ఛటోపాధ్యాయ (శ్రీమతి సరోజినీదేవి సోదరుడు) మొదలైనవారు దీనికి నాయకత్వం వహించారు.

ఇంగ్లీషువాళ్ళనుంచి ఎక్కువ అధికారం గుంజుకోడానికి హిందూ ముస్లిం ఐక్యతయొక్క అవసరం ఇండియాలోకూడా గుర్తించబడింది. ఆగాఖాన్ చెప్పుచేతల్లోఉన్న పాతనాయకత్వాన్ని త్రోసేసి, మౌలానామహ్మదాలీ, మౌలానా ఆజాద్, జిన్నాగార్లు ముస్లింలీగుకు నాయకత్వంవహించి కాంగ్రెస్‌తో ఐక్యతకోసం కృషిచేశారు. ఆ కృషి ఫలించింది. ఇరువురూ ముందుగా అంగీకరించిన ఒడంబడికకు తమ తమ సంస్థల ఆమోదం సంపాదించడానికి 1916 లో లక్నోలో కాంగ్రెస్ — లీగు మహాసభలు జరిగాయి.

సమాన హక్కులతో, సమానబాధ్యతలతో, సమాన భాగస్వామిగా బ్రిటిష్ సామ్రాజ్యంలో స్వతంత్ర దేశంగా, వుండేలాగా భారతదేశానికి స్వపరిపాలన కావాలనీ, గవర్నర్ జనరల్, గవర్నర్ కార్యవర్గాల్లో కనీసం సగంమందైనా భారతీయులుండాలనీ, శాసనసభలనింకా విస్తృతం చేసి ఎన్నుకోబడినవారి మెజారిటీవుండేలా చెయ్యాలనీ ఈ లక్నో ఒడంబడిక సమిష్టి నినాదమిచ్చింది.

మహమ్మదీయులకు ప్రత్యేక నియోజకవర్గాలు ఉండవచ్చునని కాంగ్రెసు నాయకులు అంగీకరించారు. ఇదివరకు 1909 చట్టం ప్రకారం ప్రత్యేక నియోజకవర్గాలు లేని సి. పి., పంజాబు రాష్ట్రాలకుకూడా యీ హక్కును అంగీకరించారు. రాష్ట్రశాసనసభల్లో ముస్లింలకు, మింటో మోర్లేయాక్టు కంటె ఎక్కువ స్థానాలిచ్చారు. బెంగాల్లో జనాభా ప్రకారం రావలసిన సీట్లలో నాల్గింటిలో మూడు, పంజాబులో పదింట్లో తొమ్మిది చొప్పున ముస్లింలకు వచ్చాయి. ఇది 1909 చట్టం ముస్లింలకిచ్చినదానికంటే చాలాఅధికం. ఈ ఒడంబడిక వల్లబెంగాల్‌లో నూటికి 10.4 నుంచి 40 దాకా, పంజాబులో నూటికి 25 నుంచి 50 దాకా ముస్లింలకెక్కువ సీట్లువచ్చాయి. కేంద్రంలో ఎన్నుకోబడిన భారత సభ్యుల్లో ముస్లింలు మూడవవంతుండాలి. ఇది రాష్ట్రాల్లోని వారి ప్రాతినిధ్యానికి సాధ్యమైనంత దగ్గరగానే వుంటుంది. ఇంకా సంస్కృతికి, మతానికి సంబంధించిన ప్రధాన రక్షణ ఒకటి ఇచ్చారు. ఒక జాతికి సంబంధించిన ఏ చట్టమైనా

ఆ జాతిసభ్యుల్లో ముప్పాతికవంతు వ్యతిరేకించినట్టయితే దాన్ని అమలు జరుపకూడదు.

ఈ ఒడంబడిక చాలా ముందడుగే అయినప్పటికీ. దీనికి మూలం రాజీపద్ధతి గనుక రెండుపక్షాలవారూ తమతమ సూత్రాలను వదిలిపెట్టుకో వలసి వచ్చినట్లు భావించారు. ప్రత్యేక నియోజక వర్గాలకు అంగీకరించడంవల్ల ముస్లింలవిడిపొయ్యేతత్వానికి ఒకవిధంగా సహాయంచేస్తున్నట్లు కాంగ్రెస్ నాయకులనుకున్నారు. లీగ్ నాయకులు బెంగాలు పంజాబుల్లో తమకు మెజారిటీరాగల హక్కును వదులుకున్నామనీ, 1909 యాక్టు ప్రకారం సాధారణ నియోజక వర్గాల్లో పోటీ చేయడానికున్న తమ హక్కునుకూడా వదులుకోడానికి అంగీకరించామనీ చెప్పారు. ఆ నాడు అలాంటి రాజీ చేసుకోడం తప్పు - అని ఇవాళ సర్దార్ పటేలువంటి కాంగ్రెస్ నాయకులు బహిరంగంగానే చెబుతున్నారు. కాని, అప్పుడు కాంగ్రెస్ లీగు నాయకులిద్దరూ అంగీకారానికి రాగలిగినందుకు ఎంతో ఉత్సాహ పడ్డారు.

అప్పుడు కాంగ్రెస్ మహాసభకు లీగు నాయకులు హాజరైనారు. ఇవాళ సర్దార్‌పటేల్‌లాగానే ఆనాడు మాట్లాడినవారికి లోకమాన్య తిలక్ క్రిందివిధంగా జవాబు చెప్పాడు :

> "మనం మన మహమ్మదీయ సోదరులకు ఎక్కువగా లొంగిపోయామని కొంతమంది చెబుతున్నారు. భారత దేశమంతటిలో ఉన్న హిందువుల అభిప్రాయానికి నేను ప్రాతినిధ్యం వహిస్తానని నాకు నమ్మకంవుంది నేను చెబుతున్నాను. మనం ముస్లింలకు లొంగిపోలేదు.........మనం మూడవపార్టీతో పోరాడవలసి వుండగా, మనమంతా ఈ వేదికమీద జాతిలోను, మతంలోను, వివిధరాజకీయాభిప్రాయాలలోను,ఐక్యమైనిలబడ్డామంటే ఇదిచాలా గొప్పవిషయం. చాలముఖ్యమైన సంఘటన. ఇది ఇవాళఅంత్యంత ముఖ్యమైనసంఘటన."

కాంగ్రెస్ నాయకులుకూడా జనాబ్ జిన్నా అధ్యక్షతక్రింద జరిగిన లీగు మహాసభకు హాజరైనారు. భారత జాతీయోద్యమ పితామహుడు సురేంద్రనాధ బెనర్జీ, గాంధీజీ మొదలైనవారంతా కూడ హాజరైనారు. సరోజనీదేవి, బిపిన్ చంద్రపాల్‌గార్లు చర్చల్లోగూడా పాల్గొన్నారు.

ముస్లింలు వేరుపడకోరుతారని. వారిలో స్వాతంత్ర్య పిపాసలేదనీ చేసే విమర్శలకు జవాబు చెబుతూ జనాబ్ జిన్నా ఇలా అన్నాడు :

> "ఈ ముస్లిం మహాసంస్థ అతి త్వరితంగా ఐక్యభారత దేశాన్ని సృష్టించగల మహత్తరమైన శక్తిగా పెంపొందడం చూస్తే ముస్లింలు వేర్పడతారని మనమీదచేసేఆరోపణ దానంతటదే సమసి పోతున్నట్లు స్పష్టమవుతుంది. ఒక మైనారిటీ జాతిలో విశాలమైన రాజకీయ చైతన్యాన్ని రేకెత్తించడానికి. జాతీయ సమస్యల విషయంలో సహకారం. సమిష్టి ప్రయత్నం చెయ్యడానికి - ఆ మైనారిటీకి పూర్తిరక్షణ ఉంటాయనే హామీ అన్నిటికంటె ముందుగా కావాలి. ఒకజాతిగా ముస్లింల రాజకీయ హోదా గుర్తించ బడడం ద్వారానే, భారత ముస్లింలకు ఆ హామీ వస్తుంది." (ఎం. హెచ్, సయ్యద్ వ్రాసిన 'మహమ్మదాలీ జిన్నా' అనే పుస్తకం 876 వ పేజీనుంచి.)

## కాంగ్రెస్ - ఖిలాఫత్ ఉద్యమం

ఖిలాఫత్తు ఉద్యమంతో భారత స్వాతంత్రోద్యమం బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఒక బలవత్తరమైన, సంఘటిత శక్తిగా అభివృద్ధి చెందింది. కన్నతల్లియొక్క రెండు చల్లని కళ్ళలాగా మహాత్మాగాంధీ అలీ సోదరులు దానికి నాయకత్వం వహించారు. 'స్వరాజ్య' నినాదం దిక్కు దిక్కునా మారుమ్రోగింది.

ఇవాళ మన కర్తవ్యం స్వాతంత్ర్యంకోసం అంతిమ పోరాటం ; ముస్లింలు హిందువులకంటే ఎంత వెనుకబడి వున్నప్పటికీ, వారే ముందు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరారనేది మనం మరచిపోకూడదు.

"స్వరాజ్యం" అనే శబ్దాన్ని సంపూర్ణ స్వాతంత్ర్యంగా నిర్వచించ వలసిందని ముందు పట్టుపట్టింది ఖిలాఫత్ నాయకులు. 1921 లో అహమ్మదాబాద్‌లో మౌలానా హజరత్ మోహనీ ఈ వివాదం లేవదీశాడు. గాంధీజీ దీన్ని వ్యతిరేకించి "బాధ్యతలేనట్లు కన్పిస్తున్నది కనుక యిది నన్ను చాలా నొప్పించిం" దన్నాడు.

1919 లోనే, ముస్లింలీగ్ అమృతసర్ మహాసభలో భారత ముస్లింలెవరూ సైన్యంలో చేరవద్దని కోరుతూ తీర్మానించింది.

1922 జూన్‌లో లక్నోలో జరిగిన ఖిలాఫత్, జమయత్ కార్యవర్గాల సమిష్టి సమావేశంలో "ఇండియాయొక్క మహమ్మదీయుల యొక్క ఉత్తమ ప్రయోజనాలు కాపాడబడాలంటే, కాంగ్రెసు కోరే "స్వరాజ్య" సిద్ధాంతానికి బదులు 'సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని' స్వీకరించడం అవసరమని కోరుతున్నాం" అని ఒక తీర్మానం చేశారు.

(సెంట్రల్ ఖిలాఫత్ కమిటీ మినిట్స్‌నుంచి)

దీనివల్ల "కాంగ్రెస్ నిర్మాణంలో పెద్ద మార్పు" చేయవలసి వస్తుంది కనుక తామలా చేయలేమని ఆ నాడు కాంగ్రెసు నాయకత్వమే వాదించింది.

తీరా, జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వాన తీవ్రవాద శక్తులన్నీ ఒత్తిడి తెచ్చాక కాంగ్రెస్ 1927 మద్రాసు మహాసభలో సంపూర్ణ స్వాతంత్ర్యమే తన లక్ష్యంగా అంగీకరించింది. కాని, ఆ మరుసటి సంవత్సరమే మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతను సమావేశమైన కమిటీ రిపోర్టులో అధినివేశ ప్రతిపత్తే లక్ష్యంగా అంగీకరించింది. దానితో, మహాసభ తీర్మానం కాస్తా నిరర్థకమైపోయింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదులమీద భారత మితవాద నాయకులకు అంతగట్టి నమ్మకం వుండేది - ఇప్పటికీ వుంది।

ముస్లిలు తక్కువమందే అయినప్పటికీ, వారి ఆర్థికస్థితి దుర్భరంగా వున్నప్పటికీ. వారు ఖిలాఫత్ నిధికి కోటి రూపాయలు వసూలు చేసారని మనం గుర్తుంచుకోవాలి. ఇంత మొత్తమే తిలక్ స్వరాజ్య ఫండుకుకూడా వసూలైంది.



ధైర్య సాహసాలతో సైనికులకు నిషిద్ధ విషయాలు ప్రబోధించి ఆలీ సోదరులు, మౌలానా హుసేన్, అహ్మద్ మదనీ మొదలైన ముస్లిం నాయకులు ఆరేసి సంవత్సరాలు జైలుశిక్ష లనుభవించారు.

మలబారు మాప్లా రైతులు, భూస్వాముల్నీ సామ్రాజ్యవాద దౌర్జన్యాన్నీ ఎదిరించి ఘోరమైన పోరాటంసాగించి, వీరకృత్యాలను ప్రదర్శించారనీ, పోరాటానికి అవసరమైన సమర్థతను త్యాగాన్నీ చూపారనీ, మనం జ్ఞప్తికి తెచ్చుకోవాలి. అలాగే 1930 లో సరిహద్దు రాష్ట్రంలోని పఠానులుకూడా తమంతతామే బ్రిటిష్ ప్రభుత్వంమీద కత్తిదూశారు.

1922 ఫిబ్రవరిలో గాంధీజీ సహాయ నిరాకరణోద్యమాన్ని ఆపుజేసినప్పుడు, ఖిలాఫత్ నాయకులందరూ వ్యతిరేకించారు. సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమం పెంపొందాలన్నారు. స్వాతంత్ర్య పోరాటానికి కోటి మంది ముస్లిం సత్యాగ్రహులు కావాలని పిలుపు ఇచ్చారు. (సెంట్రల్ ఖిలాఫత్ కమిటీ మినిట్సునుంచి).

ఈ ఉత్తేజితమైన దేశభక్తిని గాంధీజీ మొదలైన కాంగ్రెస్ నాయకులే అణచివేసారు.

ఇవాళ చాలమంది కాంగ్రెస్‌వాదులు ఈ మహత్తర విప్లవశక్తిని గుర్తించకుండా, స్వాతంత్ర్య సాధనకు ముస్లింలతో పనిలేదని ఊహిస్తున్నారు గనుక, ఈ చరిత్రనంతా గుర్తుకు తేవలసివచ్చింది.

క్రిందటి యుద్ధానంతరం వచ్చిన ప్రజా ఉద్యమంలో ముస్లింలీగు, కాంగ్రెస్ ఖిలాఫత్ నాయకులు ఒక్కటిగా పనిచేశారు. ప్రభుత్వతొత్తులను అభివృద్ధి నిరోధకులను త్రోసేసారు. ముస్లింల న్యాయమైన కోర్కెలను సమ్మతింప జేయడానికి ముస్లిం నాయకులు కాంగ్రెస్ సహకారాన్ని అర్థించారు. అప్పటికి హిందూ మెజారిటీ పెత్తనం చేస్తుందనే భయం ఉండేదికాదు.

ఉద్యమం ఆగిపోవడంతో బ్రహ్మాండమైన విస్పృహ ఏర్పడింది. కాంగ్రెస్ స్వరాజ్యపార్టీని నిర్మించి, 1919 చట్టంమీద పనిచెయ్యడానికి

విశ్వయించింది. సామ్రాజ్యవాదులీ అవకాశాన్ని పూర్తిగా వినియోగించుకొన్నారు. మతకలహాలు ప్రారంభమైనాయి. అభివృద్ధి నిరోధకులు ముందుకు వచ్చారు. అభివృద్ధి నిరోధకులైన హిందువులు కొందరు 'శుద్ధి' 'సంఘటన్' ఉద్యమాలు ప్రారంభించారు. ముస్లింపక్షంనుంచి 'తంజీమ్' 'తబ్లిగ్' ఉద్యమాలువచ్చాయి. ఇద్దరూకూడా రెండో మతంనుంచి తమ మతంలోకి ఎక్కువమందిని త్రిప్పుకోడానికి పోటీ పడ్డారు.

అయినప్పటికీనీ, కాంగ్రెస్‌లో ఉన్న ఉత్తమదేశభక్తులూ, లీగు ఖిలాపత్తులలో ఉన్న ఉత్తమదేశభక్తులూ ఒక సమిష్టి ప్రాతిపదిక కోసం హిందువులు ముస్లింలు తదితర జాతులకు న్యాయంకలిగించే స్వతంత్ర భారత రాజ్యాంగ నిర్మాణానికి ఆధారభూతంకాగల జాతీయ ఒడంబడిక కోసం ప్రయత్నిస్తూనే ఉన్నారు.

## జాతీయ ఒడంబడికల కోసం అన్వేషణ

మన స్వాతంత్ర్యోద్యమం ఒక క్రొత్త స్థాయికి వచ్చింది. మన నాయకులు బ్రిటిష్ పెత్తనంకింద బాధ్యతాయుత ప్రభుత్వం కావాలనే దృష్టిలో ఆలోచించడంలేదు. స్వరాజ్యం వారి దృష్టి. వారివెనుక దేశ వ్యాపితమైన ప్రజాఉద్యమం ఉంది. వారు తమ సొంత రాజ్యాంగాన్ని నిర్మించుకొని యావద్భారతదేశ పరిపాలనను తమహస్తగతం చేసుకోవా లనుకున్నారు. కాని ఇంకా కాంగ్రెస్ ముస్లిం, నాయకుల్లో బ్రిటిష్‌వాళ్ళను గూర్చి భ్రమలున్నాయి. కాంగ్రెస్, లీగ్, తదితర పార్టీలు కలిసి బ్రిటిష్ రాజ్యాంగవిధానాన్ని అనుసరించి, అందరికీ అంగీకారయోగ్యమైన ఒక ప్రజాస్వామిక రాజ్యాంగాన్ని నిర్మించగలిగితే, బ్రిటిష్‌వాళ్లు దానిని తిరస్కరించలేరని వారి నమ్మకం.

పూర్తిగా ప్రజాస్వామికదృష్టిలో అఖిలభారత రాజ్యాంగం వుండాలని కాంగ్రెస్ నాయకులు ఆలోచించారు. అందులో రాష్ట్రాలకు గవర్నర్లు కేంద్రానికి గవర్నర్ జనరల్ నాయకులుగా వుంటారు; రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు ప్రజాస్వామికంగా ఎన్నుకోబడిన శాసనసభలకుబాధ్యత వహిస్తాయి.



ఇప్పుడు కాంగ్రెసుకూ లీగుకూ మధ్యనున్న సమస్య నియోజక వర్గాలను గురించికాదు.

సింధు; బెలూచీస్థాన్, సరిహద్దు రాష్ట్రాలు మొదలైన ముస్లిం మెజారిటీ రాష్ట్రాలసరిహద్దులను పునఃపరిశీలించి. తక్కువ రాష్ట్రాలతో సమానంగా ఆ రాష్ట్రాలుకూడా ప్రజాస్వామిక ప్రభుత్వాన్నీ. రాష్ట్రీయ స్వాతంత్ర్యాన్నీ పొందేలా భారత రాజ్యాంగం వుండాలని ముస్లింనాయకులు కోరారు. కేంద్ర ప్రభుత్వంలో ముస్లింలకు తగిన ప్రాతినిధ్యం కావాలని కోరారు.

అప్పుడు ముస్లింలు వెలిబుచ్చిన ప్రధానమైన కోరిక లివి :

1. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, ముస్లింలు అధికంగాఉన్న భూభాగాలను పెద్ద రాష్ట్రాల్లో చేర్చిపారేశారు. బెలూచీస్థాన్, సరిహద్దు రాష్ట్రాలాంటి వాటిని అభివృద్ధి పొందకుండా జేశారు. ఇలా అణగద్రొక్కబడిన రాష్ట్రాలన్నీ బ్రిటిషిండియాలోని తక్కిన రాష్ట్రాలతో సమాన హోదా కలిగిన ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పడాలి.

2. పంజాబులోను బెంగాలులోను ఉన్న ముస్లిం మెజారిటీకి అనుగుణంగా శాసనసభల్లో ప్రాతినిధ్యం వుండాలి.

3. కేంద్రశాసన సభలోను, కేంద్ర ప్రభుత్వంలోను ముస్లింలకు కనీసం మూడవవంతు ప్రాతినిధ్యం వుండాలి.

ముస్లింనాయకులు, కాంగ్రెస్‌వారు. ఖిలాఫత్ వారు, జనాబ్ జిన్నా లాంటి లీగు మితవాదులు, అందరూ ఈ కోర్కెలను బలపరచారు. ఈ కోర్కెలు కనక అంగీరికంపబడితే, ప్రత్యేక నియోజక వర్గాలను వదలుకొని సమిష్టి నియోజకవర్గాల ఏర్పాటుకు కృషిచేస్తామని వారిలో చాలా మంది 1927 లో ఒప్పుకున్నారు.

ఏ: ఐ. సి, సి. ఈ కోర్కెలను అంగీకరించింది; 1927 డిసంబరులో మద్రాసులో జరిగిన కాంగ్రెస్ మహాసభ ఆమోదించింది.

ఇంతలో బ్రిటిష్‌వాళ్లు, రాజ్యాంగాభివృద్ధికి ఇండియా తయారుగా వుందో లేదో తనిఖీ చేయడానికని కేవలం తెల్లవాళ్ళతో కూడిన సైమన్

కమీషన్‌ను ఇండియాకు పంపుదామని ప్రకటించారు. భారతీయులేమీ చేయలేరని వాళ్ళు గట్టి నమ్మకంతో ఉన్నారు. అప్పట్లో ఇండియా కార్యదర్శిగా వున్న బర్కెన్ హెడ్ హిందూ ముస్లింలు ఐక్యం కాలే"రవి సగర్వంగా చెప్పుకున్నాడు.

సామ్రాజ్యవాదుల సవాలుకు భారతీయులు జవాబు చెప్పారు. హిందువులు ముస్లింలు ఏకమై సైమన్‌కమీషన్‌ను బహిష్కరించారు.

అప్పటికే హిందూముస్లింలు ఒక అంగీకారానికి వచ్చారు. దాన్ని ఆధారం చేసుకొని ఇద్దరూ కలిసి సమిష్టి స్వరాజోద్యమానికి ఆ ఐక్యతను దిట్ట పరచుకోవడం అవసరమైంది. ఈసమయాన సైమన్ కమీషన్‌తో సహకరిస్తున్న హిందువులలోని. మహమ్మదీయులలోని అభివృద్ధి నిరోధకులు ప్రభుత్వ గులాములు కాంగ్రెస్ లీగుల ఒడంబడికను తిట్టిపోయ మొదలు పెట్టారు.

కాని, కాంగ్రెస్ ముస్లిం నాయకులు ఈ ఒడంబడికకు ఎక్కువ కాలం కట్టుబడి వుండలేకపోయారు. ఈ ఒడంబడికకు అసలు ఆధారం రాజీతత్వమే కాని. అందరికీ న్యాయమైన ప్రజాస్వామిక సూత్రాలుకాదు. 'స్వరాజ్' దేశంలో బ్రిటిష్ రాజ్యాంగ విధానం లోగడ వున్నట్టు రాష్ట్రలకు పరిమిత స్వాతంత్ర్యంగల కేంద్రీకృత ప్రభుత్వంగా ఏకజాతి ప్రజాస్వామికంగా వుండాలని కాంగ్రెస్ ఊహ. అందువల్లనే నెహ్రూ అఖిలపక్ష సమితి చిత్తు రాజ్యాంగ చట్టాన్ని తయారుచేసేటప్పుడు, ముస్లిం కోర్కెల మాట వదిలిపెట్టి, తమరాజ్యాంగం బ్రిటిష్ డొమియన్ రాజ్యాంగానికి బటాబటిగా వుండేలాగా చూశారు. ముస్లిం కోరికల సారాంశం ఏమంటే—ఇండియా కేంద్రీకృత రాజ్యాంగంగా కాక, రాజ్యాంగ సమాఖ్యగా వుండాలని; అంటే; రాష్ట్రాలకు సంపూర్ణ స్వాతంత్ర్యం, అన్ని అధికారాలు వుండాలని.

కాంగ్రెస్‌వారు. హిందువులు కేంద్రీకృత రాజ్యాంగం, బలమైన కేంద్ర ప్రభుత్వం కావాలని తలపోశారు; ఇదే వారు బ్రిటిష్ రాజ్యాంగం నుంచి నేర్చుకున్నపాఠం. ముస్లింలు రాష్ట్రాలకు సంపూర్ణ స్వాతంత్ర్యంతో



కూడిన భారత సమాఖ్యను కోరడం విచ్ఛినపంథాగా వారు పరిగణించారు. కాంగ్రెస్‌వారు బలమైన కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ రాష్ట్రాలకు సంపూర్ణాధికారాలను ఇవ్వడానికి నిరాకరించడంచేత, వారు హిందూ ఆధిపత్యంకోసం చూస్తున్నారని ముస్లింలు అనుమానించారు.

## అఖిలపక్ష మహాసభలో విచ్ఛిత్తి

1928 డిసెంబరులో కలకత్తాలో జరిగిన అఖిలపక్ష మహాసభలో పూర్తిగా విచ్ఛిత్తి ఏర్పడింది. కాంగ్రెసువారు ప్రతి విషయమూ బ్రిటిషు వాళ్ళకు నచ్చేలాగా వుండాలని ఆలోచించారు. ముస్లింకోర్కెను గమనించనేలేదు. ఫలితం ఆలీ సోదరులవంటి ఖిలాఫత్ నాయకులును, జిన్నా లాంటి లీగునాయకులును విముఖులయారు. అదివరలో స్వాతంత్ర్య పోరాటంలో సాధించిన హిందూ ముస్లిం ఐక్యత, ముందు అంతిమ పోరాటంకోసం పెంపొందింపజేయవలసిన ఐక్యత ఈవిధంగా విచ్ఛిన్నం చేయబడింది.

ఈకాలంలో మన స్వాతంత్ర్యోద్యమం హిందూ ముస్లిం ఐక్యతను యెందుకు సాధించలేకపోయింది? ఇందుకు రెండు కారణాలున్నాయి. ఒకటి; నాయకులకు తమ సోదర ప్రజలయందు కంటె బ్రిటిషు సామ్రాజ్యవాదులమీద ఎక్కువ నమ్మకంవుంది; రెండు; మన వాస్తవ జాతీయ జీవితాన్ని ఆధారంజేసుకొని న్యాయమైన ప్రజాస్వామిక సూత్రాలమీద తమలో తమకున్న విభేదాలను పరిష్కరించుకోలేకపోయారు.

భారతీయులంతా ఒకే జాతి అని కాంగ్రెస్ నాయకుడూ హిందువులు తలచేవారు. ముస్లిములు ముస్లిమెజారిటీ రాష్ట్రాలను కోరడం విచ్ఛిత్తికరంగా వారు భావించేవారు. ముస్లింలుకూడా తమ కోరికను తమ దృష్టిలోనే వెలిబుచ్చారు గానీ. జాతుల దృష్టిలో విడమర్చి చెప్పలేదు.

నిజానికి. ఇంగ్లాండు ఫ్రాన్సుల్లాగా భారతదేశమంటే ఒకేజాతి కాదనీ, వివిధజాతుల కుటుంబమనీ నాయకులు గు ర్తించకుండా వారి పాత

అపోహలు వారికి అడ్డువచ్చాయి. ప్రతిజాతికీ ప్రత్యేకభాష, ప్రత్యేక సంస్కృతి, ప్రత్యేక సంప్రదాయాలూ....ఉన్నాయి. భారత స్వాతంత్ర్య మంటే, భారతదేశంలోని ప్రతిఒక్క జాతికీ స్వాతంత్ర్యం తక్కిన అన్ని జాతులతో సమానంగా పూర్తి అభివృద్ధి చెందడానికి ప్రతి జాతికీ గట్టి రక్షణ అన్నమాటే. అప్పుడు స్వతంత్రభారత దేశం వివిధ స్వతంత్ర రాష్ట్రాల ఐచ్ఛిక సమాఖ్యగా వుండాలి. ఇక ఆ స్వతంత్ర రాష్ట్రాలు బుద్ధి పూర్వకంగా ఇచ్చిన అధికారాలతోనే బలమైన కేంద్రప్రభుత్వం ఏర్పడాలి.

నిజంగా, భారతదేశంలోని హిందూ ముస్లిం సమస్యకు ఇదే న్యాయమైన, ప్రజాస్వామికమైన పరిష్కారమార్గం. 1926 లోనే భారత ముస్లిం విప్లవకారుడు ఒబీదుల్లాసింధీ యిదే నిర్ణయానికి రావడం గమ వింపదగింది. విప్లవానంతర సోవియట్ ప్రజాస్వామ్యాన్ని చూసి, ఆయన కాన్‌స్టాంటినోపిల్‌లో ప్రవాసంలో వుండగా, ఒక భారత రాజ్యాంగవిధా నాన్ని తయారుచేసాడు దానికి 'స్వరాజ్య' రాజ్యంగం అని పేరుపెట్టాడు. ఉత్తరహిందూ స్థానంలో ఆయన ప్రత్యేకభాషాప్రయుక్తములైన ఈక్రింది వివిధజాతులను గుర్తించాడు — సింధీ, బెలూచీ, పుస్టానియా (పఠాన్ భూమి), పశ్చిమ పంజాబు, మధ్యపంజాబు, కాశ్మీరు, ఆయన ఇచ్చిన పరిష్కారంలో ముఖ్యవిషయాలు. (1) అన్నిజాతులకూ స్వయంనిర్ణయ సూత్రం; (2) స్వతంత్ర ప్రజాస్వామిక రాష్ట్రాల ఐచ్ఛికసమాఖ్యగా భారత దేశంవుండాలి; (3) జమీందారీ తత్వాన్ని రూపుమాపాలి; (4) ముఖ్య పరిశ్రమలను సంఘపరం చెయ్యాలి.

కాని 1928 లో అఖిలపక్ష మహాసభలో సమావేశమైన నాయకు లకు మార్గదర్శకంగా ఇలాంటి విప్లవసూత్రాలులేవు. కనీసం, తమ అపోహలను బట్టిగాక, వాస్తవంగా భారతప్రజలు ఎలావున్నారో చూద్దా మన్న ఊహకూడా వారికి లేదు.

1928 లో ఐక్యత సాధించలేకపోవడమనేది మన జాతీయోద్యమ చరిత్రకే పెదదెబ్బ. దాని ఫలితంగా జరిగిన ఘటనలు చివరకు బ్రిటిష్



సామ్రాజ్యవాదులు 1932 లో 'కమ్యూనల్ అవార్డు' మన నెత్తిన రుద్ద డానికి దారితీసాయి. ఈచట్టం మన విభేదాలను మరింత పెంచింది,

నాయకులు మళ్ళీ తమతమ పక్షాల్లోని అభివృద్ధి నిరోధకులనే ఆశ్రయించారు. ఆలీ సోదరులు బ్రిటిష్‌వాళ్ళ కనుకూలమైన సర్ మహ మ్మద్ షాఫీ ముఠాతో చేతులు కలిపారు. కాంగ్రెస్ నాయకులనుంచి న్యాయం కలుగుతుందని భావించడం పొరపాటని జిన్నా వెనుకటి అను మానం ఇంకాబలపడి, వెనక్కు తగ్గాడు.

ముస్లింలలో డాక్టర్ అన్సారీ నాయకత్వాన కొద్దిమంది మాత్రమే కాంగ్రెసులో మిగిలారు. 1930 లో కాంగ్రెస్ శాసనోల్లంఘ నోద్యమం తేవాలని ప్రయత్నించినప్పుడు, ముందుగా ముస్లింలతో ఒడంబడిక చేసు కోవాలని డాక్టరు అన్సారీ పోరుకాడాడు; లాభం లేకపోయింది. అందు వల్లనే ఆ ఉద్యమంలో 1920 లో లాగా ఎక్కువమంది ముస్లింలు పాల్గొన లేదు. చాలా కొద్దిమంది మాత్రమే పాల్గొన్నారు. సరిహద్దు రాష్ట్రాలలోని పఠాన్ ప్రజా ఉద్యమం, కాశ్మీర్ ముస్లిం ప్రజా ఉద్యమం ఆ మహోద్య మంలోనే కలిసి పోయినప్పటికీ, అవి కాంగ్రెస్ నడిపిన ఉద్యమాలుకావు; వాటంతట అవే వచ్చాయి.

## రౌండ్ టేబిల్ సమావేశం - కమ్యూనల్ అవార్డు

శాసనోల్లంఘ నోద్యమం ఆగిపోయినాక, గాంధీ-ఇర్విన్ ఒడం బడిక జరిగాక, రౌండ్ టేబుల్ సమావేశంలో మళ్ళీ హిందూ ముస్లిం సమస్య వచ్చింది, కాంగ్రెస్‌కు ప్రజల్లో ఉన్న పలుకుబడిని దృష్టిలో పెట్టు కొని, కాంగ్రెసుతో బ్రిటిష్‌వాళ్ళు రాజీకి రాక తప్పదని కాంగ్రెస్ ప్రతినిధి గాంధీజీ నమ్మాడు. దీనికి భిన్నంగా, బ్రిటిష్‌వాళ్లు (అప్పుడు కూడా లేబర్ ప్రభుత్వమే వుండేది) ఇండియాలోని పార్టీలు కనుక ఒక నిర్ణయానికివస్తే తమ 'కున్న బాధ్యతల'కు భంగం లేకుండా తాము ఆ నిర్ణయాన్ని అమలు పరుస్తామని చెప్పారు.

తీరని సమస్యలన్నీ తలెత్తాయి. ఏదోవిధంగా ఐక్యతను ప్రదర్శించడంకోసం ఆదరాబాదరా ప్రయత్నాలు జరిగాయి.

పంజాబురాష్ట్ర సరిహద్దుల్ని పునఃపరిశీలించి, హిందూ ఆధిపత్యం గల అంబాలా డివిజన్‌ను వేరుచేసి, పంజాబును ముస్లిం మెజారిటీ ప్రాంతంగా చెయ్యాలని ముస్లిం నాయకులు మైనారిటీల కమిటీలో సూచించారు. ఈసూచన త్రోసివెయ్యబడింది. బెంగాల్‌లోని ముస్లింమెజారిటీకి పూర్తి ప్రాతినిధ్యం వుండాలా లేదా అనేసమస్య తేలనేలేదు. సిక్కునాయకులదీ హిందూమహాసభా నాయకులదీ పైచెయ్యి అయింది. ఇక ఎవ్వరూ ఒక అంగీకారానికి రాలేకపోయారు. అందరూ బ్రిటిషు మంత్రి తీర్పును అర్థించారు. బ్రిటిషుమంత్రి 'న్యాయం'చేస్తాడని ప్రతి ఒక్కరూ విశ్వసించారు.

ఇక్కడ బ్రిటిష్‌వాళ్ళ పాత్ర ఏమిటో స్పష్టంగా తెలుస్తుంది. వాళ్లు కమ్యూనల్ అవార్డు ప్రసాదించారు. దాని ప్రధానాంశాలు ఇవి;

1. బెంగాల్లోను, పంజాబులోను ముస్లిం మెజారిటీల సమస్య అంగీకరించబడింది. అదీ హిందువులకు వ్యతిరేకంగానే, కాని పూర్తిగా కాదు.

2. ముస్లింలు నూటికి 55 గురు, హిందువులు 43 గురు వున్న బెంగాల్లో ముస్లింలకు నూటికి 48 స్థానాలు. హిందువులకు 39 స్థానాలు. 7 కోట్ల జనసంఖ్య కలిగిన బెంగాల్‌రాష్ట్రంలో కంచుకాగడా వేసిచూసినా కన్పించని యూరోపియన్ మైనారిటీకి 10 స్థానాలువచ్చాయి. "సంఖ్యలో కొద్ది అయినా యూరోపియన్లకు వర్తక పారిశ్రామిక ప్రయోజనాలున్నా" యట! ఈవిధంగా బ్రిటిష్‌వాళ్ళు హిందువులకూ ముస్లింలకూ చెరి కొంచెము ఇచ్చి నిర్ణయాధికారాన్ని తమచేతుల్లో పెట్టుకున్నారు. హిందూ ముస్లింలను చీలదీసి పాలించడానికి యూరపియన్ స్థానాలను భద్రపరచుకున్నారు.

3. పంజాబులోకూడా నూటికి 57 గురున్న ముస్లింలకు నూటికి 49 స్థానాలు, 27 గురున్న హిందువులకు 27 స్థానాలు, 13 రున్న సిక్కులకు 18 స్థానాలు ఇచ్చారు. భూస్వాముల నియోజక వర్గాలు మూటిలో కూడ విజయం పొందితే ముస్లింలకే నూటికి 51 స్థానాలు లభిస్తాయని కూడా హామీ యిచ్చారు!

4. మత సంస్కృతుల రక్షణ విషయంలో ముస్లిం కోర్కెలను మొదటినుంచీ కాంగ్రెస్ అంగీకరిస్తూనే వచ్చింది. కమ్యూనల్ అవార్డు ప్రకారం, ఈ రక్షణాధికారం బ్రిటిష్‌వాళ్ళ చేతుల్లోకి పోయింది. ఇదికూడా గవర్నరుయొక్క ప్రత్యేకాధికారాల్లో చేరింది. దీంతో గవర్నర్‌జనరలూ, గవర్నర్లూ ప్రతివిషయంలోనూ జోక్యం కలిగించుకునే అధికారం ఏర్పడింది.

5. సింధును బొంబాయినుంచి విడదీశారు; సరిహద్దు రాష్ట్రానికి ఒక ప్రత్యేక గవర్నర్ను నియమించారు.

కమ్యూనల్ అవార్డుయొక్క స్వరూపం యిది. ఇది ఏసమస్యనూ పరిష్కరించలేదు. ఇది హిందువులను మహమ్మదీయులను అసంతృప్తి పరచింది; ఒకరి గొంతుమీద మరొకర్ని పెట్టింది. హిందూ ప్రయోజనాలు గానీ ముస్లిం ప్రయోజనాలుగానీ నెరవేరకుండా ఇద్దర్నీ బంధించి బెంగాలునూ, పంజాబునూ తీరనిసమస్యలుగా తయారుచేసింది ఈ అవార్డు.

ఈ కమ్యూనల్ అవార్డువల్ల ఉభయపక్షాలకూ కలిగిన అనర్థాన్ని హిందూ ముస్లింనాయకులిద్దరూ గమనించారు. సామ్రాజ్యవాదుల ఆట కట్టించడానికి ఐక్యతకావాలనికూడా యిద్దరూ గుర్తించారు.

1932 డిసెంబరులో అలహాబాదులో జరిగిన ఐక్యతాసమావేశంలో పండిట్ మాలవ్యా, డాక్టర్ మూంజీలాంటి హిందూమహాసభానాయకులే ఈ క్రింది ముస్లిం కోర్కెలకు అంగీకరించారు: (1) సర్వాధికారాలు గల స్వతంత్రరాష్ట్రాలతో కూడిన ఐచ్ఛికభారత సమాఖ్య; (2) సింధు, సరిహద్దురాష్ట్రం, బెలూచీస్థాన్ ప్రత్యేకరాష్ట్రాలుగా వుండాలి; (3) బెంగాల్ పంజాబులలోని ముస్లిం మెజారిటీలబట్టి శాసన సభలలో ముస్లింల ప్రాతినిధ్యం వుండాలి; (4) కేంద్రంలో ముస్లింలకు నూటికి 32 స్థానాలుండాలి, మొ॥

దీనికి బదులుగా ముస్లింలు సమిష్టి నియోజక వర్గాలకు సమ్మతించారు. ఏ అభ్యర్థిఅయినాసరే ప్రతి జాతిలోనుంచి కనీసం ఒక నిర్దిష్ట సంఖ్యగల వోట్లు సంపాదించాలనే షరతుమీద ఎన్నికల పద్ధతిలో కొద్దిగా మార్పు చేసారు.

కాని సర్ మహమ్మద్ షాఫీలాంటి ప్రభుత్వతొత్తులూ, బెంగాల్ హిందూనాయకులు కొందరూ ఈ ఒడంబడికను వ్యతిరేకించారు. కాంగ్రెస్ నాయకులు పోరాటవాదం వదలుకున్నారు. ముస్లిం నాయకులు పరిష్కారం జరుగుతుందనే ఆశలు వదలుకున్నారు.

భగ్నహృదయుడై మౌలానా మహమ్మదాలి మరణించాడు. నెహ్రూ అఖిలపక్ష సమావేశం విచ్ఛిన్నమైన తర్వాత, భారత రాజకీయాలను జనాబ్ జిన్నాకే వదలిపెట్టి ఆయన లండన్‌లో 'ప్రాక్టీసు' పెట్టుకున్నాడు

అది మన స్వాతంత్ర్యోద్యమంలో రెండవదశ. ఆదశలో అధినివేశ ప్రతిపత్తి రూపంలో వుండే 'స్వరాజ్' మన సమిష్టి ఆశయంగా ముందుకు నడిచాం. అప్పుడు హిందూముస్లింల మధ్య కొత్తకొత్త సమస్యలు రావడం, విభేదాలు పొడసూపడం మనం గమనించాం. అప్పటి ప్రధాన సమస్య ఏమంటే—ముస్లిం మెజారిటీ రాష్ట్రాలను ఏర్పరచి వాటికి తగిన రాష్ట్రాలతోపాటు సంపూర్ణ స్వాతంత్ర్యమూ, కేంద్రాధికారంలో తగిన భాగమూ ఇవ్వడం. అప్పుడుకూడా హిందూముస్లింలలో ఐక్యత లేనందువల్ల, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల 1932 కమ్యూనల్ అవార్డువచ్చింది. ఈ అవార్డుతో తీరిన సమస్య ఏదీలేదు. ఈ కమ్యూనల్ అవార్డును తొలగించడానికి కాంగ్రెస్ లీగులు ఒకనిర్ణయానికి రాలేకపోయాయి. మనలో మనకు న్యాయం కలిగేలాగా కాంగ్రెస్ లీగులు ఒక అంగీకారానికివచ్చి-నిజమైన ప్రజాస్వామిక దృష్టిలో స్వాతంత్ర్య పోరాటానికి జాతీయైక్యతను సాధించలేకపోయాయి.

1935 రాజ్యాంగచట్టాన్ని ఎదుర్కొనడానికి అప్పట్లో సూచింపబడిన సామ్రాజ్యవాదుల ఫెడరేషన్ నిర్ణయాన్ని ప్రతిఘటించడానికికూడా కాంగ్రెస్ లీగులు ఒకే వేదికమీదికి రాలేకపోయాయి. కాంగ్రెస్ లీగులు రెండూకూడా సామ్రాజ్యవాదుల ఫెడరేషన్‌ను వ్యతిరేకించాయి. కాని సర్వాధికారాలుగల స్వతంత్ర రాష్ట్రాల ఐచ్ఛిక సమాఖ్యగా భారత స్వాతంత్ర్యాన్ని నిర్వచించడంలో ఒక నిర్ణయానికి రాలేకపోయాయి. దీనికిబదులు కమ్యూనల్ అవార్డు ఇంకా చీలికలను రెచ్చగొట్టింది. కాంగ్రెస్ సామ్రాజ్యవాదుల ఫెడరేషన్‌ను వ్యతిరేకించింది. భారతదేశానికి రెండు ఫెడరేషన్లు కావాలని లీగు కోరింది. దీంతో లీగుయొక్క విడిపోయే కోరికకు పునాది ఏర్పడింది.



## సామ్రాజ్యవాదుల సమాఖ్యకు వ్యతిరేకంగా పోరాటం

1935 లో బ్రిటిష్‌వాళ్లు తమ ఫెడరేషన్‌ను ఇండియామీద రుద్దాలని ప్రయత్నించారు. ఆ ఫెడరేషను భారతీయులకు ప్రజాస్వామ్యం ఇచ్చినట్లుగానే కన్పిస్తుంది. కాని బ్రిటిష్‌వాళ్ళ నిరంకుశత్వాన్ని సంరక్షిస్తుంది. తమ తొత్తులైన సంస్థానాధిపతులను అడ్డం పెట్టుకొని కేంద్ర శాసనసభలో తమ పెత్తనం చెలాయిద్దామని బ్రిటిష్‌వాళ్ళ ఆలోచన.

ఈ ఇండియా కొత్తచట్టంమీద చర్చలో లార్డు రీడింగు ఈ చట్టం వల్ల తమకు పొయ్యేదేమీ లేదని టోరీలకు హామీ ఇచ్చాడు. రీడింగు చెప్పింది ఇది:

"మనం భయపడవలసిందేముంది ? భారతస్వాతంత్ర్యంకోసం, సామ్రాజ్యంనుంచి పోవడానికికూడా, ఆందోళనచేసే వాళ్లున్నారు. ....కనుక, ఈ అభిప్రాయానికి వ్యతిరేకంగా మనం ఎంతగట్టిపలుకుబడి సంపాదించ గలిగితే అంత సంపాదించడం ముఖ్యం. శాసనసభలో నూటికి 33 గురు సంస్థానాధిపతులుంటారు; అప్పర్ ఛేంబర్ లో 44 గురు వుంటారు." (పామీదత్తువ్రాసిన" "ఇండియా టుడే" లో 401 వ పేజీ)

అదేచర్చలో బాల్డ్విన్ సామ్రాజ్యవాద నీతిని ఈ విధంగా బయటపెట్టాడు: "భారతీయులు చీలిపోయి ఉన్నంతకాలం వారిని పరిపాలించే హక్కు మనకుంది."

కాంగ్రెస్ లీగు నాయకులిద్దరూ అలాంటి ఫెడరేషనుకు వ్యతిరేకంగానే వున్నారు.

జనాబ్‌జిన్నా రాజేంద్రబాబు కలుసుకొని 1935 జనవరిలో ఒక గట్టి నిర్ణయానికి వచ్చారు. ఆ నిర్ణయాన్ని కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీలోను లీగు కౌన్సిలోను ప్యాసుచేసే లోపల హిందూసిక్కు వ్యతిరేకతను అణచాలనికూడా అంగీకారానికి వచ్చారు. కాని పంజాబ్ హిందూ నాయకులు దీన్ని పూర్తిగా వ్యతిరేకించడంతో మార్చిలో జిన్నారాజేన్‌బాబు. సంభాషణలు ఆగిపోయాయి. తాము గట్టి ప్రయత్నాలు చేసినప్పటికీ "అందరినీ సంతృప్తి పరచగల" ఒక నిర్ణయానికి రాలేకపోయామనీ, "దేశాభ్యుదయానికి అన్ని మతాల ఐక్యత అవసరమనీ, ముందుముందు ఈ ప్రయత్నాలను సఫలంచేయ శక్తులు పైకి వస్తాయని ఆశిస్తున్నా"మనీ జనాబ్‌జిన్నా రాజేన్‌బాబులు ఒక సంయుక్త ప్రకటన చేసారు.

దీంతో అంగీకారానికై చేసిన మరొకప్రయత్నం, మళ్ళీ పంజాబు సమస్యమీదనే విఫలమైంది. కాని ఈ కాలంలో (1935–37) కాంగ్రెస్ లీగులు రెండూ అఖిలభారత కేంద్రప్రభుత్వం వుండాలని ఒప్పుకున్నాయి. ఈ సంగతి గుర్తుంచుకోవాలి. సమస్య క్లిష్టతరమైనకొద్దీ విభేదాలెక్కువైనాయి.

వయోజన వోటింగుద్వారా ఎన్నుకోబడిన శాసనసభచేత ఏర్పరచబడిన కేంద్ర ప్రభుత్వం కావాలనేది కాంగ్రెస్ లక్ష్యం. ఇందులో మైనారిటీలకు ప్రత్యేక నియోజకవర్గాలద్వారా తమ అభ్యర్థులను ఎన్నుకొనే హక్కు వుంటుంది. కాని ఎన్నికల్లో విజయంపొందడంకోసం కాంగ్రెస్ "బానిసరాజ్యాంగం రద్దుకావాలి" అనేనినాదంతో ముందడుగు వేసింది. శాసనసభల్లో కాంగ్రెస్ బలవత్తరమైన పక్షంగా ఒక్కసారి వచ్చిందా అంటే, ఇక బ్రిటిష్‌ప్రభుత్వం తమతో రాజీపడితీరాలసి వస్తుందనికాంగ్రెస్ నాయకులు ఆశపడ్డారు.

"మహమ్మదీయులయొక్క తక్కిన మైనారిటీలయొక్క హక్కులకు ప్రయోజనాలకు గట్టి రక్షణలుగల స్వతంత్ర ప్రజాస్వామికరాష్ట్రాల సమాఖ్యను భారతదేశంలో నిర్మించడం" లీగు లక్ష్యం.

(లీగు లక్నో మహాసభ, 1937)

జనాబ్ జిన్నాచే పునర్నిర్మించబడిన లీగుకూడా ఎన్నికల్లో పాల్గొన్నది. సాధ్యమైనన్ని స్థానాలు సంపాదించి, ముందు జరుగనున్న రాజీ రాయబారాలలో తమ శక్తినిచూపి మాట్లాడవచ్చునని లీగు నాయకుల ఉద్దేశ్యం.

కాంగ్రెస్ లీగులు రెండూ ఎన్నికల్లో నిలబడ్డాయి. యు.పి. వంటి రాష్ట్రాల్లో ఒకర్నొకరు పోటీ చేయకుండా వుండడానిక్కూడా పరస్పరం ఒప్పందాలు చేసుకున్నాయి. కాంగ్రెసు అమోఘ విజయం సాధించింది. జిన్నాగారు యూరపునుంచి తిరిగివచ్చాక కొత్తగా పునర్నిర్మించబడిన లీగు బలహీనమైన స్థితిలోవుంది. అంత బ్రహ్మాండమైన విజయాలను పొంద లేకపోయింది.

యు. పి. లో కూడా మంత్రివర్గం ఏర్పరచవలసి వచ్చినప్పుడు కాంగ్రెస్ లీగు సంయుక్తమంత్రివర్గాన్ని ఏర్పరచడానికి కాంగ్రెస్ నాయకులు నిరాకరించారు. ఒకేపార్టీ మంత్రివర్గం వుండాలన్నారు. శాసనసభలో తమ అసెంబ్లీపార్టీని, బయట పార్లమెంటరీబోర్డును లీగువారు రద్దుచేసుకొని, కాంగ్రెస్ ప్రమాణపత్రంమీద సంతకంపెట్టి, కాంగ్రెస్ క్రమశిక్షణకు కట్టుబడివుండడానికి ఒప్పుకొనేట్లయితే, కాంగ్రెస్ నాయకులు వారికి మంత్రివర్గంలో కొన్నిస్థానాలిస్తామన్నారు. కాంగ్రెస్‌పార్లమెంటరీ బోర్డుసభ్యుడు మౌలానా ఆజాద్ ఈషరతులను యు. పి. రాష్ట్ర ముస్లిం లీగు నాయకుడైన ఖలీకుజ్జామన్‌కు సూచించాడు.

మరొకసారి, మళ్ళీ, అంగీకారంకుదరలేదు, లీగు నాయకులు మళ్ళీ తమలోని అభివృద్ధినిరోధకుల చేతుల్లోకి పోయారు. ఏదోవిధంగా లీగు కనుకూలమైన మంత్రివర్గాలను ఏర్పరచుకోడానికి, తమ చౌకబారు రాజకీయాలకు మంత్రివర్గాలు తోడ్పడేలాగా చూచుకోడానికిగాను

జిన్నా గారు సికందర్ హయత్‌ఖాన్ వంటి బ్రిటిష్ అనుకూల ప్రధానులతోను, ఫజులుల్‌హక్‌లాంటి నీతి నియమాలులేని అవకాశ వాదులతోను రాజీ పడ్డాడు. అఖిలభారత రాజకీయాల్లో తాను లీగును బల పర్చేటట్లు పంజాబ్ అంతరంగిక రాజకీయాల్లో యూనియనిస్టుపార్టీ చర్యలలో లీగు జోక్యం కలిగించుకోకుండా వుండేటట్లు సర్ సికందర్ హయత్‌ఖాన్ షరతుపెట్టాడు. ఈ షరతుమీద సర్ సికందర్‌ముతా తమ తమ మంత్రివర్గానికి లీగుపేరుపెట్టారు; వాళ్లకు తన లీగు ముద్ర వెయ్య డమే కాకుండా, రాష్ట్ర ముస్లింలీగు నాయకత్వాన్నికూడా వాళ్ళకే కట్ట బెట్టింది.

## ఒకరినొకరు దూషించుకోవడం

ఐక్యతా ప్రయత్నంలో వరస వరసగా వచ్చిన అపజయాలు కాంగ్రెస్ లీగు నాయకుల్లో ఒకరిమీద ఒకరికి అసంతృప్తి కలిగించాయి. ప్రతివారూ రెండోవారిని తిట్టడం ప్రారంభించారు. పండిత నెహ్రూ లీగు కోరికలను వేళాకోళంచేసి అసలు లీగుయొక్క సామ్రాజ్యవాద వ్యతిరేక స్వభావాన్నే శంకించాడు. ఆయన అన్నమాటలివి.

"లీగు దేనికోసం నిలబడుతుంది ? అది భారత స్వాతంత్ర్యంకోసం సామ్రాజ్యవాద వ్యతిరేకత కోసం నిలబడుతుందా ? నాకు నమ్మకంలేదు.... ముస్లింలీగు సభ్యుల్లో చాలమందికంటె ముస్లింప్రజలతో నాకు ఎక్కువ సంబంధం వున్నదని నేను జిన్నాగారికి సూచించవచ్చునా ? శాసనసభల్లోను ప్రభుత్వ పరిపాలనలోను నూటికిన్ని స్థానాలని అంకెలు గుణించేవారికంటె ముస్లింప్రజల ఆకలి, దారిద్ర్యం, దుర్భర పరిస్థితులు నాకు బాగా తెలుసు" (జనవరి 10, 1937 నెహ్రూ వ్రాసిన 'ఇండియాలో 18 నెలలు' అనే పుస్తకం 147వ పేజీ నుంచి).

దీనికి జిన్నాగారు ఇంతే కంటగింపుతో, ఇంతే గ్రుడ్డితనంతో జవాబు చెప్పాడు. లీగు లక్నో మహాసభలో అధ్యక్షోపన్యాసం చేస్తూ ఆయన అన్న ముక్కలివి :

"భారత జాతీయ ప్రజాస్వామిక స్వపరిపాలనకు లీగు నిలబడు తుంది.........సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని గురించి మాట్లాడేవాళ్ళు కొంత మంది ఉన్నారు. చేతుల్లో 1935 ఇండియా చట్టాన్ని పెట్టుకొని, సంపూర్ణ స్వాతంత్రాన్ని ఉచ్చరించి ప్రయోజనం లేదు. పదేళ్ళబట్టి కాంగ్రెస్ నాయకత్వం భారత ముస్లింల పట్ల మరీ శత్రుత్వం వహిస్తున్నది. హిందూ తత్వాన్ని అవలంబిస్తున్నది. వారికి మెజారిటీ వున్న ఆరు రాష్ట్రాల్లో మంత్రివర్గాలను స్థాపించింది లగాయతు, ముస్లింలు వారిచేతుల్లో న్యాయం పొందజాలరనేది కాంగ్రెస్‌నాయకులు మనోవాక్కాయకర్మల ద్వారా ధ్రువపరిచారు. ఎక్కడెక్కడ వారికి మెజారిటీవుందో. ఎక్క డెక్కడ వారికి అవకాశం వుందో అక్కడక్కడల్లా వారు లీగుతో సహ కారం చెయ్యనిరాకరించారు. లీగును లొంగిపొమ్మన్నారు. చివరకు తమ ప్రమాణ పత్రాలమీద సంతకాలు కూడా చెయ్యమన్నారు."

(ఇండియన్ యాన్యుయల్ రిజిష్టర్, 1937; వాల్యూం: 403 పేజీనుంచి)

"ఏమాత్రంఅధికారం' బాధ్యత వచ్చినప్పటికీ అధిక సంఖ్యాక జాతి అయిన హిందువులు హిందూస్థాన్ తమదే అనే ఉద్దేశం స్పష్టపరిచారు. కాంగ్రెస్ జాతీయత అనే ముసుగు వేసుకొంది. కాని, హిందూసభ ఈ విషయం దాచడంలేదు." అని చెప్పిన మాటల్లోనే జిన్నాగారి పాకిస్థాన్‌కు బీజంవుంది. ఈవిధంగా కాంగ్రెస్ లీగు నాయకులు సమస్యలను అర్థంచేసు కోలేకపోయారు, ఒక అంగీకారానికి రాలేకపోయారు. ఒకరినొకరు తిట్టు కొని దేశంలో అల్లకల్లోలం తెచ్చారు, గుడ్డిద్వేషంతో వాస్తవ పరిస్థితు లనుచూడలేకపోయారు. కాంగ్రెస్‌నాయకులు లీగును సామ్రాజ్యవాద అను కూలసంస్థ అన్నారు. లీగు నాయకులు కాంగ్రెసు మాటల్లో జాతీయ సంస్థగాని చేతల్లో హిందూసంస్థే నన్నారు.

## యుద్ధసంక్షోభం — పాకిస్థాన్ సమస్య

రెండో ప్రపంచయుద్ధం ప్రారంభం కావడంతో మన స్వాతం త్రోద్యమం చిట్టచివరి దశకు వచ్చేసింది, 'భారత స్వాతంత్ర్యాన్ని వెంటనే

గుర్తించాలి. వయోజన వోటింగు పద్ధతిమీద ఎన్నుకోబడిన రాజ్యాంగసభ ద్వారా తమ రాజ్యాంగం ఎలావుండాలో భారతప్రజలే నిర్ణయించుకోవాలి' అనే నినాదం లేచింది. ఈయుద్ధంతో సామ్రాజ్యవాదానికి అంత్యదశ వచ్చేసిందని, భారత స్వాతంత్ర్యోద్యమం ఇప్పుడే స్వాతంత్ర్యం సాధించగలదనీ గుర్తించిన కాంగ్రెస్ నాయకులు ఈ నినాదాన్ని లేపారు. కాని, మామూలు ధోరణినే బెదరించి కొన్ని సౌకర్యాలనూ అధికారాలనూ పొందాలని చూశారు. అందువల్ల మళ్ళీ బేరసారాలకు అవకాశం అట్టే పెట్టారు.

మేము సహాయ నిరాకరణోద్యమం తెస్తామని బెదరించి కాంగ్రెస్ నాయకులు ప్రస్తుతం స్వాతంత్ర్యం కావాలన్నారు. అంటే, కేంద్రంలో అధికారమిస్తే యుద్ధంలో సహాయం చేస్తారన్నమాట! కనుక యుద్ధప్రయత్నాలను భగ్నపరచకూడదనే పాలిసీని కాంగ్రెస్ అవలంబించింది. కాని మంత్రివర్గాలనుంచి తొలగి, తన షరతులమీదనే రాజీ జరగడం కోసం ఎదురుచూసింది.

1936 లో జిన్నాగారు పునర్నిర్మించిన ముస్లింలీగు ఈపాటికే ముస్లింలలో చాలా బలవత్తరంగా తయారయింది. కాంగ్రెసువారూ ముస్లింలూ కలిసి సమిష్టిగా చేసిన 'స్వరాజ్య' పోరాటాలలో నుంచి ముస్లిం జాతీయోద్యమం వెలువడింది. కాని 1924 నుంచీ కాంగ్రెస్ ముస్లింల మధ్య సమిష్టి స్వాతంత్ర్య పోరాటంకోసం ఒక అంగీకారం కుదరక పోవడంవల్ల ఐక్యతకోసం చేసిన కృషి వరసనే విఫలం కావడంవల్ల నానాటికీ ముస్లింల స్వాతంత్ర్య జాతీయోద్యమం చిన్నాభిన్నమైపోయింది. ప్రజా ఉద్యమాలన్నీ విజృంభించిన సమయంలో జిన్నా మళ్ళీ లీగును పునర్నిర్మించాడు. తర్వాత 1937 ఎన్నికల్లో లీగు అభివృద్ధికరమైన విధానాన్ని అవలంబించింది. 1937 లోనే లక్నో మహాసభలో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదించి, ముస్లింలీగు ముస్లిం స్వాతంత్ర్య చైతన్యాన్ని కేంద్రీకరించింది. ఇది ఈ కొత్తలీగు యొక్క అభివృద్ధిలో ఒక దృక్పథం. ఈకాలంలో మన స్వాతంత్ర్యోద్యమం లోగడనుంచే వున్న కాంగ్రెస్ ముస్లిం విభేదాలను పరిష్కరించి, ఐక్యతను సాధించలేక పోవడంవల్ల లీగు అభివృద్ధిలో రెండో దృక్పథం కూడా ఏర్పడుతుంది.

సింధు, సరిహద్దు, బెలూచీస్థాన్, పంజాబ్ మొదలైన ముస్లిం మెజారిటీ రాష్ట్రాలకు సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని ముస్లింలు అంతకంతకూ గట్టిగా కోరడంలో నిజమైన అర్థమేమిటో కాంగ్రెసువాదులూ, హిందూవులూ తెలుసుకోలేక పోయారు. ఈ కోరికలో ముస్లింజాతులు తమతమ జన్మభూముల్లో స్వతంత్రంగా వుండగోరే సదుద్దేశం వుందని వారు గ్రహించలేకపోయారు. అప్పటికింకా ముస్లింలు తమ కోర్కెను విడిపోయే తత్వంలోకి దింపలేదు. 1928 లో అఖిలపక్ష సమావేశం విఫలమయినాక, స్వతంత్ర భారతదేశం, అమెరికా సంయుక్తరాష్ట్రాల పద్ధతిలో, స్వతంత్ర ప్రజాస్వామికాల కూటమిగా వుండాలని అఖిలభారత ఖిలాఫత్ మహాసభ కోరింది.

ముస్లింలీగు 1937 లో తన స్వాతంత్ర్యలక్ష్యాన్ని నిర్వచిస్తూ, భారతదేశం 'స్వతంత్రప్రజాస్వామిక రాజ్యాల సమాఖ్య'గా వుండాలని చెప్పింది. ఈ కాలంలో, రాష్ట్రమంత్రివర్గాలు ఏర్పడ్డతరువాత, సామ్రాజ్యవాదులు సూచించిన ఫెడరేషనును దేశమంతా ఖండిస్తున్న సమయంలో వివిధస్వతంత్రరాజ్యాల ఐచ్ఛిక ప్రజాస్వామిక సమాఖ్యగా భారతదేశం వుండాలనే ప్రాతిపదిక మీద కాంగ్రెస్‌కూ ముస్లింలకూ మధ్య ఐక్యత సాధించవలసింది. కాని, 1937—39 మధ్య కాంగ్రెస్ లీగు రాయబారాలు ఎప్పుడూ ఏ ఫలితానికీ రాలేదు. కాంగ్రెస్ ముస్లింలమధ్య ఒక అంగీకారం కుదరక పోవడంవల్ల ముస్లింలలో అసంతృప్తి హెచ్చింది. ఆ అసంతృప్తి క్రమక్రమంగా విడిపోయేతత్వం క్రిందికి దిగింది. అదే ఈక్రొత్త లీగుయొక్క విశిష్టస్వభావమైంది. అదే లీగు అభివృద్ధిలో రెండో దృక్పథం.

యుద్ధం ప్రారంభంకాగానే, లీగు నాయకత్వంకూడా, కాంగ్రెసువాళ్ళలాగానే, సామ్రాజ్యవాదులతో బేరమాడసాగింది. యుద్ధానికి సహ

కారంచేస్తామనీ, యుద్ధ ప్రయత్నాలకు భంగంకల్గించమనీ, లీగునాయకులు చెప్పారు. తమ షరతులమీద తమతో ప్రభుత్వం ప్రత్యేక పరిష్కారానికి రావాలని ఆశించారు.

వైస్రాయి, తమకు సాంప్రదాయసిద్ధమైన విధానాన్ని, అవలంబించాడు. కాంగ్రెసు, లీగు విభేదాలను వినియోగించుకొన్నాడు. రెండు పార్టీల కోర్కెలను తిరస్కరించాడు. రాష్ట్రప్రభుత్వాలను నిర్మించడం విషయంలో ముందుగా రెండు పార్టీలూ ఒక అంగీకారానికివచ్చి, తర్వాత కేంద్రాన్నిగురించిన ఒక సమిష్టిప్లానుతో తనదగ్గిరికి రావాలని అన్నాడు.

కాంగ్రెస్, లీగులు సమిష్టిగా తనకు లొంగిపోవాలని వైస్రాయి సవాలుచేశాడు. కాని దురదృష్టవశాత్తు, కాంగ్రెస్ లీగులు ఏకమై ఈ సవాలును ఎదుర్కోలేకపోయాయి.

పండిత నెహ్రూ, జనాబ్ జిన్నాలు కలుసుకున్నారు.

జిన్నా కూడా స్వాతంత్ర్యం కోసం నిలబడతాడని తెలుసుకొని నెహ్రూ ఆశ్చర్యపోయాడు. ఆయన ఇలా అన్నాడు ;

"జిన్నాగారు ముస్లింలీగు భారతదేశంయొక్క స్వాతంత్ర్య ప్రకటనకు వ్యతిరేకంగా వున్నారని వైస్రాయి ఊహిస్తున్నాడా? అయితే అతను చాలా పొరపడుతున్నాడు. జిన్నాగారికి నాకు చాల భాగం సమిష్టి లక్ష్యాలున్నాయని తెలుసుకోడానికి నేను ఆనందిస్తున్నాను....—"

(ఇండియన్ యాన్యుయల్ రిజిస్టర్, 1939: వాల్యూం 2, 417 వ పేజీనుంచి)

కాని వచ్చిన అనర్థమంతా ఎక్కడ వున్నదంటే నెహ్రూ జిన్నాలు అంగీకారానికి అవసరమైన సమిష్టి సూత్రాలను నిర్మించుకోలేకపోయారు; అవసరానికయినా ఒక హద్దు ఉన్నదనుకున్నారు; సంభాషణలు చాలించారు.

ఈ రోజుల్లో జరిగిన రాజీ రాయబారాలన్నీ మొగ్గలోనే తునిగిపోయాయి. ముస్లిం మైనారిటీలోని అనేక సంఘాల్లో లీగుకూడా ఒకటని కాంగ్రెస్ నాయకులు పరిగణించారు. కాంగ్రెస్ అసలు ముస్లింలకే



ప్రాతినిధ్యం వహించదనీ, ఒక ప్రధానమైన హిందూపక్షమనీ జిన్నా పేచీ పెట్టాడు.

కాంగ్రెస్, లీగులు ఒక అంగీకారానికి రాలేకపోయినప్పుడల్లా ఒకళ్ళమీద ఒకళ్ళకు మంట ఎక్కువయింది. పరస్పరాంగీకారంమీది ఆశలు అడుగంటి, అది అసాధ్యమనే విశ్వాసం అధికమైంది. ఇద్దరూ తుది నిర్ణయంకోసం బ్రిటిషువాళ్ళవంక అర్రులు చాపుతూవచ్చారు.

కేంద్ర ప్రభుత్వంలో ముస్లిం మెజారిటీ జన్మభూములమీద కూడా కాంగ్రెస్ పెత్తనం చెలాయిస్తుందని లీగు నాయకులు విశ్వసించారు.

రాంఘర్ మహాసభలో కాంగ్రెస్ సంపూర్ణ స్వాతంత్ర్యాన్నీ, వయోజన వోటింగు పద్ధతిమీద రాజ్యాంగ సభనూ కోరింది.

లాహోరు మహాసభలో లీగు ముస్లిం మెజారిటీ రాష్ట్రాల సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరుతూ అవి ప్రత్యేక స్వతంత్ర రాజ్యాంగంగా నిర్మించబడాలని తీర్మానించింది.

ఈ 'ప్రత్యేకరాజ్యాంగం' అనే కోరికను సమర్థించడంకోసం జిన్నాగారు ముస్లింలు ఒక జాతి అనే నినాదం లేవదీశాడు. కాని ఈ సిద్ధాంతానికి మొదట్లోనే వాస్తవ పరిస్థితులలో సంఘర్షణ వచ్చింది. అందువల్లనే పాకిస్థాన్ రాజ్యాంగంలోని "వివిధ భాగాలు ప్రత్యేకంగాను స్వతంత్రంగాను వుండా"లని తీర్మానించడం జరిగింది.

ఈ తీర్మానంమీద ఉపన్యసిస్తూ జిన్నాగారు, అసలు తాను ఈ పాకిస్థాన్ తీర్మానానికెలావచ్చిందీ వివరిస్తూ ఇలా అన్నాడు.

"నిస్సందేహంగా మనం భారత స్వాతంత్ర్యంకోసం నిలబడతాం. అది భారతదేశమంతటికీ స్వాతంత్ర్యమై వుండాలి. ఏ ఒక వర్గానికో స్వాతంత్ర్యంకాదు. అందులో కాంగ్రెసు పెత్తనంక్రింద ముస్లింలు తక్కిన అల్పసంఖ్యాకుల బానిసత్వమయితే మరీ అధ్వాన్నం."

(ఇండియన్ యాన్యుయల్ రిజిస్టర్, 1940, వాల్యూం. 1, 309 వ పేజీనుంచి)

హిందూ ముస్లిం విభేదాలయొక్క చరిత్ర ఇది. మన సమస్య పెంపొందిన చరిత్ర ఇది.

ఉభయపక్షాల నాయకులు ఈ సమస్య ఎలా పెంపొందిందీ అర్థం చేసుకోలేకపోయారు. కాబట్టి బ్రిటిష్ మితవాద భావాలను భారతదేశంలోని వాస్తవపరిస్థితుల కనుగుణంగా మార్చుకొని అన్వయించుకోలేకపోయారు కాబట్టి, ఐక్యతకోసం జరిగిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి. ఇందువల్లనే కాంగ్రెసు లీగులు ఒకదాని కొకటి దూరమైపోయాయి. ఒకరిమీద ఒకరికి నమ్మకం లేకుండా పోయింది, ఇద్దరూ బ్రిటిష్ పాలకులమీద ఆశలు పెట్టుకోడం జరిగింది.

## క్రిప్సు రాయబారం - తదనంతరం

ఇండియాకు చుట్టుకున్న దండయాత్రా ప్రమాదంతో 1942 లో కొత్త పరిస్థితి ఏర్పడింది. ఏసౌకర్యాలూ లేకుండా, ప్రభుత్వం, కాంగ్రెసును లొంగదీసుకోవల్సిన అవసరం వచ్చింది. కాంగ్రెసుకూ లీగుకూ ఆశలు పెట్టడం, సంస్థానాధిపతుల నుపయోగించుకొని అధికారం తమ చేతుల్లోనే వుంచుకోవడం - ఇదే పాత నాటకం మళ్ళీ ప్రారంభమైంది

క్రిప్సు ఎవరేది అడిగితే అదల్లా వాగ్దానం చేసాడు, కాంగ్రెసుకు - అఖిలభారత రాజ్యాంగం; లీగుకు - కేంద్రాధిపత్యంతో నిమిత్తంలేకుండా ప్రత్యేక రాజ్యాంగం; సంస్థానాధిపతులకు - వారి నిరంకుశత్వంతో ఎవరూ జోక్యం కలిగించుకోకుండా....

కాంగ్రెసును బుట్టలోవేసుకోడానికి, బ్రిటిష్‌వైస్రాయి, భారతదేశం భూగోళ శాస్త్రరీత్యా ఒకే దేశమని ముచ్చటించాడు. కాని ముస్లింలకు భారతదేశ విభజనలో బ్రిటిష్‌వాళ్ళు తోడ్పడతారనే విశ్వాసం పోకుండా వుండడానికి, ఏరాజ్యాంగాన్ని కూడా బలాత్కారంగా ముస్లింల నెత్తిన రుద్దమని వాగ్దానం చేసాడు. దీంతో సామ్రాజ్యవాదులు కాంగ్రెస్ లీగు ను బుట్టలో వేసుకున్నారు.



అన్ని పార్టీలవారిని ఒక నిర్ణయానికి రమ్మని సామ్రాజ్య వాదులు కోరారు. ఏనిర్ణయంకూడా ఎవరిమీదా బలవంతంగా రుద్దబడదని హామీ ఇచ్చారు; కాంగ్రెసును జైల్లో పెట్టారు. యుద్ధానికి సహాయం చెయ్యడం ద్వారా ప్రత్యేక సంధికోసం ప్రయత్నించినప్పటికీ, లీగును యుద్ధానికి దూరంగా వుంచారు.

ఆగస్టు ఉద్యమం విఫలమైనాక, కేంద్రప్రభుత్వంలో లీగుకు తగిన భాగమివ్వడానికి బ్రిటిష్‌వాళ్ళు నిరాకరించాకనే, గాంధీ జిన్నాలు కలుసుకున్నారు. కాని- ఒక పరిష్కారానికి రాలేకపోయారు; 'ముస్లింలు ఒక జాతి' అనే సిద్ధాంతం వెనుక అన్నిదేశాల ముస్లింలు కలిసి భారతదేశం మీద దాడిచేసే తత్వం (పాన్-ఇస్లామిజం) ఉన్నదేమోనని గాంధీజీ అనుమానించాడు, భారతదేశ విభజనకు వ్యతిరేకంగా వాదించడంలో గాంధీజీ హిందూ ఆధిపత్యంకోసం ప్రాకులాడుతున్నాడనీ, ఆయన మాటల్లో మాత్రమే స్వయంనిర్ణయసూత్రం అంగీకరించడానికి తయారైనాడనీ జనాబ్ జిన్నా అనుమానించాడు.

కాంగ్రెసు నాయకులు జైళ్ళనుండి బయటకువచ్చి, సిమ్లాసమావేశం జరుగుతుందని ప్రకటించబడగానే, మళ్ళీ కాంగ్రెసు లీగులు ఎవరికివారు ప్రభుత్వంతో రాజీపడవచ్చునని ఆశపడ్డారు. ఉభయులూ సిమ్లాచేరారు. అదివరకు గాంధీ, జిన్నా సంభాషణలవల్ల కలిగిన అభివృద్ధి నంతటినీ కాంగ్రెసునాయకులు కాలదన్నారు.

దీనికి బదులు, లీగ్, భూలాభాయ్ లియాఖత్ సంధిని నిరాకరించింది. చివరకు ఉభయుల ఆశలూ బూడిదైనాయి. దేశానికి తీరని అవమానం జరిగింది.

ఈవాడు ఒకళ్ళమీద ఒకళ్ళు పూర్తిగా నేరం ఆరోపిస్తున్నారు.

సాధారణ నియోజకవర్గాల్లో కాంగ్రెసు, హిందూమహాసభయొక్క ముస్లిం వ్యతిరేక గర్జనల నన్నిటినీ గుత్తగొన్నది. ముస్లిం నియోజకవర్గాల్లో లీగుకు వ్యతిరేకంగా నిలబడ్డవాళ్ళనల్లా బలపరుస్తున్నది.

సీట్లు సంపాదించడం కోసం, ప్రభుత్వ గులామైనాసరే, కాంగ్రెస్‌తో పోరాటానికి కత్తికడితేసరి. ఏ ముస్లిమునైనా లీగు ఆహ్వానిస్తున్నది. ఐక్యతావాంఛ పోయి లీగులో కాంగ్రెస్‌మీద ద్వేషం పెచ్చు పెరుగుతున్నది. కాంగ్రెస్. ముస్లిం ఐక్యతను విచ్ఛిన్నంచేయ బూనుకున్నదనీ, ముస్లిం న్యాయమైన హక్కును నిరాకరించి, ముస్లింలమీద పెత్తనం చెలాయించ నిశ్చయించిదనీ ముస్లింల అభిప్రాయం.

లీగు తన ఎన్నికల ప్రచారంలో స్వాతంత్ర్యంకంటే హిందూ వ్యతిరేకతకే ప్రాధాన్య మిస్తున్నది. మళ్ళీ మతావేశం ప్రవేశించింది. ప్రభుత్వ గులాములు ముఖ్యమైన స్థానాలను ఆక్రమిస్తున్నారు.

భారతదేశం స్వతంత్రరాష్ట్రాల కూటమిగా ఒకే రాజ్యాంగంగా వుండాలనీ. అందులో మైనారిటీలకు వారివారి మత సంస్కృతుల విషయంలో పూర్తి రక్షణలుండాలనీ కాంగ్రెస్ ఊహ. వయోజనవోటింగుతో ఎన్నుకోబడ్డ రాజ్యాంగసభ స్వతంత్ర భారతరాజ్యాంగాన్ని నిర్మించాలని కాంగ్రెస్ చెబుతుంది.

భారతదేశం రెండు స్వతంత్రరాజ్యాల స్నేహకూటంగా వుండాలని. (అందులో ఒకటి ముస్లింలు అధికసంఖ్యాకులుగావున్న తూర్పు ఈశాన్య ప్రాంతం, పాకిస్థాన్; రెండవది హిందూమెజారిటీవున్నమిగతా భారతదేశం, హిందూస్థాన్) లీగు ఊహ. కనుక పాకిస్థాన్‌కూ హిందూస్థాన్‌కూ ప్రత్యేకంగా రెండు రాజ్యాంగ నిర్ణయసభలేర్పడాలని లీగు చెబుతుంది.

ఒకరిమీద ఒకరికి అనుమానం. కాంగ్రెస్ నాయకత్వానికి గానీ, లీగు నాయకత్వానికి గానీ,హిందూ ముస్లిం ఐక్యత వస్తుందనే విశ్వాసం లేదు, స్వరాజ్యానికి హిందూ ముస్లిం ఐక్యతే ప్రధానాధారమని కాంగ్రెస్ లీగు నాయకులు ఇరవై ఏళ్ళక్రిందట గమనించారు. దేశంనుంచి బ్రిటిష్‌వాళ్లు వెళ్ళిపోయేదాకా హిందూ ముస్లిం ఐక్యత సాధ్యంకాదని ఇవాళ కాంగ్రెస్ నాయకులంటున్నారు! బ్రిటిష్‌వాళ్ళకంటే హిందువులూ, కాంగ్రెసూ. తమకు ప్రధానశత్రువులుగా లీగు నాయకులు పరిగణిస్తున్నారు

ఈనాడు మన స్వాతంత్ర్యోద్యమం మూడవదశలో. చివరిదశలో వుంది. తమ రాజ్యాంగాన్ని తామే నిర్మించుకోడానికి భారత ప్రజల జన్మహక్కును పురస్కరించుకొని సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరుతున్నాం. వివిధ పక్షాలు తమ తమ విభేదాలను ప్రజలముందుపెట్టి, వారి నిర్ణయాన్ని స్వీకరించాలి. అందరికీ న్యాయం జరగడానికీ, అందరియొక్క ప్రజాస్వామికం, స్వాతంత్ర్యం రక్షింపబడడానికీ, ఇదే సూత్రం. కాని మన స్వాతంత్ర్యోద్యమంలో అలాంటి సూత్రాలతో కూడిన సమిష్టి ప్లానులేదు. వయోజన వోటింగుతో కూడిన రాజ్యాంగసభ భారతదేశ మంతటికీ ఒక్కటే కావాలంటుంది కాంగ్రెసు. లీగు కలాంటిదేమీ పనికిరాదు; ముస్లిం మెజారిటీప్రాంతాలకు ప్రత్యేకరాజ్యాంగసభ కావాలంటుంది లీగు.

బ్రిటిష సామ్రాజ్యాధిపత్యాన్ని పటాపంచలు చేయడానికీ, భారత ప్రజలందరియిష్టానికీ అనుగుణమైన కార్యక్రమంతో స్వాతంత్ర్యశక్తులన్నీ ఏకంకావాలి. దీనికిబదులు ఇవాళ మనకు పరస్పరం పోరాడుకుంటున్న రెండు ముఠాలు కన్పిస్తున్నాయి. అంతర్యుద్ధపు ఛాయలు అలుముకొంటున్నాయి. సమయంచూచి సామ్రాజ్యవాదులు మళ్ళీ మనకు ఇంకొక కమ్యూనల్ అవార్డు ఇవ్వడానికి సిద్ధపడుతున్నారు. దీనిప్రకారం మన దేశం (1. హిందూరాజ్యం, 2. ముస్లిం రాజ్యం, 3. సంస్థానాధిపతుల నిరంకుశరాజ్యం) మూడు రాజ్యాలుగా శాశ్వతంగా విభజింపబడుతుంది. ఈ మూటిమీద బ్రిటిషువాళ్ళ అదుపాజ్ఞల్లోవుండే 'ఏజెన్సీ సెంటర్' సర్వాధికారాలు చెలాయిస్తుంది.

కాంగ్రెస్ లీగునాయకు లిద్దరూ ఈ విషయాన్ని గమనించడమే లేదు. ఎన్నికల్లో ఎక్కువస్థానాలు సంపాదించి, బ్రిటిష్‌వాళ్ళతో ఎవరికి వారు ప్రత్యేకంగా పరిష్కారం చేసుకుందామని వాళ్లు చూస్తున్నారు!

## మన శత్రువేమనుకుంటాడు !

ఇక్కడ కాంగ్రెస్ లీగులను గురించి మన పరిపాలకులేమనుకొంటున్నారో, మన శత్రువుదృష్టిలో మనం ఎలా వున్నామో ఆలోచించు

కొనడంఅవసరం. యుద్ధానికిపూర్వం. యుద్ధకాలంలోను కాంగ్రెస్‌చెందిన అభివృద్ధి అంతా ఇంగ్లీషువాళ్లపోయాక మొత్తం ఇండియామీద పెత్తనం చెలాయించగోరే హిందూస్వార్ధపరులు పెంపొందడం క్రింద జమకట్టాడు ప్రొఫెసర్ కూప్లండు।

ఈ పెద్దమనిషికే లీగులో సామ్రాజ్య వాంఛలు కనిపించాయి. హిందూ ఆధిపత్యంనుంచి మళ్ళీ భారతదేశాన్నంతటినీ జయించి, ముస్లిం సామ్రాజ్యాన్ని నిర్మించాలని లీగునాయకులు కోరుతున్నారట।

మన శత్రువులు మన ఉద్యమాల్లో నీచస్వభావాలను తీసుకుంటారు; మన నాయకులు చేసిన చెడ్డపనులను మాత్రమే తీసుకుంటారు. కాంగ్రెస్ లీగులు వెనుక ఉన్న అశేష ప్రజ, సామ్రాజ్యవాదుల దృష్టిలో కన్పించదు.

కాంగ్రెసు ఎన్నికల సభల్లోగానీ పత్రికల్లోగానీ చేసే లీగు వ్యతిరేకప్రచారం చూస్తే కాంగ్రెసువాదులు లీగును తిట్టిపోసేధోరణి, పైన చెప్పిన సామ్రాజ్యవాదుల ధోరణికి నకలుగానేవుంటుంది. కాంగ్రెసుమీద లీగు ప్రచారంకూడా అదే ధోరణిలో వుంటుంది.

ఎదుటిపార్టీనాయకులు చెప్పినమాటల్లో చెడ్డవీ, వారుచేసిన చేతల్లో చెడ్డవీ ఏరి తూర్పారపట్టడం తప్పితే, ఎదుటిపార్టీ వెనుకనున్న ప్రజలను అర్థంచేసుకోడంగానీ, వారికి తమ పంథాను నచ్చజెప్పడంగానీ లేదు.

ఇక్కడ కాంగ్రెసు, లీగు విభేదాలను సింహావలోకనంచేశాం. ఇదంతా మూడు ముక్కల్లో చెప్పాలంటే —

1. వారి రాజకీయాభిప్రాయాలనుబట్టి కాంగ్రెసు, లీగు నాయకులుభయులూ 19 శతాబ్దపు బ్రిటిష్ మితవాద ధోరణికి చెందినవారు. 20 వ శతాబ్దపు భారత ప్రజాస్వామిక వాదులుకారు.

2. తమ ప్రజల్లో ఆందోళనచేసేటప్పుడైనా, వారిలోని నీచోద్రేకాలనూ మతావేశాలను రెచ్చగొట్టడానికి వెనుకాడరు.



3. బ్రిటిష్‌వాళ్ళ మాటవస్తే, ఈ నాయకులు తమసోదరుడి కంటే, ఇద్దర్నీ బానిసల్ని చేసిన ఆ యజమానులమీద ఎక్కువ విశ్వాసం ఉంచుతారు. దీనికంతటికీ ఫలితం పెద్ద సంక్షోభం. అదే ఇవాళటి మన భారతదేశ స్వరూపం.

ఈ నాయకులు తమ ప్రజల స్వాతంత్ర్య పిపాసకు, ఒక కార్యక్రమం ఇవ్వలేకపోయారు. అందరికీ న్యాయం జరగాలనే సిద్ధాంతంమీద అందరి స్వాతంత్ర్యం కోసం ఒక స్వాతంత్ర్య కార్యక్రమాన్ని నిర్వచించలేకపోయారు. అందర్నీ బానిసల్ని చేసి అణగద్రొక్కే బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సమిష్టిపోరాటం సాగించలేకపోయారు.

# 3. సామ్రాజ్యవాదుల క్రొత్తప్లాను

వెనుకటి గుణపాఠాల నన్నిటినీ భారత నాయకులు ఇవాళ మరచి పోతున్నారు. ఒకరిమీద ఒకరు కత్తులు దూసుకుంటున్నారు. భారత దేశాన్ని "చీల్చి పాలించా"లనే పాతఎత్తుగడతోనే సామ్రాజ్య వాదులు ప్రవేశపెట్టబోతున్న కొత్తప్లానును గమనించలేకపోతున్నారు.

మన పూర్వులు. బ్రిటిష్‌వాళ్ళ ఎత్తుగడలను అర్ధంచేసుకోలేక పోయారు. కనుకనే మన విభేదాలను బ్రిటిష్‌వాళ్ళు వినియోగించుకునే అవకాశం ఇచ్చారు. కనుకనే మన మాతృభూమిని కోల్పోయారు.

ఇప్పటి నాయకులుకూడా అదే తప్పుచేస్తున్నారు. కాంగ్రెస్ లీగు నాయకులలో అత్యంత ప్రముఖులైన నెహ్రూ, జిన్నాగార్లు ఇవాళ ఎన్నికల మీటింగులలో చెబుతున్న దేమిటి ? తమయందు విశ్వాసంవుంచి, తమను గెలిపిస్తే తక్కిన పనంతా తామే చేసిపెడతామని చెబుతున్నారు. ఇవ్వాళ వారు ప్రజలనుకోరుతున్నదల్లా ఇదే। వాళ్లు కోరేది - తమయందు విశ్వాసం ప్రకటించమని. అంతే।

కాని, వారియందు ఇంతకాలంగా ప్రజలు అచంచల విశ్వాసం వుంచారుగదా, మరి. తమ ఆశయాన్ని ఎందుకు సాధించలేకపోయారు ? ఈ చిన్న ప్రశ్నకు వారుచెప్పే జవాబేమీలేదు. వారు తమ ఉపన్యాసాల్లో బ్రిటిష్‌వాళ్ళ ఆశయాన్ని గూర్చిగానీ. వాళ్ళ ఇవాళటి ఏత్తుగడలను గూర్చి గానీ చెప్పడంలేదు. బ్రిటిష్ పరిపాలన నశించాలని తిట్టి, బ్రిటిషువాళ్ళు తమతో రాజీకి రావాలని అంటున్నారు.

బానిస భారతదేశపు నాయకులు మనల్నింకా బానిసత్వంలో పెట్ట డానికై బ్రిటిష్ సామ్రాజ్యవాదులు అవలంబిస్తున్న పంధాను అర్ధంచేసుకో డానికి గట్టిగా ప్రయత్నిస్తారనీ. భారత స్వాతంత్ర్య పోరాటసైన్యాన్ని నిర్మించడానికి ఎక్కువగా కృషిచేస్తారని సాధారణంగా అనుకుంటాం. కాని ఇదే ఇవాళ కాంగ్రెస్, లీగుల్లో జరగడంలేదు. నాయకులను నమ్మి వారియందు విశ్వాసం ప్రకటించినంత మాత్రాన ప్రజలకు స్వాతంత్ర్యం వచ్చేటట్లయితే. నిజానికి సమస్య చాలా తేలికే అవుతుంది.

మా పార్టీ ఒక్కటిమాత్రమే ఎన్నికల ప్రచారంలో తన గొప్ప తనాన్నిగూర్చి చెప్పుకోడంలేదు; తనకూ ఇతర పార్టీలకూ ఉన్న భేదాలనుగురించి చెప్పుకోడంలేదు; కేవలం బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలద్రోయాల్సిన అవసరాన్నిగురించిమాత్రమే చెబుతున్నది. బ్రిటిష్ సామ్రాజ్య వాదుల ఎత్తును మా పార్టీమాత్రమే స్పష్టంగా అర్ధంచేసుకున్నది; దానికి పై ఎత్తువేసి మన స్వాతంత్ర్య పోరాటానికి బాట చూపుతున్నది.

## బ్రిటిష్ రాక్షస తంత్రం

"కమ్యూనిస్టుపార్టీ తన శక్తినంతటినీ సామ్రాజ్యవాదులమీదికి కేంద్రీకరిస్తున్నది. అంతఃకలహాలలో ఒక్క మాటనుగానీ, ఒక్క కామ్రేడునుగానీ కోల్పోవడం మహాపరాధమని తలుస్తున్నది.

"మా పార్టీయొక్క నినాదం ఒక్కటే — భారతీయుడు భారతీయుడితో పోరాడరాదు; భారతీయులందరుకలిసి బ్రిటిష్ పరిపాలకులతో పోరాడాలి।

"చీల్చి పాలించే విధానంతోనే బ్రిటిష్‌వాళ్ళు మనజన్మభూములను జయించారనీ, ఆవిధానంతోనే ఈ 200 సంవత్సరాలు పాలించారనీ. అదే విధానంతో ఇంకా ఇక్కడ తిష్టవెయ్యడానికి చూస్తున్నారనీ కమ్యూనిస్టుపార్టీ భారతీయులందరికీ గుర్తుకుతెస్తున్నది.

"భారతదేశాన్ని విభజించే సామ్రాజ్యవాదుల క్రొత్తప్లానుకు వ్యతిరేకంగా, భారతదేశ వ్యక్తిత్వంకోసం. సమిష్టిత్వంకోసం కమ్యూనిస్టు పార్టీమాత్రమే ప్రజలనందరినీ సమీకరిస్తున్నది.

"భారత ప్రజానీకంలో పెంపొందుతున్న బ్రిటిష్ ద్వేషాన్నీ. స్వాతంత్ర్య ప్రియులైన, ప్రపంచ ప్రజల్లో వస్తున్న నూతన చైతన్యాన్ని చూశాక, ఇక భారతీయులను వెనకటిలాగా చీలదీయడానికి అవకాశం లేదనీ, భారతదేశాన్ని బానిసదేశంగా త్రొక్కిపట్టడానికి వీలులేదనీ బ్రిటిష్ సామ్రాజ్యవాదులు గుర్తించారు.

ఇండియామీద వాళ్ళ సర్వాధికారమూ, ఇండియాలో వాళ్లు ప్రవేశపెట్టిన సాంఘిక విధానమూ పటాపంచలైపోతున్నాయి. వాళ్లను దేశం నుంచి వెళ్లగొట్టడానికి భారతీయుల మందరం ఒకటి కాక ముందు, వాళ్లు మనమీద రుద్దిన సాంఘిక విధానాన్ని మన కనుకూలమైన విధంగా మార్చి పునర్నిర్మించుకోకముందు, తమ ప్రయోజనాలను కాపాడుకోడానికి వీలైన విధంగా సామ్రాజ్యవాదులు తమ పాత ప్రభుత్వానికి కొత్త స్వరూపం కల్పించబోతున్నారు.

"వాళ్లు భారతదేశాన్ని హిందూ మెజారిటీ రాజ్యంగాను ముస్లిం మెజారిటీ రాజ్యంగాను విభజించడానికి ఎత్తులేస్తున్నారు, ఈ రెండు రాజ్యాల రాజ్యాంగ చట్టాలు బ్రిటిషువాళ్ల సహకారంతో తయారు చెయ్యాలట! వీటితోపాటు, బ్రిటిష్ ప్రభుత్వంతో స్వతంత్ర సంధి సంబంధాలు కలిగిన సంస్థానాధిపతుల రాజ్యాన్నికూడా నిలబెట్టాలని సామ్రాజ్యవాదుల పన్నాగం.

ఈ విధంగా కాంగ్రెసు, లీగు ఉద్యమాలద్వారా వచ్చిన మహత్తర ప్రజా చైతన్యాన్ని చీలదీసి, తరతరాలుగా తమ తొత్తులైన సంస్థానాధిపతుల ద్వారా తమ పెత్తనాన్ని నిలబెట్టుకోవాలని బ్రిటిష్‌వాళ్ళ ఆశ.

"మనదేశాన్ని శాశ్వతంగా విభజించడానికి, కొత్తరకం బానిసత్వం మనదేశంమీద రుద్దడానికి ఇదొక జిత్తులమారి ఎత్తు."



అని కమ్యూనిస్టుపార్టీ తన 'ఎన్నికల ప్రణాళిక'లో బ్రిటిషు సామ్రాజ్యవాదుల రాక్షస తంత్రాన్ని బట్టబయలుచేసింది.

ఇలాంటి రాక్షస తంత్రం బ్రిటిష్‌వాళ్ళకు సహజంగానే స్ఫురిస్తుంది. నీచాతినీచమైన జిత్తులతో తియ్యనిమాటలు చెప్పడంలో వారు ఆరితేరారు. వాళ్లు ఉత్తినే వంద సంవత్సరాలు నవీన ప్రపంచంమీద పెత్తనం చెయ్యలేదు.

ఖండాలకు ఖండాలనే పెద్ద పెద్ద సంక్షోభాల్లో ముంచెత్తి జాతులకు జాతులనే బానిసల్ని చేసుకొని తలెత్తిన ప్రతి స్వాతంత్ర్యోద్యమాన్ని మెడ విరుగగొట్టి ప్రపంచమంతటా చిరకాలంగా పెత్తనం చెలాయించిన బ్రిటిష్ పరిపాలకవర్గానికి ఈ రాక్షసతంత్రాలు నిత్యకృత్యాలు.

## సామ్రాజ్యవాదుల ఎత్తుగడ

వాళ్ళ ఆశయమేమిటో స్పష్టం. భారతదేశం మళ్ళీ స్వాతంత్ర్యం సంపాదించుకోవాలని వాళ్ళ ఉద్దేశంకాదు.

వాళ్ళ ఎత్తుగడకూడా మామూలు ధోరణిలోనేవుంది - ఒక పార్టీ మీదికి మరొకపార్టీని పురిగొల్పడం,

ఈవిధంగా ఇండియా నెత్తిన కూర్చోవాలని వాళ్ళు ఆలోచిస్తున్నారు. కాంగ్రెసు, లీగు నాయకులు తమ విజయాన్ని గురించి ఎంత విశ్వాసంతో వున్నారో, సామ్రాజ్యవాదులుకూడా తమ విజయాన్నిగూర్చి అంత విశ్వాసంతోనే ఉన్నారు.

లేనిపోని భ్రమలు పెట్టుకొని మనంతట మనం తెలివితక్కువవాళ్ళం కాదలచుకోకపోతే. మనం ముందు సామ్రాజ్యవాదుల పంధాను అర్థం చేసుకోవాలి. ప్రపంచ సామ్రాజ్యవాదం నశించడం. బ్రిటిష్ సామ్రాజ్యవాదం అల్లల్లాడి పోవడం మాత్రమేచూసి, నెహ్రూలాగా. మళ్ళీ తన సామ్రాజ్యవాదం తన బ్రతుకుకోసం వేసే ఎత్తుగడలను చూడకపోవడం గుడ్డితనం.

క్రిప్సు ప్రతిపాదన అప్పటికప్పుడు భారతదేశాని కిచ్చిందేమీలేదు. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వపు ఇష్టాని కనుగుణంగా యుద్ధానంతర భారత స్వాతంత్ర్యానికి ఒకప్లానుమాత్రం ఇచ్చింది. తరువాత వచ్చిన బ్రిటిష్ ప్రభుత్వం ఆ ప్లానునే పునరుద్ఘాటించింది.

1945 జూన్ 14 న లార్డు వేవెలు ఇండియాలో ఉపన్యసించిన సమయంలోనే ఇంగ్లాండులో కామన్సుసభలో ఒక ప్రకటనచేస్తూ అమెరీ యిలా అన్నాడు.

"ఏవిధమైన మార్పులు కూర్పులు లేకుండానే. 1942 మార్చిలో క్రిప్సు చేసిన ప్రతిపాదన అలాగేవుంది.....తమ సూచనలను అంగీకరించడానికి భారతనాయకులు సిద్ధపడితే, సాధ్యమైనంత ముందడుగు వెయ్యడానికి బ్రిటిష్‌వారు ఇష్టపడుతున్నారు...."

(సిమ్లాలో అధికార ప్రకటన)

టోరీలను బయటకునెట్టి లేబరు ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక అట్లీ మళ్ళీ పాతపాటనే పాడాడు.

"ఇండియా విషయంలో బ్రిటిష్ పాలసీయొక్క పూర్తి నిర్వచనం 1942 ప్రతిపాదనలోనే వుంది, ఈదేశం (ఇంగ్లాండు) లోని అన్ని పార్టీల ఆమోదం పొందిన ఆ ప్రతిపాదన ఇంకా అమల్లోనే వుంది" అని చెప్పి అట్లీ, క్రిప్సు ప్రతిపాదన మీద జార్జిరాజు చేసిన ఈ క్రింది ప్రసంగాన్ని ఉల్లేఖించాడు: "నా భారత ప్రజలకు ఇదివరకే చేసిన వాగ్దానాలకు అనుగుణంగా భారతనాయకుల ఉద్దేశాన్నిబట్టి, భారతదేశం వెంటనే సంపూర్ణ స్వపరిపాలనను పొందడానికి నా ప్రభుత్వం శాయశక్తులా పనిచేస్తుంది."

(టైమ్సు ఆఫ్ ఇండియా సెప్టెంబరు 20. 1945)

లార్డు వేవెలు 1945 డిసెం. 10 వ తేదీన బ్రిటిష్ అసోసియేటెడ్ ఛేంబర్స్ ఆఫ్ కామర్సు (వ్యాపారస్తుల సంస్థ) లో ఉపన్యసిస్తూ, బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశం స్వాతంత్ర్యంపొందాలని కోరుతున్నదనీ, అందుకు తోడ్పడుతుందనీ మళ్ళీ హామీ యిచ్చాడు. ఆయన ఇలా అన్నాడు:



"భారత ప్రజలు రాజకీయ స్వాతంత్ర్యం పొందాలనీ, ఒక ప్రభుత్వాన్ని గానీ రెండు ప్రభుత్వాలనుగానీ తమ కిష్టమైన విధంగా ఏర్పరచుకోవాలనీ బ్రిటిష్ ప్రభుత్వమూ బ్రిటిష్ ప్రజలూ హృదయ పూర్వకంగా కోరుతున్నారు. నేను ఈవిషయం మీకు నిస్సందేహంగా చెప్పగలను"

(టైమ్సు ఆఫ్ ఇండియా, డిసెంబరు 11, 1945)

బ్రిటిష్ సామ్రాజ్యవాదులను అర్థం చేసుకోవలసిన విధంగా అర్థం చేసుకొని, మన స్వాతంత్ర్య లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని కొన్ని సమస్యలు తేల్చుకుందాం.

భారత స్వాతంత్ర్యాన్ని గుర్తిస్తూ బ్రిటిష్ ప్రభుత్వ ప్రకటనలేదు. ఏ భారతీయ పక్షానికిగానీ, లేదా ప్రజలెన్నుకున్న ప్రతినిధులకు గానీ, అధికారం అప్పచెపుతామనే నిర్దిష్టమైన ప్రకటనా లేదు.

## కాంగ్రెసును బుజ్జగించడం

భారతరాజ్యాంగ నిర్ణయసభ తన కిష్టమయితే బ్రిటిష్ సామ్రాజ్యం నుంచి విడిపోవడానికి హక్కున్నదని కాంగ్రెసును సంతృప్తి పరచడానికి క్రిప్సు ప్రకటించాడు. కాని, అప్పట్లోవున్న బ్రిటిష్ ప్రభుత్వమూ, తర్వాత వచ్చిన ప్రభుత్వాలూ, ఇండియా ఎల్లప్పుడూ బ్రిటిష్ కామన్‌వెల్తులోనే భాగస్వామినిగా వుంటుందనే విశ్వాసాన్నీ, ఆశనూ ప్రకటించాయి.

కాంగ్రెసు నింకా సంతృప్తి పరచడానికీ, లీగుకు వ్యతిరేకంగానయినా సరే బ్రిటిష్‌ప్రభుత్వం తనతో రాజీపడవచ్చునని కాంగ్రెసును భ్రమపెట్టడానికీ, వాళ్ళు భారతదేశంయొక్క ఐక్యతను కాపాడగోరుతున్నట్టు, అందుకోసం సహాయం చేయనున్నట్టు ప్రకటనలు చేశారు.

"భారతదేశంలో సాధ్యమైనంత త్వరలో స్వపరిపాలనను స్థాపించడానికి" బ్రిటిష్ ప్రభుత్వం ప్రతిపాదనలు చేసినట్లు క్రిప్సు ప్రకటనలో వుంది. "నూతన భారత సమాఖ్యను నిర్మించడమే ఆశయ"మట.

(బొంబే క్రానికల్, మార్చి 30, 1942)

కామన్సుసభ చర్చలో సిమ్లా సమావేశాన్ని గురించి ప్రకటిస్తూ, అమెరీ ఇలా అన్నాడు: "అన్ని రాజ్యాలు సంపూర్ణభాగస్వామ్యం వహించే అఖిలభారత సమాఖ్యే మొదటినుంచీ మన లక్ష్యం...." (హిందూ, జూన్ 15, 1945),

పెథిక్‌లారెన్స్ లేబర్‌ప్రభుత్వంలో ఇండియా కార్యదర్శి. ఇతన్ని భారత మిత్రుడని చెప్పి ఆకాశానికెత్తారు. ఈ 'మహానుభావుడు' 1945 డిసెం. 4 వ తేదీన ప్రభువులసభలో ఉపన్యసిస్తూ, చట్టసమ్మతం కాని ఏ స్వాతంత్ర్య పోరాటాన్నయినా బ్రిటిష్‌ప్రభుత్వం అణిచేస్తుందని బెదిరించాడు. "భారతదేశం త్వరగా బ్రిటిష్ కామన్వెల్తులో స్వతంత్ర భాగస్వామినిగా తన పూర్తిస్థానం పొందాలనే ఈదేశ (ఇంగ్లాడు) ప్రజల కోర్కెనూ, ఈ లక్ష్యసిద్ధికోసం మా చేతిలో ఉన్నదల్లా చేయగోరే పార్లమెంటు వారిభనూ ముఖాముఖిన తెలియజేయడానికి" ఒక పార్లమెంటరీ రాయబారవర్గాన్ని భారతదేశానికి పంపుతున్నామన్నాడు.

(టైమ్సు ఆఫ్ ఇండియా, డిసెం. 5, 1945).

చిట్టచివరకు లార్డువేవెలుకూడా తాత్కాలిక కేంద్రప్రభుత్వం విషయంలో కాంగ్రెస్ నాయకులకు ఆశలుగొల్పాడు. బ్రిటిష్ ప్రభుత్వమూ, దాని ఏజెంటుగా తాను "ఒడంబడిక కుదుర్చుకొనడానికీ, భారతదేశం ఒక రాజ్యాంగం నిర్మించుకొనేలా సహాయపడ్డడానికీ కేంద్ర ప్రభుత్వంలో అన్నిపార్టీల సహకారాన్ని సంపాదించడానికీ, రాజ్యాంగంలో మార్పు వచ్చేలోగా (వివిధపార్టీల) వారు దేశ పరిపాలనలో పూర్తి బాధ్యత వహించేలాగా చెయ్యడానికీ చేతనైనదల్లా చేస్తా"మని వేవెలుచెప్పాడు.

(టైమ్సు ఆఫ్ ఇండియా, డిసెంబరు 11, 1945)

## లీగుకు వాగ్దానాలు

లీగును సంతృప్తిపరచడానికి కాంగ్రెస్ నాయకత్వం చెప్పే మాటకంటే తనమాటకే బ్రిటిష్‌ప్రభుత్వం ఎక్కువ విలువ ఇస్తుందని లీగు నాయకత్వాన్ని భ్రమపెట్టడానికీ బ్రిటిష్‌వాళ్లు రెండు పనులు చేశారు.



1. ఇష్టంలేని ఏ పార్టీమీదగానీ యే రాజ్యాంగాన్నీ రుద్దమని చెప్పడం;
2, విభజనకు అవకాశం కల్పించడం; ఇందుకు క్రిప్సుసూత్రం చూడండి:

"బ్రిటిషు ఇండియాలోని ఏ రాష్ట్రంగానీ తన ప్రస్తుత రాజ్యాంగ స్థితికి మారుగా నూతన రాజ్యాంగాన్ని అంగీకరించకపోయినట్లయితే.... (అలా భారత రాజ్యాంగంలో) ప్రవేశించని రాష్ట్రాలతో, వాటి కిష్టమయితే వాటికి భారత సమాఖ్యకిచ్చినంత పూర్తి తాహతుయిచ్చి ఒక నూతన రాజ్యాంగంమీద ఒడంబడిక కుదుర్చుకోడానికి బ్రిటిష్‌ప్రభుత్వం సిద్ధంగా వుంటుంది.

కామన్సుసభలో 1945 జూన్ 14 వ తేదీన సిమ్లా సమావేశ ప్రకటనమీద ఉపన్యసిస్తూ అమెరీ ఇలా అన్నాడు.

"ఇండియాలోని ప్రధాన జాతుల కోర్కెలకు వ్యతిరేకంగా ఎట్టి మార్పునుగాని ప్రవేశపెట్టడం బ్రిటిష్ ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యం కాదు. .... భారతదేశపు భవిష్యత్తు శాశ్వత రాజ్యాంగం, లేక రాజ్యాల స్వరూపాన్నిగూర్చి, ఇప్పుడు సూచింపబడ్డ మార్పులు యేవిధంగాను నిర్ణయాలుకావు; అపోహలు కలిగించవు."

(ఉపన్యాసంయొక్క అధికార ముద్రిత ప్రకటన)

ప్రభువుల సభలో పెథిక్ లారెన్సు ఇలా ప్రకటించాడు:

"భారత ప్రజలెన్నుకున్న ప్రతినిధులచేతనూ, వారి సలహాతోను, బ్రిటిష్ ఇండియాయొక్క భవిష్యత్పరిపాలనకు సంబంధించిన నిర్ణయాలు తీసుకోబడవలెనని బ్రిటిష్‌ప్రభుత్వంయొక్క దృఢవిశ్వాసం"

(టైమ్సు ఆఫ్ ఇండియా, డిసెంబరు 5, 1945)

లేబరు ప్రధాని అట్లీ ఇలా ప్రసంగించాడు:

"1942 క్రిప్సు ప్రతిపాదననాటినుంచీ, ఎల్లప్పుడు భారత సంపూర్ణస్వాతంత్ర్యం, (భారతీయులు తీసుకోడమే ఆలస్యం,) సిద్ధంగావుంది, ఇంతవరకూ వచ్చిన ఆటంక మేమంటే - చాలా పెద్ద ఆటంకమే. ఇండియాలోని జాతులు తమలోతాము ఒక అంగీకారానికి రాలేకపోవడం."

(టైమ్సు ఆఫ్ ఇండియా, నవం. 10, 1945)

చిట్టచివరకు వేవెలు, లోగడ ఉదహరించిన కలకత్తా ఉపన్యాసంలో భారతప్రజలు వారి ఇష్టానుసారం ఒక ప్రభుత్వాన్నిగానీ, (కొన్ని) ప్రభుత్వాలను గానీ" ఏర్పరచుకోవచ్చునని అన్నాడు.

బ్రిటిషు ప్రభుత్వం భారతీయుల స్వయంనిర్ణయ హక్కును గుర్తించడం ఎంత బూటకమో, ముస్లింల స్వయంనిర్ణయ హక్కును గుర్తించడంకూడా అంత బూటకమే.

వాళ్లు సూచించిన రాజ్యాంగ నిర్ణయ సభను ఆధారం చేసుకొని, పంజాబ్ బెంగాలులు ఎప్పటికీ విడిపోవడానికి వోటు చెయ్యజాలవని వాళ్లకు నమ్మకం ఉంది.

క్రింది శాసనసభ లన్నిటినీ కలిపి రాజ్యాంగ నిర్ణయసభను ఏర్పర చాలని క్రిప్సు ప్లాను, రాష్ట్ర అసెంబ్లీల సభ్యులందరూ కలిసి. రాష్ట్రాని కింతమంది అని, రాజ్యాంగ నిర్ణయసభకు ప్రతినిధులను ఎన్నుకోవాలి.

ముస్లింలు అధిక సంఖ్యాకులుగాఉన్న రాష్ట్రాల్లోగూడా ఈ క్రింది పరిస్థితులున్నాయి.

| రాష్ట్రం | ముస్లింలజనసంఖ్య నూటికి ఎంతమంది | రాష్ట్రఅసెంబ్లీలో మొత్తం స్థానాలు | ముస్లింస్థానాలు | మొత్తంలో ముస్లింస్థానాలు నూటికి ఎన్ని ? |
|---|---|---|---|---|
| పంజాబు | 57 | 175 | 86 | 49 |
| బెంగాలు | 55 | 250 | 119 | 48 |
| సింధు | 71 | 60 | 34 | 57 |
| సరిహద్దు | 92 | 50 | 36 | 72 |
| బెలూచిస్థాన్ | 87½ | ఎన్నుకున్న అసెంబ్లీయే లేదు. | | |

అసెంబ్లీలో నూటికి 80 మంది విడిపోవడానికి వ్యతిరేకంగా ఓటు చేసినట్లయితే ఆ సమస్య ఇక శాశ్వతంగా తేలిపోయినట్లేనని విడిపోయే హక్కునుగురించి క్రిప్సు ప్రతిపాదన స్పష్టపరిచింది. నూటికి 60 మంది గానీ, అంతకు తక్కువమందిగానీ అలాచేస్తే ఆ సమస్యను ప్రజల వోటుకు పెట్టమని మైనారిటీ కోరవచ్చు. కాని పంజాబులో బెంగాలులో ఇప్పటి సరిహద్దుల ప్రకారం, ఇప్పటి సంకుచిత వోటింగు పద్ధతిప్రకారం అసెంబ్లీ స్థానాలు ఎవరెవరికి ఎన్నెన్నివున్నాయో చూడండి. పంజాబు బెంగాల్ శాసనసభల్లో ముస్లింలకున్న స్థానాలన్నింటిలోను లీగు విజయం పొందినప్పటికీ, మొత్తం స్థానాల్లో నూటికి 50 కంటే తక్కువస్థానాలే లీగుకు వస్తాయి. కనుక విడిపోవడానికిగాను లీగుకు పంజాబ్ బెంగాల్ అసెంబ్లీలలో ఎప్పుడూ మెజారిటీవోటు రాదు.

ఈ విధంగా, ముస్లిం మెజారిటీ జన్మభూములు విడిపోవాలంటేను తన కనుకూలమయిన సరిహద్దు లేర్పరచుకోవాలంటేను లీగు సర్వదా బ్రిటిష్ ప్రభుత్వాన్నిపట్టుకు వ్రేలాడవలసిన స్థితిలోపెట్టారు సామ్రాజ్య వాదులు.

## సంస్థానాధిపతులకు రక్షణ

తాము క్షేమంగా భారతదేశంలోనే వుండడంకోసం సామ్రాజ్య వాదులు సంస్థానాధిపతుల అండజేరారు. రాజ్యాంగ నిర్ణయ సభలో సంస్థానాధిపతులు పాల్గొనాలనీ, ఏ రాజ్యాంగంకూడా వాళ్ళమీద రుద్దడానికి వీలులేదనీ, వాళ్ళ ఇష్టంలేకుండా వాళ్ళ ప్రస్తుత హోదాను ఎంతమాత్రం మార్చడానికి అవకాశం లేదనీ బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ప్రకటించారు.

సంస్థానాధిపతులకు వారి ప్రజలమీదఉన్న అధికారం చెక్కు చెదరకూడదనీ, వారి పవిత్రమైన హక్కులను త్రోసివెయ్యరాదనీ - టోరీలుగానీ, లేబరు ప్రభుత్వంగానీ చేసిన ప్రకటనలన్నీ ఏకగ్రీవంగా నొక్కిచెప్పాయి.

రాజ్యాంగ నిర్ణయ సభలో ప్రవేశించగోరే సంస్థానాధిపతులకు క్రిప్సు ప్రతిపాదనలు ఒక హక్కు నిచ్చాయి. బ్రిటిష్ ఇండియాలో మాదిరిగానే జనసంఖ్యనుబట్టి తమ ప్రతినిధులను నియమించుకోవచ్చు. (ప్రజలు ఎన్నుకొనడం కాదు.) ఈ ప్రతినిధులకు ఎన్నుకోబడిన ప్రతినిధులతో సమానమైన అధికారాలుంటాయి:

పత్రికా విలేఖరుల సమావేశంలో క్రిప్సు ఇలా చెప్పాడు :

"ఈస్కీము ఏ భారత సంస్థానంమీదగానీ బలవంతంగా ఎట్టి మార్పును తేదలచలేదు. ఏ భారత సంస్థానాన్నిగానీ ఇందులో చేరమని బ్రిటిష్ ప్రభుత్వం బలవంతపెట్టదు."

(బాంబే క్రానికల్, మార్చి 30, 1942)

సిమ్లాసమావేశం జరుగుతూవున్న సందర్భంలో అమెరీ ఐక్య భారతదేశమే తమ ఆశయమనీ, సంస్థానాలు ఇంతవరకు ఐక్య భారత దేశంలో సముచితపాత్రనే నిర్వహించాయనీ ప్రకటించాడు. బ్రిటిషు ప్రభుత్వ నిర్ణయాన్ని పునరుద్ఘాటిస్తూ అమెరీ సంస్థానాధీశ్వరులకు ఈవిధముగా అభయహస్తం ఇచ్చాడు :

"తుదినిర్ణయం ఐక్య భారతదేశంమీద ఆధారపడినా లేక విభజిత భారతదేశంమీద ఆధారపడినా ప్రస్తుత స్థితిగతుల్లో మార్పులువచ్చినా లేక సంస్థానాధీశ్వరుల భవిష్యత్తు సంస్థానాధీశ్వరులకే వదలిపెట్టబడినా, ముందుగా సంప్రదింపులు జరుపకుండా ఈ మధ్యకాలంలో యెటువంటి మార్పులు జరుగవు."

(హౌస్ ఆఫ్ కామన్స్ డిబేట్ - హిందూ 15-6-45)

లేబర్ గవర్నమెంటు ప్రకటనలో ఇలావుంది ;

"ఎన్నిక లయినతర్వాత ఎన్నుకోబడినవారి ప్రతినిధులతోను, సంస్థానాల ప్రతినిధులతోను, రాజ్యాంగ నిర్మాణసభ తీసుకోవాలిసిన విధానాన్నిగురించి దానికి ఉండవలసిన అధికారాల్నిగురించి, కార్యక్రమాన్ని గురించి (Procedure) బ్రిటిష్ ప్రభుత్వం సంప్రతింపులు జరుపుతుంది."

(టైమ్సు ఆఫ్ ఇండియా 20-9-45)

వేవెల్ ఇటీవల తన కలకత్తా ఉపన్యాసంలో ఇలా చెప్పాడు :

"వివిధ పార్టీలు తమలో తాము ఏదోవిధంగా ఒక ఒడంబడికకు రావాలసి ఉంటుంది. (1) భారత దేశంలో ప్రధాన రాజకీయ పార్టీలైన కాంగ్రెసు, (2) అల్ప సంఖ్యాకుల్లో అత్యధిక సంఖ్యాకులుగా వుండి



ప్రధానపాత్ర నిర్వహిస్తూవున్న మహమ్మదీయులు, (3) భారత సంస్థానాధీశ్వరులు, (4) బ్రిటిషు ప్రభుత్వం. ఈ అందరి ఆశయం సర్వసౌఖ్యాలతో తులదూగే స్వతంత్ర భారతదేశాన్ని నిర్మించడమే."

సంస్థానాల స్థితిగతులు ఎలా వున్నాయో నేడు ప్రతి భారతీయునికి తెలుసు. బ్రిటిష్ ఇండియాకంటెకూడా సంస్థానాల పరిస్థితులు మరీ అధ్వాన్నంగా ఉన్నాయి. సంస్థానాధిపతులు జన్మతః భారతీయులే అయినప్పటికి బ్రిటిష్ప్రభుత్వం చేతిలోని కీలుబొమ్మలు. బ్రిటిష్వాళ్ళ సహాయంతోనే నేడు తమ నిరంకుశాధికారం చలాయించగలుగుతూ ఉన్నారు. తెల్లదొరల అండలేకపోతే ప్రజాక్రోధాగ్నికి ఎప్పుడో ఆహుతి అయిపొయ్యేవాళ్ళు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఏదోవిధంగా మసిబూసి మారేడుకాయ జేసి స్వాతంత్ర్య కాముకులైన ప్రపంచప్రజల కండ్లుమూయ జూస్తున్నారు. ఇండియాకు స్వరాజ్యం ఇవ్వడానికి సిద్ధంగానే ఉన్నామనీ, భారతీయ ప్రజలు తమలో తాము ఒక ఒడంబడికకు రావడమే తరువాయి అనీ, బిగ్గరగా గొంతు చించుకుంటున్నారు.

భారతీయ ప్రజల్లో ఐక్యతరాకుండా ఉండేందుకుగాను అందరికీ లేనిపోని అనేక ఆశలు గొలుపుతూ ఉన్నారు.

అందర్నీ చివరకు తమ దయాదాక్షిణ్యాలమీద ఆధారపడేటట్లు చేసుకుంటున్నారు. భారతీయులకు స్వాతంత్ర్యాన్ని ఇవ్వడానికి తాము మనస్పూర్తిగా వాంఛిస్తున్నామనీ, స్వాతంత్ర్యమార్గంలో తామెటువంటి అభ్యంతరాలు కలిగించటల్లేదనీ, భారతీయులు తమలో తాము ఒక ఒడంబడికకు రావడమే ఇక ఆలస్యమని ప్రకటిస్తూ ఉన్నారు. భారతీయులు ఒకవేళ తమలో తాము ఒక ఒడంబడికకు రాలేకపోయినా అభ్యంతరాల్ని లక్ష్యపెట్టకుండా ఇక తమ ప్లానును అమల్లో పెట్టబోతున్నామని ఇవ్వాళ తామొక పెద్ద న్యాయమూర్తుల్లాగా నటిస్తూ ఉన్నారు.

పైనుదహరించిన విషయాలనుబట్టి బ్రిటిష్విధానం ఎలావుంటుందో స్పష్టం అవుతుంది. ఇంకా ఎవరికయినా తేటతెల్లంగా తెలియకపోతే

ప్రొఫెసర్ కూప్లాండు తయారుజేసిన "భారతరాజ్యాంగ నిర్మాణసమస్య" అనే పుస్తకాన్ని ఒకసారి చదవవలసింది. ఈ గ్రంథం పండిత భాషలో ఉన్నా (acadamic language) బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పంథాను స్పష్టంగా తెలియపరుస్తుంది. భారత సమస్యను పై అధికార ప్రకటనలో సూచించిన రీతిగా తమ కనుకూలంగా పరిష్కరించుకో దలచారవి స్పష్టమవుతుంది.

తాతలనాడెప్పుడో బ్రిటిష్ ప్రభుత్వంతో సంస్థానాధీశ్వరులు చేసుకున్న సంధిపత్రాలను మన్నించాలట. బ్రిటిష్ప్రభుత్వం గొడుగుక్రింద కడుపులో చల్లకదలకుండా ఈరాజాలు మహారాజాలు, నవాబులు నవాబ్ జాదాలు ఇన్నాళ్ళనుంచి చల్లగా కాలక్షేపం జేస్తున్నారు. తమతో చేసుకున్న ఒడంబడికలకు వాగ్దానాలకు తూచా తప్పకుండా బ్రిటిష్ ప్రభుత్వం కట్టుబడి ఉంటుందని వారికి తెలుసు. కాని భారత రాజకీయ్య నాయకులు "భగవత్ప్రసాదితమైన" తమ జన్మహక్కుల్ని అంగీకరించరేమో అని సంస్థానాధీశ్వరులు సందేహిస్తూన్నారు. తమ కిష్టంగాకపోతే భారతసమాఖ్యలో (ఫెడరేషన్) చేరకుండా బ్రిటనుతోనే నేరుగా సంబంధం పెట్టుకొనే అవకాశంకూడా సంస్థానాధిపతుల కివ్వబడింది.

## సంస్థానాలే బ్రిటిష్ ప్రభుత్వానికి కీలకస్థానాలు

తమ చేతులో కీలుబొమ్మలైన సంస్థానాధిపతుల్ని సామ్రాజ్యవాదులు ఏవిధంగా ఉపయోగించుకో దలచుకున్నారో కూప్లాండు ఇది వరకే వెల్లడిచేశాడు.

ఇప్పుడున్న సంస్థానాలన్నీ ఒక అవిభాజ్యభూభాగంగా (ఒక పెద్ద అతుకుల బొంతగా) ఏర్పడాలట. పడమట కోస్తాలో ఉన్న కథియవార్ సింధు రాష్ట్రాలనుంచి రాజపుతానా సెంట్రల్ ఇండియామీదుగా తూర్పుకోస్తాలో ఉన్న ఒరిస్సా సంస్థానాలు, ఉత్తరంగా హిమాలయ పర్వత పాదభూమిలో ఉన్న కాశ్మీరునుంచి రాజపుతానా, హైద్రాబాద్ మైసూరులమీదుగా దక్షిణాగ్రములో ఉన్న కొచిన్ ట్రావెన్కూర్ సంస్థానాలు. ఇవన్నీకలిసి ఒక ప్రిన్సిస్థాన్గా (సంస్థానాలకూటమి) ఏర్పడాలట.



సంస్థానాధీశ్వరులతో ఒడంబడిక చేసుకునేపక్షంలో నేడు బ్రిటిష్ ప్రభుత్వాధీనంలో ఉన్నసమస్తభారతభూమి— కరాచీనుంచి కలకత్తావరకు కాశ్మీర్నుంచి రామేశ్వరం వరకు ఒకే విశాలదేశంగా ఉండే అవకాశం ఉంటుందని ఆ ప్రబుద్ధుడు సూచిస్తూన్నాడు.

"ఇండియన్ ఫెడరేషన్లో చేరడానికి ప్రిన్సిస్తాన్ అంగీకరించకపోతే బ్రిటిష్ ప్రభుత్వంతో డిఫెన్సు ట్రీటీ (రక్షణసంధి) చేసుకుంటుంది. పరిశ్రమాభి వృద్ధికి, ఆయుధాగార నిర్మాణానికి బ్రిటిష్ సహాయాన్ని అర్థిస్తుంది. బ్రిటిష్ వైమానికులచేత మధ్య భారతదేశంలో ఆక్రమించుకోబడిన విమానాశ్రయాలు బ్రిటిష్ కామన్వెల్తు యొక్క ప్రధాన అవసరాల్ని గుర్తిస్తాయి." అని కూడా ఆ పెద్దమనిషి సెలవిస్తున్నాడు.

వివిధ పక్షాలకు జెందిన భారతీయులందరు దీని భావ మేమిటో స్పష్టంగా తెలుసుకోవాలి. అందరికి తెలిసేటట్లు ఒక్కముక్కలో చెప్పాలంటే బ్రిటిష్సైన్యాలు సంస్థానాల్లో ఎప్పటిలాగా తిష్ఠవేస్తాయి. సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా జరిగే తిరుగుబాట్లను అణగ గొడతాయి. ఆసియా ఖండాన్ని అంతటినీ తన గుప్పెటలో పట్టుకోవడానికి ఈ విమానాశ్రయాలు బ్రిటనుకు చక్కగా ఉపయోగపడతాయి.

ఇందులో ముఖ్యంగా గ్రమవించవలసిన మరో విషయంకూడా ఉంది. మిగతా భారతదేశం ఒకవేళ బ్రిటిష్ పెట్టుబడిని నిరాకరించినా, లేక బ్రిటిష్ పెట్టుబడిదార్లకు అంగీకార యోగ్యములుకాని షరతులు విధించినా, తమ చెప్పుచేతుల్లో ఉండే ఈ సంస్థానాల్లోనయినా యథేచ్ఛగా తమ పెట్టుబడిని ఉపయోగించి బ్రిటిష్ పరిశ్రమల్ని నిర్మించుకోవచ్చునని సామ్రాజ్యవాదుల ఊహ. భారత ప్రభుత్వం విధించే పన్నులు, సుంకాలు చెల్లించకుండా తప్పించుకోవడానికి బ్రిటిష్ పెట్టుబడిదార్లకు ఇదొక చక్కని మార్గం.

## బ్రిటిష్ ప్రభుత్వం హిందూ మహమ్మదీయ కలహాన్ని అపేక్షిస్తుంది

కాంగ్రెసు లీగులు తమలో తాము ఒక ఒడంబడికకు రాలేవని కూప్లాండ్ అభిప్రాయం. అందువల్ల తన ఇష్టానుసారం పాకిస్తాన్ సరిహద్దుల్ని నిర్ణయించాడు. అతని స్కీముప్రకారం పడమటి పాకిస్థాన్‌లో నేటి సింధురాష్ట్రం, సరిహద్దురాష్ట్రం, పంజాబ్ రాష్ట్రం (అంబాలా డివిజన్ను మినహాయించి) ఉంటాయి. తూర్పు పాకిస్తాన్‌లో నేటి అస్సాం, బెంగాల్ రాష్ట్రాలు (బర్ద్వాన్ డివిజన్ మినహా) ఉంటాయి. అంటే కలకత్తా మాత్రం తూర్పు పాకిస్తాన్‌లోనే ఉంటుంది. కాని బొగ్గు, ఇనుము పరిస్రమలకు ఆధార భూతమయిన ప్రధాన పారిశ్రామిక ప్రదేశం మాత్రం హిందూస్తాన్‌లోనే ఉంటుంది.

ఈ సరిహద్దులు లీగు నాయకత్వానికి అంగీకార యోగ్యములని ఆ ప్రొఫెసరు అభిప్రాయం. కాని అన్యాయానికి తలపడిన ఏ మహమ్మదీయుడైనా ఈ పరిష్కారానికి అంగీకరిస్తాడేమో కాని, ప్రజాస్వామిక సూత్రాన్ని పాటించే ముస్లిం ప్రజా బాహుళ్యం మాత్రం యిందుకు అంగీకరించదు. సిక్కుల అభిప్రాయాన్ని పాటించకుండా నిర్బంధంగా వారిని పడమటి పాకిస్తాన్‌లో అట్టిపెట్టితే శాంతిసౌఖ్యాలకు బదులుగా ఆరాష్ట్రంలో అల్లరి. అశాంతి చెలరేగుతుంది. యుద్ధానంతరం ఏర్పడిన తూర్పు యూరప్ మధ్యయూరప్‌లాగా అంతఃకలహాలకు ఆటపట్టవుతుంది.

తూర్పు పాకిస్తానుకు కూడా ఇదేగతి పడుతుంది. అస్సామీయులు, కొండజాతులు కలిసి అస్సాం మహమ్మదీయులమీద తిరుగుబాటు చేస్తారు. బెంగాలీ మహమ్మదీయులకు బెంగాలీ హిందువులకు మధ్య ఆరని యుద్ధాగ్నిజ్వాలలు అలముకుంటాయి."

ఈ ప్రమాదాలన్నీ కూప్లాండ్ గుర్తించకపోలేదు. పైనుదహరించిన విధంగా ఏర్పడిన పాకిస్తాన్‌కు ఆత్మరక్షణకు కావలసిన శక్తి సామర్ధ్యాలు ఉండవు అన్నాడు. ప్రస్తుత బడ్జెటును ఆధారంగా తీసుకొని ఈ విషయాన్ని అంకెలతోసహా రుజువు చేయడానికి ప్రయత్నించాడు: ఈ పాకిస్తాన్‌లో ముస్లిం ప్రజాసామాన్యాన్ని పీల్చి పిప్పిజేస్తూ ఉన్న నేటి ముస్లిం భూస్వాములు చెక్కుచెదరకుండా అలాగే తమ దోపిడీ విధానాన్ని కొనసాగిస్తూఉంటారు. నేడు అమల్లోఉన్న ఈఆర్ధికవిధానంమీదనే కూప్లాండ్ ప్లాను ఆధారపడుతుంది.



అధిక సంఖ్యాకులుగా ఉన్న హిందువులు దేశ విభజనను వ్యతిరేకిస్తూ ఉన్నారని మరోకారణం చెప్పుతున్నాడు.

"ఈ పరిస్థితుల్లో హిందూ మహమ్మదీయ రాష్ట్రాల్లో స్నేహపూర్వక మయిన సంబంధాలు ఏర్పడడం అసంభవం. స్వయం కృతాపరాధానికి తగిన ఫలితం అనుభవించాలిసిందే. అని హిందువులు మహమ్మదీయులకు తోడ్పడరు.........హిందుస్తాన్ పాకిస్తాన్‌కు సహాయం చేస్తుందనుకోవడం కలలో వార్త. కాబట్టి పైరెండు రాష్ట్రాలకు ప్రత్యేకంగా వేరే వేరే సైన్యాలుండాలి."

(కూప్లాండ్- పేజి 95, 3 వ భాగం)

"ఒక వేళ పాకిస్తాన్ ఏర్పడినా, తన్ను తాను రక్షించుకొనే స్థితిలో ఉండదు. దేశాన్ని విభజించడం తప్పనిసరి అయ్యే పక్షంలో నేడు హిందువుల్లో ఉన్న అసంతృప్తి ఆగ్రహంగా మారి యుద్ధానికి దారితీయకుండా ఉండాలని ప్రతివాడూ ఆశిస్తాడు. కాని అది ఎంతవరకు సాధ్యమవుతుందో ఎవరూ చెప్పలేరు"

హిందూస్తాన్ పాకిస్తాన్‌గా విభజించ బడిన భారతదేశంలో జరగబోయే అంతర్యుద్ధాన్ని గురించి అతడు ఇలా చెప్పుతున్నాడు. "భవిష్యత్తులో ఎక్కడ యుద్ధాగ్నిజ్వాలలు రేగినా, ప్రపంచశాంతి భద్రతలను అత్యంత సమర్ధతతో కాపాడలేక పోయినా, భారతదేశంలోకూడా అంతర్యుద్ధం చెలరేగడం అని వార్యం అవుతుంది."

ఈ సామ్రాజ్యవాద భాష్యకారుని వావం ఇది:-

భారతీయులు తమలో తాము ఒక ఒడంబడికకు రాలేకపోతే ఇండియాను విభజించడం తప్పనిసరి అవుతుంది. అ పరిస్థితుల్లో భారతదేశం

అంతర్యుద్ధానికి గురి అవుతుంది. ఇండియాలో యుద్ధాగ్నిజ్వాలలు చెల రేగితే ఒక్క భారతదేశానికే కాకుండా యావత్ప్రపంచ శాంతి భద్రతలకు ప్రమాదం వాటిల్లుతుంది.

కాబట్టి బ్రిటిష్ ప్రభుత్వమే ఇండియా శాంతి భద్రతల్ని కాపాడాలి. ఇందువల్ల ఒక్క ప్రాచ్యదేశాలే కాకుండా యావత్ప్రపంచం యుద్ధప్రమాదాన్నుంచి రక్షింపబడుతుంది.

బ్రిటిష్ ప్రభుత్వం భారత సంస్థానాల్ని తన కీలక స్థానాలుగా ఉంచుకుంటుంది. తద్వారా ఆర్థికవిధానంమీద అధికారం సంపాదిస్తుంది. ఆ యుధాగారాల్ని నిర్మిస్తుంది. బలహీనంగా ఉన్న పాకిస్తాన్ బ్రిటిష్ ప్రభుత్వ సహాయాన్ని అర్థిస్తుంది. శాంతి భద్రతల్ని కాపాడే అందుకు ఇక్కడే తిష్ఠవేయమని బ్రిటనుకు నైతికబలాన్ని చేకూరుస్తుంది. మిగతా రాష్ట్రాలు అంగీకరిస్తే హిందూస్తాన్ ఏర్పడుతుంది. ఇది కూప్లాండ్ స్కీములో చిత్రించబడిన భారతదేశ పరిస్థితి.

## ముందు బలహీనస్థానాన్ని చేజిక్కించుకొని తద్వారా సంపూర్ణాధికారం చలాయించడం

పైనుదహరించిన విధంగా అశాస్త్రీయంగా విభజించబడిన భారతదేశం రాబోయే విషమ పరిస్థితిని ఎలా ఎదుర్కొంటుంది? భారతీయులు తమలో తాము ఒక ఒడంబడికకు రాలేకపోవడంవల్ల పరస్పరం కలిసి ఉంటానికి అంగీకరించరు. పాకిస్తాన్ 'స్వాతంత్ర్యాన్ని' సంస్థానాధీశ్వరుల 'స్వాతంత్ర్యాన్నీ' రక్షించాలి. ఇందుకుగాను ముందు బలహీన స్థానాన్ని చేజిక్కించుకుంటేనేగాని తమ ఆటలుసాగవు. కూప్లాండ్ తన గ్రంథంలో 'ఏజెన్సీ' సెంటర్ అని దీన్నే పేర్కొన్నాడు. కూప్లాండ్ ప్లాను ప్రకారం ఈ మూడు ప్రధాన శాఖలు 'ఏజెన్సీ' అధీనంకింద ఉంటాయి.

1. విదేశాంగశాఖ. రక్షణశాఖ.
2. విదేశ వ్యాపారం. పన్నులవిధానం (Tariff policy)
3. కరెన్సీ



కూప్లాండ్ పాకిస్తాన్‌లో తమ పరిస్థితులు ఎలావుంటాయో లీగు సోదరులు ఒకసారి తీవ్రంగా ఆలోచించుకోవాలి. సంస్థానాధీశ్వరులు కూడా తమతో సమానంగా భాగస్వాములయ్యే సెంటరులో ఎవరిమాట చలామణి అవుతుంతో ఎవరి ఆశయాలు నెరవేరుతాయో కాంగ్రెసు సోదరులు అతి శ్రద్ధగా ఆలోచించాలి. ఏదోవిధంగా అఖండ హిందూస్థానాన్ని నిర్మిస్తున్నామనే భ్రమలో కాంగ్రెసువాదులు పడకూడదు. బ్రిటిష్ ప్రభుత్వం వేస్తూవున్న ఎరను నమ్మి మోసపోరాదు. సామ్రాజ్యవాదులు పన్నే వలలో పడగూడదు.

బ్రిటిష్‌ప్రభుత్వం చేస్తూన్న ఈ కుట్రను తెలుసుకుంటే ప్రతి భారతీయునిరక్తం ఉడుకెత్తుతుంది. ఢిల్లీ దొరలు వైట్‌హాల్ దొరలు కలసి ఆడుతూన్న ఈ దొంగనాటకానికి నోరు మెదల్పకుండా తల ఒగ్గవలసిందేనా? లేక ఈ పన్నాగాన్ని బద్దలుకొట్టి మన భవిష్యత్తును మన ఇష్టానుసారం నిర్మించుకోవడమా? దీన్నిగురించి ప్రతి భారతీయుడు తీవ్రంగా ఆలోచించాలి.

భారతసమస్యమీద కూప్లాండ్ 700 పేజీల ఉద్గ్రంథాన్ని వ్రాశాడు. అయినా అతన్ని పట్టి పండిత పరిషత్తుల్లో పాల్గొనే సామాన్య విద్వాంసుడు లాగు భావించగూడదు.

వలసదేశాల రాజ్యాంగ నిర్మాణంలో అతనిది ఆరితేరిన చెయ్యి ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో వలస దేశాల చరిత్రను బోధించే ఆచార్యుడు. నప్ఫీల్డుకంపెనీ ధనసహాయంజేసి భారతదేశ పరిస్థితిని 'శాస్త్రీయంగా' పరిశీలించడానికి అతన్ని నియమించింది. మోటారుపరిశ్రమలో నప్ఫీల్డ్ కంపెనీ ప్రపంచమంతటా పేరుమ్రోగింది. ఇటీవల జరిగిన బిర్లా-నప్ఫీల్డ్ ఒడంబడిక అందరికి తెలిసిందే.

క్రిప్సు రాయబారంలో సలహాదారుడుగా జేరమని ప్రభుత్వం కూప్లాండ్‌ను కోరింది. ఇండియా ఆఫీసులో అనధికార వర్గం తరపున అతనొక సలహాదారు. వైస్రాయ్‌వేవెల్ లండన్ వెళ్ళినప్పుడు కూడా మళ్ళీ అతన్ని సలహాదారుడుగా ఉండమని కోరాడు.

1937 లో పాలెస్టయిన్ రిపోర్టుకూడా తయారుజేసి పేరు గడించింది ఈ సుప్రసిద్ధుడే. ఇందులో ఎంతనాటకం ఆడాడో చూడండి. పాలెస్టయిన్నుకూడా మూడు భాగాలుగా విభజించాడు. ఒకటి స్వతంత్ర 'అరబ్ రాజ్యం' రెండవది 'స్వతంత్ర' యూదురాజ్యం మూడవది ఈ రెంటిమధ్య క్రిష్టియన్ పవిత్ర స్థానాల్ని కాపాడడానికి నేరుగా బ్రిటిషుఅధీనంలో ఉండే ప్రదేశం.

భారతదేశం కూడా ఇదేవిధంగా మూడుగా గానీ, లేక అంతకంటే ఎక్కువ భాగాలుగా గానీ విభజింపబడుతుంది. వీటి అన్నిటిపైన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ పెత్తనం చలాయిస్తూ ఉంటారు. భారతదేశానికి కూడా త్వరలోనే అదే దుర్గతి పట్టబోతూ ఉంది.

మా పార్టీ ఒక్కటే రాబోయే ఈ మహాప్రమాదాన్ని గుర్తించింది. ఈ 'కొత్తరకపు బానిసత్వాన్నుంచి మనం బైటబడాలని మా ఎన్నికల ప్రణాళికలో ముందే హెచ్చరించాం.

కండ్లున్న ప్రతివానికి ఈ నగ్నసత్యం స్పష్టంగా దృష్టిగోచరం అవుతుంది. నానాటికి ఈప్రమాదం ఇంకా హెచ్చుతూ ఉంది.

భారత రాజకీయ పార్టీలు తమలోతాము తిట్టుకుంటూ దూరమైన కొలదీ సహాయంకోసం ప్రతిపార్టీ ప్రభుత్వంవైపు అర్రులుజాచి ఎదురు జూస్తుంది. ప్రాధేయపడినకొలదీ సామ్రాజ్యవాదులు ఇంకా నెత్తికెక్కుతారు.

వేవెల్ తన కలకత్తా ఉపన్యాసంలో ఇలా చెప్పాడు.

"భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వాలని మనఃపూర్వకంగా మేము అభిలషిస్తున్నాం. కాని సహేతుకమైన ఒకఒడంబడిక కుదరకుండా మేము మా బాధ్యతనుండి విరమించుకోజాలం.

వేవెల్ ఎంత అహంకార పూరితంగా మాట్లాడుతున్నాడో చూడండి. అతనికింత ఆత్మవిశ్వాసం ఎక్కడనుంచి వచ్చింది. మన రాజకీయ పార్టీలు తమలోతాము దెబ్బలాడుకుంటూ ఉంటే తాము మధ్యవర్తులుగా ఉండి తమ నిరంకుశ విధానాన్ని తేలికగా అందరి నెత్తిమీద రుద్దవచ్చు. ఇదే అతని ధైర్యం.

టోరీ వైస్రాయ్ మాటల్లో ఏధోరణి ఏవైఖరి ప్రతిబింబిస్తుందో అదే ధోరణి అదే వైఖరి లేబర్ మినిస్టర్ పెధిక్ లారెన్స్ ప్రకటనలో కూడా స్పష్టంగా కనిపిస్తుంది.

"భారత ప్రభుత్వం తనమీద ఉన్న బాధ్యతల్ని, రాష్ట్రప్రభుత్వాల మీద ఉన్న బాధ్యతల్ని వదలుకొనజాలదు. శాంతి భద్రతలను కాపాడాలి, జబరదస్తీగా రాజ్యాంగ నిర్మాణ సమస్యల్ని పరిష్కరించే ప్రయత్నాలు అరికట్టబడతాయి."

(టైమ్సు ఆఫ్ ఇండియా 6-12-45)

## బ్రిటిష్ ప్రభుత్వం వల పన్నింది

తాము వేసుకున్న ప్లాను అమల్లో బెట్టాలంటే అన్ని పార్టీలతో స్నేహంగా ఉన్నట్లు నటించాలి. సర్వాధికారాలు తమ చేతిలోనే అట్టిపెట్టుకున్నా సాధ్యమైనంతవరకు ఎక్కువ అధికారం వప్పగిస్తూ ఉన్నట్లు పైకి కనపర్చాలి.

ఈ ఉద్దేశంతోనే యీ కొత్తస్కీము ను తయారుజేశారు, 1944లో గాంధీజీని చూడడానికికూడా తిరస్కరించిన ఈ వేవెల్ ప్రబుద్ధుడే నేడు గాంధీ, నెహ్రూ మొదలైన కాంగ్రెసునాయకుల్ని కలుసుకోవడానికి మహా ఆదుర్దా పడుతున్నాడు. కాంగ్రెసును 'ప్రధాన రాజకీయసంస్థ' అని తెగ బొగడుతున్నాడు. 'అఖండ భారతదేశం' యొక్క ఐక్యతను కాపాడే మహానుభావుడులాగా నటిస్తున్నాడు. కాంగ్రెసునాయకుల ముందు వినయ విధేయతలతో సంచరిస్తూ ఉన్నాడు.

'వేవెల్ చాలా నిజాయితీ గలవాడు అని సిమ్లా సమావేశ సందర్భంలో మొదలుబెట్టిన పొగడ్త ఈనాటికి, అవిచ్ఛిన్నంగా సాగిపోతూనే వుంది. 'రాబోయే పోరాటాన్ని' గురించి ఒకవైపు నెహ్రూ నిప్పులు

గ్రక్కుతూనే ఉన్నాడు. ఆజాద్ హింద్ ఫౌజును పొగిడిపొగిడి ఆకాశానికి ఎత్తుతూనే ఉన్నాడు. మరోవైపు న్యూఢిల్లీలో వైస్రాయిని. సైన్యాధిపతిని కలుసుకొని సంప్రదింపులు సాగిస్తూనే ఉన్నాడు. బ్రిటిష్ పరిపాలకులు కూడా పైకి సుహృద్భావం జూపుతున్నారు. దీనికి బదులుగా కాంగ్రెసు నాయకులుకూడా తమ సంతోషాన్ని వెల్లడిస్తూ ఉన్నారు. పండిట్ జీ మెత్తని మాటలతో ఆజాద్ హింద్ ఫౌజు గొప్పతనాన్ని కొనియాడాడు. కలకత్తాలో విద్యార్థి ఊరేగింపులమీద దారుణంగా కాల్పులు జరిగాయి. కాని గాంధీ, కేసీ సంభాషణలు. గాంధీ వేవెల్ సంభాషణల ఫలితం వెంటనే కన్పించింది. కాల్పుల్ని గురించి అనధికార విచారణ జరపాలని సాగించిన బ్రహ్మాండమయిన ఆందోళన చప్పగా చల్లబడింది.

బ్రిటిష్ పరిపాలకులు నేడుకూడా తమ పాతపాటనే పాడుతున్నారు. ఒకవైపు బెదరిస్తూ మరోవైపు బుజ్జగిస్తూ ఉన్నారు. పూర్వంలాగే నేటికీ కాంగ్రెసు నాయకులు సామ్రాజ్యవాదుల మీద లేనిపోని ఆశలు బెట్టుకుంటున్నారు.

నిజంగా వేవెల్ ఇందుకు ఏమయినా సందు యిచ్చాడంటే అదీ సున్నే. డిసెంబరు 10 వ తేదీన వేవెల్ తన కలకత్తా ఉపన్యాసంలో ఆజాద్ హింద్ ఫౌజును గురించి కాంగ్రెసు తీసుకున్న వైఖరిని తీవ్రంగా విమర్శించాడు. రాజభక్తి ప్రమాణానికి కట్టుబడి ధైర్యంగా తమ కర్తవ్యాన్ని నెరవేర్చిన సైనికుల్ని బ్రహ్మాండంగా కొనియాడాడు. ఆజాద్ హింద్ ఫౌజును తెగబొగడుతూఉన్న కాంగ్రెసునాయకుల వైఖరినిగురించి వేవెల్ ఇలా చెప్పాడు.

"మీకు ఎలాంటి రాజకీయభావాలున్నా సరే, ఆత్మగౌరవాన్ని పాటించే వీరుల్ని. వ్యతిరేక పరిస్థితిల్లోకూడా నిశ్చలంగా నిలబడి తమ కర్తవ్య పథాన్నుంచి ఏమాత్రం తొనకకుండా తామ్ము దీసుకున్న ప్రమాణానికి కట్టుబడి ఉండే ధీరుల్ని మెచ్చుకోలేని పక్షంలో ఒకజాతిని నిర్మించడానికి కావలసిన గుణగణాల్ని మీ రేమాత్రం గ్రహించలేక పొయ్యారన్నమాట". (టైమ్సు ఆఫ్ ఇండియా 11–12–45)



క్విట్ ఇండియా తీర్మానాన్ని గురించి ఎగతాళి జేస్తూ—

"స్వాతంత్ర్యాన్ని సాధించడం ఏమంత తేలిక పనిగాదు. క్విట్ ఇండియా 'మంత్రాన్ని' జపించినంత మాత్రాన స్వాతంత్ర్యం ఊడిపడదు. స్వరాజ్య మనేది ఆలీబాబా కథలోని పర్వత గుహలాంటిదికాదు. (ఈగుహ తలుపులు ఒక మంత్రం చదివితే తెరుచుకుంటాయి. మరో మంత్రం చదివితే మూసుకుంటాయి.) బలప్రదర్శనంద్వారా కూడా స్వరాజ్యాన్ని సాధించజాలరు. సాధించలేరు. (టైమ్సు ఆఫ్ ఇండియా 11-12-45)

## అహంకారానికి లొంగుబాటు

అహంకారపూరితమైన వేవెల్ సంభాషణకు ప్రతి భారతీయుడు ఆవేశపరవసుడై పొయ్యాడు. భారతీయ నాయకుల్ని భారత స్వాతంత్ర్య తీర్మానాన్ని ఈ విధంగా ఎగతాళిపాలు జేసిన వేవెల్ని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీవ్రంగా ఖండించి జాతీయ గౌరవ ప్రతిష్ఠల్ని కాపాడుతుందని ప్రతివాడూ ఆశించాడు.

ఆగస్టు పోరాటాన్ని గురించి కాంగ్రెసు నాయకులంతా గుక్క తిరుగకుండా ఉపన్యాసాలు దంచేశారు. హఠాత్తుగా ఒక్కసారి పొంగి పొర్లిన 'మహాపోరాటం' అంటూ దాన్ని తెగబొగిడారు. ఈ పోరాటంలో పాల్గొననందుకుగాను కమ్యూనిస్టుల్ని 'ద్రోహులు' అని ఇష్టం వచ్చినట్లు ఆడిపోశారు. బొంబే ఏ. ఐ.సి.సి. లో నిప్పులుగక్కే ఉపన్యాసాలిచ్చారు. పిడుగుల్లాగా గర్జించారు. 'అహింస'ను గురించి పల్లెత్తు మాటయినా మాట్లాడిన 'పాపాన' పోలేదు.

కాంగ్రెసు వైఖరిని వేవెల్ బహిరంగంగా వేళాకోళం చేసిన తర్వాత కాంగ్రెసు నాయకులు కలకత్తాలో వేవెల్ని కలుసుకొని ప్రైవేటుగా మాట్లాడారు. వేవెల్ అహంకారానికి కాంగ్రెసు నాయకత్వం లొంగిపోయింది. తమ పాత అహింసా సిద్ధాంతాన్ని పునరుద్ఘాటిస్తూ ప్రజల సాహసకృత్యాలు అనేకం మెచ్చుకోదగినవే అంటూ ఈ విధంగా తీర్మానించారు.

"అహింసా సూత్రానికి వర్తించని కొన్ని పనులుకూడా జరిగాయి ... (1920 లో అంగీకరించబడిన అహింసాసిద్ధాంతం అమల్లోనేఉంది) పబ్లిక్ భవనాల్ని తగలబెట్టడంగాని, ఆస్తి పాస్తుల్ని నష్టపరచడంకాని, టెలిగ్రాఫ్ తీగల్ని తెంచడంగాని, భయపెట్టడంగాని అహింసాసిద్ధాంతాని కనుగుణ్యమైన పనులు కావు." (టైమ్సు ఆఫ్ ఇండియా 12-12-45)

'ఈ తీర్మానానికి ఎంతో ప్రాముఖ్యత ఉంది' అని కాంగ్రెసు అధ్యక్షులు మౌలానా ఆజాద్‌గారు నొక్కి చెప్పారు. అంటే, బ్రిటిష్ ప్రభుత్వానికి ఇష్టంగాని ఏ పద్ధతిద్వారాగాని భారత స్వాతంత్ర్య సమస్యను పరిష్కరించమని కాంగ్రెసు నాయకత్వం లార్డ్ వేవెలుకు హామీ ఇచ్చింది.

ఆజాద్ హింద్ ఫౌజును గురించి ఒక తీర్మానం జేశారు. అందులో ఈ విధంగా ఉంది. ఆ॥ హిం॥ ఫౌజు సైనికులమీద జరిగే విచారణకు సానుభూతి చూపెడుతున్నామంటే - సహాయాన్ని చేస్తున్నామంటే శాంతి యుతమైన న్యాయసమ్మతమైన పద్ధతులద్వారా స్వరాజ్యాన్ని సాధించాలి' అనే కాంగ్రెసు సిద్ధాంతాన్ని జాంవిడిచాం అనుకోగూడదు." ఆజాద్ హింద్‌ఫౌజు సైనికులు తమ దేశభక్తికిగాను శిక్షింపబడే అమరజీవులైన స్వాతంత్రయోధులు గాకపోయినా సామాన్యపౌరసత్వ హక్కుల సూత్రం మీదనే ఆధారపడి వారియెడల సానుభూతి చూపబడింది, బాధపడుతూ ఉన్నవారికి సహాయం చేయడం జరిగింది.

ఇదంతా చూచి కాంగ్రెసు ప్రజాసామాన్య హృదయం కలతచెంది పోయింది. కాంగ్రెసు నాయకత్వంలోని ఈ మార్పులు ఈ తిరుగుళ్లు మితవాద ధోరణిలోని ఒక భాగం మాత్రమే. బ్రిటిష్ ప్రభుత్వంతో ఒడంబడిక కుదురుతుందని ఆశించే కాంగ్రెసు నాయకత్వం ఈ పద్ధతినిగాక మరే పద్ధతి నవలంబిస్తుంది?

## లీగుమీద ప్రభుత్వదాడి

లీగునుగురించికూడా బ్రిటిష్ ప్రభుత్వం సరిగ్గా ఇదేవైఖరి నవలంబిస్తుంది.

1944 డిసెంబరులో లీగు విధానాన్ని ఎగతాళిజేస్తూ వేవెల్ తన కలకత్తా ఉపన్యాసంలో ఇలా చెప్పాడు.

"భారతదేశం అంతఃకలహమనే జబ్బుతో బాధపడుతూఉంది. పాకిస్తాన్ అనే శస్త్రవైద్యంతో తప్ప [ఆపరేషన్] ఈ జబ్బు కుదరదని భారత రాజకీయవేత్తలు నిర్ణయిస్తే ఈ సువిశాలదేశం శాంతియుతంగా సౌఖ్యప్రదంగా జీవించే సదవకాశం కోల్పోతుంది. (హిందూ 15-12-44)

ఏరాజ్యాంగ పద్ధతి అయినా సరే రక్షణశాఖను ఇంకా కట్టుదిట్టంగా ఏర్పాటు చేయవలసి ఉంటుంది అనికూడా వేవెల్ హెచ్చరించాడు "ఈ జబ్బు కుదరడానికి ఆపరేషన్ చేయవలసినంత అగత్యంకూడా లేదని నేను భావిస్తున్నాను" అని పై పెచ్చు సలహాకూడా ఇస్తున్నాడు.

ఇటీవల వేవెల్ కలకత్తాలో ఉపన్యసిస్తూ కులమతతత్వాలను రెచ్చగొట్టే వాచాలత్వం తగదంటూ లీగు నాయకత్వానికి హెచ్చరిక చేశాడు.

"మనమీఅంతఃకలహాన్ని అరికట్టాలి. మనలో మనం ఒక ఒడంబడికకు రావాలి. మనస్ఫూర్తిగా పూర్తిగా మనం ప్రయత్నిస్తే తప్పకుండా ఒక అంగీకారానికి రాగలం"

"ఈ విశాల భూమిలో హిందువులు మహమ్మదీయులు అన్యోన్యంగా కలసి మెలసి ఉండవలసిన వారే"

ఈ విధంగా వేవెల్ కాంగ్రెసు నాయకత్వాన్ని లీగు నాయకత్వాన్ని కూడా మందలించాడు.

"రాబోయే సంవత్సరంలో సంప్రదింపులు జరుగుతాయి. కులమత తత్వ పూరితమైన వాతావరణం ఆ సంప్రదింపులకు అభ్యంతరం కలిగిస్తే, ఆ వాతావరణం దౌర్జన్య చర్యలకు దారితీస్తే, భారతదేశం మహా ప్రమాదకరమైన పరిస్థితుల్ని ఎదుర్కోవాలిసి వస్తుంది"

(టైమ్సు ఆఫ్ ఇండియా 11-12-45)

"మహమ్మదీయులకిష్టంగాని పక్షంలో ఏ రాజ్యాంగ చట్టం కూడా బలాత్కారంగా వారి నెత్తిమీదవేసి రుద్దం, అని ఒక వైపు హామీఇస్తు

న్నాడు. మరోవైపు మత పిచ్చను రెచ్చగొట్టే వాచాలత్వాన్ని కట్టి పెట్టండని ఉపన్యాసాలిస్తున్నాడు "బ్రిటిష్ ప్రభుత్వం శాంతి భద్రతల్ని కాపాడి తీరుతుంది" అని బెదిరిస్తూ ఉన్నాడు.

## ఎవరికిలాభం ?

ప్రతి కాంగ్రెస్ సభ్యుడు ప్రతి లీగుసభ్యుడు ముఖ్యంగా ఒక విషయం ఆలోచించాలి, పరిస్థితులీవిధంగా నానాటికి దిగజారిపోతూఉంటే మీ మీ ఆశయాలు ఎలా నెరవేరుతాయి? భారత నాయకులు బ్రిటిష్ మోసాన్ని తెలుసుకోలేక ఎంతఅంధకారంలో పడిపోతున్నారో చూడండి. రాబోయే ఎన్నికలలో ఒకసారి తమకున్న బలాన్నిఅంతా పూర్తిగా ప్రదర్శిస్తే బ్రిటిష్ ప్రభుత్వం తప్పకుండా రాజీ రాయబారాలకు దిగివస్తుందని ఉవ్విళ్ళూరుతున్నారు.

ఇందువల్లవచ్చే ఫలితమేమిటి? బ్రిటిష్ప్రభుత్వం తన చిత్తం వచ్చిన చట్టాన్ని ఇండియా మెడకు అంటగడుతుంది. ఇది సాధ్యమా అసాధ్యమా అనే సమస్య ఇకలేదు. అక్షరాలా జరిగి తీరుతుంది.

ఇన్నాళ్ళనుంచి ఒక ఒడంబడికకు రాలేక మనలో మనం కలహించుకున్న దాని ఫలితంగా ప్రపంచ ప్రజలదృష్టిలో అధఃపతనమవుతాం. ప్రపంచ ప్రజలకు ఇదంతా గందరగోళంగా ఉంటుంది. భారత సమస్యను పరిష్కరించేఅందుకు మేమెంతో 'తోడ్పడుతున్నాం'అని బ్రిటిష్ప్రభుత్వం జెప్పే కల్లబొల్లికబుర్లకు లొంగిపోతారు.

ఈవిధంగా ఇప్పుడు మనలోమనం దెబ్బలాడుకోవడంవల్ల ఎదటివాడిలోఉన్న మంచిని గ్రహించలేకపోతాం. మన ప్రత్యేక ఆశయాల్ని సమిష్టి ఆశయాల్నికూడా గుర్తించలేకపోతాం.

విభజించి పాలించటమే బ్రిటిష్కూటనీతిలోఉన్న కిటుకనీ, సామ్రాజ్యవాదులు తమ సర్వశక్తులూ ఉపయోగించి మనలో మనకు ఐక్యత రాకుండా చీలికలు కలిగించడంకోసం కావాల్సినంత దొంగనాటకం ఆడతారని స్వాతంత్ర్యాన్ని అభిలషించే ప్రతి భారతీయుడు గమనించాలి.



ఈ క్రింది ముఖ్యవిషయాల్ని గురించి శ్రద్ధగా ఆలోచిస్తే భారతీయులందరు—హిందువులుగానీ మహమ్మదీయులుగానీ, కాంగ్రెస్ సభ్యులుగానీ, లీగుసభ్యులుగానీ - మన మాతృదేశానికి ఎక్కువ సహాయం చేయగలుతారు, తమ ప్రత్యేకాశయాలను సమిష్టి ఆశయాలను సాధించడానికి స్వాతంత్ర్య సమరంలో సక్రమపంథా నవలంబిస్తారు.

1. మనలో మనకు చీలికలుండడం వల్లనే—ప్రధాన రాజకీయ పార్టీలు ఒక ఒడంబడికకు రాలేనందువల్లనే—స్వతస్సిద్ధమైన మన హక్కుల్ని బ్రిటిష్ప్రభుత్వం నిరాకరించగలుగుతూఉంది. తన నిరంకుశాధికారాన్ని అవిచ్ఛిన్నంగా చలాయించ గలుగుతుంది. స్వాతంత్ర్యకాముకులైన భారతీయుల్లోని ఈ అనైక్యతే మన శాశ్వత బానిసత్వానికి దారితీస్తుంది.

2. కాంగ్రెసు లీగు నాయకుల్లోఉన్న మితవాదధోరణి ఫలితంగానే వారుబ్రిటిష్ ప్రభుత్వాన్ని గురించి ఇంకా భ్రమపడుతూనే ఉన్నారు. భారతదేశ గత చరిత్రగాని, మొన్నమొన్ననే జరిగిన సిమ్లా నాటకంగానీ నేర్పిన గుణపాఠాన్ని ఇప్పటికీ వారు గుర్తించలేకపోతున్నారు. భ్రమాత్మక మయిన మితవాద ధోరణిమీద ఆధారపడిన మన నాయకులు చివరకు నిరాశజెంది బ్రిటిష్ పన్నాగానికి తలలొగ్గవలసి వస్తుంది.

కళ్లకుకట్టినట్టు కనబడే ఈ నగ్నసత్యాన్ని ఇకనైనా గుర్తించాలి. చరిత్ర నేర్పిన గుణపాఠాన్ని నేర్చుకోవాలి.

## కాంగ్రెసులోజరిగే అంతర్నాటకం

రాష్ట్రనాయకులను గురించిగానీ, అఖిలభారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీని గురించిగాని ఇదివరకు ఏ కొంచెం తెలిసిఉన్నాసరే నేడు వారు 'విప్లవ' శబ్దజాలాన్ని ఎందువల్ల విడిచిపెట్టారో ప్రతి భారతీయుడు గమనించాలి.

ఎన్నికల్లో ఎన్నిరాష్ట్రాల్లో మనకు మెజారిటీ వస్తుంది? వ్యతిరేక పార్టీని ఓడించడానికి షాహుకార్ల దగ్గిరనుంచి జమీందార్ల దగ్గిరనుంచి

ఎలా దబ్బుగడించాలి? ఇదే నేడు వారిని ఎదుర్కొనే సమస్య. ఎక్కువ రాష్ట్రాల్లో సాధ్యమైనన్ని ఎక్కువ స్థానాలు సంపాదించడమే ఇప్పుడు వారికి కావాలిసింది.

రాష్ట్ర కాంగ్రెసు నాయకులు పదవులకోసం తగవులాడు కోవడంతోనే ప్రొద్దుపుచ్చు కుంటున్నారు. మంత్రి పదవుల్లో ఎవరెవరికి స్థానమివ్వాలి? ఏ కాంగ్రెసు కమిటీలో ఏ గ్రూపుకి అధికారం ఉండాలి? ఏ పదవి ఎవరికి కట్టిపెట్టాలి? ఇదే నేడు వారి కార్యక్రమం.

బ్రిటిష్ గవర్నమెంటు తప్పకుండా తమతో రాజీపడుతుంది అని కాంగ్రెసువాదులు అనుకుంటున్నారు. ఒకవేళ పూర్తిగా రాజీకుదరక పోయినా, రాజ్యాంగనిర్మాణసభలో కనీసం ముస్లింలీగు ఆటల్ని అయినా సాగనివ్వకుండా జేస్తుందని వారి ఆశ. కాంగ్రెసులో నిజమయిన అతివాద శాఖకు చెందిన మాతో (కమ్యూనిస్టు పార్టీతో) సంబంధాలు తెంచుకుంటున్నారు. బ్రిటిష్ చెప్పుచేతల్లో మెలగే భూస్వాముల్ని పెట్టుబడిదారుల్ని కౌగలించుకుంటున్నారు. ఎన్నో సంవత్సరాల క్రితంనుంచి అపఖ్యాతి పాలైన హిందూమహాసభలోని బాబులికి కాంగ్రెస్ టిక్కెట్లు ఇచ్చి అసెంబ్లీలకు పంపుతున్నారు. జమీందారుల్ని పెట్టుబడిదారుల్ని తనకనుకూలంగా ఉపయోగించుకుంటున్నానని కాంగ్రెసు కులుకుతూ ఉంది. కాని యదార్థమేమిటంటే కాంగ్రెసును, కాంగ్రెసు పేరును షాహుకార్లు భూస్వాములు తమ చిత్తం వచ్చినట్లు ఉపయోగించుకుంటున్నారు.

.25 సంవత్సరాల పూర్వమే బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమం లేవదీసిన కాంగ్రెసు నేటికి బ్రిటిష్ అధీనం కింద పనిజేసే శాసనసభల్లో తమకెన్ని సీట్లువస్తాయి అని లెక్కలు వేసుకోవాలిసి వస్తుందంటే, దీని అర్థమేమిటో ప్రతివాడూ తీవ్రంగా ఆలోచించాలి. కాంగ్రెసు వైఖరి ఏవైపుకు దారితీస్తుందో తెలుసుకోవాలి. ఇదంతా మితవాద ధోరణిగాక మరేమిటి? దీని ఫలితం బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు తప్పనిసరిగా లొంగిపోవడమే అవుతుంది. నేటి కాంగ్రెసు నాయకుల వైఖరి ఇంకా స్పష్టంగా తెలుసుకోవాలంటే మచ్చుకి ఈ రెండు ఉదాహరణలు చూడండి.



ఆంధ్రకేసరి బిరుదాంకితులు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు, రాబోయే మద్రాసు కాంగ్రెసు మంత్రి వర్గానికి బహుశా ప్రధానమంత్రి, శ్రీ ప్రకాశం పంతులుగారు 26—11—45 వ తేదీన విశాఖపట్నంలో మాట్లాడుతూ ఇలా చెప్పారు.

"ఎన్నికల రూపంలో మనకు ఇప్పుడు స్వరాజ్యం వచ్చింది. ఈ నాడు జరగబోయే ఎన్నికలు పూర్వపుఎన్నికల్లాంటివి కావు. మనం మన మంత్రివర్గాన్ని నిర్మించుకోబోతున్నాం. ఈ మంత్రివర్గానికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఉంటుంది.

ఎన్నికలద్వారా స్వరాజ్యం వస్తుందని ప్రకాశం పంతులుగారుహామీ యిచ్చారు. ఈ ఎన్నికలు జరుపుతూ ఉన్నందుకు లార్డ్ వేవెల్ని ఎలా ప్రశంసించారో చూడండి.

"ప్రస్తుత రాజప్రతినిధి చాలా మంచివాడు. దేశంలో కాంగ్రెసుకు ఎంతబలం ఉందో గత మూడు సంవత్సరాలనుంచి చూశాడు. అందువల్లనే అతను స్వయంగా ఇంగ్లాండు వెళ్ళి సిమ్లాసభ నేర్పాటుచేసే అవకాశం కలిగించాడు." కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీ సభ్యులైన డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు 2—12—45 వ తేదీ బెజవాడ ఉపన్యాసంలో ఇలా చెప్పారు.

"పెద్దలం అయిన మేము మీకు స్వరాజ్యాన్ని తెచ్చి యివ్వడానికి నిశ్చయించుకున్నాం, తెస్తూ ఉన్నాంకూడా. కాని, మీరు ఆ స్వరాజ్యాన్ని దక్కించుకోలేరేమో అని భయపడుతున్నాం..... ఖద్దరు బట్టలు కట్టుకోని వారందరు ఇండియానుంచి బ్రిటిష్‌ప్రభుత్వం తొలగిపోగూడదు అనేవారే. నూటికి నూరుమంది భారతీయులు ఖద్దరు కట్టుకున్ననాడు స్వరాజ్యం దానంతట అదే వస్తుంది.

ప్రతిరాష్ట్రంనుంచి ఇలాంటి ఉదాహరణలు కావాలంటే అనేకం ఉన్నాయి. కాంగ్రెసు నాయకులు నేడీ విధంగా ప్రజలకు బానిస భావాలు నూరి పోస్తున్నారు. 'మంత్రివర్గాల ద్వారా స్వరాజ్యం' అనే పేరుతో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ప్లానుకు లొంగిపోయేటట్లు ప్రజల్ని తయారు చేస్తున్నారు.

## లీగు వైఖరి

ఇండియాను విభజించడంద్వారానే ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు సంపూర్ణాధికారం లభిస్తుందని లీగునాయకత్వం భావిస్తూ ఉంది. మన అందరినెత్తి కెక్కి తొక్కుతూఉన్న బ్రిటిష్‌ప్రభుత్వంయొక్క బానిసత్వాన్నుంచి బైటబడిననాడే సమస్త భారతదేశానికి స్వయం నిర్ణయాధికారం లభిస్తుంది అనే విషయాన్ని లీగు గు_ంచటంలేదు. అందువల్లనే నేటిలీగు నాయకత్వం బ్రిటిష్ యజమానులవైపు అర్రుజాచి ఎదురుజూస్తూ ఉంది. ఇండియాను విభజించ వలసిందని పరప్రభుత్వాన్ని యాచిస్తూఉంది. ఇందువల్ల ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు సంపూర్ణాధికారం లభించకపోగా బ్రిటిష్‌పెత్తనం ఇంకా బలపడుతుంది.

ఇంగ్లీషువాళ్ళతోపాటు హిందువుల్నికూడా మహామ్మదీయులు తమ శత్రువులే అనుకుంటే దీని పర్యవసానం ఎలా పరిణమిస్తుంది! ఇండియాను విభజించ వలసిందని పదేపదే బ్రిటిష్ ప్రభుత్వాన్ని యాచించ వలసి వస్తుంది. హిందువులమీద ఇంకా ద్వేషం పెరుగుతుంది. చివరకీ వైఖరి ఎక్కడికి దారి తీస్తుంది? తమ పాలసీని అంగీకరించని వారంతా బ్రిటిష్ ప్రభుత్వ ఏజెంట్లే అని కాంగ్రెసువాదులు ఎలా ఆడిపోస్తూ ఉన్నారో సరిగ్గా అదేవిధంగా లీగు సిద్ధాంతాల్ని అంగీకరించని మహామ్మదీయులంతా హిందువుల ఏజెంట్లే అని లీగు తిట్టిపోస్తుంది. ఇందువల్ల కాంగ్రెసును దూషించే బ్రిటిష్ ప్రభుత్వ బంట్లు, నవాబులు, ఖాన్‌సాహెబులు ముస్లింలీగు ముసుగుకింద దూరుతారు. ఈ అభివృద్ధినిరోధకులంతా ఏకమై చివరకు లీగును బ్రిటిష్‌యజమానుల గుమ్మంముందుకు తీసుకవెళ్తారు.

ఈ పద్ధతి నవలంబించడం వల్ల దేశానికి స్వాతంత్రం సిద్ధించదు, ముస్లింమెజారిటీ ప్రాంతాలకు స్వయంనిర్ణయాధికారం లభించదు. హిందూ మహమ్మదీయ కలహాలు ఇంకా ఎక్కువ అవుతాయి. ఉభయులు పరస్పరం దెబ్బలాడుకుంటూఉంటే బ్రిటిష్‌ప్రభుత్వం మధ్యవర్తిగావచ్చి జోక్యం కలిగించుకుంటుంది. సామ్రాజ్యవాదుల రొట్టెముక్క నేతిలో పడుతుంది.



ఎదటివాళ్ళ బలాన్ని గుర్తించకుండా ఎవరికివారే తమ బలాన్నే గొప్పగా చెప్పుకోవడంవల్ల ఫలితంశూన్యం, ఇందువల్ల బ్రిటిష్‌ప్రభుత్వం లొంగిరాదు సరేకదా ఉభయపక్షాలు తుదకు ప్రభుత్వంవలలో బడతాయి. బ్రిటిష్‌ప్రభుత్వం ఒక పార్టీమాటమాత్రం ఎందుకు వింటుంది? ప్రజాసామాన్యంగోరేహక్కుల్ని అంగీకరించడమా సామ్రాజ్యవాదుల ఆశయం? అందర్నీ తమకింద బానిసలుగా ఉంచి అందరిమీద తమకర్ర పెత్తనం సాగించాలనే వాళ్ళ ఆలోచన, అందుకు కావాలసిన ప్లానునుకూడా వాళ్ళు సిద్ధంగానే ఉంచుకున్నారు.

ఈ నాటి ఈ దౌర్భాగ్య పరిస్థితుల్ని చూస్తే హృదయం తరుక్కుపోతుంది. అయినా ఈ మహాప్రమాదాన్నుంచి తప్పించుకోడానికి తగిన అవకాశం బొత్తిగా లేకపోలేదు. పరిస్థితి ఇంకా మన చేతినుంచి పూర్తిగా జారిపోలేదు. రానున్న ప్రమాదాన్ని గుర్తించి ఇకనైనా స్వాతంత్ర్య పిపాసులైన భారతీయులందరు మేల్కొనాలి. సంకుచిత భావాల్ని విడనాడి సమిష్టి ఆశయాన్ని సాధించడానికి నడుంబిగించాలి. ఈనాడు ఎవరికివారు తాముకోరే హక్కులు న్యాయసమ్మతమైనవే అనుకుంటున్నారు. అయితే, "మన న్యాయసమ్మతమైన హక్కుల్ని మన సోదరులే ఎందుకు అంగీకరించటల్లేదు." అని ప్రతిఒకరూ ఆత్మ విమర్శన జేసుకోవాలి. మన తోటి సోదరుల్ని కాదని తోసి పుచ్చుతూ పరాయి ప్రభుత్వం ఏదో తవ్వి తలకెత్తుతుందనుకోవడం ఎక్కడి వివేకం? మన అందరికి సమాన శత్రువయిన బ్రిటిష్ ప్రభుత్వాన్ని సాగనంపడానికి సాగించబోయే అంతిమ స్వాతంత్ర్య పోరాటంలో మన ఆశయంకూడా ఒక భాగంగా ఉండాలి అంటే ఏమిచెయ్యాలి? దీన్నిగురించి వివరంగా ముందు చర్చించుదాం.

మన సిద్ధాంతాల్లో, ఆశయాల్లో సమానత్వంచేకూర్చి ఐక్యతను నిర్మించడానికి మాపార్టీ సరియైన కార్యక్రమాన్ని ఇస్తూఉంది. భారతీయులమందరం భాయీభాయీగా చేయీ చేయిగలిపి సుశిక్షిత స్వాతంత్ర్యసైన్యంవలె ఒకే అడుగుమీద విజయయాత్ర సాగించుదాం.

## భారతీయ స్వాతంత్ర్యప్రణాళిక

ప్రపంచ ప్రజాఉద్యమానికి అనుగుణ్యంగాను, మన స్వాతంత్ర్యోద్యమ సత్సాంప్రదాయాలకు సముచితంగాను. మేమొక భారతీయ స్వాతంత్ర్యప్రణాళికను తయారుజేసి మీ ముందుంచుతున్నాం.

## మన స్వాతంత్ర్యాశయం

మనం బ్రిటిష్‌ప్రభుత్వాన్నుండి మన దేశానికి స్వయంనిర్ణయాధికారం కావాలని కోరుతున్నాం. ఈ కోరిక ఎంతో సమంజసమైనది. ఈ సమంజసమైన హక్కునే మనం మన భారతీయులందరికి వర్తింపజేయాలి.

బ్రిటిషు ప్రభుత్వాన్నుంచి మనం స్వాతంత్ర్యం కోరుతున్నాం. ఈ స్వాతంత్ర్యహక్కు భారతీయులందరికీ ఉంది అని మనం అంగీకరించాలి. నామమాత్రంగా అంగీరించడంతో సరిపోదు. క్రియాపూర్వకంగా రుజువుజేసి చూపెట్టాలి.

బ్రిటిష్‌ప్రభుత్వాన్ని అసహ్యించుకున్నంత మాత్రాన ఇవ్వాళ మనం మన కర్తవ్యాన్ని నెరవేర్చిన వాళ్ళం కాజాలం. 1857 లో జరిగిన ప్రథమ స్వాతంత్ర్యయుద్ధకాలంనుచి మన పూర్వులు, మన పెద్దలు బ్రిటిష్ ప్రభుత్వాన్ని అసహ్యించుకుంటూనే ఉన్నారు. తర్వాత వచ్చిన మూడు తరాల్లో ఈ బ్రిటిషువిద్వేషాగ్ని ఇంకా తీవ్రంగా ప్రజ్వరిల్లింది. ఇంత కాలం గడచిన తర్వాతకూడా మన స్వాతంత్ర్యోద్యమం ఇంకా బ్రిటిష్ విద్వేషాన్ని బోధించడంతోనే సరిపుచ్చుకుంటే మనపూర్వుల సత్సాంప్రదాయాల్ని ముందుకు తీసుకవెళ్ళిన వాళ్ళం అవుతామా ?

బ్రిటిష్ విద్వేషానికి మాపార్టీ ఒక స్వరూపం ఇచ్చి ఆచరణ సాధ్యమయిన ఒక చక్కని కార్యక్రమాన్నికూడా మీముందు ఉంచుతూ ఉంది. మనల్ని బానిసలుగాజేసి మన నెత్తికెక్కి పెత్తనం చలాయిస్తూ ఉన్న సామ్రాజ్యవాదులకు మన మాతృభూమిలో బెత్తెడు జాగాకూడా ఇవ్వగూడదని మన పెద్దలునేర్పిన పాఠాన్ని ఇకనైనా ఆచరణలో పెడదాం. ఈ తెల్లవాళ్లు మనదేశానికి విజేతల్లాగా వచ్చారు. దేశాన్ని ఆక్రమించుకున్నారు. మనల్ని బానిసలుగా తయారుజేసి తమ నిరంకుశాధికారాన్ని నిరాఘాటంగా సాగిస్తూ ఉన్నారు.

ఇతరపార్టీల కార్యక్రమంలోని నిజాయితీని పరీక్షించడానికి మనం ఏ గీటురాయిని వాడుతున్నామో, అదే గీటురాయిని తమ పార్టీకికూడా వర్తింపజేసి చూడవలసిందని మాపార్టీ కోరుతూ ఉంది. మన స్వాతంత్ర్యోద్యమ కార్యక్రమం ప్రజలందరూకోరే స్వాతంత్ర్యాశయాల్ని ఏకీభవింపచేసేదిగా ఉండాలి. స్వాతంత్ర్యాన్ని అభిలషించే ప్రతి భారతీయుని హృదయంలో ఒక నూతనోత్సాహాన్ని పురికొల్పాలి. స్వాతంత్ర్యశక్తులన్నింటినీ ఐక్యంజేసి ఒకే అడుగుమీద రణరంగంలోకి ఉరికించాలి.

'స్వాతంత్ర్యం' అనే మాటకు సరియైనఅర్థం, భారతీయు లందరి 'స్వాతంత్ర్యం' అని బోధించేది మాపార్టీ ఒక్కటే. ఇవ్వాళ కాంగ్రెసు నాయకులు దూషిస్తూ ఉన్నట్లు మా సిద్ధాంతంతో భేదించేవారిని మాపార్టీ దూషించదు. ముస్లింలీగు నేడు తనతోటి సోదరులమీద ద్వేషాన్ని రెచ్చగొడుతూఉంది. కాని మాపార్టీ ఆవిధంగా ద్వేషాన్ని రెచ్చగొట్టదు.

ఈ దిగున నుదహరించిన విషయాల్ని గురించి తీవ్రంగా ఆలోచించవలసిందని ప్రతి భారత స్వాతంత్ర్య సైనికునికి మాపార్టీ విజ్ఞప్తి చేస్తూఉంది.

బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి మనం ఏ స్వయం నిర్ణయాధికారం కోరుతున్నామో, ఆస్వయంనిర్ణయాధికారాన్నే స్వతంత్ర భారతదేశంలో కూడా వర్తింపజేయాలి. అలా చేయని పక్షంలో ఇతరపార్టీలకు చెందిన ప్రజాసామాన్యంయొక్క విశ్వాసాన్ని కాంగ్రెసు చూరగొనలేదు. సందేహాలు నానాటికి ఇంకా ఎక్కువ అవుతాయి.

లీగు తానుకోరే ముస్లిం స్వయంనిర్ణయాధికారాన్ని భారత స్వయంనిర్ణయాధికారంలో ఒకభాగంగా చేయలేకపోతే తన 'ముస్లింమెజారిటీ ప్రాంతాల స్వయంనిర్ణయాధికార సిద్ధాంతానికి' హిందువుల సహాయసాను

భూతున్ని సంపాదించలేదు. లీగునుగురించి హిందువుల్లో నానాటికి ఇంకా సందేహాలుఎక్కువ అవుతాయి.

'స్వాతంత్ర్యం' అనే మాటను అన్వయించుకోవడంలోనే మన ప్రధాన రాజకీయ పార్టీలమధ్య అభిప్రాయభేదా లేర్పడ్డాయి. అంటే జయ ప్రదంగాఅంతిమపోరాటాన్నిసాగించి, శాశ్వతంగాబ్రిటిష్‌ప్రభుత్వానికి చెల్లు చీటీయిచ్చి సాగనంపేముందు మనం ఇంకా ఎంత తీవ్రంగా ఆలోచిం చాలో ఒకళ్ళ భావాల్ని ఒకళ్లు ఎంత సుహృద్భావంతో ఓపికగా అర్థం జేసుకోవాల్సిన అవసరంఉందో స్పష్ట మవుతుంది.

## స్వాతంత్ర్య సాధనోపాయం

స్వాతంత్ర్య పోరాటానికి మేము నిర్మించే వ్యూహరచనా విధానం స్వాతంత్ర్య కాముకులయిన భారతీయులందర్నీ ఐక్యపరుస్తుంది. హిందువులు మహమ్మదీయులు అన్నదమ్ముల్లాంటివారని ఉపన్యాసాలు చెప్పినంతమాత్రానగాని, బ్రిటిష్‌ప్రభుత్వం మన అందరికీ శత్రువే అని సూచించినంతమాత్రానగాని. ముందు భారతీయులందరుకలిసి తమసమిష్టి ఆశయమైన స్వాతంత్ర్యాన్ని సాధించాలని బోధించినంత మాత్రానగాని అలాంటిసరియైన ఐక్యత - సరియైన సోదరభావం - ఏర్పడదు.

"మన భారత జాతులన్నింటికీ న్యాయం జరగాలి. అన్ని జాతులకీ సమానాధికారం ఉండాలి. అనే న్యాయసూత్రాల్ని మనమందరం అంగీక రించాలి. తమతమ ఇష్టానుసారం తమ రాజ్యాంగాన్ని నిర్మించుకోవడానికి తమకు తోచిన విధంగా తగిన అభివృద్ధిని బొందడానికి, ప్రతిజాతికి సమాన అవకాశం యివ్వాలి.

మేము సూచించే ఐక్యతావిధానం సోదరభావాన్ని గురించి వట్టినీతి సూత్రాలు వల్లెవేయడం లాంటిదికాదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల్ని ఎదిరించి పోరాడే ఐక్యసంఘటనే ఈ ఐక్యత. ఈ ఐక్యసంఘటన ద్వారానే మనం బ్రిటిష్‌ప్రభుత్వపుసెత్తుల్ని భగ్నం చేయగలం. సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించగలం. సాధించిన ఆ మహత్తర విజయాన్ని ఐక్యత ద్వారానే సురక్షితంగా కాపాడుకోగలం."

స్వాతంత్ర్యాన్ని సాధించే వ్యూహరచనావిధానం(Stratagy] ప్రజ లందర్నీ కూడగట్టుకు వచ్చేటట్లుగా ఉండాలిగాని మనలో మనకు చీలికలు కలిగించేదిగా ఉండగూడదు. ఒక్క పార్టీయొక్క స్వాతంత్ర్య పోరాట కార్యక్రమం క్రమక్రమంగా మనలో మనకున్న చీలికల్ని తగ్గించడానికి బదులుగా ఇంకా ఎక్కువజేస్తూఉంటే అది అసలు 'ఒక స్వాతంత్ర పోరాట కార్యక్రమం' అనిపించుకోదు. బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు కోరేదాన్ని మనమే చేసిపెట్టడం అవుతుంది.

సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ఐక్యసంఘటనను నిర్మించడానికి మేము కృషిచేస్తున్నాం. బ్రిటిష్‌ప్రభుత్వాన్ని యిక్కడనుంచి సాగనంప డంతోనే మన పని పూర్తిగాదు. స్వతంత్ర జాతులతోకూడిన ఒక కుటుం బంగా మన భారతభూమిని నిర్మించడమే మా ప్రధానాశయం.

మా వ్యూహరచనా పద్ధతిలోను, మా ఆశయాల్లోను అవినాభావ సంబంధం ఉంది. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఈనాడు నిర్మించబడే ఈ ఐక్యసంఘటనే స్వతంత్రభారత దేశంకూడా సమానహోదాగల స్వతంత్ర జాతులతో కూడిన ఒక సమిష్టి కుటుంబంగా ఉండవలసిన ఆవశ్యకతను తెలియపరుస్తుంది.

## మా నిర్దిష్ట సూచనలు

సా తంత్ర్య పోరాట పద్ధతిలోనే ప్రజలందరి స్వాతంత్ర్య ఆశ యాలు ఇమిడి ఉండాలి. అప్పుడే మనం స్పష్టమైన ఒక కార్యక్రమాన్ని అనుసరించి ఐక్యంగా పనిచేయగలం. నేటి ప్రతిష్టంభనను బ్రద్దలుచేయ గల్గుదుం. స్వాతంత్ర్యోద్యమాన్ని ఇంకా ముందుకు తీసుకపోగలం. ఇప్పటి లాగా సుడిగుండాల్లోపడి తిరగకుండా కాంగ్రెసు లీగు ఉద్యమాలు కలిసి ముందుకు సాగిపోతాయి. ఎవరికి వారే బ్రిటిష్ ప్రభుత్వంతో ప్రత్యేకపు బొడంబడికలు చేసుకోవాలసిన గతి పట్టకుండా ఉంటుంది.

కాంగ్రెసు బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి స్వయం నిర్ణయాధికారం కోరుతుంది. కాని అదే సూత్రాన్ని ప్రజలకందరికి వర్తింపజేయడానికి మాత్రం అంగీకరించటంలేదు. సోదరజాతుల స్వాతంత్ర్య హక్కును గుర్తించకుండా కాంగ్రెసు బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి స్వాతంత్ర్యం కోరుతుంది. ఈవైఖరి సోదరపార్టీలతో పోరాటానికి ప్రభుత్వంతో ప్రత్యేకపు ఒడంబడికకు దారితీస్తుంది

అన్ని పార్టీలకంటె ప్రజల్లో తనకే ఎక్కువ పలుకుబడి ఉంది కాబట్టి బ్రిటిష్ ప్రభుత్వ తదనంతరం తానే వారసురాలని కాంగ్రెసు భావిస్తుంది. దేశభక్త కుటుంబంలో అన్ని పార్టీలకి అన్నగా ఉండి తనబాధ్యతను నిర్వహించటల్లేదు. తన తమ్ముళ్ళనికూడా తనతోపాటు కలుపుకొని ఐక్యపోరాటంద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించాలని గుర్తించుటల్లేదు; ఈనాడు దేశంలో కాంగ్రెసుకున్న పలుకుబడే కాంగ్రెసు నాయకుల్లో సంకుచిత భావాలు కలగడానికి కారణభూతమయింది. బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి తాను కోరే న్యాయసమ్మతమైన హక్కే ఇతరులుకోరే కోరికల్లోని న్యాయాన్ని గుర్తింపకుండా జేసింది.

ముస్లింమెజారిటీ ప్రాంతాల్లో స్వయం నిర్ణయాధికారాన్ని వర్తింపజేయడానికి లీగు ఇండియాను రెండు ఖండాలుగా విభజించవలసింది అని కోరుతూ ఉంది. ఈ కోరికను సాధించుకోడానికి బ్రిటిష్ ప్రభుత్వంతో ప్రత్యేకపుఒడంబడికకు సిద్ధపడుతూ ఉంది. మహమ్మదీయుల్లో లీగుకి పూర్తిగా బలం ఉన్నప్పటికీ లీగుకోరే స్వయం నిర్ణయాధికారానికి అభ్యంతరాలు కలిగించేది హిందువులేకదా ? అని లీగు ప్రశ్నిస్తూవుంది. భారతదేశానికి మొత్తానికి స్వయంనిర్ణయాధికారం ఇవ్వకుండా నిరాకరిస్తూ ఉన్న బ్రిటిష్ ప్రభుత్వం ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు మాత్రం ఈ హక్కునెందుకంగీకరిస్తుంది? ఈ మాత్రపు స్వల్ప విషయాన్నికూడా లీగు గుర్తించలేకుండా ఉంది.

మా ఎన్నికల ప్రణాళికలో ఈ విషయాన్ని గురించి స్పష్టంగా సూచించాం. కాంగ్రెసు లీగులు కోరే న్యాయసమ్మతమైన కోరికల్ని మా పార్టీ బలపరుస్తుంది. ఉభయపక్షాల్లోను ఉన్న అసమంజసమైన కోరికల్ని మా పార్టీ ఖండిస్తుంది. ఉభయపార్టీల్లోను అసంపూర్తిగా వదలివేయబడిన విషయాల్ని మా పార్టీ పూర్తిచేసి తద్వారా రెంటిలోను ఐక్యత సాధిస్తుంది, ఈవిధంగా మాపార్టీ మన అందరికీ సమాన శత్రువైన బ్రిటిష్ ప్రభుత్వాన్ని నిర్మూలించడానికి కావలసిన సన్నాహాన్ని సమకూరుస్తుంది.



## బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి స్వాతంత్ర్యం—మనలో మనకు న్యాయం

మా పార్టీ ఎన్నికల ప్రణాళికలో ఈ దిగువ నిర్దిష్ట సూచనలు చేయబడ్డాయి.

1. "అఖిలభారత ప్రజాపరిషత్తుకు (కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ), అధికారం అప్పగించాలి. ఆ ప్రజాపరిషత్తు బ్రిటిష్‌వాళ్ళను ఇండియా నుండి సాగనంపే ఒడంబడికను తయారు చేస్తుంది. ఆ ఒడంబడికను బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించిందా సరే, లేనిపక్షంలో యావద్భారత సంయుక్త అంతిమ పోరాటాన్ని బ్రిటిష్ ప్రభుత్వం ఎదుర్కోవాలసి ఉంటుంది."

2. "భారత దేశంలో నివసిస్తూ ఉన్న వివిధ జాతుల మాతృభూముల నాధారంగా చేసుకొని 17 జాతీయ ప్రజాపరిషత్తులుండాలి. ఈ 17 జాతీయ ప్రజాపరిషత్తులు అఖిల భారత ప్రజాపరిషత్తుకు ప్రతినిధులను వయోజన వోటింగు పద్ధతిపై ఎన్నుకుంటాయి, బెలూచిస్థాన్, పఠాన్‌భూమి, సింధు, పశ్చిమ పంజాబ్, సెంట్రల్ పంజాబ్, హిందూస్తాన్, రాజస్తాన్, గుజరాత్, మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్ర, కేరళ, తమిళనాడు, ఒరిస్సా, బెంగాల్, అస్సాం. బీహార్, ప్రజా స్వామ్యాలను నిర్మించాలి. ప్రస్తుతం బ్రిటిష్‌వారిచే కృత్రిమంగా విభజింపబడిన రాష్ట్రాలను శాస్త్రీయంగా పై నుదహరించిన ప్రకారం పునర్నిర్మించాలి,"

3. స్వయం నిర్ణయ హక్కును సంస్థానప్రజలకు కూడా వర్తింప జేయాలి. అది వారి జన్మహక్కు, బ్రిటిష్ ప్రభుత్వాన్ని దాని ఏజంట్ల యిన సంస్థానాధిపతుల పరిపాలనను పూర్తిగా రద్దుచేయడానికీ, తద్వారా సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించడానికీ, ఆ హక్కును గుర్తించడం అత్యవసరం."

"ముందు స్వయంనిర్ణయహక్కును పొందినట్లయితే సంస్థాన ప్రజలు తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకుంటారు. తమ మాతృ భూములతో (రాష్ట్రాలతో) తమ సోదరప్రజలతో కలసిపోగల్గుతారు, అఖిలభారత ప్రజాపరిషత్ ప్రతినిధులకు తమతమ జాతీయ ప్రజాపరిషత్తు లకు ప్రాతినిధ్యం వహించే హక్కులు మాత్రమే (Pleni Potentiaries) ఉంటాయి."

"నిజమైన, సంపూర్ణమైన, స్వాతంత్ర్యం జాతీయ ప్రజాపరిషత్తు లకు ఉంటుంది. అవి స్వతంత్రభారతదేశంతో సమాన హోదాలో రాయ బారాలు సాగించడానికి, పరస్పర సంబంధాలను నిర్ణయించుకోడానికి, సర్వాధికారాలు కలిగిఉంటాయి."

"స్వతంత్రభారత రాజ్యాంగచట్టాన్ని నిర్మించే బాధ్యత ఈ వివిధ ప్రజాపరిషత్తులకు ఉంటుంది. వివిధ ప్రజాపరిషత్తులు స్వేచ్ఛగా తమ అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తూ అట్టి నిర్మాణానికి తోడ్పడవచ్చు. వివిధ జాతులయొక్క పరస్పరక్షేమానికి భంగంకానిరీతిని అవి ఆ నిర్మాణానికి తోడ్పడవచ్చు."

"చారిత్రకరీత్యా సిక్కు మాతృభూమికిచెందిన సిక్కులు ఆ ప్రదేశంలో నివసించే ప్రజలతోకలసి స్వయంనిర్ణయహక్కును పొంద వచ్చునని కమ్యూనిస్టుపార్టీ గ్యారంటీచేస్తోంది. స్వతంత్రభారతదేశంలో ఐక్య—స్వతంత్ర—బెంగాల్ నిర్మాణాన్ని కమ్యూనిస్టుపార్టీ బలపరుస్తుంది."

"బెంగాల్ ముస్లిములకు, బెంగాలీ హిందువులకుగూడా బెంగాల్ మాతృభూమి. వయోజన వోటింగుతో ఎన్నుకోబడిన ప్రజాపరిషత్తుద్వారా తన స్వయంనిర్ణయహక్కును అమలుపరుచుకోడానికి, తక్కిన భారత



దేశంతో సంబంధాలను ఏర్పరచుకోడానికి, బెంగాలుకే పూర్తిహక్కు ఉండాలి."

## విస్పష్టమైన కమ్యూనిస్టుపార్టీ వైఖరి

మాపార్టీ కాంగ్రెసును ఏయే విషయాల్లో బలపరుస్తుందో, లీగును ఏయే విషయాల్లో బలపరుస్తుందో, ఏయే విషయాలలో పై రెంటితో భేది స్తుందో స్పష్టంగా గుర్తించాలి.

బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి వెంటనే అధికారం భారతీయుల చేతు ల్లోకి రావాలి అనే విషయంలో కాంగ్రెసుతో పూర్తిగా ఏకీభవిస్తుంది. "భారతదేశంలోఉన్న ప్రజలందరికి (జాతులు) స్వయంనిర్ణయసూత్రం వర్తిస్తుంది అనే ప్రాతిపదికమీద స్వాతంత్రపోరాటం జరగాలి" అనే విషయంలో లీగుతో పూర్తిగా ఏకీభవిస్తుంది,

'స్వయంనిర్ణయ సూత్రాన్ని భారతజాతులన్నింటికి వర్తింప జేయాలి' అనే సూత్రాన్ని కాంగ్రెసు నిరాకరిస్తూ ఉన్నందువల్ల ఈ విష యంలో మేము కాంగ్రెసును బలపర్చం.

లీగుకోరే ఆరు రాష్ట్రాల్నిగానీ, న్యాయసమ్మతంగాని సరిహద్దుల్ని గానీ. మేము అంగీకరించము. దేశాన్ని విభజించడంవల్లనే ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు సర్వాధికారాలు లభిస్తాయి, అనేవిషయంలో లీగుతో మేముపూర్తిగా భేదిస్తున్నాం.

కాంగ్రెసు లీగు కోరికలకు, మాసూచనకు ఎక్కడ ప్రత్యేకతఉందో ఈదిగువ నుదహరిస్తాను.

1. బ్రిటిష్ప్రభుత్వంపోయి ఇండియాకు సంపూర్ణాధికారం ప్రాప్తిం చాలని మనమంతా కోరుతున్నాం. ఈ సంపూర్ణాధికారంలోనే అన్ని జాతులకు స్వయంనిర్ణయాధికారంకూడా ఉండాలని అన్నిజాతులకు తమ తమ ఇష్టానుసారం అభివృద్ధిపొందే అవకాశం ఇవ్వాలనీ మేము గట్టిగా తెలియజేస్తున్నాం. ఏ ఒకజాతి (ప్రజలు) మీద బలాత్కారంగా ఎటువంటి ప్లాను రుద్దగూడదు.

2. బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి సంపూర్ణాధికారం లాక్కోవడంకోసం చేతులుకలిపేముందు జాతుల స్వయంనిర్ణయ సూత్రానికి దేశవిభజనే ప్రాతిపదికగా మేము అంగీకరించం. స్వయంనిర్ణయసూత్రమంటే విభజన అనుకోవడం 19వ శతాబ్దపునాటి మాట. తోటిసోదరులందరిని ఐక్యం చేసి మన అందరకి సమానశత్రువయిన ప్రభుత్వాన్ని కూలదోయడమే 20వ శతాబ్దపు స్వయంనిర్ణయసూత్రానికి మూలసిద్ధాంతం. 19వ శతాబ్దపు నాటి భావన పెట్టుబడిదారీవిధానం అభివృద్ధిచెందిన దాని ఫలితంగాను, దురాక్రమణకు తలపడిన సామ్రాజ్యవాదఫలితంగాను ఏర్పడింది. 20వ శతాబ్దపునాటి భావన సోవియట్ ప్రజాస్వామికం సుస్థిరంగా పాదుకొనడం వల్లను, నేడు కొత్తగా ఏర్పడిన యూరప్‌లో జాతీయకలహాలు అంతరించిన దాని ఫలితంగాను ఏర్పడింది.

స్వాతంత్ర్య కాముకులైన భారతీయులందరు ఈ సూచనలను గురించి చర్చించవలసిందని కోరుతున్నాం. వీటితో పూర్తిగా ఏకీభవించినా ఏకీభవించకపోయినా, ఇండియన్‌పార్టీలు తమతమ ఆశయాల్ని గుర్తించడానికి ఇదొక చక్కనిప్రాతిపదికగా ఉపయోగిస్తుందని మేము ఆశిస్తున్నాం.

మా ఎన్నికలప్రణాళికలో ఈవిధంగా సూచించబడింది.

"ముస్లిములు మెజారిటీగాఉన్న ప్రాంతాలను ఒక ప్రత్యేక ఫెడరేషన్‌గా ఏర్పరచుకోవాలి. అట్టి ముస్లింఫెడరేషన్ హిందువులు మెజారిటీగా ఉన్న ప్రాంతపు ఫెడరేషన్‌తో స్నేహసంబంధాలను పెట్టుకోవచ్చు. అంతేగాని, ఒకే అఖండ భారతదేశంలో ఉండాలని కోరగూడదు. ఇలా లీగు ప్రచారం చేసుకోవచ్చు."

"స్వపరిపాలన కలిగిన (సంపూర్ణ స్వాతంత్ర్యంకాదు) రాష్ట్రాలతో (యూనిట్లతో) కూడిన ఫెడరల్ ఇండియన్ యూనియన్ ఉండాలని కాంగ్రెసు ప్రచారంచేసుకోవచ్చు."

"ప్రజాస్వామ్య సూత్ర ప్రాతిపదికపైన, వివిధ స్వతంత్ర జాతీయ ప్రజాపరిషత్తులు తమంతటతామే ఐచ్ఛికంగాకలిసి ఉండే యూనియన్‌కై మా పార్టీ ప్రచారం చేసుకుంటుంది. అట్టి యూనియన్‌లో బాగా అభివృద్ధి



చెందిన ప్రాంతాలు తక్కువ అభివృద్ధిచెందిన ప్రాంతాలకు ఫెడరల్ కేంద్రం ద్వారా సహాయంచేయాలి"

"ప్రతిపార్టీ సూచించే విధానానికి ప్రజలే పరిష్కారమార్గాన్ని నిర్ణయించాలి. ఎందువల్లనంటే ప్రజాబలం ఉన్న వివిధపార్టీల మధ్య అపనమ్మకాలు ఉన్నప్పుడు ఇదొక్కటే మార్గం."

"మనకందరికీ శత్రువైన పరాయివానితో స్వాతంత్ర్యపోరాటాన్ని సంయుక్తంగా సాగించడానికి వివిధపార్టీలు కలవాలి. అందుకై అన్ని పార్టీలు కలిసి ఒడంబడిక గావించుకోడానికి అభిలాష, కృతనిశ్చయాన్ని చూపించాలి. కాబట్టి తీవ్రంగా వివిధపార్టీలు పరస్పరం సంప్రదింపులు సాగించి ఒక నిర్ణయానికి రావాలి."

మన పార్టీలలో అభిప్రాయభేదాలున్నాయి అనేవిషయం ఎవరు కాదంటారు? ప్రధానపార్టీలే తమలోతాము కలహించుకుంటూ ఉంటే నిర్ణయించేది ప్రజలుగాక మరెవ్వరు? ప్రజా నిర్ణయానికి ఉభయులు బద్ధులుగావడం మినహా మరే గత్యంతరం ఉంది?

ఇంతకు మినహా మనకు మరే మార్గంలేదు. నిర్ణయించే అధికారం ప్రజలకు లేదంటే ఇక ఎవరికివారే తమది న్యాయంఅనుకొని ఒకళ్లొకళ్ళు గొంతులు కోసుకోవాలిసిందేనా?

## భారతీయ ప్రజాస్వామిక సమస్య

మన జాతీయజీవితంలో ప్రజాస్వామిక సూత్రాన్ని ఎలా వర్తింపజేయాలో సరిగా అవగాహన చేసుకోలేకపోతే ఇండియాకుగానీ, ఇండియాలో ఉన్న ఏ ప్రజలకుగానీ సంపూర్ణాధికారం లభించదు. జాతుల స్వయంనిర్ణయ సూత్రాన్ని ముందు క్షుణ్ణంగా అర్థంచేసుకోవాలి. శాస్త్రీయ సిద్ధాంతంమీద ఆధారపడిన స్వయంనిర్ణయ సూత్రంద్వారానే మనం యీ సమస్యను పరిష్కరింప గలుగుతాం.

19వ శతాబ్దారంభంనుంచి—భారతదేశంలో నవయుగ ప్రభాతం అయినప్పటినుంచి మనల్ని ఈ సమస్య ఎదుర్కొంటూనే ఉంది. మన

నాయకులు స్వాతంత్ర్యం కోరినప్పుడల్లా బ్రిటిష్ ప్రభుత్వం ఏమని సమాధానం యిస్తూ వచ్చింది? "మనమింకా వెనకబడ్డ ప్రజలమట. మనలోమనం దెబ్బలాడుకుంటున్నామట. మనమింకా ఆధునిక జాతిగా అభివృద్ధి పొందలేదట. ప్రజాస్వామిక సూత్రంతో దేశాన్ని పరిపాలించుకోలేమట" యీ విధంగా జవాబుచెప్పుతూ వుండేది. బ్రిటిష్‌గవర్నమెంటు, 'స్వంత' పాఠశాలల్లో విద్యనార్జించిన కొద్దిమంది పైతరగతి యువకుల్ని మినహాయిస్తే మిగతాప్రజలు వోటువేయడానికి తగరట,

మన స్వాతంత్ర్యోద్యమం ప్రారంభమైన మొదటిరోజుల్లో బ్రిటిష్ ప్రభుత్వం ఇలాంటి సాకులే చెప్పుతూ ఉండేది. తర్వాత కాంగ్రెసు స్థాపించబడింది. ఇండియాకుకూడ ప్రజాస్వామిక సూత్రం వర్తింపజేయాలని బ్రిటిష్‌ప్రభుత్వాన్ని అడిగింది, "ప్రజాస్వామికపద్ధతి బ్రిటనుకు ఉపయోగించినప్పుడు ఇండియాకు మాత్రం ఎందుకు ఉపయోగపడదు? అని ఆరోజుల్లో కాంగ్రెసునాయకులు ప్రభుత్వంతో వాదించేవారు,

కాంగ్రెసు క్రమక్రమంగా దేశమంతటా బలపడింది. ఆర్థికంగాను వైజ్ఞానికంగాను ముందున్న హిందువులు కాంగ్రెసులో ప్రధానపాత్ర వహించారు. మహమ్మదీయుల్లో నూతన జాతీయ చైతన్యాన్ని కలిగించిన సర్ సయ్యద్ మహమ్మద్‌లాంటి ప్రముఖుడే "ఒక మనిషికి ఒకవోటు" అనే సూత్రం ఇండియాకు పనికిరాదని చెప్పాడు. 'ఒక మనిషికి ఒక వోటు' ఇవ్వడంవల్ల మొత్తందేశంలో హిందువులదే మెజారిటీకాబట్టి మహమ్మదీయులకు అన్యాయం జరుగుతుందని ఆయన అభిప్రాయం. ఆనాడు నాటబడిన బీజమే నేటికి ఇంకా పెరిగి పెద్దదై కాంగ్రెసు లీగు ప్రతిష్ఠంభనకు కారణభూతమయింది.

మనకువర్తించే సర్వోత్తమమైన ప్రజాస్వామిక సూత్రమేది? ఏ ప్రాతిపదికమీద మనం ఆధారపడాలి? చైతన్యవంతులయిన మహమ్మదీయులందరు సయ్యద్‌లాగే కాంగ్రెసునుజూచి భయపడ సాగారు.

భారతదేశంలో నూతన యుగానికి పునాదివేసిన ప్రముఖులు ఆ రోజుల్లో ప్రతివిషయాన్ని మతాని కన్వయించే మాట్లాడుతూ ఉండేవారు.



అలాగే ప్రజలకు బోధించేవారు. అది ఆనాటి యుగధర్మం. ప్రజల్లో మళ్ళీ నూతనస్ఫూర్తి రేకెత్తించడానికి మరచిపోయిన వెనుకటి మహత్తర చరిత్రను జ్ఞప్తికితెచ్చేవాళ్లు. నిరాశతో కుంగిపోయే ప్రజల్లో ఒకనూతనోత్సాహాన్ని కలిగించారు. ఈపునాదిమీదనే మనజాతీయోద్యమం నిర్మింపబడింది. క్రియాపూర్వకంగా ఏమీచేయకుండా నేడుకూడ ఆవెనుకటి 'మంత్రా'ల్నే జపిస్తూ కూర్చోవడం, మన పూర్వుల గొప్పతనాన్ని పొగుడుకోవడంతోనేప్రొద్దుబుచ్చుకోవడం ఈనాడు జాతీయ దురహంకారం అనిపించుకుంటుంది. ఈనాటిపరిస్థితుల్లోకూడా మన పూర్వుల గొప్పతనాన్ని తెగ పొగుడుకుంటూ తోటిసోదరుల్ని ద్వేషించడమంటే చివరకు మన అందరికి సమానశత్రువైన బ్రిటిష్‌ప్రభుత్వానికి దాసోహంఅనవలసివస్తుంది. కాబట్టి మనం రాబోయేభవిష్యత్తునుగురించి తీవ్రంగా ఆలోచించాలి. ప్రజల జీవిత పరిస్థితుల్ని అర్థం జేసుకోవాలి. నిజమైన చరిత్రమీద ఆధారపడాలి. స్వశక్తితో సంపూర్ణస్వాతంత్ర్యాన్ని సాధించాలి. ప్రజల ఇష్టానుసారం దాన్ని ఆచరణలోపెట్టాలి. మా స్వయంనిర్ణయసూత్రానికి ఇదే పునాది. నేటి భారతీయ ప్రజాస్వామికానికి వర్తించే సూత్రంకూడా ఇదే.

## బ్రిటిష్‌ప్రభుత్వం మన స్వాతంత్ర్యాన్ని హరించింది - మన జాతుల్ని విచ్ఛిన్నం చేసింది

తమ చెప్పుచేతల్లో మెలగే రాజాల, మహారాజాల సహాయంతోను, సైనిక బలంతోను బ్రిటిష్‌ప్రభుత్వం ఒక జాతిని మరో జాతిమీదికి కవ్వించి తన జిత్తులమారి ఎత్తుగడలతో ఇన్నాళ్లనుంచి మనమీద పెత్తనం చలాయిస్తూవుంది. కొందరిని పూర్తిగా తన తొత్తులుగా తయారుచేసుకుంది. మరికొందరిని తనమీదికి కత్తిగట్టకుండా మధ్యస్థులుగా మార్చుకోగలిగింది, 'విభజించి పాలించే' ఎత్తుగడలతో భారతదేశాన్ని జయించింది. ఆ ఎత్తుగడలతోనే ప్రతిజాతిని చీల్చి కొంతభాగాన్ని సంస్థానాధీశ్వరుల క్రింద అట్టిపెట్టింది. మరికొంత భాగాన్ని తన అధీనం క్రిందనే

ఉంచుకుంది. దీన్నే ఒకసారి గాంధీజీ 'భారతదేశానికి శాశ్వతంగా బావి సత్వం' అని వర్ణించాడు.

మన భారతదేశ పటాన్ని ఒకసారి పరిశీలించుదాం. మద్రాసు రాజధానిలో నాలుగుజాతు లున్నాయి. మలయాళీలు, తమిళులు. ఆంధ్రులు. కర్ణాటకులు. ఈ నాలుగుజాతులు మళ్ళీ చీలికలయ్యాయి.

మలయాళీజాతి మద్రాసు రాజధానిలోని ఒకజిల్లాలోను, కొచ్చిన్, ట్రావెన్‌కూర్, సంస్థానాల్లోను విభజించబడింది.

మద్రాసు రాజధానిలోని సర్కార్లలోను రాయలసీమలోను (11 జిల్లాలు) షుమారు రెండుకోట్ల ఆంధ్రులున్నారు. నైజాం నవాబు ప్రభుత్వంక్రింద 90 లక్షల ఆంధ్రులు నివసిస్తున్నారు.

కార్ణాటకుల పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది, నాలుగు ప్రాంతాల్లో మద్రాసు, బొంబే రాష్ట్రాల్లోను, హైదరాబాద్, మైసూరు సంస్థానాల్లోను— కర్ణాటకజాతి చీలికలైపోయింది. ఈ చీలికల్లోనే మళ్ళీ ఎన్నో పేలిక లున్నాయి. ఒక్క బొంబేరాష్ట్రంలో ఉన్న కర్ణాటకులే జమ్‌ఖండీ, ముధోల్ రాందుర్గ్, అఖల్‌కోట్, మొదలైన అనేక చిన్నచిన్న సంస్థానాల్లో వేరుగా ఉండిపోయ్యారు.

అసమాన ధైర్యసాహసాలు ప్రదర్శించి బ్రిటిషు వాళ్ళని ముప్పుతిప్పలు బెట్టిన మహారాష్ట్ర వీరజాతి ముక్కలు ముక్కలుగా తెగగొట్టబడింది. సి. పి. బీరార్ రాష్ట్రాల్లో 55 లక్షలు, హైదరాబాద్ స్టేటులో 36 లక్షలు, బొంబే రాజధానిలో ఒకకోటిమంది మహారాష్ట్రులు నివసిస్తూ ఉన్నారు. ఇంతవరకు ఈ చీలికలు చాలవా అన్నట్లు మహారాష్ట్ర మాతృభూమిలో ఇంకా కావలసినంతమంది చిన్నచిన్న రాజుల్ని సురక్షితంగా అట్టిపెట్టారు. ఈ చిల్లర సంస్థానాల్లో షుమారు 19 లక్షలమంది మహారాష్ట్రులున్నారు. గుజరాతీ జాతిని తీసుకొచ్చి మహారాష్ట్రులధికంగా ఉన్న బొంబేరాజధానితో ముడిపెట్టారు. గుజరాతీ జాతికూడా అనేక చీలికలైపోయింది. అనేకమంది రాజాలు మహారాజాలు గుజరాత్‌లో తమ నిరంకుశాధికారాన్ని నిరాఘాటంగా సాగిస్తూ ఉన్నారు. బ్రిటిషు గుజరాత్‌లో



46½ లక్షలమంది ఉన్నారు' మిగతా గుజరాత్ రాష్ట్రం వెస్టరన్ ఇండియా ఏజెన్సీకి సంబంధించిన సంస్థానాల్లోను, కథియవార్‌లోని మూడు ఏజెన్సీలల్లోను, అసలు గుజరాత్‌కు సంబంధించిన 15 సంస్థానాల్లోను, ఇంకా ఇదేవిధంగా చిన్నచిన్న ముక్కలుగా విభజింపబడింది. బ్రిటిషు ప్రభుత్వం ఈ సరిహద్దుల్ని ఎంత దారుణంగా నిర్ణయించిందో తెలుసుకోడానికి ఈ చిన్న ఉదాహరణ ఒక్కటిచాలు. సర్గున అనే ఒక సంస్థానంలో మొత్తం జనాభా 18292.

అన్నిజాతులకు ఇలాంటి అధోగతే పట్టింది. ఈవిధంగా మన దేశం చిన్నచిన్న ముక్కలుగా తెగగొట్టివేయడం వల్ల మన జాతీయ జీవితమే ధ్వంసమైపోయింది.

## అభివృద్ధి నొందుతూ ఉన్న భారతీయ జాతులు

బ్రిటిష్‌వాళ్ల అడుగు బెట్టకపూర్వం మన దేశం ఏ స్వరూపంలో ఉందో మళ్లీ అదే స్వరూపంలో — ఇప్పటివరకు జరుగుతూఉన్న అభివృద్ధితో సహా — మన మాతృభూమిని తిరిగి సాధించాలి.

ఈ విశాల దేశంలో 17 జాతులు తమతమ ప్రత్యేక మాతృభూములలో నివసిస్తూ ఉన్నాయి, 1. బెలూచిస్తాన్, 2. పఠాన్‌భూమి, 3. సింధు, 4. పశ్చిమ పంజాబ్, 5. మధ్యపంజాబ్, 6. హిందూస్థాన్, 7. రాజస్తాన్, 8. గుజరాత్, 9. మహారాష్ట్ర, 10. కర్ణాటక. 11. ఆంధ్ర, 12. కేరళ. 13. తమిళనాడు, 14. ఒరిస్సా, 15. బెంగాల్, 16. అస్సాం, 17. బీహార్, సహజసిద్ధంగా అభివృద్ధిజెందిన ఈ 17 జాతుల్ని గుర్తించటం ఒక్కటే సరియైన పరిష్కారమార్గం. దీనివల్ల దేశం విభజించబడకపోగా సర్వసౌఖ్యాలవాలమైన స్వతంత్ర భారతదేశాన్ని నిర్మించడానికి ఇది చక్కని ప్రాతిపదికగా ఉంటుంది.

బ్రిటిష్‌వాళ్లు తయారుజేసిన నేటి కృత్రిమ సరిహద్దులు భారతీయ ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్నాయి. నేటి సరిహద్దుల్నే యథావిధిగా ఉంచాలని ప్రయత్నించడం ఒక మహాపరాధం అవుతుంది.

ఆధునిక జాతులుగా మన ప్రజలు అభివృద్ధి చెందుతూవున్న సమయంలో బ్రిటిష్‌వాళ్లు వచ్చి మన దేశాన్ని జయించుకున్నారు. మన భారతీయ జాతులు సక్రమంగా అభివృద్ధి చెందకుండా అనేక అభ్యంతరాలు కలిగించారు. మన మాతృభూముల్నిగురించి సహజంగా మనకొక అభిప్రాయం ఏర్పడింది.

బ్రిటిష్‌ప్రభుత్వాన్ని తీవ్రంగా ద్వేషిస్తున్నాం. స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్నాం. ఈ పోరాటంలో మన జాతీయాభిమానం సహజంగా మనలో ఒక నూతనోత్సాహాన్ని రగుల్కొల్పుతుంది. ఒక నూతన చైతన్యాన్ని కలిగిస్తూ ఉంది.

భారతీయులు తమతమ మాతృభాషల్లో, దేశం, రాష్ట్రం, ముల్క్ అని పిలుస్తూ ఉన్నారంటే అది ఆకస్మికంగా ఒకనాడు జరిగిన ఘటనకాదు.

జగత్ప్రసిద్ధి గాంచిన 'వందేమాతర గీతాన్ని' రచించిన బంకిం చంద్ 'సప్తకోటి' (7 కోట్ల బెంగాలీలు) అని పేర్కొన్నారంటే, అది ఒకనాడు హఠాత్తుగా ఏర్పడిన భావంకాదు.

విశ్వకవి రవీంద్రనాధ్ తన 'జనగణమన అధినాయక' అనే గేయంలో 'పంజాబు సింధు గుజరాతీ మరాఠా ద్రావిడ ఉత్కళవంగా' అని వ్రాశాడంటే 'జాతి' భావం చారిత్రకంగా క్రమేణ అభివృద్ధి పొందింది గాని అమాంతంగా ఆకాశాన్నుంచి ఒక్కసారి ఊడిపడింది కాదు.

మన మాతృభూముల్ని గురించి మనం ఆలోచించేటప్పుడు సక్రమమైన సరిహద్దులతో స్వరాష్ట్రాలు ఏర్పడాలని: మన మాతృభూములు సిరి సంపదలతో పాడిపంటలతో సస్యశ్యామలంగా రాణించాలని తప్పకుండా అభిలషిస్తాం.

ఈ మాతృభూముల్లోనే మన మాతృభాషలు పుట్టి అభివృద్ధి చెందాయి, మన ఆధునిక విజ్ఞాన వికాసాలు వికసించాయి. మన దేశపటాన్ని శ్రద్ధగా ఒకసారి తిలకిస్తే మన మాతృభూములు ఎంత సహజసిద్ధంగా సరియైన భౌగోళిక సరిహద్దులతో ఏర్పడి ఉన్నాయో అందరికీ తేలికగా అర్థమవుతుంది. ఈ రాష్ట్రాలన్నీ ఆర్థికంగా స్వయంపోషకంగా ఉంటాయి.

ఈ 17 రాష్ట్రాలు వట్టి వైజ్ఞానిక సంబంధంగల ప్రాంతాలుమాత్రమే కావు. అవి ప్రత్యేకంగా అభివృద్ధి పొందుతూఉన్న జాతులు. బ్రిటిష్‌వాళ్లు రాకపూర్వమే అవి ప్రత్యేకజాతులుగా అభివృద్ధి చెందుతూఉన్నాయి. బ్రిటిష్‌వాళ్లు వచ్చి మన దేశాన్ని జయించి వాటిని చిన్నాభిన్నం చేశారు.

అనేకజాతుల కూటమిగాకుండా ఇండియాఅంతా ఒకేజాతి అనుకోవడం మన చరిత్రను సరిగ్గా అర్థం చేసుకోలేకపోవడమే అవుతుంది. సమాన హోదాలోగల అనేక జాతులతోగూడిన ఒక సమిష్టికుటుంబంగా ఇండియాను అర్థంజేసుకోగలిగి నప్పుడే మనం ఈ సుడిగుండంలోనుంచి బైటబడి దిగ్విజయంగా ముందుకు సాగిపోగలం.

స్వయంనిర్ణయాధికారం భారతదేశంలోఉన్న ప్రతి జాతికి స్వతస్సిద్ధమైన జన్మహక్కుగా అంగీకరించాలి. ఈ స్వతంత్రజాతులు ఒకే కుటుంబంగా కలసి ఉంటానికి మనం ప్రయత్నించాలి. భారతీయ స్వాతంత్ర్యానికి భారతీయైక్యతకు ఇదొక్కటేమార్గం.

భారతస్వాతంత్ర్యమంటే భారతదేశంలోఉన్న అన్నిజాతులయొక్క స్వాతంత్ర్యం అనే ప్రాతిపదికమీద భారతీయైక్యతను నిర్మించాలి.

గత చరిత్రను సరిగ్గా అర్థంచేసుకోడానికి ప్రస్తుతం ఏర్పడిన అభిప్రాయభేదాల్ని తొలగించుకోడానికి ఇదొక్కటే శాస్త్రీయమైన చక్కని పద్ధతి. అన్నిజాతుల ఇష్టంమీద ఏర్పడిన ఐక్యతే చిరస్థాయిగా ఉంటుంది. స్వాతంత్ర్యాన్ని సాధిస్తుంది. మనలోఉన్న అభిప్రాయ భేదాల్ని పరిష్కరించుకోవడానికి ఇంతకు మినహా మరేమార్గం లేదు. మన స్వాతంత్ర్యానికి ఈ స్వయంనిర్ణంసూత్రమే పునాదిగా ఉండాలి. భారతదేశంలో ఉన్న అన్ని జాతులకు సమానహోదా ఇవ్వబడుతుంది. ప్రతి జాతి తన యిష్టప్రకారం తన భవిష్యత్తును నిర్మించుకోవచ్చు. తన విద్యా, విజ్ఞాన వికాసాల్ని పెంపొందించుకోవచ్చు.

అధిక సంఖ్యాకులుగా ఉన్న హిందువులు మహమ్మదీయులమీద పెత్తనం సాగిస్తారని లీగు భయపడుతూ ఉంది. అల్ప సంఖ్యాకులైన మహమ్మదీయులు అవిధేయతగా ప్రవర్తిస్తారేమో అని కాంగ్రెసు పందే

హిస్తూఉంది, ఈ ఉభయుల సందేహాల్ని నివారించడానికి పైన సూచించిన పద్ధతి ఒక్కటే సరియైన మార్గం. ఈ పద్ధతిని అవలంబించడం ద్వారానే భారతీయులందరం కలసి ముందడుగు వేయగలుగుతాం. అందరికీ స్వాతంత్ర్యం లభిస్తుంది. నూతన ప్రపంచంలో భారతదేశానికి సముచితమైన స్థానాన్ని సంపాదించ గలుగుతాం.

భారతీయ ప్రజాస్వామికాన్ని నిర్మించుకోవడానికి ఇదొక్కటే సక్రమమైన పద్ధతి, బ్రిటిష్‌వాళ్లు పన్నే వలలో పడకుండా వుంటానికి మన ప్రజాస్వామికాన్ని మన ప్రజలే నిర్మించుకోవాలి. ఈ విధానంద్వారానే భారతీయులందరికి సంపూర్ణ స్వాతంత్ర్యం లభిస్తుంది,

ప్రజలే తమ ఇష్టప్రకారం తమ భవితవ్యాన్ని నిర్ణయించుకోవాలి. ప్రజలందరి ఇష్టంమీద కలసి మెలసి ఒక పెద్ద సమిష్టి కుటుంబంగా ఏర్పడాలి.

## ఇది ఒక్కటే పరిష్కార మార్గం

మనలో మనకు ఎలాంటి అభిప్రాయం భేదాలున్నా మనమందరం అంగీకరించే ప్రధాన విషయాలు కూడా కొన్ని వున్నాయి. ఈ సత్యాన్ని మరచిపోకూడదు అవి భారతీయులందరికి మా పార్టీ హృదయపూర్వకంగా విజ్ఞప్తి చేస్తూఉంది.

1. మన అందరి హృదయాల్లో బ్రిటిషు విద్వేషాగ్ని ప్రజ్వరిల్లుతూ ఉంది. ఆ స్వాతంత్ర్య జ్వాలను ఆరిపోనివ్వకూడదు. బహిరంగంగా కానీ అంతరంగికంగా కానీ బ్రిటిషు సామ్రాజ్య వాదుల్ని విశ్వసించామా అంటే స్వాతంత్ర్య పోరాటంలో తమ ప్రాణాల్ని సైతం సమర్పించిన ఆదర్శమూర్తులైన హిందూ మహమ్మదీయ యోధులకు ద్రోహం చేసిన వాళ్ళ మవుతాం.

2. సోదర భారతీయుల్లో స్వాతంత్రాగ్నిని ఇంకా ప్రజ్వరిల్ల జేయాలి. దేశభక్తినంతా మనమే గుత్తకు తీసుకున్నామని భావించ గూడదు; దేశభక్తినంతా మన సొత్తే అనుకోవడంవల్ల స్వాతంత్ర్యాన్ని అభిలషించి స్వాతంత్ర్యం కోసం పోరాడే సోదర భారతవీరుల్ని మనతోపాటు కలుపుకొని రాలేకపోతాం. అభివృద్ధి నిరోధకులైన భారత టోరీల యాజమాన్యంక్రిందికి పోతాం.



3. మనలో మనం అన్యోన్యం విశ్వసించాలి. ఒకరిని ఒకరు నమ్మకపోవడమంటే చివరకు అంతాకలిసి ఏకంగా బ్రిటిష్‌టోరీలు పన్నిన వలలో చిక్కుకుంటాం.

మేము జేస్తూఉన్న ఈ విజ్ఞప్తి, మేము ఇస్తూఉన్న ఈ హెచ్చరిక స్వాతంత్ర్య పిపాసి అయిన ప్రతి భారతీయుని హృదయంలో ప్రతిధ్వనించాలి.

"మన దేశంలో ప్రధానపార్టీలైన కాంగ్రెసు లీగులు పరస్పరం కలహించుకుంటూ ఉంటే మీరు మాత్రం ఏమిచేయగల్గుతారు ?" అని అనేకమంది మిత్రులు మమ్మల్ని ప్రశ్నిస్తూ ఉన్నారు.

"రెండుపార్టీలు తమలో తాము అసహ్యంగా దెబ్బలాడుకుంటూ ఉంటే మూడవపార్టీ జోక్యం కలిగించుకొని ఐక్యతకోసం సర్వప్రయత్నాలు జేస్తూ ఉభయులచేత తుస్కరింప బడుతుంది" అనే విషయంగాదు మనమిప్పుడు చూడాలిసింది. మా ప్రణాళిక వెనకఉన్న బలం ఒక్క మా పార్టీదే కాదు. స్వాతంత్రాన్ని అభిలషించే ప్రతిభారతీయుడు ఇంతకు మినహా మరో గత్యంతరం లేదు. కాబట్టి క్రమేణ దీన్నే బలపరుస్తాడు.

1, తమ్ముడు తన అన్నల్ని గౌరవించినట్లే మాపార్టీకూడా కాంగ్రెసు లీగుల్ని గౌరవిస్తుంది. ఎన్నికలైన త్వరలోనే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల్నిగురించి కాంగ్రెసు లీగులకున్న భ్రమలన్నీ తొలగిపోతాయి. మరో సిమ్లానాటకం జరుగుతుంది. కాంగ్రెసు లీగులకు అప్పుడిక మరో గత్యంతరం ఉడదు. బ్రిటిష్‌ప్రభుత్వ ప్లానులకు లొంగిఅయినా పోవాలి. లేక కాంగ్రెసులీగులు తమలోతాము ఒక ఒడంబడికకైనారావాలి. మొదటినుంచి ఈతంతు జరుగుతూనేఉంది. బ్రిటిష్‌వాళ్ళమీద మొదట ఏవో ఆశలుపెట్టుకోవడం ఆశ నిరాశఅయిన తదనంతరం తమలోతాము రాజీకోసం ప్రయత్నాలు సాగించడం. ఈసారికూడా ఇంతే జరుగుతుంది.

మాపార్టీ వెనకఉన్న ప్రజలమీద మాకెంత విశ్వాసంవుందో కాంగ్రెస్ లీగుల వెనకున్న ప్రజలమీదకూడా మాకు అంతే విశ్వాసంఉంది. కాంగ్రెసు లీగుల్లోఉన్న ప్రజాసామాన్యంకూడా స్వాతంత్ర్యంకోసం తహతహ లాడుతూఉంది. ప్రజల్లోఉన్న ఆ స్వాతంత్ర్యపిపాసే మా ప్రణాళిక జయప్రదం గావడానికి సహాయభూతం అవుతుంది. ఒకవేళ మేము చెప్పేదాన్ని యివాళ పూర్తిగా అంగీకరించకపోయినా, ఇంతకు మినహా మరో గత్యంతరం లేదుగాబట్టి రేపుఅయినా అంగీకరించక తప్పదు. అప్పటికికూడ అంగీకరించకపోవడమంటే బ్రిటిష్‌సామ్రాజ్యవాదులకుద్రమ కొనసాగవివ్వడమే అవుతుంది. స్వాతంత్ర్యానికి బదులుగా కొత్తరూపంలో మళ్ళీ బానిసత్వమే ప్రాప్తిస్తుంది. ఈనాడున్న తగాదాలు ఇంకా ఎక్కువ అవుతాయి. అప్పుడు మళ్ళీకొత్తసమస్యల్ని ఎదుర్కోవాలిసి వస్తుంది.

2. వయస్సులో మా పార్టీ కాంగ్రెసు, లీగుల కంటె చిన్నదే అయినా కాంగ్రెసు, లీగు ఉద్యమాల్లోఉన్న సత్సాంప్రదాయాన్ని మా పార్టీ ఇంకా ముందుకు తీసుకపోతూఉంది. హిందూ మహమ్మదీయ ఐక్యతను నిర్మిస్తూఉంది.

1857 ప్రథమ స్వాతంత్ర్య పోరాటంలో మన తాతలు, ముత్తాతలు హిందువులు - మహమ్మదీయులు భుజం భుజం కలిపి పోరాడిన ఆ గౌరవ ప్రతిష్ఠల్ని కాపాడాలి. హిందూ మహమ్మదీయులు కలిసి 1920 లో సాగించిన మహత్తరఉద్యమంలో మనతండ్రులు ఏ లక్ష్యాన్ని సాధించడం కోసం పాటుపడ్డారో ఆలక్ష్యాన్ని మనం మన హయాంలో సాధించాలి.

ఇందుకు కావలసిన బలాన్ని మనం తప్పకుండా చేకూర్చుకోగలం. అఖిలభారత కిసాన్‌సభ, అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌లో ఆదర్శప్రాయంగా హిందూ మహమ్మదీయైక్యతను నిర్మించగలిగాం. ఈ సత్సాంప్రదాయాన్నే ఇంకా ముందుకు తీసుకపోదాం.

25 సంవత్సరాలు కష్టించి, మా శక్తినంతా ధారవోసి ట్రేడ్‌యూనియన్ కిసాన్ సభలను నిర్మించాం. హిందూ మహమ్మదీయైక్యతను సాధించాం. ఈనాడు మన దేశంలో హిందూ మహమ్మదీయులు కలిసి



పనిజేస్తూఉన్న సంస్థలు ఈ రెండే అని ప్రతివాడూ అంగీకరించక తప్పదు. హిందూ మహమ్మదీయ కలహాలు నానాటికి పెచ్చు పెరిగిపోతూఉన్న సమయంలోనే మరోవైపు హిందూ మహమ్మదీయ ఐక్యతమీద ఆధారపడి ప్రజాసంస్థలు బ్రహ్మాండంగా బలపడ్డాయి. మన జాతీయ జీవితంలో ఒక భాగం అంధకారమయంగా వున్నా మరోభాగం ప్రకాశవంతంగా వుంది.

మా పార్టీ మన ప్రాచీన ఔన్నత్యాన్ని ఇంకా పెంపొందిస్తూఉంది. రైతు కూలీ ప్రజాసామాన్యంలో ఆనాడు వెలిగించిన హిందూ మహమ్మదీయ ఐక్యతా జ్యోతిని ఇతోధికంగా ప్రజ్వరిల్ల జేస్తూ ఉంది. హిందూ మహమ్మదీయ కలహాలు పెచ్చుపెరిగి పోవడమంటే, మన రాజకీయజీవితం మట్టిపాలైనట్టే. హిందూ మహమ్మదీయ ఐక్యతకోసం కృషిచేయడమంటే భారత రాజకీయ జగత్తులో ఉన్న చీకటిని పోగొట్టి వెలుతురును ప్రసరింపజేసినట్లవుతుంది. తుప్పుబట్టి పోయిన పాతపద్ధతులకు బదులు కొత్తపద్ధతుల కోసం, పరస్పర ద్వేషానికి బదులు సౌభాతృత్వంకోసం మా పార్టీ కృషి చేస్తూ ఉంది.

3. ఈ రెంటిలో చివరకు ఏపద్ధతి జయిస్తుంది? కాంగ్రెసు లీగుల ననుసరించే ప్రజాసామాన్య హృదయం స్వాతంత్ర్యభావ ప్రేరేపితం అనడంలో మాకెట్టి సందేహంలేదు. కాంగ్రెసు లీగులు కోరే న్యాయసమ్మతం గాని హక్కుల్ని తోసిపుచ్చి ఉభయులుకోరే న్యాయ సమ్మతమైన హక్కుల్ని బలపరిచేది మా పార్టీ ఒక్కటే.

బ్రిటిషు ప్రభుత్వాన్నుంచి కాంగ్రెసు కోరే భారత స్వయంనిర్ణయాధికారాన్ని మేము పూర్తిగా బలపరుస్తున్నాం. అదే లక్ష్యం కోసం మేము కూడా పోరాడుతున్నాం. మాసోదర కాంగ్రెసు వాదులకు మేము జేస్తూ ఉన్న విజ్ఞప్తి ఇది: బ్రిటిషు ప్రభుత్వాన్నుంచి భారత స్వయం నిర్ణయాధికారాన్ని కాంక్షించే మీరు అదే స్వయం నిర్ణయాధికారాన్ని భారతీయులందరికీ వర్తింప జేయడానికి ఎందుకు అంగీకరించరు?

ఈ విధంగా మాట్లాడమని లీగు మా చెవుల్లో నూరి పోసిందంటారా? మమ్ముల్ని మీరు అభివృద్ధి నిరోధకులైన టోరీవర్గానికి చెందిన

ముతా అనగలరా ? మాపార్టీ పుట్టినప్పటి నుంచి ఇండియాకు సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని ఆందోళన చేస్తూనే వచ్చింది. కాబట్టి మీరు మమ్మల్ని టోరీలనలేరు. భారతదేశంలో రైతుకూలీ ఉద్యమాల్ని నిర్మించింది మేమే కాబట్టి మమ్మల్ని మధ్యయుగానికి చెందిన అభివృద్ధి నిరోధకులని కూడా మీరు అనలేరు. జాతీయోద్యమంలో అభ్యుదయభావాలతో అహోరాత్రులు కృషిచేసే నిజమయిన వర్కర్లని ప్రతివారూ అంగీకరించిన విషయమే.

ముస్లిం మెజారిటీ ప్రాంతాల్లో ముస్లిం స్వయంనిర్ణయాధికారాన్ని అంగీకరించాలని హిందువుల్లో తీవ్రంగా ప్రచారం చేసింది మా పార్టీ ఒక్కటే. లీగు నాయకులు మమ్మల్ని పూర్తిగా సందేహిస్తూఉన్నా. లీగు పత్రికలు మామీద దుమ్మెత్తి పోస్తూఉన్నా లక్ష్యంచేయకుండా న్యాయమని మనస్ఫూర్తిగా నమ్మినదాన్ని మేము ప్రచారం చేశాం. మా కర్తవ్యాన్ని నిర్వర్తించాం. ఈ విషయం ప్రతి లీగుసభ్యునికి తెలిసేఉంది. అందువల్లనే లీగుసభ్యులు ఇతరపార్టీ లన్నిటికంటె కమ్యూనిస్టుపార్టీనే ఎక్కువగా గౌరవిస్తూ ఉంటారు. స్వయంనిర్ణయ సూత్రాన్ని ప్రచారం చేయడంలో మేమెన్ని యిబ్బందుల్ని ఎదుర్కొన్నామో, ఎన్నిబాధలు పడ్డామో. ప్రతి లీగు సభ్యునికి తెలుసు. మన రాజకీయాల్లో నేడు హిందూ మహమ్మదీయులు దాదాపు పూర్తిగా చీలిపోయ్యారు. కాబట్టి మహమ్మదీయులు తమ జన్మహక్కును గురించి హిందువుల్లో ప్రచారం చేయలేక పోయ్యారు. హిందువుల సహాయ సానుభూతుల్ని సంపాదించలేక పోయ్యారు. మాపార్టీ ఏ ఒక కులానికి. మతానికి 'చెందని పార్టీ కాబట్టి మహమ్మదీయుల జన్మహక్కును గురించి హిందువుల్లో తీవ్రంగా ప్రచారం చేయగలిగింది. ఈ విషయాలన్నీ యదార్థంగావని ఏ ముస్లిం ముఖాముఖి నిరాకరించి మాట్లాడలేదు.

మహమ్మదీయులు కోరే స్వయం నిర్ణయాధికారంలో ఉన్న న్యాయాన్ని న్యాయబుద్ధితో మేము అంగీకరిస్తున్నాం. అదే న్యాయ బుద్ధితో అందులో వున్న లోపాల్నికూడా లీగు సభ్యులకు తెలియజేసే



అధికారం మాకుంది. ఆరు రాష్ట్రాలు మా పాకిస్థాన్ కిందికి రావాలనడం శుద్ధ అన్యాయం. 'స్వతంత్ర భారతదేశంలో ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు కూడా స్వతంత్రాధికారం' అని మేము చెప్పే న్యాయసూత్రాన్ని అంగీకరిస్తే దీన్ని స్వాతంత్ర్య కాముకుడైన ప్రతి భారతీయుడు బలపరుస్తాడు. ఇండియాను విభజించమని బ్రిటిష్ ప్రభుత్వాన్ని ప్రాధేయపడడం మానెయ్యాలి. స్వాతంత్ర్యాన్ని అభిలషించే భారతీయు లందరితో భుజం భుజం కలిపి ముందు భారత స్వయంనిర్ణయాధికారానికి పోరాడాలి. బ్రిటిష్‌ప్రభుత్వాన్ని నమ్ముకొని కూర్చుంటే, వచ్చేది స్వయంనిర్ణయాధికారం కాదు. కొత్తరూపంలో మళ్ళీ బానిసత్వమే సిద్ధిస్తుంది. హిందూ మహమ్మదీయ సమిష్టి పోరాటంద్వారానే స్వతంత్ర భారతదేశంలో స్వతంత్ర ముస్లిం మెజారిటీ ప్రాంతాలను సంపాదించుకోగలం.

4. కాంగ్రెసు లీగుల్లో ఉన్న నిజమైన ప్రజాస్వామిక వాదులు ఇంకా ఈ విషయాన్ని గురించి నోరు మెదపటల్లేదు. వారి కండ్లముందే మారిపోతూఉన్న పరిస్థితుల్ని వారు చూడకుండా ఉంటల్లేదు. కాని పాపం వారేమి చేస్తారు ? వారి సంస్థల్లో కులతత్వవాదుల ప్రాబల్యం ఎక్కువైపోయింది. జమీందార్ల, పెట్టుబడిదార్ల పలుకుబడి నానాటికి పెరిగిపోతూ ఉంది. నిజమైన ప్రజాస్వామికవాదులు నిస్సహాయస్థితిలో పడిపోయ్యారు.

హిందూదేశభక్త కుటుంబాల్లో పుట్టిన కమూనిస్టులు ముస్లిం వ్యతిరేక ప్రచారాన్ని ఏవిధంగా ఎదుర్కొంటారో, భారతస్వాతంత్ర్యం కోసం ఎంత నిజాయితీగా పోరాడుతూ ఉంటారో సోదర కాంగ్రెసు వాదులు గమనించాలి. ముస్లిం దేశభక్తకుటుంబాల్లో బుట్టిన కమ్యూనిస్టులు ముస్లిం మతపిచ్చను ఏవిధంగా ఎదుర్కొంటారో, 'ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు స్వయంనిర్ణయాధికారం కావాలంటే ముందు భారత స్వాతంత్ర్యంకోసం భారతీయుల మందరం కలసి పోరాడాలి' అని ఎంతతీవ్రంగా ప్రచారంచేస్తూ ఉంటారో లీగుసోదరులు గమనించాలి. ఉభయపార్టీల్లో ఉన్న న్యాయసమ్మతమైన హక్కులకోసం అందరం కలసి పోరాడాలి. అలా గాని పక్షంలో మనఅందరికీ మళ్ళీ బానిసత్వమే గతి అవుతుంది.

కాంగ్రెసు లీగులతో మాకెన్ని అభిప్రాయ భేదాలున్నా కాంగ్రెస్ లీగులు మాపార్టీయెడల యెట్టి వైఖరి నవలంబించినా, మేముమాత్రం మా పార్టీ గౌరవాన్ని మాపార్టీ జెండాను రక్షించుకోవడంకోసం ఎంతతీవ్రంగా పోరాడుతామో అంతతీవ్రంగా కాంగ్రెసు లీగుకోరే న్యాయసమ్మతమైన హక్కుల్ని గాపాడడానికి ఒకళ్ళమీద ఒకళ్ళు కొనసాగించే దుష్ప్రచారాన్ని అరికట్టడానికికూడా అదేవిధంగా పోరాడుతాం. మన జాతీయ జీవితంలో ఇలాంటి అపూర్వ సంఘటన ఇంతకుపూర్వం ఎప్పుడూ జరిగియుండలేదు. మా ప్రయత్నం వృధాగాపోయ. పోవటల్లేదుకూడాను. ఉభయసంస్థల్లోను ఉన్నఉత్తమ సాంప్రదాయాల్ని కాపాడడానికి మేము కృషిచేస్తున్నాం. ఈవిషయాన్ని కాంగ్రెసు లీగుసభ్యులు కొందరు ఇదివరకే గుర్తిస్తున్నారు. ఇంకా మేము తీవ్రంగా కృషి చేసినకొలదీ మిగతా కాంగ్రెసు లీగు సభ్యులుకూడా మమ్మల్ని నిజమైన తమ సోదరులుగా భావిస్తారు. మేముసూచించే మార్గమొక్కటే అనుసరణ యోగ్యమైనదవి గ్రహిస్తారు. అంతిమ పోరాటాన్ని జయప్రదంగా కొనసాగించడానికి ఈనాడు విప్లవ కార్యక్రమం ఎంతోఅవసరం. కాంగ్రెసు లీగు సంస్థలను మా సోదర సంస్థలుగా భావించుకుంటున్నాం. భారతీయులందరికి సమానంగా న్యాయం జరగాలని విజ్ఞప్తి చేస్తున్నాం. రాజకీయ వాతావరణమంతా దూషణ ప్రతిదూషణలతో కలుషపూరితమై పోకుండా నిజాన్ని రుజువు చేయడానికి ఓర్పు వహించి పనిజేస్తున్నాం. విప్లవావశ్యకతను గుర్తించాం కాబట్టే ఈ విధంగా చేయగలుగుతున్నాం.

భారత కమ్యూనిస్టులమైన మేము మన ప్రజలు సాగించిన బ్రహ్మాండమైన స్వాతంత్ర్యోద్యమాల్లోనే జన్మించాం. "భారత స్వాతంత్ర్యం అంటే భారత ప్రజలందరి స్వాతంత్ర్యం" అనే నినాదాలతో ముందుకు సాగిపోతున్నాం. ఈనినాదంతో స్వాతంత్ర్యాగ్నిని ఇంకా తీవ్రంగా ప్రజ్వరిల్ల జేస్తున్నాం. స్వాతంత్ర్యాభిలాష ఇదివరకు మన ప్రజల్లో ఉండనే ఉంది. ఇప్పుడు కావలసిందల్లా స్వాతంత్ర్య పోరాటశక్తుల్లో ఐక్యత. ఈ నినాదాన్ని అంగీకరించడంద్వారా స్వాతంత్ర్య శక్తులన్నీ కలిసి పని



చేయడానికి ఒక చక్కని అవకాశం కలుగుతుంది. 'జెహాద్'లో మన పూర్వీకులైన మహమ్మదీయులు ఎంత గట్టి పట్టుదలతో తీవ్రంగాపోరాడేవారో 'ధర్మయుద్ధం'లో హిందూ యోధులు తమ ప్రాణాన్నికూడా తృణప్రాయంగా ఎంచి ఎటువంటి అసమాన ధైర్యసాహసాలు ప్రదర్శించేవారో టెర్రరిస్టులు ఎటువంటి వజ్ర సంకల్పంతో తమ లక్ష్యాన్ని సాధించడానికి అహోరాత్రాలు కృషిచేశారో, క్రిందటిసారి జరిగిన భారత విప్లవంలో ఎటువంటి అద్భుతమైన అపూర్వ ధైర్య త్యాగాలు ప్రదర్శించబడినవో; అటువంటి మహత్తర శక్తులన్నిటినీ సమీకరించి అంతిమ పోరాటానికి ఆయత్తం గావాలి. బ్రిటిష్ ప్రభుత్వాన్ని నిర్మూలించి స్వతంత్ర భారత ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించాలి.

మనం స్వతంత్రంగా జీవించాలన్నా, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల వన్నాగాన్ని భగ్నంచేయాలన్నా, మన భవిష్యత్తును మనమే నిర్ణయించుకోవాలన్నా, కాంగ్రెసు లీగునాయకుల్లో నేడు ఎన్ని అభిప్రాయ భేదాలున్నా సరె భారతీయులందరం ఏకమై వెంటనే అంతిమపోరాటాన్ని సాగించాలి.

స్వాతంత్ర్యాన్ని సాధించడానికి వెంటనే ఆచరణ యోగ్యమైన, న్యాయసమ్మతమైన మా పార్టీ ప్రణాళికను స్వాతంత్ర్య కాముకులైన మీ ముందు ఉంచుతున్నాం. స్వతంత్ర భారతదేశంలో మన పల్లెలు పట్టణాలు విద్యావిజ్ఞానాలతో, పాడిపంటలతో, సిరిసంపదలతో తులదూగుతూ కళకళలాడుతూ ఉండాలంటే వెంటనే ఎటువంటి కార్యక్రమాన్ని అవలంబించాలో మా ఎన్నికల ప్రణాళికలో వివరంగా తెలియజేశాం. సంఘటిత కార్మికవర్గం విప్లవభావ ప్రపూరితులైన మధ్యతరగతి యువకులతో చేయి చేయి కలిపి అధికలాభపరుల దోపిడీ విధానాన్నుంచి పట్టణ ప్రజలను కాపాడాలి, ప్రజలరక్తాన్ని పీల్చిపిప్పిజేసి కరువుల్ని తెచ్చిపెడుతూ ఉన్న జమీందార్లనీ, షాహుకార్లనీ, తిండిదొంగల్నీ నిర్మూలించేఅందుకు సంఘటిత రైతుసంఘం గ్రామాల్లో ఉండే మధ్యతరగతి యువకులతో భుజంభుజంకలిపి పోరాడాలి, సర్వసౌఖ్యాల వాలంగా ఉండే గ్రామసీమల్ని నిర్మించుకోవాలి. తమ ఇష్టంవచ్చిన స్వాతంత్ర్యాన్ని నిర్మించుకోడానికి.

తమబిడ్డలు సౌఖ్యప్రదమైన జీవితాల్ని గడపడానికి, ప్రజలు కోరే న్యాయమయినహక్కుల్ని అంగీకరించి, స్వాతంత్ర్య పోరాటంలో వారిని కార్యోన్ముఖులుగా చేయడమే మాపార్టీ ప్రధానాశయం.

దేశంకోసం, మాతృభూమికోసం. తనపట్టణంకోసం. తనపల్లెకోసం తన స్వాతంత్ర్యంకోసం తన జీవితంకోసం సత్సాంప్రదాయాలు కలిగిన ప్రతి భారతీయుని హృదయం ఆరాట పడాలి.

పూర్వపు ఔన్నత్యానికి అనుగుణ్యంగా నడుచుకొనే ప్రతి భారతీయుణ్ణి ఈ మా విజ్ఞప్తి తప్పకుండా ఆకర్షిస్తుంది. స్వకీయ జీవితాన్ని అధికంగా ప్రేమించినకొలదీ ప్రతి భారతీయుడు తన ఉజ్వల భవిష్యత్తుకోసం తన బిడ్డల భవిష్యత్తుకోసం, తప్పకుండా పోరాడతాడు.

సాతంత్ర్య సైనికుడైన ప్రతి భారతీయుడు తన గత చరిత్రను ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకోవాలిసిందనీ, ఇన్నాళనుంచి కష్టపడి నిర్మించిన ఈ మహత్తర ఉద్యమాన్ని మనమే మన చేతులారా నాశనం చేయగూడదని హృదయపూర్వకంగా విజ్ఞప్తిచేస్తున్నాం. మనపూర్వపుఔన్నత్యానికిమనం ఇంకా మెరుగుబెట్టాలి, రాబోయే తరంవారికి ఆదర్శప్రాయంగా ఉండాలి.

మనలో మనకు అంతర్యుద్ధం తగదనీ అందరం కలసి ఏకధాటిగ బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదుర్కోవాలనీ, మాపార్టీ హెచ్చరిస్తూఉంది. లొంగుబాటు స్వభావాన్ని మాపార్టీ తీవ్రంగా ఎదిరిస్తుంది.

ఈ భారతీయు లందరికి న్యాయం జరగాలనీ, పరమ పవిత్రమయిన భారత విప్లవ కార్యక్రమంలో భారతీయులందరూ కలసిమెలసి కదలి ముందుకురావాలనీ మాపార్టీ పిలుపు ఇస్తూవుంది,

సత్వరస్వరాజ్యసిద్ధికోపం, మన బిడ్డల యోగక్షేమాలకోసం, స్వాతంత్యపోరాటంలో తమ ప్రాణాల్ని సైతం బలిబెట్టిన విప్లవయోధుల పేరిట అంతిమపోరాటానికి కదలిరావాలిసిందని సోదర భారతీయులందర్నీ మా పార్టీ ఆహ్వానిస్తూఉంది.

ప్రజాశక్తిప్రెస్, మొగల్రాజపురం, బెజవాడ - కె. 13/సి. 10000 — 28—8—46

# కాంగ్రెసు - లీగ్ - కమ్యూనిస్టు ఐక్యతకు కమ్యూనిస్టుపార్టీ నూతనపంథా

దేశభక్తియుత సంస్థల్లో కాంగ్రెసు తలమానికము. దేశానికి త్వరలో స్వాతంత్ర్యం చేకూర్చి, విజయపరంపరలు సాధిస్తున్న ప్రపంచ ప్రజాశక్తులతో మనకు గాఢమైత్రిని కుదర్చగల చక్కని ప్రజాస్వామ్య కార్యక్రమాన్ని నిర్ణయించి, కాంగ్రెసు నాయకవర్గం యావద్భారతజాతిని ముందుకు నడుపుతుందని కమ్యూనిస్టులం కొండంత ఆశతో యెదురు చూశాం. గత మూడేళ్ళలోను మేము ముఖ్యంగా ఈ నాయకుల విడుదల కోసమే ఆందోళనచేస్తూ వచ్చాం. వీరిని జైళ్ళలో మ్రగ్గజేసి, ప్రతిష్టంభనను కొనసాగిస్తూవచ్చిన సామ్రాజ్యవాద ప్రభుత్వాన్ని తూర్పారబడుతూ ప్రచారం చేశాం.

ఈ మూడేళ్ళలో పడినన్నిబాధలు భారతప్రజ యిదివరకెన్నడూ అనుభవించలేదు। దుర్భరమైన యీ కష్టసముద్రంలోనుంచి తమను ఒడ్డు జేరుస్తారని కాంగ్రెసు నాయకులవంక దీనంగా చూచారు ప్రజలు.

దేశంయొక్క ఆర్థిక జీవనం నామరూపాలు లేకుండా ఛిన్నాభిన్నమయే ప్రమాదం నేడు కలిగినంతగా ఇదివరకెన్నడూ కలుగలేదు. సుస్థిరమైన కొత్తపునాదులమీద దీనిని పునర్నిర్మించవలసిన ఆవశ్యకత ఈనాడు యెంతోవుంది. దీనిని నెరవేర్చడానికి తగిన అవకాశాలుగూడ నేడున్నంతగా యిదివరకెన్నడూ లేవు.

రాజకీయ నిస్పృహ, నిరాశ ఈనాడు అలుముకున్నంతగా ఇదివరకెన్నడూ అలముకొనలేదు; మరోవైపు ప్రజాసామాన్యంలో రాజకీయాలపై నేడున్నంత శ్రద్ధ మునుపెన్నడూ చూచియెరుగం.

ప్రతిష్టంభనకు సంబంధించిన చిక్కుసమస్యల నన్నిటినీ ధైర్యంగా యెదుర్కొని, దేశస్వాతంత్ర్యాన్ని సాధించి, ప్రజాస్వామిక భారతదేశాన్ని

నిర్మించవలసిన ఆవశ్యకత మన జాతీయోద్యమ చరిత్రలో నేడున్నంత యెక్కువగా మునుపెన్నడూ లేదు.

## అహంకారం

కాంగ్రెసు నాయకవర్గంపై ఇంత మహత్తర కార్యభారంఉంది. యదార్థ పరిస్థితులను గమనించి, బుద్ధికుశలతనంతా వినియోగించి, ఆలోచించవలసిన బాధ్యత యింతగావుంది. కాని విడుదలై వచ్చిన కాంగ్రెసు నాయకవర్గం ఈ కార్యభారాన్ని గుర్తించలేదు; ఆలోచనకు పూనుకోలేదు. సంకుచితబుద్ధితో తనకున్న అహంకారాన్ని ప్రదర్శించింది. సామ్రాజ్య వాదులు తెచ్చిపెట్టిన ప్రతిష్టంభనలో మూడేళ్లుగ తల్లడిల్లిన దేశానికి తిరిగి నిర్మాణాత్మకమైన కార్యక్రమమిచ్చి, ముందుకు నడుపగల మహదవకాశం ఎ. ఐ. సి. సి. సమావేశంలో కలిగింది.

కాని, అక్కడ కాంగ్రెసు నాయకవర్గం చేసిందేమిటి? భారత స్వాతంత్ర్యాన్ని సాధించేమార్గం చూపలేదు. పైగా స్వాతంత్ర్యాన్ని చేకూర్చ గల శక్తుల్ని మరింత చీలదీసి, చిన్నాభిన్నం చేయగల పంథాను కాంగ్రెసు మహాసంస్థ నెత్తిపై రుద్దారు.

ఈ మూడేళ్ళలో కాంగ్రెసు చాల బలపడింది. ఎవ్వరూ కాదనలేరు. కాని లీగుబలంకూడా ఈ కాలంలో వృద్ధిపొందింది. దాని బలాన్ని చిలవలు పలవలుగ చిత్రించి, దీనిబలాన్ని గుర్తించకపోవడం గుడ్డితనం.

కాంగ్రెసు లక్ష్యం యావద్భారతదేశ స్వాతంత్ర్యం. ముస్లిం జన్మభూముల స్వాతంత్ర్యం లీగు ఆశయం. భారతదేశానికి స్వయంనిర్ణయాధికారాన్ని ఇవ్వవలసిందని ఒకవైపు బ్రిటిష్‌వారిని కోరుతూ; మరోవైపు ఆ హక్కునే కోరుతూన్న ముస్లింసోదరుల వాంఛను కాలదన్నడం అన్యాయం. కాంగ్రెసు ఒక మతసంస్థ కాదనేమాట నిజమే. కాని ముస్లిం ప్రజల్లో అత్యధికభాగం లీగును మాత్రమే తమ జాతీయ సంస్థగా గుర్తిస్తున్నారు. దీనిని గమనించక, లీగును ఒక మతసంస్థగా ఆడిపోస్తూంది కాంగ్రెసు. అదేసమయంలో కాంగ్రెసు ముస్లింలు కూడా ఎక్కువగా

లీగులో చేరిపోతున్నారు. పరిస్థితుల పోకడను గుర్తించకపోవడం తెలివితేటలకు చిహ్నంకాదు.

భారత స్వాతంత్ర్యం అనే మంత్రాన్ని వల్లిస్తూ కాంగ్రెసు నాయకవర్గం ముస్లింసోదరుల స్వేచ్ఛను అరికడుతూంది। జాతీయైక్యత పేరుచెప్పి రెండు ప్రధాన రాజకీయసంస్థలను ఎడమొగం పెడమొగం చేస్తూంది. మున్ముందు జాతీయైక్యతను నిర్మించాలంటే, అందుకు మార్గం ఈనాడు వున్న చీలికలను మరింత తీవ్రంచేయడం కాదు।

## అన్నదమ్ములను చీలదీయడం

లీగ్‌తో ఇక మాకేలాంటి పనిలేదని కాంగ్రెసు నాయకవర్గం అంటున్నది. అంటే భారత స్వాతంత్ర్యంకోసం జాతీయైక్యతను నిర్మించవలసిన పవిత్రబాధ్యతను కాలదన్నిందన్నమాట। సర్దార్ పటేల్, పండిత నెహ్రూ లీగ్‌పై యుద్ధం ప్రకటించారంటే, హిందువుల్ని - ముస్లింలను రెండు శతృశిబిరాలుగ చీలదీస్తున్నారన్నమాట। లీగ్ మెడలు విరచడానికి కాంగ్రెసునాయకులు బ్రిటిషు ప్రభుత్వ సహాయాన్నర్థిస్తున్నారంటే, బ్రిటిషు సామ్రాజ్యవాదుల వలలో పడుతూ భారత స్వాతంత్ర్యాన్ని వాయిదా వేయటానికి అవకాశం కలిగించుతున్నారన్నమాట.

మన అంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోమని బ్రిటిష్ సామ్రాజ్యవాదుల్ని బొట్టుపెట్టి పిలవడం దేశభక్తి అనిపించుకుంటుందని మేము అనుకోము. ఇది భారత స్వాతంత్ర్యానికి దారితీయదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తాము తయారుచేసిన కూష్మాండు ప్లానును మనపై బలవంతంగా రుద్దడానికే అవకాశం కల్గిస్తూంది.

జాతీయైక్యత పేరుచెప్పి ముస్లిం సోదరులపై ధ్వజమెత్తడము సరియైన పని అని మేము అనుకోము. ఈ పంథా అంతర్యుద్ధాన్ని రెచ్చగొడుతుందేగాని, ఐక్య భారతరాజ్యాంగానికి ఎంతమాత్రము దారితీయదు.

## కమ్యూనిస్టుపార్టీపై కత్తి దూశారు

కాంగ్రెసు నాయకవర్గం ఈ విధంగా లీగువైపు పెడ మొగం తిప్పింది. కాంగ్రెసు ఫాసిస్టు అనుకూలసంస్థ అని ఈమూడేండ్లు సామ్రాజ్య

వాదులు ఇంటాబయటా సాగిస్తూవచ్చిన విషప్రచారాన్ని ఎదుర్కొన్న మా పార్టీపైకూడ కత్తిదూసింది. ప్రతిష్టంభననుకొనసాగించి ప్రజలస్వాతంత్ర్య వాంఛను ప్రతిఘటిస్తూవచ్చిన అభివృద్ధి నిరోధకశక్తుల్ని తూర్పార బట్టిన మాపైన కాంగ్రెసు నాయకత్వం యుద్ధం ప్రకటించింది.

జైళ్ళలో ఉన్నంతకాలం ఆగస్టు ఘటనలకు బాధ్యత తమదికాదని వెలుగెత్తిచాటారు ఈ కాంగ్రెసు నాయకులు. ఆ ధోరణిలోనే బ్రిటిష్ వైస్రాయితో ఉత్తరప్రత్యుత్తరాలుకూడా సాగించారు. జైల్లోనుంచి బయటికి వచ్చిరావడంతోనే ఈ ధోరణిని మార్చారు. ఆ ఆగస్టు ఘటనలకు "ఆగస్టు పోరాటం" అని ముద్రవేసి, దానిలో పాల్గొననందుకు మమ్మల్ని ఖండించ నారంభించారు. ఈ విషయంలో మా వాదనను వినవలసిన పనే వారికి అక్కరలేక పోయింది. ఇది, నీతి నియమంలేకుండా ఏ యెండకు ఆ గొడుగుపట్టే తత్వము అని మేము ఖండిస్తే, తప్పని ఎవరనగలరు!

ఈ మూడేళ్ళలో జరిగిన విషయాలను యధాతథంగా పరిశీలించి, ఆ యా పార్టీలనుగురించి, గ్రూపులను గురించి వాస్తవిక దృష్టితో తగు నిర్ణయాలకు రాడానికి పూనుకోకుంటున్నారు కాంగ్రెసునాయకులు. ఫాసిస్టు పెనుభూతం ఇంటిగుమ్మంవరకు వచ్చిందన్న విషయాన్ని విస్మరిస్తున్నారు. విధ్వంసక కార్యక్రమం ఊసే ఎత్తడంలేదు. పరాయిప్రభుత్వంపట్ల ద్వేషం కొద్దీ స్వాతంత్ర్యారాధకులైన ప్రజలు జరిపిన పోరాటంగా ఆగస్టు ఘటనల్ని స్తుతిస్తున్నారు. ఈ పోరాటంలో పాల్గొనకుండా "అవతలపక్షం"తో చేరినవారినిగా మమ్మల్ని ఆడిపోస్తున్నారు. ఈ మూడేళ్ళ చరిత్ర తామూహించుకున్నట్టిదే అయివుంటే, మేము నిలువ నీడలేకుండా అంతరించిపోయేవారమని, ఈ నాడు మమ్మల్ని గురించి తామంతగా గొంతుచించుకోవలసిన అవసరమే ఉండేదికాదని, వీరిబుద్ధికి తట్టడంలేదు.

గత మూడేళ్ళలో కొందరు బాహాటంగా జపాను అనుకూల ప్రచారం చేశారు; మరి కొందరు విధ్వంసక కార్యక్రమాన్ని కొనసాగించారు. దేశభక్తితోనే ఇదంతా చేశారని కాంగ్రెసు నాయకులు వారిని సమర్థించారు. కొందరికి స్తోత్రపాఠాలు పాడారు; మరి కొందరిపై తీర్పుచెప్ప నిరాకరించారు. వారిపట్ల ఇంత ఆదరణచూపిన ఈ నాయకులే మా విషయంలో



ఎలా ప్రవర్తించారు? మాకు కూడా దేశభక్తి ఉండవచ్చుననీ, మా ఉద్దేశాలుకూడా దేశభక్తి పూరితములే కావచ్చుననే సందేహమైనా వారికి తట్టకపోయింది. ఈ దృష్టితో మమ్మల్ని పరిశీలించ నిరాకరించింది కాంగ్రెసు నాయకవర్గం! ప్రపంచంలోని అభివృద్ధి నిరోధకశక్తులు తమ తమ దేశాల్లో కమ్యూనిస్టుల మీద ఏ ఆరోపణలయితే చేస్తున్నారో, ఆ ఆరోపణలనే మాపైని కూడా చేశారు కాంగ్రెసు నాయకులు. ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం అనే పేరుతో రష్యా లాభంకోసమే మేము కృషి చేస్తున్నామట! దేశ రక్షణను భగ్నంచేసే విధ్వంసక కార్యక్రమాన్ని మేము ప్రతిఘటించింది బ్రిటిష్‌వారి యుద్ధ ప్రయత్నాలను బలపర్చడం కోసమేనట!

## దుష్ఫలితాలు

పరస్పర వైరుధ్యాలతో కూడుకున్న 1942 ఆగస్టు తీర్మానం జాతీయ ప్రభుత్వాన్ని తెచ్చిపెట్టలేదు సరికదా, కనివిని ఎరుగని అవమానాలను వర్షంగా కురిపించింది. ఈ విషయాన్ని గుర్తింప నిరాకరిస్తున్నారు కాంగ్రెసు నాయకులు. ఆ విధానం ఫలించకపోవడానికి కారణం మేమేనని సాకుచెప్పి, మా మీద తమ అక్కసునంతా వెళ్ళగ్రక్కుతున్నారు. మా పార్టీ పట్ల ఈ గుడ్డిద్వేషం అప్పుడే మూడు దుష్ఫలితాలకు దారితీసింది.

ఒకటి - ఇతర దేశాల్లోని మనమిత్రులు దిగ్భ్రాంతి చెందారు. ఎందువల్ల? ఈనాడు ప్రపంచంలో స్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వామ్యాన్ని సుస్థిరంగా నెలకొల్పుతూన్న శక్తుల్లో ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం అన్నిటికన్నా బలమైనది. కాంగ్రెసు నాయకవర్గం దానిమీదనే దాడి ప్రారంభించింది.

రెండవది - కాంగ్రెసు మహాసంస్థలో ఫాసిస్టు అభివృద్ధి నిరోధక తత్వాలూ, నియంతృత్వ పోకడలూ పడగలెత్తనారంభించాయి. అధికారం కోసం పెనుగులాటా, ముఠాలు కట్టడం ప్రారంభమయింది. ఈ కుళ్ళంతా కప్పిపుచ్చడానికి కమ్యూనిస్టు వ్యతిరేకతను ఉపయోగిస్తున్నారు.

మూడవ దుష్ఫలితం - సాధారణ కాంగ్రెసు సభ్యుల్లో అయోమయావస్థ అలముకుంది.

కాంగ్రెసు నాయకులు తమ వెనుకటి విధానాన్ని ఆత్మవిమర్శక దృష్టితో పరిశోధించి, నేటి పరిస్థితుల కనుగుణ్యమైన నూతన విధానాన్ని సూచించి, కాంగ్రెసులోని ఇతర గ్రూపులన్నీ దానిని నిష్పక్షపాత దృష్టితో పరిశీలించి, తగు సలహాలివ్వమని కోరడం సరియయిన మార్గం కాని, అలా చేయక, ఈ నాయకవర్గం మా పార్టీనోటికి తాళంవేయ జూస్తూంది. మా పార్టీవారు సాధారణ సభ్యులుగా ఉండవచ్చునుగాని, నిర్ణయాధికారాలు గల సంఘాలకూ, బాధ్యతగల పదవులకూ ఎన్నుకోబడ కూడదనీ వారుచేసిన తీర్మానంయొక్క భావం.

ఈ విషయంలో కాంగ్రెసు నాయకులు బ్రిటిష్ లేబరుపార్టీయొక్క అభివృద్ధినిరోధక మార్గాన్ని అక్షరాల అనుకరిస్తున్నారు. లేబరుపార్టీ కార్యనిర్వాహకవర్గాల్లో కమ్యూనిస్టులుండగూడదని ఆ నాయకవర్గం ఒకనీచమైన నిర్ణయం చేసింది. ఈనాడు కాంగ్రెసు నాయకులు గూడా అల్లాంటి విధానాన్నే అనుసరిస్తున్నారు. కాంగ్రెసు సభ్యుల్లోనే ఈనాయకులకు నమ్మకం లేకుండా పోయింది; జాతీయసంస్థలో ఒకభాగంగా ఉన్నవారికే సామాన్య ప్రజాస్వామిక హక్కులను నిరాకరిస్తున్నారీ నాయకులు!

అంతటితో ఆగలేదు, పోటీ సంఘాలకు ప్రోత్సాహం వీరు. విద్యార్థి, రైతు, కార్మిక రంగాల్లో చీలికలుతెచ్చి పోటీసంఘాలు పెట్టడానికి ప్రయత్నిస్తున్నవారికి మద్దతు నిస్తున్నారు. ఈ ప్రయత్నాలు చేస్తున్నవారెవరు? దొంగవర్తకుల, తిండిదొంగల ఏజంట్లు. లేదా కార్మిక కర్షక వాదులుగా ఒకప్పుడు వెలిసి, తరువాత నిజస్వరూపాలు బయటపడగా వెనుకటి ప్రతిష్ఠను కోల్పోయి, తిరిగి ఈనాడు కాంగ్రెసు బురఖాతో చెలామణీ కావడానికి తంత్రాలు పన్నుతున్న ఘనులు.

కాంగ్రెసు - లీగు విభేదాలు హెచ్చు పెరిగిపోతూంటే మాపార్టీ చూస్తూ ఊర్కోదు; ఒకదానికి వ్యతిరేకంగా మరొకదాన్ని బలపరచి, అంతర్యుద్ధాన్ని రెచ్చగొట్టదు. స్వాతంత్ర్య సాధనకొరకు ఈ రెండింటిమధ్య



ఐకమత్యాన్ని కుదర్చడానికి మాపార్టీ తన శక్తినంతటినీ వినియోగిస్తుంది. ఎడతెగకుండ విషపు ప్రచారం జరుగుతూంటే వింటూ ఊర్కోదు. స్వాతంత్ర్యోద్యమ నావను నట్టేట ముంచబోతూన్న నాయకవర్గంయొక్క నిర్బంధాలకు, నిషేధాలకు తలవొగ్గి మా పార్టీ ఊర్కోదు!

పదవీ అన్వేషణమే వృత్తిగా పెట్టుకొన్న పెద్దమనుష్యులు వచ్చి ఉజ్వలమైన రైతు, కార్మిక ఉద్యమాలను విచ్ఛిన్నం చేయకుండా మాపార్టీ కాపాడుతుంది. మా యువక జీవితాన్నంతా ధారపోసి ఈ ఉద్యమాలను నిర్మించాం; ఈ రైతుసంఘాలు, ఈ కార్మికసంఘాలు హిందూ, ముస్లిం ప్రజల సంఘ భవిష్యత్ ప్రజాస్వామిక వ్యవస్థకు పట్టుగొమ్మలు. వాటిని విచ్ఛిన్నం కానివ్వం. ముమ్మాటికీ కానివ్వం!!

## మా నిర్ణయము

కాంగ్రెసు నాయకవర్గం ప్రస్తుతం అనుసరిస్తున్న లీగు వ్యతిరేక, కమ్యూనిస్టు వ్యతిరేకపరథా అంతర్యుద్ధాన్ని, వర్గపోరాటాన్ని ప్రేరేపిస్తుందనీ; దేశాన్ని అధోగతి పాల్జేస్తుందేగాని, స్వాతంత్ర్యానికి దారితీయదనీ కమ్యూనిస్టులం భావిస్తున్నాం.

ఇలాంటి విధానాన్ని కొనసాగించడానికి బదులు, దానిపట్ల మా వ్యతిరేకతను సుస్పష్టం చేయడమే మా ప్రధాన కర్తవ్యంగా గణిస్తున్నాం. కాబట్టి, మా పార్టీసభ్యుల నందరినీ కాంగ్రెసు సభ్యత్వానికి రాజీనామా నివ్వవలసిందని ఆదేశిస్తున్నాం. ఏ.ఐ.సి.సి.లోని కమ్యూనిస్టు సభ్యులు మాత్రం ఇప్పుడు రాజీనామా నివ్వరు. మా పార్టీపై వర్కింగు కమిటీ తెచ్చిన అభియోగాలకు వారు జవాబు చెప్తారు. వర్కింగుకమిటీ యొక్క తీర్పు కొరకు నిరీక్షించుతారు. గడచిపోయిన విషయాలను గురించి వర్కింగు కమిటీ అభిప్రాయాలను తెలుసుకోవడం ముఖ్యం. మన జాతీయోద్యమం యొక్క భవిష్యత్తులో వాటికి ప్రధానస్థానముంది.

ఈవిషయానికి సంబంధించిన పత్రాలన్నీ మరో పదిహేను రోజుల్లో ప్రచురించబడతాయి. వాటిపై ప్రజలే తీర్పుచెప్పగలరు. ప్రస్తుత పరిస్థితుల్లో మేము తీసుకున్న నిర్ణయమే కాంగ్రెసుకీ మాకూ కూడా శ్రేయోదాయక

మూడవ దుష్ఫలితం - సాధారణ కాంగ్రెసు సభ్యుల్లో అయోమయావస్థ అలముకుంది.

కాంగ్రెసు నాయకులు తమ వెనుకటి విధానాన్ని ఆత్మవిమర్శక దృష్టితో పరిశోధించి, నేటి పరిస్థితుల కనుగుణ్యమైన నూతన విధానాన్ని సూచించి, కాంగ్రెసులోని ఇతర గ్రూపులన్నీ దానిని నిష్పక్షపాత దృష్టితో పరిశీలించి, తగు సలహాలివ్వమని కోరడం సరియయిన మార్గం. కాని, అలా చేయక, ఈ నాయకవర్గం మా పార్టీనోటికి తాళంవేయ జూస్తూంది. మా పార్టీవారు సాధారణ సభ్యులుగా ఉండవచ్చునుగాని, నిర్ణయాధికారాలు గల సంఘాలకూ, బాధ్యతగల పదవులకూ ఎన్నుకోబడ కూడదనీ వారుచేసిన తీర్మానంయొక్క భావం.

ఈ విషయంలో కాంగ్రెసు నాయకులు బ్రిటిష్ లేబరుపార్టీయొక్క అభివృద్ధినిరోధక మార్గాన్ని అక్షరాల అనుకరిస్తున్నారు. లేబరుపార్టీ కార్య నిర్వాహకవర్గాల్లో కమ్యూనిస్టులుండగూడదని ఆ నాయకవర్గం ఒకనీచమైన నిర్ణయం చేసింది. ఈనాడు కాంగ్రెసు నాయకులు గూడా అల్లాంటి విధానాన్నే అనుసరిస్తున్నారు. కాంగ్రెసు సభ్యుల్లోనే ఈనాయకులకు నమ్మకం లేకుండా పోయింది। జాతీయసంస్థలో ఒకభాగంగా ఉన్నవారికే సామాన్య ప్రజాస్వామిక హక్కులను నిరాకరిస్తున్నారీ నాయకులు।

అంతటితో ఆగలేదు. పోటీ సంఘాలకు ప్రోత్సాహం వీరు. విద్యార్థి, రైతు, కార్మిక రంగాల్లో చీలికలుతెచ్చి పోటీసంఘాలు పెట్టడానికి ప్రయత్నిస్తున్నవారికి మద్దతు నిస్తున్నారు. ఈ ప్రయత్నాలు చేస్తున్నవారెవరు? దొంగవర్తకుల, తిండిదొంగల ఏజంట్లు. లేదా కార్మిక కర్షక నాయకులుగా ఒకప్పుడు వెలిసి, తరువాత నిజస్వరూపాలు బయటపడగా, వెనుకటి ప్రతిష్ఠను కోల్పోయి, తిరిగి ఈనాడు కాంగ్రెసు టురఖాతో చెలామణీ కాడానికి తంత్రాలు పన్నుతున్న ఘనులు.

కాంగ్రెసు - లీగు విభేదాలు పెచ్చుపెరిగిపోతూంటే మాపార్టీచూస్తూ ఊరోపదు। ఒకదానికి వ్యతిరేకంగా మరొకదాన్ని బలపరచి, అంతర్యుద్ధాన్ని రెచ్చగొట్టదు. స్వాతంత్ర్య సాధనకొరకు ఈ రెండింటిమధ్య



ఐకమత్యాన్ని కుదర్చడానికి మాపార్టీ తన శక్తినంతటినీ వినియోగిస్తుంది. ఎడతెగకుండ విషప్రచారం జరుగుతూంటే వింటూ ఊరోకోదు. స్వాతంత్ర్యోద్యమ నావను నట్టేట ముంచబోతూన్న నాయకవర్గంయొక్క నిర్బంధాలకు, నిషేధాలకు తలవొగ్గి మా పార్టీ ఊరోపదు।

పదవీ అన్వేషణమే వృత్తిగా పెట్టుకొన్న పెద్దమనుష్యులు వచ్చి ఉజ్వలమైన రైతు, కార్మిక ఉద్యమాలను విచ్ఛిన్నం చేయకుండా మాపార్టీ కాపాడుతుంది. మా యువక జీవితాన్నంతా ధారపోసి ఈ ఉద్యమాలను నిర్మించాం; ఈ రైతుసంఘాలు, ఈ కార్మికసంఘాలు హిందూ, ముస్లిం ప్రజల సంఘ భవిష్యత్ ప్రజాస్వామిక వ్యవస్థకు పట్టుగొమ్మలు. వాటిని విచ్ఛిన్నం కానివ్వం. ముమ్మాటికీ కానివ్వం ။

## మా నిర్ణయము

కాంగ్రెసు నాయకవర్గం ప్రస్తుతం అనుసరిస్తున్న లీగు వ్యతిరేక, కమ్యూనిస్టు వ్యతిరేకపంథా అంతర్యుద్ధాన్ని, వర్గపోరాటాన్ని ప్రేరేపిస్తుందనీ; దేశాన్ని అధోగతి పాల్జేస్తుందేగాని, స్వాతంత్ర్యానికి దారితీయదనీ కమ్యూనిస్టులం భావిస్తున్నాం.

ఇలాంటి విధానాన్ని కొనసాగించడానికి బదులు, దానిపట్ల మా వ్యతిరేకతను సుస్పష్టం చేయడమే మా ప్రధాన కర్తవ్యంగా గణిస్తున్నాం. కాబట్టి, మా పార్టీసభ్యుల నందరినీ కాంగ్రెసు సభ్యత్వానికి రాజీనామా నివ్వవలసిందని ఆదేశిస్తున్నాం. ఏ.ఐ.సి.సి.లోని కమ్యూనిస్టు సభ్యులు మాత్రం ఇప్పుడు రాజీనామా నివ్వరు. మా పార్టీపై వర్కింగు కమిటీ తెచ్చిన అభియోగాలకు వారు జవాబు చెపుతారు. వర్కింగుకమిటీ యొక్క తీర్పు కొరకు నిరీక్షించుతారు. గడచిపోయిన విషయాలను గురించి వర్కింగు కమిటీ అభిప్రాయాలను తెలుసుకోవడం ముఖ్యం. మన జాతీయోద్యమం యొక్క భవిష్యత్తులో వాటికి ప్రధానస్థానముంది.

ఈవిషయానికి సంబంధించిన పత్రాలన్నీ మరో పదిహేను రోజుల్లో బయటపడతాయి. వాటిపై ప్రజలే తీర్పుచెప్పగలరు. ప్రస్తుత పరిస్థితుల్లో మేము తీసుకున్న నిరయమే కాంగ్రెసుకీ మాకూ కూడా శ్రేయోదాయక

మని చిత్తశుద్ధిగల కాంగ్రెసువాదులందరూ గుర్తిస్తారని నమ్ముతున్నాం. స్వేచ్ఛగా మా పాలసీని కాంగ్రెసువారి ఎదుట, ప్రజలఎదుట పెట్టగల అవకాశం ఈ నిర్ణయంవల్ల మాకు కలుగుతుంది. మూడేళ్ళ అజ్ఞాతవాసం తరువాత కాంగ్రెసు సంస్థకు తానెక్కడున్నదీ గుర్తించుకోగల అవకాశం ఇందువల్ల కలుగుతూంది. "అన్నదమ్ములమధ్య కత్తులు దూసుకోవడం స్వాతంత్ర్య సాధనకు మార్గం ఎలా కాగలదు?" అని కాంగ్రెసు సాధారణ సభ్యులు తమ నాయకులను అడగకుండా ఎంతకాలం పడివుండగలరు?

భారత ప్రజల 'జాతీయైక్య సంఘటన'కు కాంగ్రెసు మహాసంస్థ పునాది కాగలదని మేమూ, ఇతర అభ్యుదయ కాముకులూ కలలుగన్నాం. ఈనాడు కాంగ్రెసు నాయకవర్గం బుద్ధిపూర్వకంగా లీగు వ్యతిరేక, కమ్యూనిస్టు వ్యతిరేక, పంథా ననుసరించడంవల్ల ఈకలలన్నీ కల్లలవుతున్నాయి.

మనదేశం బానిసబంధాల్లో మ్రగ్గుతూన్నంతకాలం దేశంలోని అభివృద్ధికర శక్తులన్నింటియొక్క ఐక్యసంఘటన తప్ప స్వాతంత్ర్య సాధనకు మరో మార్గంలేదు.

## ఐక్యతా సాధనకు

చాల గడ్డుదినాలు మన ముందున్నాయి. ఎలాంటి విషమపరిస్థితులలోనయినా విధి, విరామంలేకుండా కాంగ్రెసు - లీగు; కాంగ్రెసు - కమ్యూనిస్టు ఐక్యతను సాధించడానికే కృషిచేస్తాము. కాంగ్రెసు, లీగు, కమ్యూనిస్టుపార్టీలు ఏకముఖంగా స్వాతంత్ర్య సాధనకు పోరాడేలాచేయడానికే పాటుపడతాం.

కాంగ్రెసు, లీగు సోదరులలో ఉన్న దేశభక్తిపై పూర్తి విశ్వాసం ఉంచే మేమీ ఐకమత్యాన్ని సాధించడానికి నడుంబిగిస్తున్నాం. ఒక పక్షంయొక్క దృక్పధంలో ఉన్న న్యాయాన్ని రెండోపక్షానికి విశదం చేయడం ద్వారా, న్యాయసమ్మతంకాని కోర్కెలను ఏ పక్షంకోరినాసరే ప్రతిఘటించుటద్వారా, మా కర్తవ్య నిర్వహణకు పూనుకుంటాం.

జనసామాన్యం తన విచక్షణాజ్ఞానాన్నుపయోగించి విచ్ఛిన్నకారులను



దేశభక్తిని ఎదురొడ్డి అపోహలను తొలగజేస్తాం.

లీగుతో కాంగ్రెసు, కాంగ్రెసుతో లీగు లేక కాంగ్రెసు - లీగులు కమ్యూనిస్టులతో ఎంతగాపోరాడుతాయో అంతగా బ్రిటిష్ సామ్రాజ్యవాదపు ఉరిత్రాడు మనందరి మెడలకు బిగుసుకుంటుందన్న విషయాన్ని లీగు-కాంగ్రెసు సోదరులు గుర్తించిననాడు మా పాలసీ సరియైనదని రుజువవుతుంది.

## విజయం తప్పదు

ఈ నాడు మాది ఏటికెదురీతకావచ్చు. కాని పరిస్థితులు సుగమం కాగలవనే ధైర్యం మాకుంది.

ఆవేశం ప్రకోపించి హేతుజ్ఞానాన్ని ఎంతకాలం అణచిపెట్టగలదు? పక్షపాతం పొంగిపొరలి ఎంతకాలం దేశభక్తికిస్థానంలేకుండా చేయగలదు?

తలొకదారై ఎంతకాలం పరాయి ప్రభుత్వంక్రింద పడి వుండగలం!

ఈనాటి మా ఉద్బోధను, రేపు అందరూ తమ అనుభవం మీదనే గుర్తిస్తారు! దేశస్థులనందరినీ ఒకే విధంగా కట్టి పీడిస్తున్న బానిసబంధాలను త్రెంచి, అందరి స్వాతంత్ర్యాన్ని సాధించగల జాతీయైక్య 'సంఘటన కోసమే ఇంతవరకు కృషిచేశాం—ఇప్పుడూ చేస్తున్నాం—ఇక ముందుకూడా చేస్తాం! భారత ప్రజలందరికీ స్వాతంత్ర్యాభివృద్ధులను చేకూర్చగల ఉద్యమమిది. దీనిలో ఓటమికి అవకాశంలేదు. ముమ్మాటికి విజయం సాధిస్తాం!

# భారత కమ్యూనిస్టుపార్టీ ఎన్నికల ప్రణాళిక

త్వరలోనే ఎన్నికలు వస్తున్నాయి. వివిధపక్షాలకు చెందిన భారత రాజకీయపార్టీలు వాటివాటి కార్యక్రమాలతో ప్రజలయెదుట నిలబడబోతున్నాయి. కమ్యూనిస్టుపార్టీ తప్ప మిగతా పార్టీలన్నీ, దేశభక్తిని తమ సొంతసొమ్ముగా ప్రకటించుకొంటున్నాయి. తమకుమాత్రమే తెలివితేటలన్నీ ఉన్నట్లు ప్రగల్భాలు కొడుతున్నాయి. స్వాతంత్ర్య సమరాన్ని తమ పార్టీతప్ప మిగతా పార్టీలన్నీ నిరోధిస్తూన్నట్లు ప్రచారం చేస్తున్నాయి. ఓటర్లు తమపార్టీని మాత్రమే గెలిపించి యితర పార్టీలను ఓడించమని

ఇది సరియైన పాలసీ కాదని గొంతెత్తి పలికేది మాపార్టీ ఒక్కటే. మనదేశంలోఉన్న ప్రధాన రాజకీయపార్టీలు ఒకదానిపై మరొకటి కత్తులు దూసుకోవడంవల్ల స్వాతంత్ర్యం మరింత దూరం కావడమే కాకుండా, భారతదేశ భవిష్యత్తు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల అంతిమనిర్ణయంమీద ఆధారపడేలా చేయడమవుతుందని ప్రజలకు కమ్యూనిస్టుపార్టీ చెప్పబోతూంది.

భారతీయుల స్వాతంత్ర్యవాంఛను ఈడేర్చడానికి బ్రిటిష్ ప్రభుత్వమెట్టి ప్రణాళికనూ ప్రకటించలేదు. ఎన్నికలు పూర్తిఅయాక వివిధపార్టీలవారు తమతమ ప్రణాళికలతోవచ్చి సమావేశంలో పాల్గొనవలసి యుంటుందని మాత్రం బ్రిటిష్ పాలకులు తెలియజేశారు.

భావిభారత రాజ్యాంగాన్ని నిర్ణయించవలసిన రాజ్యాంగ నిర్మాణ సభను బ్రిటిష్ ప్రభుత్వం యెలా ఏర్పాటు చేయబోతూందో ఒకసారి పరిశీలిద్దాం. దానికి ఎన్నికలు వయోజనవోటింగు పద్ధతి ప్రకారం జరుగవు. లక్షలాది ప్రజాసామాన్యానికి వోటింగ్ అర్హత ఉండదు. అంతేగాక, దేశావికంతకూ ఒకే రాజ్యాంగ నిర్మాణసభ ఉండడంవల్ల మొత్తం జనసంఖ్యలో హిందువులే మెజారిటీగా ఉండడంవల్ల, దానికి ఎక్కువ మంది ప్రతినిధులు కాంగ్రెసువాదులే ఎన్నుకోబడతారు. ముస్లింలు మెజారిటీగావున్న ప్రాంతాలలో లీగర్లే ఎక్కువగా ఎన్నుకోబడతారు. ఈరెండు సంస్థల నాయకులు ఇప్పుడవలంబించే విధానాన్నే అప్పుడు కూడా అవలంబిస్తే, భారత రాజ్యాంగంయొక్క ముఖ్యసూత్రాల విషయంలో ఉభయుల మధ్య ఏకాభిప్రాయం కుధరదు.

అందువల్ల, పైపద్ధతిప్రకారం ఏర్పరుపబడే రాజ్యాంగ నిర్మాణ సభలో భారత రాజ్యాంగంయొక్క ప్రధాన సూత్రాల్నిగురించి ఏ ఒక నిర్ణయమూ, జరగదు. కాంగ్రెసు ప్రతినిధులు, లీగ్ ప్రతినిధులు ఒకరిపై ఒకరు కత్తులు దూసుకుంటారు. అందువల్ల బ్రిటిషుపాలక వర్గం యీ రెండు పక్షాలమధ్య రాజీకుదర్చడంకోసం ప్రయత్నిస్తూన్నట్లు 'పోజు' చేసుంది. అంతిమ నిర్ణయాధికారం సహజంగా బ్రిటిష్ ప్రభుత్వంచేతుల్లోకి



ఈ మధ్య వేవెల్ ప్రకటించిన ప్రణాళికలోని అంతరార్థం యిదే. భారతదేశంలో రాజకీయంగా కలిగిన అపూర్వ చైతన్యం వల్ల, ప్రపంచమంతటా ప్రజాస్వామ్య శక్తులు విజృంభిస్తూండడం వల్ల, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు సూటిగాను, బహిరంగంగాను భారతదేశానికి స్వాతంత్ర్యమీయమని చెప్పలేరు. ప్రస్తుత పరిస్థితుల్లో భారత రాజకీయపార్టీలొక ఏకాభిప్రాయానికి రాజాలవని వారి దృఢవిశ్వాసం. అందువల్లనే, తాము సొంతంగా తయారు చేసిన రాజ్యాంగచట్టాన్ని భారతదేశంమీద రుద్దగలమనే ధీమా వారిలో బాగావుంది. ఇదీ, ప్రస్తుతం వారవలంబించే విధానం యొక్క రహస్యం.

## కూప్లండ్ స్కీము

కాబట్టి బ్రిటిషసామ్రాజ్యవాదులు భారతదేశంమీద తమ అధికారాన్ని శాశ్వతంగా నిలబెట్టుకోడంకోసం ఒక నూతన రాజ్యాంగ చట్టాన్ని అమలు జరుప నిశ్చయించుకున్నారు. బ్రిటన్-భారతదేశాలమధ్య "ఒడంబడిక" అనే పేరుతో దాని నిజస్వరూపాన్ని కప్పిపుచ్చ దలచుకున్నారు. ఇదీ, త్వరలో జరుగబోయేది!

ఎన్నికలు పూర్తిఅయాక ఏర్పడబోయే రాజ్యాంగ నిర్మాణ సభలో, ఇండియాను ఏక ఖండంగా ఉంచడానికి కాంగ్రెసువారు ప్రయత్నిస్తారు. అందుకు తీవ్రంగా పోరాడుతారు. మరొకవైపు ముస్లింలీగ్, ముస్లింలు మెజారిటీగావున్న ప్రాంతాలన్నింటినీ కలిపి వేరే పాకిస్థాన్ రాజ్యాంగాన్ని నిర్మించ వలసిందని ఒత్తిడితెస్తుంది. ఈ పోరాటంలో ఏపక్షానికి ఆ పక్షం బ్రిటిష్ ప్రతినిధుల సహాయాన్నర్థిస్తుంది.

కాని, ఏ పక్షాన్నీ తాము బలపరచదలచుకోలేదని బ్రిటిష్ ప్రతినిధులంటారు. నిష్పక్షపాతంగా ఉన్నట్లు నటిస్తారు. ఒకరి కోర్కెలు రెండో వారి ఆశయానికి విరుద్ధంగా ఉన్నాయని, అంతర్యుద్ధం ద్వారా తప్ప మరొక పద్ధతివల్ల అవి నెరవేరవనీ - వాదిస్తారు. తాము తయారుచేసిన

అంగీకరిస్తుందంటారు. దాన్ని ఒప్పుకుంటే, అంతర్యుద్ధం రాకుండా సమస్యను పరిష్కరించవచ్చు నంటారు.

ముస్లింలీగ్‌యొక్క పాకిస్తాన్ కోర్కెను యెలా వారు ఈడేర్చ దలచుకున్నారో చూదాం. బెంగాల్‌లోఉన్న హిందువులకు కోపం వస్తుంది గనుక బెంగాల్ అంతటినీ పాకిస్తాన్‌లో చేర్చ నిరాకరించుతారు. పంజాబ్‌లో నివశించే సిక్కులకు కోపం వస్తుంది గనుక పంజాబ్‌లో కొంతభాగంమట్టుకే పాకిస్తాన్‌లోకి వస్తుందంటారు. వారు నిర్ణయించబోయే సరిహద్దులు ముస్లింలీగ్‌కీ అంగీకారంగా ఉండవు; ముస్లిమేతరులకీ అంగీకారంగా ఉండవు. అందువల్ల పాకిస్తాన్ రాజ్యంలో శాశ్వతమైన మైనారిటీ సమస్యను సృష్టించబోతున్నారన్నమాట.

ఇక, కాంగ్రెసు కోరే అఖండ హిందుస్థాన్ కోర్కెను ఎలా యీడేర్చదలచుకున్నారో చూదాం. కేంద్రంలో ఒకే కేంద్రప్రభుత్వం ఉంటుందంటారు.

కాని, వివిధరాజ్యాంగాల రక్షణ సమస్యలను, ఆర్థిక వ్యవహారాలను, సమన్వయంచేయుట కవసరమైన అధికారాలు దానికి చాలతక్కువగా వుంటాయి.

అంతేకాదు. కేంద్ర ప్రభుత్వంలో తమ ప్రయోజనాల రక్షణకై తమ చెప్పుచేతులలో ఉండే సంస్థానాధీశుల ప్రతినిధుల్ని నియమించుతారు. బ్రిటన్ - స్వదేశ సంస్థానాల మధ్య వేరే ఒడంబడికలు చేసుకుంటారు. దీనిఅర్థం, ముందుముందు బ్రిటిష్ సేనలకూ బ్రిటిష్ పెట్టుబడికీ సంస్థానాలే కేంద్రాలుగా ఉంటాయన్నమాట.

ఇదంతా ఒక ఊహా కల్పిత చిత్రంకాదు. ఇదివరకే ప్రొఫెసర్ కూప్లెండ్ ఇట్టి ప్లానుగల భారత రాజ్యాంగ చట్టాన్ని తయారుచేశాడు. దాన్ని సామ్రాజ్యవాదులు మన దేశంమీద రుద్దబోతున్నారు. క్రిప్స్ ఇండియాకు వచ్చినప్పుడు అతనికి కార్యదర్శిగా వచ్చాడు కూప్లెండ్. లండన్‌లో బ్రిటిష్ ప్రభుత్వ యాజమాన్యంక్రింద నడుపబడే ఇండియా ఆఫీసుకు గౌరవ [illegible] తయారుచేసింది



యీ ప్రముఖుడే. వలసదేశాల రాజ్యాంగ సమస్యలపై యితని సలహానే సాధారణంగా తీసుకొంటూ ఉంటుంది బ్రిటిష్ ప్రభుత్వం.

కూప్లెండ్‌స్కీము అమల్లోకివస్తే, కాంగ్రెసుకోరే అఖండ హిందూస్తాన్ రాదు సరికదా, దేశం మూడు భాగాలుగా విభజింపబడుతుంది. ఒక భాగానికీ మరొక భాగానికీవచ్చే తగాదాలలో బ్రిటిష్‌పాలకులదే పైచేయిగా ఉంటుంది. కాంగ్రెసు అధికారంక్రింద హిందూ డొమీనియన్, ముస్లింలీగ్ నాయకత్వంక్రింద ముస్లిం డొమీనియన్, సంస్థానాధీశుల నాయకత్వంకింద సంస్థానాధీశుల కన్‌ఫెడరేషన్ — ఉంటాయి.

ఈ సంస్థానాధీశుల ప్రతినిధులు బ్రిటిష్ ప్రభుత్వంయొక్క కీలుబొమ్మలు.

కాబట్టి, ముస్లింలీగ్ కోరే స్వతంత్ర పాకిస్తాన్‌కాదు లభించేది. బ్రిటిష్ అధికారుల చెప్పుచేతల్లో ఉండే ముస్లిం డొమినియన్ మాత్రమే సిద్ధిస్తుంది.

ఎన్నికలు పూర్తిఅయాక సిమ్లా నాటకమే తిరిగి ప్రదర్శింపబడుతుంది. స్వతంత్ర భారతదేశంయొక్క రాజ్యాంగం యే సూత్రాల కనుగుణ్యంగా ఉంటే మంచిదో వివిధ రాజకీయపక్షాలు ఏకాభిప్రాయానికి రాజాలని పక్షంలో, సామ్రాజ్యవాదులు ఒకకొత్త రూపంలో బానిససంకెళ్ళను తగిలించడానికి నిశ్చయించుకున్నారన్నమాట.

## స్వతంత్ర భారతదేశంలో అందరికీ సమాన స్వాతంత్ర్యం

దేశానికి సంభవింపబోయే యీ మహా ప్రమాదాన్ని తప్పించవలసిన బాధ్యత ప్రజలదేనని ఉత్తేజ పరుస్తుంది మాపార్టీ. విప్లవం కోసం ఎడతెగని కృషిచేసేది మా పార్టీ. అందువల్ల, మేము పైకి కనపడే ఎండమావులన్నీ మంచినీటి సరస్సులేనని మోసపోము. ఒక్కొక్క ఘటనలో, ఒక్కొక్కరి ప్రకటనలో ఎంత యదార్థంఉందో జాగ్రత్తగా మేము పరిశీలిస్తాం. మేమింతవరకు అవలంబించిన రాజకీయ పాలసీ యదార్థ పరిస్థితు [illegible]

ఉదాహరణకు ఆగస్టు 8 వ తేదీని (1942) మేము పోరాటం ప్రారంభించడంవల్ల వచ్చేనష్టాన్ని స్పష్టంగా తెలియజేశాం. మాపాలసీయే సరియైనదని తరువాత జరిగిన ఘటనలు రుజువుచేశాయి.

సిమ్లా సమావేశంలో కాంగ్రెసు నాయకులు, లీగ్ నాయకులు, ఒకరినొకరు విశ్వసించుకోకుండా, వేవెల్ మీదనే విశ్వాసం ఉంచడం వల్ల సమావేశం భగ్నంకాకమానదని మేమొక్కరమే ఖచ్చితంగా చెప్పాం.

తిరిగి మేము యీనాడు చెప్పేదేమంటే : ఎన్నికలు పూర్తిఅయిన తోడనే స్వాతంత్ర్యం ఊడిపడుతుందనే అభిప్రాయం వట్టి భ్రమ. తిరిగి మా అభిప్రాయమే రూఢిఅయి తీరుతుంది.

● మేం కాంగ్రెసు సంస్థనుగాని, ముస్లింలీగ్‌నిగాని ప్రజలయెదుట న్యూనపరచడానికి కాదు ఎన్నికలలో పాల్గొంటున్నది. మమ్మల్ని మేము స్తుతించుకోవడానికి అసలేకాదు. విశాలమైన భారతదేశంలో ప్రజలందరికీ సమాన స్వాతంత్ర్యం ఉండాలన్నా, ఒకరు మరొకరిమీద పెత్తనం చెలాయిస్తారనే అనుమానం లేకుండా ఉండాలన్నా, ఎట్టి రూపంలో స్వరాజ్య సౌధం నిర్మించబడాలో వోటర్ల ఎదుట మేం చిత్రించదలచుకున్నాం. స్వాతంత్ర్యం కోరే ప్రతి భారత పుత్రుడు సంతోషంగా యితరులందరితో "భాయి భాయి" గా మెలగడానికి యే మూలసూత్రాలు అవసరమో, వేటి పునాదిమీద సుస్థిరమైన స్వరాజ్య సౌధం నిర్మింపబడాలో; మేం ప్రజలకు చెప్పబోతున్నాం. ఇందుకే మేం ఎన్నికల్లో పోటీ చేస్తున్నాం.

● వివిధ జాతులకు స్వయంనిర్ణయహక్కు ఉండాలనే సిద్ధాంతం ఒక మహోత్కృష్టమైన ప్రజాస్వామ్య సూత్రంగా భావించి, ఎడతెగకుండా మేము దానికై ప్రచారం సల్పుతున్నాం. సంపూర్ణ స్వాతంత్ర్యంగల భారతదేశ సౌధానికి అదొక గట్టి పునాది అని మా దృఢవిశ్వాసం. ప్రజల స్వాతంత్ర్యవాంఛ అందులో ఉంది.

● భారతదేశంయొక్క స్వాతంత్ర్య హక్కులను స్పష్టంగా గు రించవలసిందని మా పార్టీ బ్రిటిష్ ప్రభుత్వంమీద ఒత్తిడి చేస్తుంది.



అట్టి ప్రకటన చేయకపోతే బ్రిటన్ - భారతదేశాలమధ్య ముందుముందు అన్యోన్య సంబంధాలు ఉండవు. సామ్రాజ్యవాదులే ఎల్లకాలం మన దేశాన్ని పీడించుకు తినడానికి యిప్పటి స్పర్ధలు సాకుగా దొరుకుతాయి.

బ్రిటిష్ కార్మికులు తమ ప్రభుత్వంమీద బలమైన ఒత్తిడి తీసుకువచ్చి పై విధమైన ప్రకటనలు చేయింపజాలకపోతే, భారతీయుల హృదయాన్ని వారు చూరగొనలేరు. ముందుముందు అనేక కల్లోలాలకు కారణమవుతుంది.

స్వతంత్ర భారత రాజ్యాంగం రెండు ప్రధాన సూత్రాలమీద ఆధారపడివుండాలని ఎన్నికలలో మాపార్టీ ప్రచారంచేస్తుంది. మొదటిది యుక్తవయస్సు వచ్చినవారందరికీ వోటింగు హక్కుండాలి. రాజ్యాంగనిర్మాణ సభకు కొద్దిమందిమాత్రమే ఓట్లిచ్చి ప్రతినిధుల్ని యెన్నుకొనేపక్షంలో ఆ ఎన్నికలైనా ప్రత్యక్షపు ఎన్నికలపద్ధతి ప్రకారం కాకుండా 'పరోక్షపు' ఎన్నికల పద్ధతి ప్రకారం జరిగే పక్షంలో, అట్టి రాజ్యాంగం యే ప్రధాన సమస్యనూ పరిష్కరింపజాలదు. కొద్దిమంది ధనికవర్గాలకుమాత్రమే అధికారం లభిస్తుంది. అంతేకాదు, ఎన్నో సంఘర్షణలకుకూడా అది దారితీస్తుంది.

(ప్రత్యక్షపు ఎన్నికలంటే వోటర్లే అభ్యర్థుల్ని స్వయంగా ఎన్నుకునే పద్ధతి; పరోక్షపు ఎన్నికలంటే ఇలా ప్రజలచే ఎన్నుకోబడిన ప్రతినిధులు తిరిగి తమలో కొందరిని రాజ్యాంగ నిర్మాణ సభకు యెన్నుకుంటారు.)

రెండవది : మనదేశంలో అనేక జాతుల ప్రజలు నివశిస్తున్నారు. పఠాన్‌లాండ్, బెలూచిస్థాన్, సింధు, ముస్లింల తూర్పు పంజాబ్; సిక్కుల మధ్య పంజాబ్, హిందుస్తాన్, బీహార్, రాజస్తాన్, అస్సాం, ఒరిస్సా, ఆంధ్ర, తమిళనాడ్, కేరళ, మహారాష్ట్ర, గుజరాత్, బెంగాల్ - యివన్నీ కొన్ని విశిష్టమైన కొన్ని జాతులకు జన్మభూములు. వీటిలో ఒక్కొక్క దానికి ఒక్కొక్క రాజ్యాంగ నిర్మాణసభ ఉండాలి; అదే ఆ జాతియొక్క భావి రాజ్యాంగ విధానాన్ని తయారుచేయాలి. బెంగాల్‌విషయం ఏమంటే,

ముందుగా హిందూ ప్రాంతంలోను, ముస్లిం ప్రాంతంలోను ప్రజల అభిప్రాయాన్ని తెలుసుకోవాలి. హిందువులు, మునల్మానులు బెంగాల్‌లో కలసివుండడమా? లేక విడిపోవడమా? అనే సమస్యను ఆ యా ప్రాంతాల్లో నివసించే హిందువులు, ముసల్మానులు వేర్వేరుగా సమావేశమై తేల్చుకుంటారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కెదురుగా భారతదేశం ఒకటిగా నిలబడి తీరుతుందని స్వాతంత్ర్యంకోరే ప్రతి భారతీయునికీ తెలుసు.

అయితే, మనలో మనకు ప్రధానమైన భేదాభిప్రాయాలు ఉన్నాయి. భారతీయులమంతా విశిష్టమైన కొన్ని జాతులకు చెందియుండడంవల్ల, భారతదేశ స్వాతంత్ర్యాన్నిగురించీ, ప్రజా శ్రేయస్సునుగురించీ, వేర్వేరు దృక్పథాలుండడంవల్ల, యీ భేదాభిప్రాయాలేర్పడ్డాయి.

స్వతంత్ర భారతదేశంలో వివిధజాతుల ప్రజలకు సమాన స్వాతంత్ర్యం ఉంటుందనే విషయాన్ని అందరం నేడు గుర్తించవలసియుంటుంది. అలా గుర్తించకపోతే అందరి ఆశయమూ అయిన స్వాతంత్ర్యాన్ని సంపాదించలేము.

మన దేశంలో నివసించే వివిధజాతుల ప్రజల్ని దోచుకుతినడానికి సామ్రాజ్యవాదులు ఐక్య భారత రాజ్యాంగ యంత్రాన్ని నిర్మించారు.

మన స్వాతంత్ర్య గమ్యస్థానం చేరువకు వచ్చేకొద్దీ, అధిక సంఖ్యాకులుగా ఉన్న జాతులు వెనుకబడియున్న అల్పసంఖ్యాక జాతుల్ని అణచియుంచుతారేమోనని అనుమానాలు యెక్కువకావచ్చు. అలా కావడం సహజమే కూడా.

మనలో మనకు అభిప్రాయ భేదాలున్నాయంటూ, వాటిని సాకుగా తీసుకొని సామ్రాజ్యవాదులు అందరినీ బానిససంకెళ్ళలో బంధించివేస్తారు. ఒకరిపై మరొకరిని ఉసిగొల్పుతారు.

ఈ సుడిగుండమునుంచి బయటపడ్డానికి ఒకేమార్గం ఉంది.

మన దేశంలో నివసించే వివిధ జాతుల ప్రజలకు సంపూర్ణమైన



స్వయం నిర్ణయాధికారాన్ని కలిగియుంటారని, ఖచ్చితంగా హామీ యివ్వాలి. వారందరికీ వివిధ ప్రాంతాల్లో ప్రత్యేకమైన జన్మభూములున్నాయి. చారిత్రకంగా కొన్ని సాంప్రదాయాలున్నాయి. వివిధ రూపాలలో వారి సంస్కృతి అభివృద్ధి అవుతోంది. ఆర్ధికంగా చూచినా, ఆయా ప్రాంతాలప్రత్యేకతను మనమంతా గుర్తించితీరాలి.

ఇదే, యదార్థ పరిస్థితుల కనుగుణ్యమైన పరిష్కారమార్గం. ప్రస్తుతం మనదేశంలో తీవ్రరూపం దాల్చిన రాజకీయ విభేదాలకు కూడా యిదే చక్కని పరిష్కార మార్గం. ముందుముందు అంతర్యుద్ధం తలయెత్తకుండా చేయడానికూడా ఇదే సహాయపడుతుంది.

1. మొదటి విషయం: కాంగ్రెసు - లీగ్ విభేదాలను ప్రజాస్వామ్య పద్ధతితో పరిష్కరించి, రెండుపక్షాలు కోరే న్యాయమైన కోర్కెలను సఫలీకృతం చేయడానికి ఇది తోడ్పడుతుంది.

ఈ సూత్రాన్ని మనమంతా అంగీకరిస్తే, ముస్లిం జన్మభూములన్నింటికి స్వయం నిర్ణయాధికారాన్ని గుర్తించినట్లవుతుంది; పాకీస్థాన్ కోర్కెయొక్క మూలసూత్రంకూడా యిదే. అంతేగాదు; పై సిద్ధాంతాన్ని అంగీకరించడంవల్ల, కొందరు లీగునాయకులు కోరుతున్నట్లు పంజాబు రాష్ట్రమంతాగాని, అస్సాంరాష్ట్రంగాని, పాకిస్థాన్ రాజ్యాంగములో భాగాలుగా ఉండవు. అలా వుండాలనడం న్యాయసమ్మతమైన కోరిక కాదు.

మరోవైపుకాంగ్రెసు కోరుతూన్నట్లు, ఆయాప్రాంతాలలో నివశించే ప్రజల అభిప్రాయాన్ననుసరించే ఈ చర్యతీసుకున్నట్లవుతుంది.

అంతేగాదు; సిక్కునాయకులు, ముస్లిం నాయకులు ఏకాభిప్రాయానికి వచ్చి, పంజాబుయొక్క ఐక్యతను నిలబెట్టగల అవకాశం వస్తుంది.

బెంగాల్ ఒకేజాతిగా వుండడమా, లేక ముస్లిం ప్రాంతాలను స్వతంత్ర రాజ్యంగా చేయడమా? అనే సమస్య బెంగాలీ హిందువులు, ముస్లింలు ముందుగానే తమఅభిప్రాయాన్ని ప్రకటించడంద్వారా పరిష్కారమవుతుంది.

2. రెండవ విషయం : ఈ పద్ధతిని మనమంగీకరిస్తే, ఒకజాతికీ-మరొకజాతికి ఇప్పుడున్న వైషమ్యాలు, కక్షలు అంతరిస్తాయి. ఉదాహరణకు బొంబాయి రాష్ట్రంలో గుజరాతీలకూ - మహారాష్ట్రులకు మధ్య ద్వేషం వుంది. పంజాబీలకు - సింధురాష్ట్రంవారికీ మధ్య కక్షలున్నాయి. బెంగాలీలకు - అస్సామీలకు మధ్య క్రోధాగ్ని రగులుతోంది. బీహార్ వారికి-బెంగాలీలకు మధ్య విభేదాలున్నాయి. ఆంధ్రులకు - తమిళులకు మధ్య ఒకపెద్ద అగాధంవుంది. ఈ కక్షలూ, కార్పణ్యాలూ తీవ్రరూపందాల్చకుండా చేయాలంటే, పైన సూచించిన పద్ధతే సరియైన పరిష్కార మార్గం.

ఇంతవరకు స్వరాజ్యమనే శబ్దానికి అర్థం బ్రిటిష్ పాలకుల పెత్తనం పోవడం మాత్రమేనని భావిస్తూవచ్చాం. కాని స్వాతంత్ర్యోద్యమం అంతకంతకు అభివృద్ధి అవుతూన్నకొద్దీ, అల్పసంఖ్యాక జాతులు స్వరాజ్యంలో తమకెట్టి స్వాతంత్ర్యం ఉంటుందని ప్రశ్నించుతున్నారు. ఇది సహజమే కూడ.

ఈ ప్రశ్నకు మా పార్టీ చెప్పే సమాధాన మేమిటంటే, స్వతంత్ర భారత రాజ్యాంగంలో ఒక్కొక్కజాతికి ఒక్కొక్క జన్మభూమి ఉంటుందనీ, ఒకజాతికి యితరజాతులకూమధ్య ఉండబోయే సంబంధ బాంధవ్యాలు ఎలావుండాలో నిర్ణయించేది ఆయా జాతుల ప్రజలేననీ, మేం చెబుతాం. ప్రత్యక్షవోటింగు పద్ధతి ప్రకారం ఆయా జాతుల ప్రజలే ఈ సమస్యను పరిష్కరించుకుంటారు.

ఈ పద్ధతివల్ల, ముస్లింలు మెజారిటీగా వున్న ప్రాంతాలలోని రాజ్యాంగ నిర్మాణసభలకు లీగ్ అభ్యర్థులే ఎక్కువగా ఎన్నుకోబడితే, మెజారిటీ వోటుద్వారా వారు వేరే ప్రభుత్వాన్ని నిర్మించుకోవడమా, లేక కలిసి ఉండడమా ? అనే సమస్యను పరిష్కరించుకుంటారు. కలిసివుంటే తమకు కావలసిన హక్కులేవో సూచనలిస్తారు. ముస్లింలీగ్ కోరేది కూడా యిదే.

అలాకాక. ముసింమెజారిటీ ప్రాంతాలోని రాజ్యాంగ నిర్మాణ



ఖండంగా ఉంటుందని తీర్మానించవచ్చు; లేదా, లీగ్ నాయకుల అభిప్రాయం ప్రకారం ఉభయ రాజ్యాలకూ అవసరమైన ప్రయోజనాలేవో తెలుసుకొని, తాము యివ్వదలచిన రక్షణలేవో సూచించవచ్చు.

మాపార్టీయొక్క గట్టినమ్మకం ఏమంటే, ప్రయోజన వోటింగు పద్ధతి ప్రకారం రాజ్యాంగ నిర్మాణసభలన్నింటికీ ఎన్నికలు జరిగితే, అలా ఎన్నుకోబడిన సభ్యులలో అత్యధిక సంఖ్యాకులు తమ జన్మభూముల నూతన స్వాతంత్ర్యాన్ని పట్టుదలతో కాపాడుకోవడమే గాకుండా, అన్ని జాతులవారికీ సమానంగా అవసరమైన ప్రయోజనాల (దేశరక్షణ, విదేశాంగవ్యవహారాలు, ఎగుమతి, దిగుమతులు వగైరాలు) ఇష్టపూర్వకంగా అఖిలభారత రాజ్యాంగాన్ని నిర్మించుకోవాలని కోరుతారు.

పై విధంగా వేర్వేరు జాతులకు వేర్వేరు రాజ్యాంగ నిర్మాణసభలు ఏర్పడితే, భారతదేశం ముక్కలుముక్కలుగా విడిపోవాలని ఎవరూ నిర్ణయాలు తీసుకోరు. ఇది మా దృఢవిశ్వాసం. ఐతే, ప్రజాస్వామ్య సిద్ధాంతాల్లో మాకు గట్టినమ్మకం ఉంది. అందువల్ల వేర్వేరు ప్రాంతాల్లో నివశించే ప్రజలు తమ భవిష్యత్తును గురించి ఎట్టి నిర్ణయాలు తీసుకున్నప్పటికీ, వాటికి అంతా తలవొగ్గి తీరాలని మేం చెబుతాం.

భవిష్యత్తులో భారతదేశమంతా ఏకఖండంగానే ఉంటుందనే మా గట్టినమ్మకం. ఎందువల్లనంటే, భారతావనిలో ప్రతిజాతికీ సంపూర్ణ స్వాతంత్ర్యం, సమానహోదా ఉండి తీరుతాయని ముందుగా హామీయిచ్చినాడు - అన్ని జాతులు కలిసే ఉండాలని స్వానుభవంమీద తెలుసుకుంటారు. కారణమేమంటే, అందరికీ కొన్ని సమానమైన అవసరాలు ఉండి తీరుతాయి.

వాటిని యీడేర్చుకోవడం కోసం ఒకరిపై మరొకరికి ఇప్పటిమాదిరిగా ఉండే అనుమానాలు, ద్వేషాలుకాదు ప్రధానపాత్ర వహించేవి; ఒకరిపై మరొకరికిగల పరస్పర విశ్వాసాలే ప్రధాన

## సంస్థాన ప్రజలకుకూడా స్వాతంత్ర్యం ఉండాలి

స్వదేశ సంస్థానాలలో పైచేయి బ్రిటిష్ సివిలియన్ అధికారులదే కాబట్టి, వారి హుకుంల ప్రకారం కొందరు సంస్థానాధీశులు ప్రజాస్వామ్య బురఖాలు తగిలించుకున్నారు. కొన్ని సంస్థానాలలో "సంస్కరణలు" ప్రవేశపెట్టబడ్డాయి. కాని, అవి యెలాంటి "సంస్కరణలు?" బ్రిటిష్ యిండియాలో 1906 లో ప్రవేశపెట్టబడిన మింటో-మార్లే సంస్కరణల కంటె అవి యేమాత్రమూ ముందుకు వెళ్ళలేదు కొన్ని సంస్థానాలలో. మరికొన్నిచోట్ల మాంటేగూ - ఛెమ్సుఫర్డ్ సంస్కరణలవంటివి మాత్రం ఉన్నాయి. అవైనా చాలా కొద్ది సంస్థానాలలో. మిగతా సంస్థానాలలో అసలు సంస్కరణలే లేవు.

దీన్నిబట్టి తేలేది యేమంటే, భారత రాజ్యాంగ నిర్మాణసభలకు సంస్థానాధీశులుకూడా సంస్థాన ప్రజల ప్రతినిధులంటూ కొందరిని పంపుతారు. కాని, వారు నిజమైన ప్రజా ప్రతినిధులనడానికి వీల్లేదు. బ్రిటిష్ ఇండియాలో ఇప్పుడున్నన్ని వోటింగ్ అర్హతలైనా సంస్థాన ప్రజలకులేవు. సంస్థాన ప్రజలందరికీ బ్రిటిషు ఇండియాలోమాదిరిగానే వయోజన వోటింగుహక్కు ఉండాలనీ, స్వయంనిర్ణయ సూత్రాన్ని వారికిగూడా వర్తింపజేయాలనీ, కమ్యూనిస్టుపార్టీ ఆందోళనచేస్తుంది.

బ్రిటిషు సామ్రాజ్యవాదుల పెత్తనాన్ని పడగొట్టడానికి కాంగ్రెసు - లీగు ఒడంబడిక యెంత చక్కని ఆయుధమో, అలాగే సంస్థాన ప్రజల స్వయం నిర్ణయాధికారాన్ని గుర్తించడంవల్ల సామ్రాజ్యవాదులకు కోటలుగా ఉపయోగపడే సంస్థానాలలో వారి అధికారం అంతమవుతుంది.

అప్పుడే రాజ్యాంగ నిర్మాణసభలు ప్రజాస్వామ్య సూత్రాలప్రకారం యేర్పడగలవు. సంస్థానాలలో నిజమైన ప్రజా ప్రతినిధులు అప్పుడే రాజ్యాంగ నిర్మాణసభలకు ఎన్నుకోబడతారు. అప్పుడే పీడిత ప్రజలు తమ అభిప్రాయాలను స్పష్టంగా ప్రకటించి, స్వాతంత్ర్యం కలిగిన వివిధ జాతుల సమ్మేళనకు నాయకత్వం వహించగలుగుతారు. అప్పుడే మహా



జాతులవారందరూ తమతమ జన్మభూములలో స్వేచ్ఛావాయువులు పీల్చ గలుగుతారు. ఈ ప్రజలిప్పుడు కొందరు బ్రిటిషు ఇండియాలోను, కొందరు సంస్థానాలలోను చీలిపోయివున్నారు. వారందరినీ ఐక్యపరచడానికి మార్గం మేము సూచించుతూన్న పద్ధతే.

ఈ ఆశయం సిద్ధించిననాడు అనగా సంస్థానాలలోనూ, బ్రిటిషు ఇండియాలోనూ నివసించే జాతులు ప్రత్యేక రాజ్యాంగాలుగా యేర్పడిన నాడు వారి సంస్కృతి, వారి ఆర్థికవ్యవస్థ, రాజకీయ జీవితం అనేకరెట్లు శోభావంతంగా వికశిస్తాయన్నమాట.

ఈవిధంగా, భారతీయుల స్వాతంత్ర్య వాంఛకు ఒక చక్కని రూపం యివ్వబోతూంది కమ్యూనిస్టుపార్టీ. స్వరాజ్యం అంటే భారతదేశంలో నివశించే ప్రతి జాతివారికీ, ప్రతి భాగంలో నివసించేవారికీ, సమాన స్వాతంత్ర్యం ఉంటుందని ప్రచారం చేస్తుంది. ఈ విధంగా, సంపూర్ణ స్వాతంత్ర్యంగల వివిధజాతుల ప్రజలు అఖిలభారత రాజ్యాంగంలో సంతోషపూర్వకంగా భాగాలుగవుండడానికి ఒడంబడికలుచేసుకోవాలని, మేం ప్రచారంచేస్తాం. భారతదేశం నిజమైన స్వాతంత్ర్యం అనుభవించాలంటేనూ, నిజమైన ఐక్యత ఉండాలంటేనూ, యిదే చక్కని పరిష్కారమార్గం.

కమ్యూనిస్టుపార్టీ రాజకీయ కార్యక్రమాన్నే గాకుండా, ఆర్థిక కార్యక్రమం కూడా ఒకటి యివ్వబోతూంది. ఆర్థికంగా మనదేశం యిప్పుడనుభవిస్తూన్న చిక్కులన్నింటికీ శాశ్వతమైన పరిష్కారమార్గం చూపడమే గాక, తక్షణమే యీరోజున మన పీడిత ప్రజాసామాన్యానికి రక్షణ కలుగజేయడానికి మేమొక ప్రణాళికను తయారుచేశాం. ప్రజాస్వామ్య పద్ధతులపై మనదేశంయొక్క ఆర్థిక వ్యవస్థను పునర్నిర్మించడానికి అవకాశం కలుగజేస్తాం.

## అందరికీ తిండి - రైతులకు భూమి

మధ్యయుగాలనాటి జమీందారీ పద్ధతిక్రింద, ఆధునిక పెటుబడిగాగీ

చూస్తున్నాం. యుద్ధకాలంలో మనం గడించిన అనుభవంవల్ల మన వ్యవసాయ పద్ధతి ఎందుకూ పనికిరాదని స్పష్టమయింది. చిరకాలంనుంచి సాంప్రదాయ సిద్ధంగా రైతుల్ని దోచుకుతినే వర్గాలు రైతుల రక్తమాంసాలను పీల్చి పిప్పిచేయడమే గాకుండా, ప్రజలకు చేరవలసిన ఆహార పదార్థాలలో దొంగవ్యాపారంచేసి లక్షలూ - కోట్లూ సంపాదించారు.

> దేశంలో కరువుకాటకాలు తాండవమాడుతుంటే విపరీతంగా రూపాయనోట్లను అచ్చువేసి చెలామణీలోకి తెచ్చిన బ్రిటిష్ అధికారవర్గం, పట్టణాలలో టోకువర్తకులు, ప్రధానకారకులై ఉండగా, యిటుగ్రామాలలోకూడా ధనికవర్గం ఎక్కువ కారణమని చెప్పాలి.

ముందుముందు మనగ్రామాలు స్మశానభూములు కాకుండా జాగ్రత్తపడాలంటే, ప్రజలందరికీ కనీసం తిండియైనా లభించాలంటే, ఇలాంటి ప్రజాశత్రువులకు స్థానంలేకుండా చెయ్యాలి.

ప్రజలరెక్కలకష్టంమీద జీవించే జమీందార్లు నిరంతరం ఇనుపపెట్టెలను నింపుకోవడమే పనిగాపెట్టుకున్న వడ్డీవ్యాపారస్తులు, వ్యాపారమంతా గుత్తకు తీసుకుని లక్షలు ఆర్జించే వర్తకులు-వీరంతాయుద్ధకాలంలో దొంగవ్యాపారంచేసి దేశాన్ని దోచుకు తిన్నారు. రైతుల భూములు ఎన్నో వీరికి స్వాధీనమయినాయి. సంఘంపట్ల వారుచేయని నేరంలేదు. దేనినీ వారు పవిత్రంగాఎంచరు. బెంగాలులో వారుచేసిన అఘాయిత్యాలు మానవజాతికే వళ్ళు పులకరించేటట్లు చేశాయి. ఇతర రాష్ట్రాలకు ఆగతి పట్టని మాట నిజమే. కాని, గమనించవలసిన విషయమేమంటే, వీరిపెత్తనం ఇప్పుడూ ఇలాగేకొనసాగితే బెంగాల్ దుర్ఘటన అన్ని రాష్ట్రాలలోను జరిగి తీరుతుంది.

## రైతాంగ కోర్కెలు

పల్లెటూళ్ళలో ప్రజా శత్రువులుగా ఉన్న ఇట్టివర్గాలను రూపుమాపుటకు, రైతుకు స్వేచ్ఛను సమకూర్చుటకు, మొత్తం అన్ని గ్రామాలలో పునర్నిర్మాణ కార్యక్రమాన్ని అమలులోకి తీసుకువచ్చేటందుకు, ఈ క్రింది



1. జమీందారీపద్ధతి రద్దుకావాలి. భూమిని జాతీయ ప్రభుత్వమే స్వాధీనం చేసుకోవాలి. చాలీచాలని భూములతో వ్యవసాయం చేయడంవల్ల రైతు అనేక కష్టనష్టాలకు లోనవుతున్నాడు. గనుక, అలాంటి పేదరైతు లందరికీ ఎక్కువ భూములు లభించేటట్లు అన్ని భూములనూ తిరిగి పంచాలి. అంతేగాక, కో-ఆపరేటివు పద్ధతి ప్రకారం విశాలమైన భూఖండాలలో సేద్యం చేయడానికి వసతు లేర్పరచాలి.

2. విపరీతమైన వడ్డీరేట్లు తీసుకొని అప్పులిచ్చే పద్ధతి శిక్షార్హంచేయాలి. కో-ఆపరేటివు బ్యాంకులు వ్యవసాయదారు లందరికి విరివిగా అప్పులివ్వాలి.

3. ప్రజలకు కావలసిన ఆహార పదార్థాలను కొనడం, అమ్మడం, వ్యక్తులచేతుల్లో ఉంచకూడదు. అట్టి పద్ధతి విపరీత లాభాలను గుంజడానికి అవకాశమిస్తుంది. ప్రజలు బాధపడతారు. ప్రభుత్వమే రైతువద్ద సరసమైనధరలకు ఆహార ధాన్యాలనుకొనాలి.

4. రైతుయొక్క నిత్య జీవితావసరాలకు పోగా మిగిలిన అదనపు ధాన్యాన్ని కొనేటందుకు, అతని కవసరమైన యితర జీవితావసర వస్తువులను చౌకగా సప్లయి చేసేటందుకు, ప్రభుత్వం అన్ని గ్రామాలలోను రైతుల సహకారంతో కో-ఆపరేటివు సేల్ అండ్ పర్చేజ్ సొసైటీలను ఏర్పరచాలి.

ఈలోగా బొత్తిగా పేదరికంలో వున్న చిన్న రైతులకు తొందర తొందరగా సహాయమందజేయడానికి మంత్రివర్గాలు తక్షణమే యీ క్రింది చర్యలు తీసుకోవాలి :

1. సాగుకు లాయకైన భూముల నన్నింటినీ, అవి జమీందార్లవైనా - ప్రభుత్వానికి చెందినవైనా సాగులోకి తీసుకురావాలి.

2. అన్ని ఋణాలను రద్దుచేయాలి. పన్నుభారాన్ని బాగా తగ్గించాలి. తద్వారా బీదరైతు తన కుటుంబాన్ని సక్రమంగా పోషించుకొన గలుతాడు; అధికంగా పంటలు పండించగలుతాడు.

3. పెద్ద పెద్ద భూస్వాములు వ్యవసాయపు పన్నుతోబాటు ఇన్‌కంటాక్సుకూడా చెల్లించేటట్లు చేయాలి. ఆదాయాన్నిబట్టి దానికి ఎక్కువరేట్లు విధించాలి. ఈ విధానంవల్ల యే ధనికరైతూ సంవత్సరానికి ఆరువేల రూపాయీలకంటె ఎక్కువ ఆదాయం శిస్తు రూపంలో పొందజాలడు.

నిర్బంధ పద్ధతితో వ్యవసాయం చేయించుకొనే పద్ధతిని రూపుమాపాలి. స్వతంత్ర భారతదేశంలో స్వార్ధపరులైన నిలవ వ్యాపారస్తులుగాని, జమీందార్లుగాని, ఉండకూడదు.

ఈ పై పద్ధతుల్ని అమలుపరిస్తే దేశంలో అంటువ్యాధులలాగా వున్న కరువుకాటకాలను పోగొట్టి, గ్రామీణ ఆర్థిక సౌష్ఠవాన్ని నిలబెట్టగలం. ఎన్నికల ప్రచారంలోను, తర్వాతను ప్రజాసమీకరణద్వారా మేము సాధించదలచిన ప్రధానకర్తవ్యం ఏమంటే-రేపు ఎన్నుకోబడే ప్రజాప్రభుత్వాలు బ్రిటిషువాళ్ళ ఒత్తిడికి, పరాన్నభుక్కులైన స్వార్ధపరుల ఒత్తిడికి లొంగిపోకుండా ప్రజలందరికీ తిండీ, బట్టా, కష్టజీవులకు మంచి జీవనం, కలిగించే పద్ధతుల్ని అవలంబించేట్టు చూడడమే.

## ప్లానుప్రకారం పరిశ్రమల అభివృద్ధి

భారతదేశం పారిశ్రామికాభివృద్ధి చెందకుండా మొదటినుంచీ బ్రిటిషుపెట్టుబడిదార్లు తమ అధికారాన్ని వినియోగించుకొని, అడ్డుపడుతున్నారు. యుద్ధసమయంలోకూడా ఇక్కడ ప్రధాన పరిశ్రమలను కొత్తగా స్థాపించకుండాను, ఉన్న పరిశ్రమలను సాధ్యమైనంత ఎక్కువగా అభివృద్ధిచెందనీయకుండాను, వాళ్ళేఅడ్డుపడ్డారు. వాళ్లే మన దేశాన్ని దరిద్ర దేశంగా వుంచారు. యుద్ధకాలంలో ప్రపంచంలో మరియే ఇతర నాగరిక దేశమూ గురికానంతగా మనల్ని కరువుకాటకాలకు, అధిక ధరలకు గురిచేశారు.

ఈ క్లిష్టపరిస్థితుల్లో భారత పారిశ్రామిక పెట్టుబడిదార్లు ఏంచేశారు: ఉన్న సరుకులన్నీ దాచేసి కరువు కాటకాలకు దోహదంచేశారు; మామూలు వ్యాపారాన్ని దొంగవ్యాపారంగా మార్చేశారు. మన పారిశ్రామిక పెట్టు



బడిదార్లు, వ్యాపారస్తులు ఎక్కువమంది విపరీతంగా యుద్ధలాభాలు తీశారు. వాళ్ళ విధ్వంసక చర్యలు వాళ్ళను ప్రజాద్రోహులయిన స్వార్ధపరులుగా రుజువు చేశాయి. కనుక భారతదేశ ఆర్థిక విధానపు భవిష్యత్తును వీళ్ళ చేతుల్లో పెట్టడానికివీల్లేదు. వీరిని నమ్మడానికి వీలులేదు.

మన ప్రజలు స్వాతంత్ర్య పోరాటాలు సాగించింది ఈ పెట్టుబడిదారీ స్వార్ధపరుల్ని భారత పరిశ్రమలకూ, ఆర్థిక విధానానికీ నియంతల్ని చేయడానికి మాత్రంకాదు.

ఈ క్రింది ప్రాథమిక సూత్రాలను ఆధారంగా చేసుకొని నిర్మాణాత్మకంగా భారతదేశంలో పరిశ్రమలు ప్రజా ప్రభుత్వాధ్వర్యాన సత్వరంగా స్థాపించబడాలని కమ్యూనిస్టుపార్టీ ఉద్ఘాటిస్తుంది.

1. కీలక పరిశ్రమలన్నీ ప్రభుత్వ యాజమాన్యంక్రింద ఉండాలి.

2. దేశంలోవున్న సహజ సంపదనుకూడా ప్రభుత్వ యాజమాన్యంక్రిందికి తీసుకురావాలి.

3. అన్ని ప్రాంతాల్లోను సమానంగా ఒక ప్లానుప్రకారం పరిశ్రమల నభివృద్ధిచేయాలి.

4. కార్మికుని జీవితవ్యయానికి సరిపోయేటంత భృతి ఉండాలి. సోషల్ ఇన్సూరెన్సువంటి సౌకర్యాలకు ప్రభుత్వం ఎక్కువ ధనాన్ని ఖర్చుపెట్టాలి.

5. ప్రభుత్వప్రతినిధులు, యజమానుల ప్రతినిధులు, కార్మిక ప్రతినిధులు, సమాన సంఖ్యలో ఉండే కమిటీలద్వారా ప్రభుత్వం పారిశ్రామిక ప్లానును అమలుజరపాలి.

యుద్ధం పూర్తిఅయిన దగ్గరనుంచీ అన్నిపరిశ్రమలలోను కార్మికుల్ని భయంకరమైన నిరుద్యోగరాక్షసి ఎదుర్కొంటూంది. దేశంలో పారిశ్రామిక సంక్షోభం తలయెత్తుతోంది. దీన్ని ధైర్యంగా ఎదుర్కొంటూ కార్మికులందరికీ ఉద్యోగాలు చూపవలసిన అవసరం ఎంతోఉంది. ఈ నిరుద్యోగ సమస్యను పరిష్కరించకపోతే.

వ్యర్థంకాక తప్పదు. కాబట్టి వెన్వెంటనే యీ క్రిందికార్యక్రమాన్ని అమలు జరిపేటందుకు కమ్యూనిస్టుపార్టీ ప్రజామంత్రివర్గాలపై ఒత్తిడి తెస్తుంది.

1. యుద్ధకాలంలో పనిచేసిన పరిశ్రమ లన్నింటినీ కార్మికుల సహకారంతో ప్రజల నిత్యావసరాలకు కావలసిన సరుకుల్ని ఉత్పత్తి చేసేటందుకు వినియోగించాలి.

2. ఇప్పుడు మన దేశంలో ఉన్న బ్రిటిష్ పారిశ్రామిక సంస్థలను, వ్యాపార సంస్థలను జాతిపరం చేయడానికి చట్టం ఒకటి ప్యాసు చెయ్యాలి. యుద్ధకాలంలో బ్రిటిష్ ప్రభుత్వం మనకు చెల్లించవలసిన బాకీలో కొంతభాగాన్ని ఇందుకు వినియోగించాలి. అట్టి పరిశ్రమలను క్రమక్రమంగా ప్రభుత్వపరం చేయాలి.

3. యుద్ధంవల్ల ఏర్పడ్డ అసాధారణ పరిస్థితుల్లో ప్రజల్ని కొల్లగొట్టి విపరీతమైన లాభాలు సంపాదించిన నిలవవ్యాపారస్తుల్ని కఠినశిక్షలకు గురిచెయ్యాలి. వారి ఆస్థులన్నింటినీ ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి.

4. యుద్ధకాలంలో పెద్దపెద్ద వ్యాపారస్థులమీద ప్రభుత్వం ఎక్స్‌ట్రా ప్రాఫిట్స్ టాక్స్ (అదనపు లాభాల పన్ను) విధించింది. ఇలా వచ్చిన ఆదాయాన్ని ప్రభుత్వం ఒక రిజర్వు ఫండుగా నిలవ జేసింది. ఈ ధనాన్ని తిరిగి ఆ వ్యాపారస్థులకు ఇచ్చివేయకుండా చేయడానికి వెంటనే శాసనసభలో ఒకచట్టం తయారుచేయాలి.

పారిశ్రామిక కూలీల ప్రస్తుత జీవిత పరిమాణాన్ని పెంచేందుకు, నిరుద్యోగ భృతి నివ్వడానికి తగిన ఆర్థిక సదుపాయాలు పొందేటందుకు, కొత్త పరిశ్రమలను ప్రారంభించేందుకు ప్రజా మంత్రివర్గాలు ఈ క్రింది విధానాన్ని బలపరచి, ఆచరణలో పెట్టాలని మాపార్టీ శాసనసభల్లో వాదిస్తుంది. మంత్రివర్గాలను ఒత్తిడి చేస్తుంది.

## అస్పృశ్యుల్ని అణచరాదు

అస్పృశ్యులకు యితర కులస్థులతో సమానంగా ఆర్థిక, రాజకీయ హక్కు లివ్వాలని, రాజ్యాంగ యంత్రంలో కూడా హక్కుల్ని రక్షించాలని మాపార్టీ ఆందోళన చేస్తుంది. కొంచెంకూడా భూమిలేని నిమ్నజాతుల వారందరికీ భూములివ్వాలి. సాగుకు లాయకైన కొత్త భూములను సాగులోకి తీసుకువచ్చేటప్పుడు యితరులకంటే వీరికే వాటిపై మొదటి హక్కు ఉంటుంది.

పై కార్యక్రమాన్ని మా పార్టీ వోటర్లందరి ముందు పెట్టబోతూంది. జంతువులకంటె హీనస్థితిలోవున్న మన ప్రజానీకం మానవ మాత్రులుగా జీవించాలంటే, పైకోర్కెలన్నీ సఫలం కావాలి.

## వివిధపార్టీలపట్ల మా వైఖరి

మాపార్టీకి కాంగ్రెసుతోను, ముస్లింలీగ్‌తోను, తీవ్రమైన అభిప్రాయ భేదాలున్నమాట వాస్తవమే. కాని, అవి రెండూ ఘన ప్రధాన రాజకీయ సంస్థలని మేం గుర్తిస్తున్నాం. కనుకనే, ఏయే నియోజకవర్గాలలో మా సభ్యులు అభ్యర్థులుగా నిలబడ్డంలేదో, అక్కడ మేం కాంగ్రెసు అభ్యర్థుల్నీ, లీగ్ అభ్యర్థుల్నీ, అభివృద్ధినిరోధకులకు వ్యతిరేకంగా బలపరచ దలచుకొన్నాం.

ఇంచుమించు అన్ని కార్మిక నియోజకవర్గాలలోను మా అభ్యర్థులు నిలబడతారు. ఎందువల్లనంటే, భారతదేశ కార్మికవర్గం మాపార్టీ నాయకత్వాన్ని అంగీకరించుతూందనే విషయం స్పష్టంగా ప్రదర్శింపబడవలసి వుంది.

ఇక రూరల్ (పల్లెటూళ్ల) నియోజకవర్గాల సంగతి. వీటిక్రిందికి సాధారణ నియోజకవర్గాలూ వస్తాయి; ముస్లిం నియోజకవర్గాలూ వస్తాయి. కొన్నికొన్ని ప్రాంతాల్లో కమ్యూనిస్టుపార్టీకి యితర పార్టీలకంటే ఎక్కువ మెజారిటీ ఉంది. అక్కడ రైతాంగాన్ని రైతుసంఘాలలో సంఘటిత పరచి, బలమైన రైతు ఉద్యమాన్ని మేం నిర్మించాం. అలాంటి ప్రదేశాల్లో రైతుల సంఘటితశక్తినీ, వారి చైతన్యాన్నీ, మేం ప్రదర్శించ పూనుకున్నాం.

నిమ్నజాతులవారికి ప్రత్యేకించబడనట్టి, కమ్యూనిస్టులు పోటీచేయనట్టి, సాధారణనియోజకవర్గాలలో మేం కాంగ్రెసు అభ్యర్థుల్నే బలపరుస్తాం.

...క ముస్లిం నియోజకవర్గాల విషయం. కమ్యూనిస్టు అభ్యర్థుల పోటీచేయనిచోట్ల ముస్లింలీగ్ అభ్యర్థుల్ని మేం బలపరుస్తాం.

ఏ నియోజకవర్గంలోనైనా, ప్రజాశత్రువులైన దొంగ వ్యాపారస్తు... గాని, తదితరులుగాని కాంగ్రెసు తరపున నిలిచినా, లీగ్ తరపున నిలిచి... అట్టివారికి కమ్యూనిస్టుపార్టీ సహాయం చేయదు.

కాంగ్రెసునుగాని, ముస్లింలీగ్‌నిగాని, ఎదుర్కొనడానికి కాద... కమ్యూనిస్టుపార్టీ ఎన్నికలలో పాల్గొంటున్నది. ఉభయసంస్థలవారు యీ... రోజున ఒకరిపై ఒకరు ద్వేషాగ్నిని రగుల్కొల్పుతున్నారు. దాని... ఆర్పడానికి మేం పూనుకున్నాం. కాంగ్రెసూ - ముస్లింలీగూ కోరే న్యాయ... మైన కోర్కెలను బలపరుస్తూ, రెండు పక్షాలవారూ కోరే అన్యాయ... కోర్కెలను నిరాకరించే ఒక ప్రణాళికను మేం ప్రజల యెదుట పెట్టి... దాన్ని ప్రచారం చేయడంద్వారా యీ ద్వేషాగ్నిని చల్లార్పదలచుకున్నాం... ప్రజలందరి శ్రేయస్సుకు అత్యవసరమైన పునర్నిర్మాణ కార్యక్రమా... ప్రచారం చేయదలచాం.

మా నిష్పక్షపాతం ఒక్కటేకాదు, మాకుగలబలం. హిందువుల్లోను ముసల్మానులలోనూ ఉన్న ప్రజాసామాన్యపు విశ్వాసాన్ని చూరగొన్న... పార్టీ మా దొక్కటే. కార్మికవర్గం ఒక్కుమ్మడిగా బలపరిచే పార్టీకూడా మాదొక్కటే. రైతులలో హిందువులూ - ముస్లింలు ఉన్న బెంగాల్... పంజాబ్‌వంటి రాష్ట్రాల్లో బలమైన రైతు ఉద్యమం ఉన్నచోట్ల రైతు... (హిందువులు-ముస్లింలు) మాపార్టీనే బలపరుస్తారు.

మా పార్టీ కొన్నిస్థానాల్లో పోటీచేసి కొన్నిటికి పోటీచే... పోయినా, మా కార్యక్రమాన్నిమాత్రం ఆసేతు హిమాచలపర్యం... ప్రచారం చేయబోతున్నాం. మా కార్యక్రమాన్ని కాంగ్రెస... లీగ్ అనుచరులూ జాగ్రత్తగాను, ఓపికతోను, వింటారు.

అందరికీ స్వాతంత్ర్యం
అందరికీ తిండి
అందరికీ పనులు

# అంతిమపోరాటానికి కదలిరండు!

పి. సి. జోషీ

ప్రజాశక్తి ప్రచురణాలయం,
మొగల్‌రాజపురం :: బెజవాడ





ప్రజాశక్తి ప్రెస్, మొగల్ రాజ పురం, బెజవాడ.

పర్మిట్ నెం. కె. 13/సి.—10,000 — 29—1—46

# ప్ర వే శి క

ఇవాళటి ప్రధాన సమస్య భారత స్వాతంత్ర్యం.

ప్రపంచమంతటా స్వాతంత్ర్యప్రియులు ముందుకు నడుస్తున్నారు. ఇవాళ ప్రపంచంలో భారతదేశం స్వతంత్రదేశం కాగూడదనే పెద్దమనిషి ఒక్కడుకూడా లేడు. ఐతే, భారతదేశం ఇంకా ఎందుకు స్వతంత్రదేశం కాలేదు? అని అందరూ ప్రశ్నిస్తున్నారు.

ప్రతి భారతీయుడి హృదయంలోను బ్రిటిష్ పరిపాలకులమీద నేడున్నంత ద్వేషం, స్వాతంత్ర్య పిపాస మరెన్నడూ లేవు. మన విశాల దేశంలో ప్రతి వర్గంలోను, ప్రతి తరంవారిలోను, స్త్రీలలోను. పురుషుల్లోను స్వాతంత్ర్యాగ్ని పొగలు గ్రక్కుతున్నది.

మన దేశంమీద వారు పెత్తనంచేసే రోజులు గతించాయని సామ్రాజ్యవాదులకు తెలుసు. ఇది వారి ధోరణిలోనే స్పష్టమవుతూంది.

వాళ్లు మన దేశాన్ని జయించిన తర్వాత, రెండు తరాలవరకు రతీయులం నాగరికులం కామనీ. మనల్ని నాగరికుల్నిచేసే బాధ్యత మదేననీ వారు గప్పాలు కొట్టేవారు. ఈ విధంగా వాళ్లు తమ పేరాసకు ులిముసుగువేసి, ప్రపంచంఎదుటమనల్నిపనికిరానివాళ్ళంగా చిత్రించారు

కొంతకాలం గడిచింది. మిమ్మల్ని స్వపరిపాలనకు సమర్థుల్ని స్తున్నామంటూ వాళ్లు మన తాత ముత్తాతలకు చెప్పారు. తమ పాత పాట వదిలేశారు. మన సంస్కృతి గొప్పదేనట కాని, తగినంత ఉత్తమ

తమ ప్రజల్ని ఉత్తేజపరచకుండా ఒకరి నిజాయితీని ఒకరు నమ్మకుండా ఉన్నందున శత్రువు చేతుల్లోకి మనజుట్టు అందించినవార మవుతున్నాం,

## కాంగ్రెసు. లీగు, కమ్యూనిస్టు పార్టీలు

అసలు, మన విభేదాలేమిటో తరచి చూద్దాం.

కాంగ్రెస్ సమస్త భారతదేశంయొక్క స్వాతంత్ర్యానికి నిలబడుతున్నది. కాంగ్రెస్ భారతదేశానికి స్వయం నిర్ణయ సూత్రం కావాలంటుంది. కాని భారతీయుల్లో భారతీయులకు ఆ సూత్రాన్ని అంగీకరించదు. భారతదేశ స్వాతంత్ర్యమనే నినాదంచాటున, కాంగ్రెస్ హిందూ ఆధిపత్యం కోసం చూస్తున్నదనే ముస్లింలీగు అనుమానానికిదే కారణం.

ముస్లింలీగు, ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు స్వయం నిర్ణయ సూత్రం కావాలంటున్నది. కాని ముస్లింలు మెజారిటీగాలేని కొన్ని ప్రాంతాలను కూడా కోరుతున్నది. తతిమ్మా భారతదేశంతో ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు ఎలాంటిసంబంధం వుంటుందో చెప్పడానికి లీగ్ నిరాకరిస్తున్నది. ముస్లింల స్వయం నిర్ణయ సూత్రమనే నినాదంచాటున దేశద్రోహానికి, లీగుసిద్ధమవుతున్నదనే కాంగ్రెస్ అనుమానానికి కారణం యిదే.

కాంగ్రెస్ ఐక్యభారత దేశంకోసం నిలబడుతున్నది. కాని స్వాతంత్ర్య ప్రియులైన భారతీయులందరినీ ఐక్యం చెయ్యలేకపోతున్నది. అందరికీ స్వాతంత్ర్యం ఉండాలనే సూత్రంమీద ఆధారపడిన భారత సమాఖ్యను (Indian Union) గూర్చి కాంగ్రెస్ సూచనలేమీ చెయ్యలేదు. ఇందువల్ల, స్వాతంత్ర్యపోరాటానికి నానాటికీ కాంగ్రెస్ ముస్లింల బలాన్ని సంపాదించడానికి బదులు, ఉన్న బలాన్నికూడా కోల్పోతున్నది.

లీగు నిజానికి న్యాయమైనస్వయంనిర్ణయ సూత్రాన్నే కోరుతున్నది. కాని. తెగదెంపులు చేసుకోడమే మంచిదనే ధోరణిలో చెబుతున్నది. తనకుచెందని ప్రాంతాలనుకూడా కోరుతున్నది. ఇలాంటిపని, ముస్లిమేతరులను, ముఖ్యంగా ముస్లింమెజారిటీ ప్రాంతాల్లోని వారిని, లీగుకు వ్యతిరేకంగా తయారుచేస్తుంది,



బ్రిటన్‌నుంచి కాంగ్రెస్‌కోరే స్వయంనిర్ణయసూత్రాన్ని మా పార్టీ బలపరుస్తుంది. కాని భవిష్యద్భారత రాజ్యాంగంలో అన్నిజాతులకూ అదే సూత్రాన్ని అమలుపరచాలని కోరుతుంది. కాని ఇలాఅన్న వెంటనే, కాంగ్రెస్ నాయకులు మేము దేశద్రోహులమయామనీ, లీగును బలపరుస్తున్నామనీ, మామీద విరుచుకు పడతారు.

స్వయంనిర్ణయ సూత్రంకోసం ముస్లింలీగ్‌కోరే కోర్కెను మాపార్టీ బలపరుస్తుంది. కాని. న్యాయమైన సరిహద్దులకోసం పోరాడుతూ చీలికలు పేలికలైపోయిన భారతదేశానికి మారుగా, ఐచ్ఛికంగా అన్ని జాతులూ కలిసిఉన్న స్వతంత్రభారత సమాఖ్యకోసం సూచనలు చేస్తుంది. దీనితో, మేము ముస్లింల ఐక్యతను భగ్నపరుస్తున్నామని అనుమానించి, లీగునాయకులు కాంగ్రెస్‌కు తాళంవేస్తున్నామని మామీద పడతారు.

భారతదేశంలోని అన్నిజాతులకు స్వాతంత్ర్యం ఉండాలనేసూత్రం మీద ఆధారపడిన భారతదేశ స్వాతంత్ర్యానికి మా పార్టీ ఎన్నికల ప్రణాళికలో ఒక మార్గం చూపింది. ఆ మార్గాన్ని స్పష్ట పరచడంకోసమే ఈ పుస్తకం.

# 1. పాతకాలపు భ్రమలు

మనదేశంలో వివిధరాజకీయపక్షాలు ఒకదానితో మరొకటి పోరాడే కొలదీ, ప్రజల్లో చీలికలెక్కువవుతాయి; మన మాతృభూమిలో బ్రిటిష్ పరిపాలకులు పెత్తనం చెలాయిస్తూ ఎక్కువకాలం వుంటారు.

మన రాజకీయపార్టీలు పరస్పరం ఎంతగా పోట్లాడుకుంటూ వుంటాయో, అంతగా మన ఆంతరంగిక వ్యవహారాలను పరిష్కరించవలసిందంటూ అవి బ్రిటిష్‌ప్రభుత్వాన్ని అర్థిస్తూ ఉంటాయి.

కాంగ్రెస్ నాయకులు, తామిప్పుడు దేశంలోని జాతీయ విద్రోహశక్తులతో పోరాడుతున్నామనీ, ఈపోరాటం అయినాక, బ్రిటిష్‌ప్రభుత్వం తమతో రాజీకిరాకపోతే అప్పుడు బ్రిటిష్‌ప్రభుత్వంతో పోరాడుతామనీ చెప్పుకొంటున్నారు. కాని, వారు చెప్పేదానిలో అంతా యదార్థంకాదు. అసలు సంగతేమంటే — వారు ఇతర పార్టీలతో పోరాడేది తమశక్తిని ప్రదర్శించి బ్రిటిష్ ప్రభుత్వం తమతో మాత్రమే రాజీకి వచ్చేలా చేసుకోడానికే. బ్రిటిష్‌వాళ్ళతో తాము ప్రత్యేకంగా రాజీకిరాగలమనే పాతకాలపు భ్రమలను పట్టుకొని వాళ్ళిలా దేవులాడుతున్నారు. కాని ఈ భ్రమలు ఎప్పుడూ సఫలం కావు.

ఇలాగే లీగునాయకులు కూడా, తామిప్పుడు హిందువుల్లో వున్న పాకిస్థాన్ వ్యతిరేకతను అణచడానికే పోరాడుతున్నామనీ, పాకిస్థాన్ కావం తర్వాత బ్రిటిషవాళ్ళతో పోరాడుతామనీ, చెప్పుకొంటున్నారు హిందూ సోదరులకంటే బ్రిటిష్‌వాళ్ళే త్వరగా ముస్లింల కోర్కెన సంతృప్తి పరచగలరని వారనుకొంటున్నారు. వారుకూడా, కాంగ్రెస్‌వారిలాగానే. బ్రిటిషువాళ్ళతో ప్రత్యేక రాజీకోసం కలలు గంటున్నారు; అది కేవలం పిచ్చిభ్రమ తప్ప మరొకటి కాదు,

ఒక సమిష్టికుటుంబంలో కలతలువచ్చి అన్నదమ్ములు పరాయివాళ్ల సహాయంకోసం ఎదురుచూస్తే. ఆ కుటుంబం అంతటితో నాశనమయిపోతుంది. పరాయివాళ్లు అందర్నీ బానిసలుగా చేస్తారు. అప్పుడు ఇక చెప్పేదేముంది.

సాధారణంగా వెనుకపడ్డగ్రామాల్లోనే యిలాజరుగుతుంది. సమిష్టికుటుంబం విడిపోయి, ఒక్కొక్కళ్ళే న్యాయంకోసం భూస్వామి దగ్గరికి వేర్వేరుగా పోతారు. అంతటితో ఈ కుటుంబంపని అయిపోయిందని తక్కిన కుటుంబాల వాళ్ళందరూ అంటారు.

జమీందారీ గ్రామాల్లోని అమాయక రైతుల్లాగానే మన ప్రధాన రాజకీయపక్షాల నాయకులుకూడా ఎందుకు ప్రవర్తించాలి ?

ఎందుకంటే - ప్రభుత్వాన్నిగూర్చి వారిలోవున్న పాతమితవాదపు భ్రమలింకా అంతరించలేదు. వారికి తమ ప్రజల్లో కలిగిన పలుకుబడివల్ల ఎక్కువ ఆత్మవిశ్వాసం ఏర్పడింది. కాని, దురదృష్టవశాత్తు వకళ్ళనుచూస్తే ఒకళ్ళకు పడకుండాపోతున్నది. ఇద్దరూ బ్రిటిష్‌ప్రభుత్వంమీద ఇంకా ఆశలు పెట్టుకున్నారు. వారింకా పాతలోకంలోనేఉండి ఆలోచిస్తున్నారు. అందువల్లనే మన దేశంలోని స్వాతంత్ర్యశక్తులను ఐక్యపరచి బ్రిటిష్ పరిపాలనను అంతమొందించుటకు మహత్తరమైన ఒక భారత స్వాతంత్ర్య సైన్యాన్ని సమీకరించలేక పోతున్నారు. అందుకు తగిన స్వాతంత్ర్య మాత్రాలనుకూడా కనిపెట్టలేక పోతున్నారు. "స్వతంత్రభారత్" ఏరూపములోఉంటుందో వివరించిచెబితే, యీనాడు భారతదేశంలోని ప్రతిఒక్కరూ ఉత్తేజితులు కావాలి. స్వతంత్రభారత్‌లో తన స్వాతంత్ర్యం

రక్షింపబడుతుందని ప్రతిఒక్కరూ నమ్మాలి. తనయొక్క, తన సోదరులయొక్క స్వాతంత్ర్యంకోసం జరిగే పోరాటంలో తాను పాల్గొనక పోవడం తన బాధ్యతనుంచి తప్పించుకోవడమేనని భారతదేశంలోని ప్రతిఒక్కరూ గుర్తించాలి. స్వతంత్రభారత్ నిర్వచనం అంత చక్కగా వుండాలి

## ప్రమాదకరమైన భ్రమలు

మన స్వాతంత్ర్యోద్యమచరిత్ర చూసినా, బ్రిటిష్ ప్రభుత్వ ప్రకటనలు చూసినా బ్రిటిష్‌వాళ్లు కాంగ్రెస్‌తోగానీ, లీగుతోగానీ ప్రత్యేకంగా రాజీ పడతారనుకోడానికేమీ అవకాశం లేదు.

ఇండియాలోని బ్రిటిష్ వ్యాపారస్తుల సంస్థఅయిన అసోసియేటెడ్ ఛేంబర్ ఆఫ్ కామర్సులో ఉపన్యసిస్తూ వేవెలు ప్రభువు ఇలా అన్నాడు ;

“ఏదైనా పరిష్కారం కావాలనుకుంటే భారత దేశంలోని ప్రధాన రాజకీయ పక్షమైన కాంగ్రెసూ, అల్పసంఖ్యాకులూ (ఇందులో ముస్లింలే ఎక్కువమంది; వారే ముఖ్యమైనవారు) భారతసంస్థానాధిపతులూ, బ్రిటిష్ ప్రభుత్వమూ ముందుగా తమలోతాము ఒక అంగీకారానికిరావాలి, అందరి లక్ష్యమూ ఒక్కటే—భారత స్వాతంత్ర్యమూ, సౌభాగ్యమూ” ।

(టైమ్సు ఆఫ్ ఇండియా, డిసెం. 11—45)

బ్రిటిష్ లేబరు ప్రభుత్వంయొక్క ప్రధానమంత్రి అట్లీ మాన్షన్ హౌస్‌లో ఉపన్యసిస్తూ ఇలా అన్నాడు,

“1942 లో క్రిప్సు సూచనల అనంతరం ఎప్పుడూ భారతస్వాతంత్ర్యాన్ని అంగీకరిస్తూనే వున్నాం; కాని భారతీయులు దాన్ని స్వీకరించడమే తరువాయి. ఇంతవరకూ ఉన్న అడ్డంకి—చాలా పెద్ద అడ్డంకి—ఏమిటంటే భారతదేశంలోని వివిధజాతులు (Communities) తమలో తాము ఒక అంగీకారానికి రాలేక పోవడం”

(టైమ్సు ఆఫ్ ఇండియా నవం. 10—1945)

ఈ ప్రకటనలు, సిమ్లాసమావేశాన్ని ఏర్పాటుచేస్తూ వేవెలు ప్రభువు చేసిన రేడియో ఉపన్యాసానికి నకలుగానే ఉన్నాయి. అప్పుడుకూడా కాం



గ్రెస్ లీగునాయకులు తమ ఇరువురికీ సంబంధించిన ఆ మాటల్లో యిమిడి వున్న స్పష్టమైన అర్థాన్ని తెలుసుకోకుండా, వాటి వెనుక తమ క్లిష్టమైన అర్థం ఏదో ఉన్నదని వెతుకులాడారు.

ఇవాళకూడా వారదేపని చేస్తున్నారు. సిమ్లాలో మాదిరిగానే ఇప్పుడుకూడా ఉభయపక్షాల నాయకులూ బ్రిటిష్‌వాళ్లు తమతోనే పరిష్కారం చేసుకుంటారనీ, రెండవపక్షం నిరోధించినప్పటికీ తమ ఆశయమే సిద్ధిస్తుందనీ ఎవరికివారు లేనిపోని భ్రమలు పెట్టుకొనివున్నారు.

రెండుపక్షాల నాయకులూ, తమంతట తాము ముందుకు పోతునాంతమనీ, బ్రిటిష్ ప్రభుత్వానికేమీ ప్రత్యేకమైన ప్లాను లేదనీ తలుస్తున్నారు. ఎవరికి వారు అజేయులమనీ, సర్వశక్తిమంతులమనీ. రెండవపక్షం కేవలం చెడ్డదనీ అపోహపడుతున్నారు.

బ్రిటిషు సామ్రాజ్యవాదుల్ని శత్రువులుగా ద్వేషించేవారికీ, సాటి భారతీయులను నిజమైన సోదరులుగా ప్రేమించేవారికీ, వాస్తవ పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని ఆలోచించేవారికీ ఈ ఉభయపక్షాల నాయకులూ ఏ ఒక్క విషయంలోకూడా సక్రమంగా ప్రవర్తించడంలేదని స్పష్టం అవుతుంది.

నాయకులు తమలో తాము పోరాడుకొంటున్నది దేశభక్తిలేక కాదు. ఉన్నసమస్యల్లా ఏమిటంటే, ఎవరికి వారు తామే ఒప్పుచేస్తున్నామనీ, రెండోవారు తప్పుచేస్తున్నారనీ భావించడం ।

నిజానికి, ఇద్దరూ కొంతయదార్థాన్ని మాత్రమే ప్రతిబింబిస్తున్నారు. ఎవ్వరూ సంపూర్ణసత్యాన్ని ప్రతిబింబించడం లేదు.

## భారతదేశం - ఒకేజాతి

భారతదేశమంతా ఒకేజాతి అని చెప్పినప్పుడు బ్రిటిష్‌పెత్తనానికి వ్యతిరేకంగా భారతీయుల్లో ఐక్యత ఉండాలని కాంగ్రెస్ స్పష్టపరుస్తున్నది. స్వతంత్రభారతదేశం ఐక్యంగా వుండాలని కోరినప్పుడుకూడా కాంగ్రెస్ మంచివుద్దేశాన్నే వెలిబుచ్చుతున్నది. కాని ‘ఇండియా - ఒకే

' అనే దృక్పథం మన ఆంతరంగిక విభేదాలను త్రోసిపుచ్చడానికి ·దియై, అంతర్యుద్ధానికి దారితీసినప్పుడు మాత్రం ఆ నిర్వచనంలో ·లోపమున్నట్లు స్పష్టంగా తెలుస్తున్నది.

'భారతదేశం ఒక జాతి' అనే నిర్వచనంవల్ల, ముస్లింలు కాంగ్రెసు ·చి నానాటికీ ఎందుకు దూరమైపోతున్నారో కాంగ్రెసునాయకులు చెప్ప ·న్నారు. కాకపోతే, ముస్లింలు హిందువులంత స్వాతంత్ర్యప్రియులు ·నాలి. ఇలాగేచెబితే ఇది పచ్చిఅబద్ధం. అంతేకాదు; భారతస్వాతంత్ర్యో ·మ·చరిత్రనూ. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ముస్లింలు ·ంగ్రెస్ జెండాక్రింద, తమ జెండాక్రింద, నిర్వహించిన మహత్తరమైన ·త్రనూ. త్రోసిరాజనడమవుతుంది.

'భారతజాతి ఒకజాతి' అనే దృక్పథం తీసుకోవడంవల్ల కాంగ్రెస్ ·యకులు తమలో తమకే వస్తున్న విభేదాలను విడమర్చి చెప్పజాలరు.

ఉదాహరణకు — కాంగ్రెస్ స్వయంనిర్ణయసూత్రాన్ని అంగీక ·ంచాలని చెప్పే మౌలానా ఆజాద్‌కూ, అలాంటి ఆలోచనకే వ్యతిరే ·ంగా కత్తులు నూరుకు కూర్చున్న పటేల్, కృపలానీలకూ, తీవ్ర భేదాభి ·ాయాలున్నమాట అందరికీ తెలిసినగుట్టే. ఆజాద్ మతావేశపరుడన ·నికి ఎవరికీ సాహసంలేదు. మరి అలాంటి విభేదాలు ఎందుకు రావాలి?

క్రిందటిసారి తమిళుడైన రాజాజీ మద్రాస్‌ప్రధానమంత్రి అయినాడు. ·నుక, ఈసారి ఆంధ్రుడు ప్రధాని కావలసిందేనని ఆంధ్ర కాంగ్రెస్ నాయ ·లు గట్టిగా కోరుతున్నారు. భారతదేశమంతా ఒకేజాతి అనుకుంటే దీని ఆంతర్యమేమిటి?

కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడైన పట్టాభికి, ఒరియా కాంగ్రెసు వాదులు నల్ల జెండాలు చూపారు. ఆయనమీద రాళ్లువిసిరారు. "ఓ ఒరిస్సా విరోధీ, వెనక్కు పో" మ్మని నినాదా లిచ్చారు. భారతదేశమంతా ఒకేజాతి అనుకుంటే. ఈ ఘటనకూడా మనకు అర్థముకాదు.

ఇలాంటి ఉదాహరణలు ఎన్నైనా చూపవచ్చు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా మనమంతా ఒకటిగా నిలవాలని చెప్పడానికి ఇండియాఅంతా ఒకే జాతి అని చెప్పనవసరంలేదు. అలాంటి దృక్పథం మన సమ· పరిష్కారానికి గాక వాటిని అధికం చెయ్యడానికి తోడ్పడుతుంది. · వాన్ని మభ్యపెడుతుంది. హిందూ ఆధిపత్యాన్ని గూర్చిన అనుమానా రేకెత్తిస్తుంది.

## ముస్లింలు—ఒకేజాతి

ఇలాగే 'ముస్లింలంతా ఒకేజాతి' అనే లీగు నినాదంకూడా చేదికాదు. బ్రిటిష్ వారినుంచి స్వాతంత్ర్యం సంపాదించాలనే పిపాస· స్వతంత్ర భారతదేశం సామాన్య మెజారిటీ పరిపాలన సిద్ధాంతం· ఆధారపడితే అందులో హిందూ ఆధిపత్యమే ఉంటుందనే భయ వ్యక్తపరచే నినాదంగానే, ముస్లింప్రజలు దీన్ని అర్థంచేసుకుంటున్నా

కాని, హిందూ ముస్లింల జన్మభూములకు కొన్ని సమిష్టి ఆ రాలూ, ప్రయోజనాలూ లేనే లేవనేదానికి ఈ దృక్పథం పునాది అ· ప్పుడు ఇందులో ఏదో పెద్దలోపం వున్నదన్నమాట.

నిజానికి. లీగునాయకులు ముస్లింలంతా ఒకజాతి అనే సూ· మీద ఆధారపడడంవల్ల ముస్లింప్రజాచైతన్యంయొక్క పూర్వచరిత్రనుగ మనకళ్ళముందు కన్పడుతున్న ప్రస్తుత చరిత్రను గాని విశదపరచలేద

బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా బలవత్తరమైన విప్లవ మాన్ని నిర్మించుకొన్న పఠాన్లు. లీగుతోగాక, కాంగ్రెస్‌తోనే ఎం· చేతులుకలుపుతున్నారు? ఎందుకంటే. కాంగ్రెస్‌తో కలిసినప్పుడే బ్రి· పరిపాలనను అంతమొందించి స్వతంత్ర పఠాన్‌భూమిని నిర్మించుకో మనుకున్నారు.

షేక్ అబ్దుల్లా నాయకత్వాన కాశ్మీర్‌జాతీయ మహాసభ రూపొందిన కాశ్మీర్ ప్రజల (వీరిలో నూటికి 82 రు ముస్లింలు) జాతీ చైతన్యాన లీగునాయకులు ముస్లింలు ఒక జాతిఅనే సూత్రంతో ఆ చేసుకోగలరా? ఈ మహాసభ కాశ్మీర్‌ప్రజలకు స్వయంనిర్ణయ హక కావాలన్నది; ముస్లిం మెజారిటీ ప్రాంతాలకుకూడా స్వయంనిర్ణ

సూత్రం అవసరమేనని బలపరుస్తున్నది. అయినప్పటికీ ఈ మహాసభ లీగుకంటే కాంగ్రెసుతో ఎక్కువ ఆత్మీయంగా వుంది.

'ముస్లింలు ఒక జాతి' అనే నినాదంవల్ల లీగులో జరిగే విషయాలను కూడా అర్థం చేసుకోడానికి ఉపయోగపడదు.

ఉదాహరణకు— బెంగాలంతా ఒకే రాష్ట్రంగావుండి, తమకు ఇష్టమయితే పాకిస్థానులోగానీ, హిందూస్థాన్‌లోగానీ చేరేలాగను, లేకపోతే విడిగా సంపూర్ణ స్వతంత్ర రాష్ట్రంగా వుండేలాగాను కోరుతూ బెంగాల్ రాష్ట్ర ముస్లింలీగు గాంధీ—జిన్నా సమావేశ సమయంలో ఎందుకు తీర్మానించింది? ఇంతేకాక ఈ విషయంలో ఆలోచించవలసిందిగా రాష్ట్రలీగు కాంగ్రెస్ నాయకుడైన కిరణశంకర రాయ్‌కి తన తీర్మానాన్ని ఎందుకు పంపింది? ఇంతేకాదు, బెంగాల్ సమస్యమీద గాంధీజీతో తెగతెంపులు చేసుకోవద్దనీ, తమ భవిష్యత్తును బెంగాలీలే నిర్ణయించుకోగలరనీ జనాబ్ జిన్నాకు బెంగాల్‌లీగు ఎందుకు తెలియజేసింది?

1943 జులైలో జిన్నాగారు క్వెట్టా వెళ్ళినప్పుడు బెలూచీస్థాన్ ముస్లింలీగు ఆయనయందు విశ్వాసాన్ని ప్రకటిస్తూనే, (పశ్చిమోత్తర పాకిస్థాన్‌లో భాగాలైన సింధు, పంజాబ్, సరిహద్దు రాష్ట్రాలతో బెలూచీస్థానునుకూడా కలిపివేశాక) బెలూచీస్థానును ఒక ప్రత్యేక రాష్ట్రంగా" నిర్మించేటందుకు కృషి చేయడానికి ఒక కమిటీని నియమిస్తూ ఎందుకు తీర్మానించింది? (హిందూ, జులై 3, 1945) కనుక, ఇండియా ఒక జాతి అనే దృక్పథంగానీ, ముస్లింలు ఒక జాతి అనే దృక్పథంగాని మన పూర్వచరిత్రను అర్థంచేసుకోవడానికి ఉపయోగించవు; ప్రస్తుతం మన తక్షణ కర్తవ్యమైన భారత జాతీయైక్యతను సాధించడానికికూడా అవి ఉపయోగించవు. పైపెచ్చు, కాంగ్రెసు లీగులమధ్య ఇంకా అగాధం పెంచడానికీ, అంతిమ పోరాటానికి మనలో ఐక్యత లేకుండా చేయడానికీ మాత్రమే తోడ్పడుతాయి.

## స్వతంత్రజాతుల సమిష్టి కుటుంబం

భారతదేశం స్వతంత్ర జాతులయొక్క సమిష్టి కుటుంబమని కమ్యూనిస్టుపార్టీ దృక్పథం. ఇదే మన చరిత్రకు సరియైన అర్థమనీ, ఇదే మన దేశానికి ఉజ్వల భవిష్యత్తును చేకూర్చుతుందనీ మా నమ్మకం.

బ్రిటిష్‌వాళ్ళకు వ్యతిరేకంగా మన స్వాతంత్ర్య పిపాసనూ, బ్రిటిష్ పరిపాలనకు వ్యతిరేకంగామనఐక్యతనూ,ఈనిర్వచనంతేటతెల్లంచేస్తుంది. మన దేశాన్ని స్వతంత్రంగాను, నూతన ప్రపంచంలో బలవత్తరమైన ఒక శక్తిగాను నిర్మించడానికి; ప్రపంచ శాంతికి పునాదులు వేయడానికి; బానిస దేశాల విముక్తికోసం పోరాడ్డానికి; ప్రజాభ్యుదయంకొరకు కృషి చేయడానికీ—ఈ దృక్పథమే సరియైన మార్గదర్శి. మన ప్రజలు స్వతంత్రంగా తమ ఇష్టప్రకారం అభివృద్ధి చెందడానికి ఇదే చక్కని హామీ ఇస్తుంది.

మనం చిన్నచిన్న ముఠాలుగా ఉండేదశనుంచి మారి, ప్రజలుగా అభివృద్ధిచెందిన తరువాతనే బ్రిటిష్‌వాళ్ళు మనల్ని జయించారు, కాని అప్పటికి మనం ఇంకా ఆధునిక జాతులుగా పరిణామం చెందలేదు. వాళ్లు మన స్వదేశీరాజులను ఉపయోగించుకొని, మనలో మనకు పోరాటాలు పెట్టి, ఒకరితర్వాత మరొకరినీ, ఒకప్రాంతం తర్వాత మరొకప్రాంతాన్నీ ఒకప్రజతర్వాత మరొక ప్రజనూ వరసగా అందర్నీ జయించారు.

బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి స్వాతంత్ర్యం సంపాదించుకోడానికి, మనం కళ్లు తెరవగానే మన సంస్కృతిలోను, స్వాతంత్ర్యోద్యమంలోను, వివిధభావాలు పొడసూపాయి.

ఈ వివిధ భావాల్లో రెండు దృక్పథాలేర్పడ్డాయి—ఒకటి సనాతన దృక్పథం; రెండవది నవీన దృక్పథం, ఇవి రెండూ హిందువులలోను ముస్లింలలోనుకూడా ఏర్పడ్డాయి.

అప్పటి రాజులక్రింద, మతాధిపతులక్రింద మనమతం శిథిలమైపోయిందికాబట్టే మనల్ని బ్రిటిష్‌వాళ్లు జయించగలిగారని సనాతనులు

కాంగ్రెసును బలపరచాలని ఇవాళ కాంగ్రెసు నాయకులు యివాళ హిందూ నియోజకవర్గాల్లో చెబుతున్నారు. ముస్లిం మెజారిటీ ప్రాంతాల్లో కాంగ్రెస్ ప్రధాన నినాదం ఇదే.

ఈవిధంగా కాంగ్రెస్-లీగునాయకత్వాలు యివాళ సనాతనప్రచారానికి తయారైనాయి. కాని, వాళ్ళపని చేస్తున్నది తమఅనుచరుల్ని బ్రిటిష్‌వాళ్ళ మీదికి రెచ్చగొట్టడానికికాదు. ఒకళ్ళమీదికొకళ్ళను పురికొల్పడానికి।

ఉన్న అరిష్టమలా ఏమంటే, పాత హిందూముస్లిం మితవాదుల్లాగానే కాంగ్రెస్ లీగు నాయకులు బ్రిటిష్ ప్రభుత్వంమీద ఆశలు పెట్టుకున్నారు.

సిమ్లాసమావేశం విఫలమైన తర్వాతకూడా, ముస్లింలీగు ముస్లింలకందరికీ ప్రాతినిధ్యం వహించదనీ కాంగ్రెస్ కొంతమంది ముస్లింలకైనా ప్రాతినిధ్యం వహించదనీ, వైస్రాయి వేవెలు తెలియజేసిన తర్వాతకూడా ఇంకా సామ్రాజ్యవాదంమీద కాంగ్రెస్ నాయకుల విశ్వాసం చెక్కుచెదర లేదు. ఆ మర్నాడే కాంగ్రెస్ అధ్యక్షుడు మౌలానా అజాద్ వైస్రాయికిలా వ్రాశాడు.

"ఇప్పటికొక అధ్యాయం ముగిసింది. కనుక, మా హృదయాలూ, మీ హృదయం ఇకముందు అందరికీ గౌరవప్రదమైన భారత స్వాతంత్ర్య గమ్యస్థానంవైపు దారితీసే ఒక పరిష్కార మార్గాన్ని అన్వేషించాలి. పరస్పర సహకారానికి ఇప్పుడున్న ఆటంకాలను త్రోసిరాజనడానికి వీలులేదు." (1945 జులై 15 న మౌలానా ఆజాద్ వైస్రాయికి వ్రాసిన ఉత్తరంలో నుంచి) ఈ ఉత్తరప్రత్యుత్తరాలు ఏ. ఐ. సి. సి. సమావేశంలో పంచిపెట్టారు. ఇంకా ప్రచురించలేదు.)

లీగు అధ్యక్షుడైన జిన్నాగారి ధోరణికూడా ఇలాగేవుంది 1944 డిసెంబరులో వైస్రాయి ఒకరాజకీయ వైద్యునివేషం వేసుకొని పాకిస్థాన్‌అనే 'ఆపరేషన్' పనికిరాదని ఉపన్యసించిన తర్వాతకూడా, లీగు హక్కును సిమ్లాలో తిరస్కరించిన తర్వాతకూడా, జిన్నాగారికి బ్రిటిష్‌వాళ్ళ నిజాయితీలో విశ్వాసం మొక్కవోలేదు. ఏమైనా మార్పుంటే ఆ విశ్వాసం మరింత పెరిగిందనే చెప్పాలి.



1945 డిసెంబరు 10 వ తేదీ 'అసోసియేటెడ్ ఛేంబర్సు ఆఫ్ కామర్సు' సభలో ఉపన్యసిస్తూ వైస్రాయి "భారత ప్రజలు రాజకీయ స్వాతంత్ర్యం పొందాలనీ, ఒక ప్రభుత్వాన్నిగానీ లేక ప్రభుత్వాలనుగానీ ఏర్పరచుకోవాలనీ" బ్రిటిష్ ప్రభుత్వం కోరుతున్నదన్నాడు. ఈ ఉపన్యాసం జిన్నాగారి విశ్వాసాన్ని మరింత బలపరిచింది. దీనికి ఆయన స్వాగతమిస్తూ ఇలా అన్నాడు: రెండో విషయంవల్ల నాకు అర్థమవుతున్నదేమంటే వైస్రాయి యిప్పుడే భారతరాజకీయ పరిస్థితిని అర్థం చేసుకోవడమారంభిస్తున్నాడు.........ఆయన ఇకముందు భారతదేశ విభజన ఆవశ్యకమనీ, అదొక్కటే భారతరాజకీయ సమస్యకు పరిష్కార మార్గమనీ; స్పష్టపరుస్తాడని ఆశిస్తాను....వివిధ అల్పసంఖ్యాకవర్గాలు (మైనారిటీలు) భారత రాజకీయ జీవితంలో ముఖ్యపాత్ర వహిస్తాయనీ, భారతదేశంలో జరిగే ఏ పరిష్కారంలోనయినా వారి వాక్కును ప్రకటించాలనీ, వారికి న్యాయం జరగాలనీనేను మొదటనుంచీ చెబుతున్నాను". (హిందూ డి. 18.1945)

నాయకులు ఈ విధంగా వాస్తవప్రపంచంలో తమకు తగులుతున్న దెబ్బల నన్నిటినీ మరిచిపోయి, వేవెల్ చెప్పే తియ్యనిమాటలమీద ఎలా ఆధారపడుతున్నారో చూడండి। ఇద్దరికీ వేవెలు అంటే నమ్మకం. వైస్రాయి 'గౌరవప్రదమైన పరిష్కారం' చేస్తాడని కాంగ్రెస్ అధ్యక్షుడూ, 'న్యాయమైన పరిష్కారం' చేస్తాడని లీగు అధ్యక్షుడూ—ఇద్దరికళ్ళూ వేవెలు మీదనే।

ఒకళ్ళకు వ్యతిరేకంగా ఒకళ్ళు ఆందోళన చెయ్యడమూ. రెండో వాళ్ళను త్రోసివేసి తమతో బ్రిటిష్ ప్రభుత్వం రాజీకి వస్తుందని నమ్మకోడమూ—అంటే; అర్థం మితవాద రాజకీయాలకు తిరిగి రావడం అన్న మాట. ఇంపీరియలిస్టు పాలకుల చేతుల్లో చిక్కడం అన్నమాట. ఇది భారత స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనడమే అయితే, ఇది నిష్ప్రయోజకం. ఇది మన లక్ష్యాన్ని చేరుకోడానికి తోడ్పడదు. మన అపజయానికీ నిరంతర దాస్యానికి మాత్రమే దారితీస్తుంది. ఈ పని చెయ్యడమంటే మన పాత చరిత్ర నంతటినీ విస్మరించటమన్న మాట।

# 2. హిందూ ముస్లిం విభేదాలు - సామ్రాజ్యవాదుల యెత్తులు

హిందూ ముస్లిం విభేదాలు, ప్రధానంగా కాంగ్రెస్ లీగు విభేదాలు ఇవాళ భారతదేశంలో ఒక గడ్డుసమస్యగా తయారైనాయి.

వాటివంక చూడకుండా కళ్లు మూసుకుంటే లాభంలేదు. "ఇవన్నీ మత విభేదాలు, ఆర్థిక, రాజకీయ సమస్యలమీద ప్రజలను ఐక్యపరచుకొంటూ నవీన జీవిత విధానం పెంపొందినకొద్దీ అవే పోతాయి" అని చెప్పి లాభంలేదు.

ఈ విభేదాల రాజకీయ స్వభావ మేమిటో వివిధ జాతులు నివసించే మన దేశంలో, నవీన జీవిత విధానంలో అవి ఎలా రూపొందాయో అర్థం చేసుకోడం స్వాతంత్ర్య కాముకుల విధి. ఈ విభేదాలను న్యాయమైన విధంగా పరిష్కరించి, స్వాతంత్ర్య లక్ష్యమూ, దానికి అనువైన కార్యక్రమమూ అందరికీ సంతృప్తికరమైన విధంగా నిర్వచించి, ప్రజల్లో ఉన్న ప్రతి వర్గం స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనేలా చెయ్యడమే మనవిధి.

మనం ఈవిధిని ఎప్పుడైతే నిర్వర్తించలేక పోయామో, అప్పుడల్లా సామ్రాజ్య వాదులు మనవిభేదాలను వినియోగించుకొని. వాటినింకా ఎక్కువచెయ్యడానికి ప్రయత్నించారు. మన ప్రజల్లో ఇంకా చీలికలు పెట్టడానికీ, మన స్వాతంత్ర్య పైనికులను ఒందొరులనుంచి ఇంకా వేరు



చెయ్యడానికీ వారు ఆ విభేదాలను వినియోగించుకున్నారు. ఇలా అయితేనే సురక్షితంగా తాము మనమీద ఎక్కువకాలం పెత్తనం చేయవచ్చు. ఇలా మనల్ని విభజించాలని బ్రిటిష్‌వాళ్లు చేసే ప్రయత్నాల నెదుర్కోడానికి దేశంలోని స్వాతంత్ర్య శక్తులనన్నిటినీ మనం సమీకరించ గలుగుతూ వచ్చామా ? – చాలవరకు సమీకరించ లేకపోయామనే చెప్పాలి. ఇది మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రను చూస్తే తెలుస్తుంది.

దీనిఫలితం–ఇవాళ శక్తివంతమైన మన స్వాతంత్ర్యోద్యమం అంతిమ పోరాటానికి సిద్ధం కావలసిన సమయాన, దేశమంతా పరస్పర ద్వేషంతో రెండుక్యాంపులుగా చీలిపోయివుంది. ముస్లింలలో అత్యధిక సంఖ్యాకులు లీగుజెండా క్రింద ఐక్యమై వున్నారు. తతిమ్మా దేశమంతా కాంగ్రెస్ వెనుక నిలబడి వుంది.

పరస్పర విరుద్ధమైనభావాలే ఈ రెండు క్యాంపులను విడదీస్తున్నాయి. ప్రతిఒకరూ రెండోవారి ఆశయం స్వాతంత్ర్యోద్యమానికి విద్రోహకరమనీ, తమ ఆధిపత్యంకోసం రెండోవారి స్వాతంత్ర్యాన్ని నిరాకరిస్తున్నారనీ అంటున్నారు.

## విభేదాలెందుకు వచ్చాయి ?

మన స్వాతంత్ర్యోద్యమం వెనుకటికంటే ఎంతో బలవత్తరంగాను, శక్తివంతంగాను ఉన్న ఈ నాడు ఇలాంటివిచ్ఛిన్న పోకడలు ఎందుకు వచ్చాయి ? ఈ హిందూముస్లిం సమస్య వెనుకటికంటె యీ నాడు ఎందుకు గడ్డువారింది ?

సాధారణంగా, మన స్వాతంత్ర్యోద్యమంయొక్క ప్రతిదశలోను బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మన విభేదాలను వినియోగించుకున్నారన్నమాట వాస్తవం. కాని, ఇక్కడ ప్రధానమైన విషయం ఏమంటే - స్వాతంత్ర్యోద్యమ నాయకులు హిందూముస్లిం విభేదాలను ఎందుకు నిర్మూలించలేకపోయారు ? సమిష్టి స్వాతంత్ర్యంకోసం న్యాయంయొక్క, ప్రజాస్వామికంయొక్క, సామాన్య సూత్రాలను ఎందుకు సమన్వయ పర్చలేకపోయారు ?

ఎందుకంటే — భారత స్వాతంత్ర్యోద్యమంయొక్క • ప్రాథమిక సూత్రాలను, కార్యవిధానాన్ని నిర్మించడానికత్యవసరమైన సమిష్టి భావాలకే మనం ఇంకా రాలేకపోయాం.

బ్రిటిష్ పరిపాలనపట్ల ద్వేషాన్ని వెల్లడించే ఒక బలమైన కోరికగా మాత్రమే నేడు మన స్వాతంత్ర్యాశయంవుంది. మనమందరం కోరే స్వాతంత్ర్యంయొక్క స్వరూపం ఎలా వుండాలో నిర్వచించగల నూతన ప్రజాస్వామిక చైతన్యం ఇంకా రాలేదు.

అందుకనే మన స్వాతంత్ర్యోద్యమం చీలికలు పేలికలుగావుంది. అది మన ప్రజల స్వాతంత్ర్య వాంఛను వెల్లడిస్తుంది కాని, ప్రజలనందరినీ అంతకంతకూ ఐక్యపరచి, స్వాతంత్ర్య శక్తుల్ని నానాటికీ పెంపొందింపజేయగల ప్రజాస్వామిక సూత్రాలతో నడుపబడడంలేదు.

అందుకనే మనం బ్రిటిష్ ప్రభుత్వంతో తలపడిఓడిపోయి నప్పుడల్లా మనలో మనం ఒక అంగికారానికి రాజాలనప్పుడల్లా - అన్యోన్యంగా నిందించుకొంటున్నాం.

మన దేశాన్ని విభజించి స్వాతంత్ర్యోద్యమాన్ని విచ్ఛిన్నంచేసి, మన బానిసత్వాన్ని చిరస్థాయిగా చేసే మూడో కమ్యూనల్ అవార్డు వచ్చే ప్రమాదాన్ని తప్పించుకోడం కోసం హిందూ ముస్లిం విభేదాలను పరిష్కరించాలని మనప్రజలు కోరుతున్నారు. అందుకనే, మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో పూర్వం ఎప్పుడెప్పుడు, ఎక్కడెక్కడ ఐక్యతను ఎందువల్ల నిర్మించలేక పోయామో, ఎందువల్ల సామ్రాజ్యవాదుల ప్రయత్నాలను ఓడించలేక పోయామో - మేము ఎత్తి చూపుతున్నాం

## కాంగ్రెస్ లీగ్ విభేదాల పునాది

హిందూముస్లిం సమస్యలో ఇంత గందరగోళానికి చాలవరకు కారణం కాంగ్రెస్ లీగు నాయకులు ఇంకా పంథొమ్మిదోశతాబ్దపు మితవాద బూర్జువా ప్రజాస్వామిక ధోరణిలో వుండడమేనని చెప్పాలి. మరొక కారణం: మన వృద్ధ నాయకులు, మన దేశాన్నీ మన ప్రజల్నీ వారివారి



ప్రత్యేకతల్నీ నూతనాభివృద్ధినీ అర్థంచేసుకోడానికి బదులు, తమకు పూర్వంనుంచీ ఉన్న అపోహలమీద, ఇతరదేశాలనుంచి తీసుకున్న తప్పుడు సాదృశ్యాలమీద ఆధారపడ్డారు.

మన స్వాతంత్రోద్యమం యొక్క మొదటిదశలో కాంగ్రెస్ - లీగ్ విభేదాలకిదే పునాదిగా కన్పిస్తుంది. ఈ శతాబ్దం మొదట్లో, మన స్వాతంత్రోద్యమం చదువుకున్న మధ్యతరగతి పట్టణ ప్రజలకు మాత్రమే సంబంధించి ఉన్నప్పుడు, బ్రిటిష్ యాజమాన్యంక్రింద బాధ్యతాయుత ప్రభుత్వంకంటె మనలక్ష్యం ముందుకు పోనప్పుడు, మన నాయకులకు బ్రిటిష్‌వాళ్ళ న్యాయబుద్ధిమీద బ్రిటిష్ ప్రజాస్వామిక సూత్రాలమీద నమ్మకం వుండేది. అప్పుడు మనకు ప్రజా ప్రతినిధి సంస్థలు కావాలని కోరుతుండేవాళ్ళం. మన కోరికకు ప్రాతిపదికగా, తమ వోటును తెలివి తేటలతో వినియోగించుకోగలవారికే (ధనికులకూ, విద్యావంతులకూ) వోటుహక్కులుండాలనే బ్రిటిష్ బూర్జువా సూత్రాన్ని అంగికరించాం! ఆనాటి మన కాంగ్రెస్ ముస్లిం నాయకులు బ్రిటిష్ ఎన్నికల విధానం న్యాయసమ్మతమైనదనీ, మంచిదనీ ఆమోదించారు. కాని ఈ సూత్రం తమకు వ్యతిరేకమవుతుందని త్వరలోనే ముస్లిములు కనుక్కున్నారు.

ఆరోజుల్లో ఇండియాలోని వివిధ ప్రాంతాల్లో ప్రజల నూతన వికాసం ఇప్పటికంటేకూడా చాలా హెచ్చుతగ్గులుగా వుండేది. వర్తక వ్యాపారాలు, విద్య ముందుగా బొంబాయి కలకత్తా మద్రాసులలో అభివృద్ధి చెందాయి. అంటే ఉత్తరాది ముస్లిం ప్రాంతాల్లోకంటె ముందుగా హిందూ ప్రాంతాల్లో నూతన జీవితం ప్రారంభమైంది, సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ రోజుల్లో యూనివర్సిటీ విద్యనభ్యసించేవారిలో ముస్లింలు నూటికి నలుగురు మాత్రమే (1882 హంటర్ కమీషన్.)

ముస్లిం సంస్కృతికి నిర్మాతయైన సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ ఆ రోజుల్లో కాంగ్రెస్ కోరే ప్రజాప్రతినిధి సంస్థల నినాదాన్ని వ్యతిరేకించాడు. "వోటును తెలివితేటలతో, స్వతంత్రంగా వినియోగించుకోగలవారికే" వోటుహక్కు వుండాలనే బ్రిటిష్ బూర్జువా సూత్రాన్ని ఆయన

కూడా అప్పటి కాంగ్రెస్ నాయకుల్లాగానే బలపరిచేవాడు. (సుప్రీం లెజిస్లేటివు కౌన్సిల్లో స్థానిక స్వపరిపాలన చట్టంమీద 1883 లో ఆయన ఉపన్యాసం.) కాని, ఈ సూత్రాన్ని భారతదేశ పరిస్థితుల కనుగుణ్యంగా మార్పుచెయ్యకపోతే విద్యాసంపదలు తక్కువగావున్న ముస్లింలకు, ముస్లిం మెజారిటీ ప్రాంతాల్లోకూడా సక్రమ ప్రాతినిధ్యం ఉండదని సర్ సయ్యద్ అభిప్రాయపడ్డాడు. అందువల్లనే సర్ సయ్యద్ అహ్మద్‌ఖాన్ తక్కిన ముస్లిం నాయకులు బ్రిటిష్ గవర్నమెంటునుండి మొదట నామినేషన్లరూపంలోను, తర్వాత ప్రత్యేక నియోజకవర్గాల రూపంలోను రక్షణ కోరారు.

కాంగ్రెస్ నాయకులు, హిందూనాయకులు ఆస్తి - విద్య - యోగ్యతల ప్రాతిపదికమీద "ప్రజాస్వామికం"గా ఎన్నికలు జరగాలని, శక్తిసామర్థ్యాలు మాత్రమే పరీక్షింపబడాలికాని జాతి, మతాలుకావనీ వాదించేవారు. సమిష్టి నియోజకవర్గాలకోసం వారు పోరాడారు. దీంతో నియోజకవర్గాలు సమిష్టిగా వుండాలా, ప్రత్యేకంగా వుండాలా అనే సమస్యమీద అభిప్రాయభేదం వచ్చింది.

## సమిష్టి నియోజకవర్గాలా ? ప్రత్యేక నియోజకవర్గాలా ?

ప్రజలు నూతన జీవితాన్ని నిర్మించుకోడానికి సమిష్టి నియోజకవర్గాలే నిజమైన ప్రజాస్వామిక పద్ధతి. సమిష్టి నియోజకవర్గాల ప్రకారం ఏర్పడిన ఎన్నికల పద్ధతివల్ల చిన్న చిన్న విభేదాలుగాక అందరికీ సంబంధించిన విషయాలు స్పష్టపడతాయి.

కాని, అసలు తగాయిదాకుమూలం సమిష్టి నియోజకవర్గాలుకాదు. ఆస్తినిబట్టి విద్యనుబట్టి నిర్ణయించబడ్డ సంకుచిత ఎన్నికల విధానంలో వుంది. వెనుకబడిన ప్రాంతాల్లో ముస్లింలకు తగిన ప్రాతినిధ్యంలేకుండా చేసింది యీ సమిష్టి నియోజకవర్గాలే. ఈసంకుచిత ఎన్నికల పద్ధతివల్ల కలిగే నష్టాలను వారించడానికి, వోటుహక్కు ఇంకా ఎక్కువమందికి ఏర్పడేందుకు కాంగ్రెస్ లీగు నాయకులు కలిసి బ్రిటిషు ప్రభుత్వాన్ని



చుట్టుముట్టవలసింది. కాంగ్రెస్‌వారూ, హిందువులు, ముస్లింలకు జరిగిన ఈ అన్యాయాన్ని అర్థంచేసుకోకుండా, 'ప్రజాస్వామ్యం' పేరిట ఆ సంకుచిత ఎన్నికవిధానాన్నే సమర్థించారు. ఆస్తి, విద్యా యోగ్యతలనే ఆమోదించిన ముస్లింలు నామినేషన్లకోసం, ప్రత్యేక నియోజక వర్గాలకోసం, బ్రిటిష్‌వాళ్ళ వంక తిరిగారు.

వోటు హక్కును విస్తృతం చేయడంకోసం, పరస్పరానుగుణమైన ప్రాతిధ్యంకోసం కాంగ్రెసువారు, ముస్లింలు కలసి ప్రభుత్వంమీద ఒత్తిడి తెచ్చినట్లయితే, అసలు సమిష్టి నియోజకవర్గాలతోనే సరిపొయ్యేది కాని, కాంగ్రెసూ, మధ్యతరగతి హిందూనాయకులూ ఆస్తి, విద్యాయోగ్యతలతో కూడిన వోటు హక్కువల్ల తమకు వచ్చే అవకాశాన్ని వదలుకో దలచలేదు. ఇక నామినేషన్లద్వారా, ప్రత్యేక నియోజక వర్గాలద్వారా బ్రిటిష్ రక్షణలకోసం ముస్లింలుచూశారు. కనుక, బ్రిటిష్‌వాళ్ళ సంకుచిత ఎన్నికల పద్ధతిని హిందూ ముస్లింలు కలసి ఎదుర్కొనే దానికి బదులు, మనలో మనకే చీలికవచ్చింది. మనలో మనకు ప్రత్యేక నియోజకవర్గాలు ఏర్పరచే అవకాశం బ్రిటిష్ ప్రభుత్వానికి కలిగింది.

1906 లో ముస్లింలీగు నిర్మాతలు తమ రాయబారవర్గంద్వారా వైస్రాయికి తెలిపిన కోర్కెల ఆధారంమీద, బ్రిటిష్‌వాళ్లు ప్రత్యేకనియోజక వర్గాలను ఏర్పరచడంతోనే, భారతదేశంలో మత కలహాలకు బీజాలు నాటబడ్డాయని ఇప్పటికీ నిజాయితీగల కాంగ్రెసువాదులు చెప్పుతారు. అందుకని అది "ఆంగ్లో ముస్లింకుట్ర" అని అంటారు, కాని ఇదిపూర్తి యదార్థంకాదు; సగంమాత్రమే. తక్కినసగం ఏమంటే కాంగ్రెసుగాని, హిందూ నాయకులుగాని సంకుచితమైన ఆస్తి యోగ్యతా నియోజకవర్గ పద్ధతివల్ల తమ ముస్లిం సోదరులకు జరిగిన అన్యాయాన్ని తొలగించే ప్రయత్నం చేయలేదు.

తర్వాత, స్వాతంత్ర్యోద్యమంయొక్క ప్రతి దశలో మనం ఇలాగే అపజయాలు పొందుతూ వచ్చాం. ఈ మొదటి దశలో, బ్రిటిషు యాజమాన్యంక్రింద బాధ్యతాయుత ప్రభుత్వమే మన లక్ష్యంగా వున్నప్పుడు,

శాసనసభల్లో ఎవరికెంత ప్రాతినిధ్యం వుండాలనేదే హిందూ ముస్లిం విభేదాలకు మూలకారణం అయింది. అది సమిష్టి నియోజక వర్గాల ద్వారానా? లేక ప్రత్యేక నియోజకవర్గాలద్వారానా? బ్రిటిషుప్రభుత్వం ప్రత్యేక నియోజకవర్గాల నేర్పరచింది. కాని దాంతో హిందూ ముస్లిం విభేదాలేమీ పరిష్కారం కాలేదు. కాంగ్రెస్‌వాదు లీనాటికీ 'కమ్యూనల్ అవార్డును' దూషిస్తారు. ముస్లింలు దాన్ని ఒక వరప్రసాదంగా చూస్తారు. అన్యోన్య న్యాయం, సమిష్టి జీవితం, నిజమైన ప్రజా స్వామ్యం—వీటిమీద మన స్వాతంత్ర్యోద్యమం ఒక పరిష్కారానికి రాలేకపోయింది. ఈనాటికీ కూడా ఈ సమస్యమీద మనకు స్పష్టమైన పరిజ్ఞానంలేదు.

ఆరోజుల్లో హిందువులు ఇప్పటిలాగానే, ప్రత్యేకత కోరుతున్నందుకూ బ్రిటిష్‌వాళ్లవైపు చూస్తున్నందుకూ ముస్లింలను నిందించేవారు. కాంగ్రెస్‌లో హిందూ ఆధిపత్యం వుందని ముస్లింలు ఆరోపించేవారు. ఇక్కడ బ్రిటిష్‌వాళ్లు తమ 'చీలదీసి పాలించే' విధానంలో విజయం పొందారు. ఎందువల్ల? అన్యోన్యన్యాయాన్నీ నిజమైన ప్రజాస్వామికాన్నీ, ఆధారంగా చేసుకొని కాంగ్రెస్‌నాయకులు ముస్లింనాయకులు సమిష్టిగా ఒక పరిష్కారానికి రాలేకపోయారు కాబట్టి.

వయోజన వోటింగు పద్ధతి వచ్చినట్టయితే, ఈ సమిష్టి ప్రత్యేక నియోజక వర్గాల సమస్య మరో విధంగా వుండేది. వయోజన వోటింగిస్తే, కొన్నిసీట్ల రిజర్వేషన్‌తో సమిష్టి నియోజక వర్గాలను ముస్లింలు అంగీకరించే వున్నారు. కాని, జాతి మతాల దృష్టితో చేసిన ఈ సీట్ల రిజర్వేషనుకూడ జాతి మత విభేదాలకు దారితీస్తుంది. జాతి, మత విభేదాలకు దారితీయకుండా వుండే పద్ధతి ఏదంటే - ప్రతి గ్రూపునూ వారు తెచ్చుకోగలిగిన వోట్లనుబట్టి తగిన ప్రపోర్షనల్ ప్రాతినిధ్యం వుండేలాగా చూడాలి.

ఈ విధంగా వయోజన వోటింగు సమిష్టి నియోజక వర్గాలు, (ప్రపోర్షనల్ రిప్రెజెంటేషన్) వుండడమనేది వివిధ ప్రజలున్న మన దేశంలో న్యాయమైన మార్గం అన్ని జాతులకు, అన్ని గ్రూపులకు పాలక

చూడు :—

26 వ పేజీ చివరి పేరాలో ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ ద్వారా అన్ని పా లకు పాలకసంస్థల్లో తగిన ప్రాతినిధ్యం వస్తుందనీ, అదే సరయిన ప్రజాస్వామి పద్ధతి అని చెప్పబడి ఉంది.

ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ అంటే ఏమిటి? దానిద్వారా ప్రజలందరి అన్ని పార్టీలకు న్యాయం ఎలాజరుగుతుందో చూద్దాం. వయోజన ఓటింగున ప్రవేశపెట్టి ప్రపోర్షనల్ రిప్రజెంటేషన్ పద్ధతిద్వారా ఎన్నికలు జరిపితే అన్నిపా లకు, గ్రూపులకు వారి బలాన్నిబట్టి ప్రాతినిధ్యం వస్తుంది. అంటే ఎన్నికలలో ప్రతి పార్టీకి వచ్చిన ఓట్ల దామాషాప్రకారం సీట్లుకూడా యివ్వబడుతాయి. ఉదాహరణకు. వయోజన ఓటింగు ప్రవేశపెడితే కృష్ణాజిల్లాలో 10 లక్షలమంది ఓటర్లు ఉన్నారనుకుందాం. అసెంబ్లీకి 10 మంది ప్రతినిధులను పంపాలనుకుందాం. ఎన్నికలలో కాంగ్రెసు, కమ్యూనిస్టుపార్టీ, నిమ్నజాతుల ఫెడరేషన్, ముస్లిం లీగు పోటీచేస్తున్నాయనుకుందాం. అప్పుడు ఈ నాలుగుపార్టీలుకూడా తమ తమ అభ్యర్థులను ప్రకటించుతాయి. ప్రతి పార్టీకూడా తమ అభ్యర్థులను ఒక వరుసలో ప్రకటించుతాయి. ఎన్నికలలో 5 లక్షల ఓట్లు కాంగ్రెసుకు, 3 లక్షల ఓట్లు కమ్యూనిస్టు పార్టీకి, 1 లక్ష నిమ్నజాతుల ఫెడరేషన్‌కు వచ్చాయనుకుందాం. అప్పుడు కాంగ్రెసు లిస్టులోని మొదటి ఐదుగురు, కమ్యూనిస్టుపార్టీ లిస్టులోని మొదటి ముగ్గురు, లీగు, నిమ్నజాతుల ఫెడరేషన్ లిస్టులలో మొదటివారు ఎన్నుకోబడతారు.

ఈ పద్ధతిద్వారా ప్రజలకోసం పాటుబడుతూ ప్రజలకు ప్రాతినిధ్యంవహించే ప్రతి పార్టీకి తమ ప్రతినిధులను అసెంబ్లీకి పంపుకోవచ్చు. ఆయాపార్టీలకు ప్రజలలోవున్న పలుకుబడి, బలాన్నిబట్టి సీట్లువస్తాయి. ఇది చక్కనైన ప్రజాస్వామిక పద్ధతి. యూరప్‌లోఏర్పడిన నూతనప్రభుత్వాలన్నీ ఈపద్ధతినే అవలంబిస్తున్నాయి.

సంస్థల్లో తగిన ప్రాతినిధ్యం కలిగించగల ప్రజా స్వామికమయిన పద్ధతి యిదే. సీట్ల రిజర్వేషన్‌తో సమిష్టి నియోజక వర్గాలుగాని. ప్రత్యేక నియోజకవర్గాలుగాని ఒక మత స్వరూపం దాల్చి వెనుకటి లాగానే ఇప్పుడున్న విభేదాలమీద మన ప్రజల్ని చీలదీస్తాయి. ఈ పని చేయడానికి సహజంగా బ్రిటిష్‌వాళ్ళు తయారుగానే వున్నారు. వాళ్ళు మింటోమోర్లేయాక్టుద్వారా మనకు ప్రత్యేక నియోజక వర్గాలు ప్రవేశపెట్టారు.

కాని వయోజన వోటింగు, ప్రపోర్షనల్ రిప్రజంటేషన్ బ్రిటిష్ రాజ్యాంగ విధానానికే కొత్త విషయం. అలాంటి బ్రిటిష్ రాజ్యాంగాన్ని మన నాయకులు ప్రజాస్వామికానికి నమూనాక్రింద తీసుకున్నారు! వారి నాయకత్వం బ్రిటిష్ మితవాద భావాలమీద ఆధారపడివుంది. మన కాంగ్రెస్, లీగు దాదాలు వారి చిన్నతనంలో "ఒకే ప్రజ. ఒకే జాతి, ఒకే దేశం" అనే సూత్రాన్ని ప్రబోధించే పుస్తకాలు చదువుకున్నారు. కాని. ఆ భావాలనే ఒకరు మన జాతీయ జీవితానికి సమన్వయింపజూసేటప్పటికి రెండోవారు సహజంగా వెనక్కు తగ్గేవారు. ముస్లిం నాయకులుకూడా ఈ సూత్రం న్యాయమైనదే అనుకున్నప్పటికీ, ఆ సమయంలో అది తమ ప్రయోజనాలకు వ్యతిరేకంగావుందని వాదించేవారు.

## బ్రిటిష్ భావాలు - భారతదేశం

కాబట్టి కాంగ్రెస్, లీగు నాయకులు తాము బ్రిటిష్‌వాళ్ళ పుస్తకాల్లో నేర్చుకున్న ప్రజాస్వామిక భావాలను మన దేశానికి అన్వయించ పూనుకున్నారు; లేదా, మార్పుచేసి అన్వయించ పూనుకున్నారు. కాని, భారత జీవితాన్ని ఆధారంచేసుకొని, ప్రజాస్వామికాభివృద్ధికోసం, భారత స్వాతంత్ర్యంకోసం. న్యాయమైన నూతనసూత్రాలను నిర్మించడానికి ప్రయత్నించలేదు.

మన రాజకీయనాయకుల్లో వెనుకటి తరంవారు 19 వ శతాబ్దపు భావాలను తమ హృదయాలనుంచి తుడిచివెయ్యాలి. యువకులు భారత ప్రజాజీవితం ఎలా అభివృద్ధి చెందిందో తెలుసుకోవాలి. 'ఒకే ప్రజ—ఒకే

జాతి' అనే సిద్ధాంతాన్ని ఆధారం చేసుకొన్న బ్రిటిష్ ప్రజాస్వామికోద్యమాన్నే కాక, అన్నదమ్ముల్లాగా అనేక జాతులను కలుపుకొని నూతన ప్రజాస్వామికాలను నిర్మించిన సోవియట్‌రష్యా యుగొస్లావియాల ప్రజాస్వామికోద్యమ చరిత్రనుకూడా యువకులు నేర్చుకోవాలి. మనం ఈపని చెయ్యకపోతే నిజమైన స్వాతంత్ర్య సూత్రాలను అన్వయించుకోలేము. నిజమైన భారత ప్రజాస్వామికానికి పునాదులు నిర్మించలేము. మన ఆశయానికి నానాటికీ దూరమైపోయి ..నలోమనం తిట్టుకుంటూ ఉండవలసి వస్తుంది.

ఏ సమస్యనైనా బుద్ధి సరిగా అర్థంచేసుకోలేకపోతే, హృదయంకూడా సరిగా కొట్టుకోదు. కొట్టగూడని వ్యక్తిమీదికి చెయ్యివేస్తుంది. ఎప్పుడైతే క్లిష్టపరిస్థితులేర్పడుతాయో, ఎప్పుడైతే కాంగ్రెస్ లీగులు ఏకం కాలేకపోతాయో, అప్పుడు ప్రతిసంస్థా, క్రిందటి యుద్ధమైనతర్వాత మాదిరిగానే, తన సమస్యల్ని పరిష్కరించుకోడానికి బ్రిటిషు ప్రభుత్వం వంక చూస్తుంది. బ్రిటిష్‌వాళ్ళు న్యాయమూర్తుల వేషంతో ఆతగాదాను ఇంకా పెంచుతారు. మైనారిటీరక్షణల పేరిట ప్రతిదాంట్లోను జోక్యం కలిగించుకొనే నియంతృత్వాధికారాలను తమ చేతుల్లో పెట్టుకుంటారు. ఇవి మనం పూర్వం నేర్చుకొన్న పాఠాలు. ప్రస్తుత ఘటనలుకూడా వీటినే ధ్రువపరుస్తున్నాయి.

## హిందూ ముస్లిం ఐక్యత - లక్నో ఒడంబడిక

1916 లో రాజకీయ జ్యోతిష్కులు యుద్ధం ఆఖరయే సూచనలు కన్పిస్తున్నాయని చెప్పేవారు. కాంగ్రెసు, ముస్లిం ప్రజానీకంలో సాధారణ రాజకీయ చైతన్యం పెంపొందుతూ వచ్చింది.

విదేశాలకు వెళ్లిన విప్లవకారులు హిందువులు, ముస్లింలు కొందరు బ్రిటిష్‌వారితో పోరాడి స్వాతంత్ర్యం సంపాదించడానికని కాబూల్‌లో ఒక తాత్కాలికభారతప్రభుత్వాన్నిఏర్పరచారు. రాజామహేంద్రప్రతాప్, మౌల్వీ అబీదుల్లా సింధీ. మౌల్వీ, బర్కతుల్లా, వి. ఛటోపాధ్యాయ (శ్రీమతి సరోజనీదేవి సోదరుడు) మొదలైనవారు దీనికి నాయకత్వం వహించారు.

ఇంగ్లీషువాళ్ళనుంచి ఎక్కువ అధికారం గుంజుకోడానికి హిందూ ముస్లిం ఐక్యతయొక్క అవసరం ఇండియాలోకూడా గుర్తించబడింది. ఆగాఖాన్ చెప్పుచేతల్లోఉన్నపాతనాయకత్వాన్నిత్రోసేసి, మౌలానామహ్మదాలీ, మౌలానా ఆజాద్, జిన్నాగార్లు ముస్లింలీగుకు నాయకత్వంవహించి కాంగ్రెస్‌తో ఐక్యతకోసం కృషిచేశారు. ఆకృషి ఫలించింది. ఇరువురూ ముందుగా అంగీకరించిన ఒడంబడికకు తమ తమ సంస్థల ఆమోదం సంపాదించడానికి 1916 లో లక్నోలో కాంగ్రెస్ — లీగు మహాసభలు జరిగాయి.

సమాన హక్కులతో, సమానబాధ్యతలతో, సమాన భాగస్వామిగా బ్రిటిష్ సామ్రాజ్యంలో స్వతంత్ర దేశంగా, వుండేలాగా భారతదేశానికి స్వపరిపాలన కావాలనీ, గవర్నర్ జనరల్, గవర్నర్ కార్యవర్గాల్లో కనీసం సగంమందైనా భారతీయులుండాలనీ, శాసనసభలనింకా విస్తృతం చేసి ఎన్నుకోబడినవారి మెజారిటీవుండేలా చెయ్యాలనీ ఈ లక్నో ఒడంబడిక సమిష్టి నినాదమిచ్చింది.

మహమ్మదీయులకు ప్రత్యేక నియోజకవర్గాలు ఉండవచ్చునని కాంగ్రెసు నాయకులు అంగీకరించారు. ఇదివరకు 1909 చట్టం ప్రకారం ప్రత్యేక నియోజకవర్గాలు లేని సి. పి., పంజాబు రాష్ట్రాలకుకూడా యీ హక్కును అంగీకరించారు. రాష్ట్రశాసనసభల్లో ముస్లింలకు, మింటో మోర్లేయాక్టు కంటె ఎక్కువ స్థానాలిచ్చారు. బెంగాల్లో జనాభా ప్రకారం రావలసిన సీట్లలో నాల్గింటిలో మూడు, పంజాబులో పదింట్లో తొమ్మిది చొప్పున ముస్లింలకు వచ్చాయి. ఇది 1909 చట్టం ముస్లింలకిచ్చినదాని కంటే చాలాఅధికం. ఈ ఒడంబడిక వల్లబెంగాల్‌లో నూటికి 10.4 నుంచి 40 దాకా. పంజాబులో నూటికి 25 నుంచి 50 దాకా ముస్లింలకెక్కువ సీట్లువచ్చాయి. కేంద్రంలో ఎన్నుకోబడిన భారత సభ్యుల్లో ముస్లింలు మూడవవంతుండాలి. ఇది రాష్ట్రాల్లోని వారి ప్రాతినిధ్యానికి సాధ్యమైనంత దగ్గరగానే వుంటుంది. ఇంకా సంస్కృతికీ, మతానికీ సంబంధించిన ప్రధాన రక్షణ ఒకటి ఇచ్చారు. ఒక జాతికి సంబంధించిన ఏ చట్టమైనా

ఆ జాతిసభ్యుల్లో ముప్పాతికవంతు వ్యతిరేకించినట్టయితే దాన్ని అమలు జరుపకూడదు.

ఈ ఒడంబడిక చాలా ముందడుగే అయినప్పటికీ. దీనికి మూలం రాజీపద్ధతి గనుక రెండుపక్షాలవారూ తమతమ సూత్రాలను వదిలిపెట్టుకోవలసి వచ్చినట్లు భావించారు. ప్రత్యేక నియోజక వర్గాలకు అంగీకరించడంవల్ల ముస్లింలవిడిపొయ్యేతత్వానికి ఒకవిధంగా సహాయంచేస్తున్నట్లు కాంగ్రెస్ నాయకులనుకున్నారు. లీగ్ నాయకులు బెంగాలు పంజాబుల్లో తమకు మెజారిటీరాగల హక్కును వదులుకున్నామనీ, 1909 యాక్టు ప్రకారం సాధారణ నియోజక వర్గాల్లో పోటీ చేయడానికున్న తమ హక్కునుకూడా వదులుకోడానికి అంగీకరించామనీ చెప్పారు. ఆ నాడు అలాంటి రాజీ చేసుకోడం తప్పు - అని ఇవాళ సర్దార్ పటేలువంటి కాంగ్రెస్ నాయకులు బహిరంగంగానే చెబుతున్నారు. కాని, అప్పుడు కాంగ్రెస్ లీగు నాయకులిద్దరూ అంగీకారానికి రాగలిగినందుకు ఎంతో ఉత్సాహ పడ్డారు.

అప్పుడు కాంగ్రెస్ మహాసభకు లీగు నాయకులు హాజరైనారు. ఇవాళ సర్దార్‌పటేల్‌లాగానే ఆనాడు మాట్లాడినవారికి లోకమాన్య తిలక్ క్రిందివిధంగా జవాబు చెప్పాడు :

"మనం మన మహమ్మదీయ సోదరులకు ఎక్కువగా లొంగిపోయామని కొంతమంది చెబుతున్నారు. భారత దేశమంతటిలో ఉన్న హిందువుల అభిప్రాయానికి నేను ప్రాతినిధ్యం వహిస్తానని నాకు నమ్మకంవుంది నేను చెబుతున్నాను. మనం ముస్లింలకు లొంగిపోలేదు..........మనం మూడవపార్టీతో పోరాడవలసి వుండగా, మనమంతా ఈ వేదికమీద జాతిలోను, మతంలోను, వివిధరాజకీయాభిప్రాయాలలోను,ఐక్యమైనిలబడ్డామంటే ఇదిచాలా గొప్పవిషయం. చాలముఖ్యమైన సంఘటన. ఇది ఇవాళఅంత్యంత ముఖ్యమైనసంఘటన."

కాంగ్రెస్ నాయకులుకూడా జనాబ్ జిన్నా అధ్యక్షతక్రింద జరిగిన లీగు మహాసభకు హాజరైనారు. భారత జాతీయోద్యమ పితామహుడు సురేంద్రనాధ బెనర్జీ, గాంధీజీ మొదలైనవారంతా కూడ హాజరైనారు. సరోజనీదేవి, బిపిన్ చంద్రపాల్‌గార్లు చర్చల్లోగూడా పాల్గొన్నారు.

ముస్లింలు వేరుపడకోరు తారని. వారిలో స్వాతంత్ర్య పిపాసలేదనీ చేసే విమర్శలకు జవాబు చెబుతూ జనాబ్ జిన్నా ఇలా అన్నాడు :

"ఈ ముస్లిం మహాసంస్థ అతి త్వరితంగా ఐక్యభారత దేశాన్ని సృష్టించగల మహత్తరమైన శక్తిగా పెంపొందడం చూస్తే ముస్లింలు వేర్పడతారని మనమీదచేసేఆరోపణ దానంతటదే సమసి పోతున్నట్లు స్పష్టమవుతుంది ఒక మైనారిటీ జాతిలో విశాలమైన రాజకీయ చైతన్యాన్ని రేకెత్తించడానికి. జాతీయ సమస్యల విషయంలో సహకారం. సమిష్టి ప్రయత్నం చెయ్యడానికీ - ఆ మైనారిటీకి పూర్తిరక్షణ ఉంటాయనే హామీ అన్నిటికంటె ముందుగా కావాలి. ఒకజాతిగా ముస్లింల రాజకీయ హోదా గుర్తించ బడడం ద్వారానే, భారత ముస్లింలకు ఆ హామీ వస్తుంది." (ఎం. హెచ్, సయ్యద్ వ్రాసిన 'మహమ్మదాలీ జిన్నా' అనే పుస్తకం 876 వ పేజీనుంచి.)

## కాంగ్రెస్ - ఖిలాఫత్ ఉద్యమం

ఖిలాఫత్తు ఉద్యమంతో భారత స్వాతంత్రోద్యమం బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఒక బలవత్తరమైన, సంఘటిత శక్తిగా అభివృద్ధి చెందింది. కన్నతల్లియొక్క రెండు చల్లని కళ్ళలాగా మహాత్మాగాంధీ అలీ సోదరులు దానికి నాయకత్వం వహించారు. 'స్వరాజ్య' నినాదం దిక్కు దిక్కునా మారుమ్రోగింది.

ఇవాళ మన కర్తవ్యం స్వాతంత్ర్యంకోసం అంతిమ పోరాటం ! ముస్లింలు హిందువులకంటే ఎంత వెనుకబడి వున్నప్పటికీ, వారే ముందు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరారనేది మనం మరచిపోకూడదు.

"స్వరాజ్యం" అనే శబ్దాన్ని సంపూర్ణ స్వాతంత్ర్యంగా నిర్వచించవలసిందని ముందు పట్టుపట్టింది ఖిలాఫత్ నాయకులు. 1921 లో అహమ్మదాబాద్‌లో మౌలానా హజరత్ మోహానీ ఈ నినాదం లేవదీశాడు. గాంధీజీ దీన్ని వ్యతిరేకించి "బాధ్యతలేనట్లు కన్పిస్తున్నది కనుక యిది నన్ను చాలా నొప్పించిం" దన్నాడు.

1919 లోనే, ముస్లింలీగ్ అమృతసర్ మహాసభలో భారత ముస్లింలెవరూ సైన్యంలో చేరవద్దని కోరుతూ తీర్మానించింది.

1922 జూన్‌లో లక్నోలో జరిగిన ఖిలాఫత్, జమయత్ కార్యవర్గాల సమిష్టి సమావేశంలో "ఇండియాయొక్క మహమ్మదీయులయొక్క ఉత్తమ ప్రయోజనాలు కాపాడబడాలంటే, కాంగ్రెసు కోరే "స్వరాజ్య" సిద్ధాంతానికి బదులు 'సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని' స్వీకరించడం అవసరమని కోరుతున్నాం" అని ఒక తీర్మానం చేశారు.

(సెంట్రల్ ఖిలాఫత్ కమిటీ మినిట్స్‌నుంచి)

దీనివల్ల "కాంగ్రెస్ నిర్మాణంలో పెద్ద మార్పు" చేయవలసి వస్తుంది కనుక తామలా చేయలేమని ఆ నాడు కాంగ్రెసు నాయకత్వమే వాదించింది.

తీరా, జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వాన తీవ్రవాద శక్తులన్నీ ఒత్తిడి తెచ్చాక కాంగ్రెస్ 1927 మద్రాసు మహాసభలో సంపూర్ణ స్వాతంత్ర్యమే తన లక్ష్యంగా అంగీకరించింది. కాని, ఆ మరుసటి సంవత్సరమే మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతను సమావేశమైన కమిటీ రిపోర్టులో అధినివేశ ప్రతిపత్తే లక్ష్యంగా అంగీకరించింది. దానితో, మహాసభ తీర్మానం కాస్తా నిరర్థకమైపోయింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదులమీద భారత మితవాద నాయకులకు అంతగట్టి నమ్మకం వుండేది - ఇప్పటికీ వుంది!

ముస్లిలు తక్కువమందే అయినప్పటికీ, వారి ఆర్థికస్థితి దుర్భరంగా వున్నప్పటికీ, వారు ఖిలాఫత్ నిధికి కోటి రూపాయలు వసూలు చేసారని మనం గుర్తుంచుకోవాలి. ఇంత మొత్తమే తిలక్ స్వరాజ్య ఫండుకుకూడా వసూలైంది.



ధైర్య సాహసాలతో సైనికులకు నిషిద్ధ విషయాలు ప్రబోధించి అలీ సోదరులు, మౌలానా హుసేన్, అహ్మద్ మదనీ మొదలైన ముస్లిం నాయకులు ఆరేసి సంవత్సరాలు జైలుశిక్ష లనుభవించారు.

మలబారు మాప్లా రైతులు, భూస్వాముల్నీ సామ్రాజ్యవాద దౌర్జన్యాన్నీ ఎదిరించి ఘోరమైన పోరాటంసాగించి, వీరకృత్యాలను ప్రదర్శించారనీ, పోరాటానికి అవసరమైన సమర్ధతను త్యాగాన్నీ చూపారనీ, మనం జ్ఞప్తికి తెచ్చుకోవాలి. అలాగే 1930 లో సరిహద్దు రాష్ట్రంలోని పఠానులుకూడా తమంతతామే బ్రిటిష్ ప్రభుత్వంమీద కత్తిదూశారు.

1922 ఫిబ్రవరిలో గాంధీజీ సహాయ నిరాకరణోద్యమాన్ని ఆపుజేసినప్పుడు, ఖిలాఫత్ నాయకులందరూ వ్యతిరేకించారు. సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమం పెంపొందాలన్నారు. స్వాతంత్ర్య పోరాటానికి కోటి మంది ముస్లిం సత్యాగ్రహులు కావాలని పిలుపు ఇచ్చారు. (సెంట్రల్ ఖిలాఫత్ కమిటీ మినిట్సునుంచి).

ఈ ఉత్తేజితమైన దేశభక్తిని గాంధీజీ మొదలైన కాంగ్రెస్ నాయకులే అణచివేసారు.

ఇవాళ చాలమంది కాంగ్రెస్‌వాదులు ఈ మహత్తర విప్లవశక్తిని గుర్తించకుండా, స్వాతంత్ర్య సాధనకు ముస్లింలతో పనిలేదని ఊహిస్తున్నారు గనుక, ఈ చరిత్రనంతా గుర్తుకు తేవలసివచ్చింది.

క్రిందటి యుద్ధానంతరం వచ్చిన ప్రజా ఉద్యమంలో ముస్లింలీగు, కాంగ్రెస్ ఖిలాఫత్ నాయకులు ఒక్కటిగా పనిచేశారు. ప్రభుత్వతొత్తులను అభివృద్ధి నిరోధకులను త్రోసేసారు. ముస్లింల న్యాయమైన కోర్కెలను సమ్మతింప జేయడానికి ముస్లిం నాయకులు కాంగ్రెస్ సహకారాన్ని అర్థించారు. అప్పటికి హిందూ మెజారిటీ పెత్తనం చేస్తుందనే భయం ఉండేదికాదు.

ఉద్యమం ఆగిపోవడంతో బ్రహ్మాండమైన నిస్పృహ ఏర్పడింది. కాంగ్రెస్ స్వరాజ్యపార్టీని నిర్మించి, 1919 చట్టంమీద పనిచెయ్యడానికి

నిశ్చయించింది. సామ్రాజ్యవాదులీ అవకాశాన్ని పూర్తిగా వినియోగించు కొన్నారు. మతకలహాలు ప్రారంభమైనాయి. అభివృద్ధి నిరోధకులు ముందుకు వచ్చారు. అభివృద్ధి నిరోధకులైన హిందువులు కొందరు 'శుద్ధి' 'సంఘటన్' ఉద్యమాలు ప్రారంభించారు. ముస్లింపక్షంనుంచి 'తంజీమ్' 'తబ్లిగ్' ఉద్యమాలువచ్చాయి. ఇద్దరూకూడా రెండో మతంనుంచి తమ మతంలోకి ఎక్కువమందిని త్రిప్పుకోడానికి పోటీ పడ్డారు.

అయినప్పటికీనీ, కాంగ్రెస్‌లో ఉన్న ఉత్తమదేశభక్తులూ, లీగు ఖిలాపత్తులలో ఉన్న ఉత్తమదేశభక్తులూ ఒక సమిష్టి ప్రాతిపదిక కోసం హిందువులు ముస్లింలు తదితర జాతులకు న్యాయంకలిగించే స్వతంత్ర భారత రాజ్యాంగ నిర్మాణానికి ఆధారభూతంకాగల జాతీయ ఒడంబడిక కోసం ప్రయత్నిస్తూనే ఉన్నారు

## జాతీయ ఒడంబడికల కోసం అన్వేషణ

మన స్వాతంత్రోద్యమం ఒక క్రొత్త స్థాయికి వచ్చింది. మన నాయకులు బ్రిటిష్ పెత్తనంకింద బాధ్యతాయుత ప్రభుత్వం కావాలనే దృష్టిలో ఆలోచించడంలేదు. స్వరాజ్యం వారి దృష్టి. వారివెనుక దేశ వ్యాపితమైన ప్రజాఉద్యమం ఉంది. వారు తమ సొంత రాజ్యాంగాన్ని నిర్మించుకొని యావద్భారతదేశ పరిపాలనను తమహస్తగతం చేసుకోవా లనుకున్నారు. కాని ఇంకా కాంగ్రెస్ ముస్లిం, నాయకుల్లో బ్రిటిష్‌వాళ్ళను గూర్చి భ్రమలున్నాయి. కాంగ్రెస్, లీగ్, తదితర పార్టీలు కలిసి బ్రిటిష్ రాజ్యాంగవిధానాన్ని అనుసరించి, అందరికీ అంగీకారయోగ్యమైన ఒక ప్రజాస్వామిక రాజ్యాంగాన్ని నిర్మించగలిగితే, బ్రిటిష్‌వాళ్లు దానిని తిరస్కరించలేరని వారి నమ్మకం.

పూర్తిగా ప్రజాస్వామికదృష్టిలో అఖిలభారత రాజ్యాంగం వుండాలని కాంగ్రెస్ నాయకులు ఆలోచించారు. అందులో రాష్ట్రాలకు గవర్నర్లు కేంద్రానికి గవర్నర్‌జనరల్ నాయకులుగా వుంటారు ; రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు ప్రజాస్వామికంగా ఎన్నుకోబడిన శాసనసభలకుబాధ్యత వహిస్తాయి.



ఇప్పుడు కాంగ్రెసుకూ లీగుకూ మధ్యనున్న సమస్య నియోజక వర్గాలను గురించికాదు.

సింధు; బెలూచీస్థాన్, సరిహద్దు రాష్ట్రాలు మొదలైన ముస్లిం మెజారిటీ రాష్ట్రాలసరిహద్దులను పునఃపరిశీలించి. తక్కిన రాష్ట్రాలతో సమానంగా ఆ రాష్ట్రాలుకూడా ప్రజాస్వామిక ప్రభుత్వాన్నీ. రాష్ట్రీయ స్వాతంత్ర్యాన్నీ పొందేలా భారత రాజ్యాంగం వుండాలని ముస్లింనాయకులు కోరారు. కేంద్ర ప్రభుత్వంలో ముస్లింలకు తగిన ప్రాతినిధ్యం కావాలని కోరారు.

అప్పుడు ముస్లింలు వెలిబుచ్చిన ప్రధానమైన కోరిక లివి :

1. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, ముస్లింలు అధికంగాఉన్న భూభాగాలను పెద్ద రాష్ట్రాల్లో చేర్చిపారేశారు. బెలూచీస్థాన్, సరిహద్దు రాష్ట్రాలాంటి వాటిని అభివృద్ధి పొందకుండా జేశారు. ఇలా అణగద్రొక్కబడిన రాష్ట్రాలన్నీ బ్రిటిషిండియాలోని తక్కిన రాష్ట్రాలతో సమాన హోదా కలిగిన ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పడాలి.

2. పంజాబులోను బెంగాలులోను ఉన్న ముస్లిం మెజారిటీకి అనుగుణంగా శాసనసభల్లో ప్రాతినిధ్యం వుండాలి.

3. కేంద్రశాసన సభలోను, కేంద్ర ప్రభుత్వంలోను ముస్లింలకు కనీసం మూడవవంతు ప్రాతినిధ్యం వుండాలి.

ముస్లింనాయకులు, కాంగ్రెస్‌వారు, ఖిలాఫత్‌వారు, జనాబ్ జిన్నా లాంటి లీగు మితవాదులు, అందరూ ఈ కోర్కెలను బలపరచారు. ఈ కోర్కెలు కనక అంగీకరింపబడితే, ప్రత్యేక నియోజక వర్గాలను వదలుకొని సమిష్టి నియోజకవర్గాల ఏర్పాటుకు కృషిచేస్తామని వారిలో చాలా మంది 1927 లో ఒప్పుకున్నారు.

ఏ; ఐ. సి. సి. ఈ కోర్కెలను అంగీకరించింది; 1927 డిసంబరులో మద్రాసులో జరిగిన కాంగ్రెస్ మహాసభ ఆమోదించింది.

ఇంతలో బ్రిటిష్‌వాళ్లు, రాజ్యాంగాభివృద్ధికి ఇండియా తయారుగా వుందో లేదో తనిఖీ చేయడానికని కేవలం తెల్లవాళ్ళతో కూడిన సైమన్

కమీషన్‌ను ఇండియాకు పంపుదామని ప్రకటించారు. భారతీయులేమీ చేయలేరని వాళ్ళు గట్టి నమ్మకంతో ఉన్నారు. అప్పట్లో ఇండియా కార్య దర్శిగా వున్న బర్కెన్ హెడ్ హిందూ ముస్లింలు ఐక్యం కాలే"రని సగర్వంగా చెప్పుకున్నాడు.

సామ్రాజ్యవాదుల సవాలుకు భారతీయులు జవాబు చెప్పారు. హిందువులు ముస్లింలు ఏకమై సైమన్‌కమీషన్‌ను బహిష్కరించారు.

అప్పటికే హిందూముస్లింలు ఒక అంగీకారానికి వచ్చారు. దాన్ని ఆధారం చేసుకొని ఇద్దరూ కలిసి సమిష్టి స్వరాజోద్యమానికి ఆ ఐక్యతను దిట్ట పరచుకోవడం అవసరమైంది. ఈసమయాన సైమన్ కమీషన్‌తో సహకరిస్తున్న హిందువులలోని. మహమ్మదీయులలోని అభివృద్ధి నిరోధకులు ప్రభుత్వ గులాములు కాంగ్రెస్ లీగుల ఒడంబడికను తిట్టిపోయ మొదలు పెట్టారు.

కాని, కాంగ్రెస్ ముస్లిం నాయకులు ఈ ఒడంబడికకు ఎక్కువ కాలం కట్టుబడి వుండలేకపోయారు. ఈ ఒడంబడికకు అసలు ఆధారం రాజీతత్వమే కాని, అందరికీ న్యాయమైన ప్రజాస్వామిక సూత్రాలుకాదు. 'స్వరాజ్' దేశంలో బ్రిటిష్ రాజ్యాంగ విధానం లోగడ వున్నట్టు రాష్ట్రలకు పరిమిత స్వాతంత్ర్యంగల కేంద్రీకృత ప్రభుత్వంగా ఏకజాతి ప్రజాస్వామికంగా వుండాలని కాంగ్రెస్ ఊహ. అందువల్లనే నెహ్రూ అఖిల పక్ష సమితి చిత్తు రాజ్యాంగ చట్టాన్ని తయారుచేసేటప్పుడు, ముస్లిం కోర్కెల మాట వదిలిపెట్టి, తమరాజ్యాంగం బ్రిటిష్ డొమియన్ రాజ్యాంగానికి బటాబటిగా వుండేలాగా చూశారు. ముస్లిం కోరికల సారాంశం ఏమంటే–ఇండియా కేంద్రీకృత రాజ్యాంగంగా కాక, రాజ్యాంగ సమాఖ్యగా వుండాలని; అంటే; రాష్ట్రాలకు సంపూర్ణ స్వాతంత్ర్యం, అన్ని అధికారాలు వుండాలని.

కాంగ్రెస్‌వారు. హిందువులు కేంద్రీకృత రాజ్యాంగం, బలమైన కేంద్ర ప్రభుత్వం కావాలని తలపోశారు; ఇదే వారు బ్రిటిష్ రాజ్యాంగం నుంచి నేర్చుకున్నపాఠం. ముస్లింలు రాష్ట్రాలకు సంపూర్ణ స్వాతంత్ర్యంతో కూడిన భారత సమాఖ్యను కోరడం విచ్ఛినవందాగా వారు పరిగణించారు. కాంగ్రెస్‌వారు బలమైన కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ రాష్ట్రాలకు సంపూర్ణాధికారాలను ఇవ్వడానికి నిరాకరించడంచేత, వారు హిందూ ఆధిపత్యంకోసం చూస్తున్నారని ముస్లింలు అనుమానించారు.



## అఖిలపక్ష మహాసభలో విచ్ఛిత్తి

1928 డిసెంబరులో కలకత్తాలో జరిగిన అఖిలపక్ష మహాసభలో పూర్తిగా విచ్ఛిత్తి ఏర్పడింది. కాంగ్రెసువారు ప్రతి విషయమూ బ్రిటిషవాళ్ళకు నచ్చేలాగా వుండాలని ఆలోచించారు. ముస్లింకోర్కెను గమనించనేలేదు. ఫలితం ఆలీ సోదరులవంటి ఖిలాఫత్ నాయకులును, జిన్నాలాంటి లీగునాయకులును విముఖులయారు. అదివరలో స్వాతంత్ర్య పోరాటంలో సాధించిన హిందూ ముస్లిం ఐక్యత, ముందు అంతిమ పోరాటంకోసం పెంపొందింపజేయవలసిన ఐక్యత ఈవిధంగా విచ్ఛిన్నం చేయబడింది.

ఈకాలంలో మన స్వాతంత్ర్యోద్యమం హిందూ ముస్లిం ఐక్యతను యెందుకు సాధించలేకపోయింది? ఇందుకు రెండు కారణాలున్నాయి. ఒకటి; నాయకులకు తమ సోదర ప్రజలయందు కంటె బ్రిటిష సామ్రాజ్యవాదులమీద ఎక్కువ నమ్మకంవుంది; రెండు; మన వాస్తవ జాతీయ జీవితాన్ని ఆధారంజేసుకొని న్యాయమైన ప్రజాస్వామిక సూత్రాలమీద తమలో తమకున్న విభేదాలను పరిష్కరించుకోలేకపోయారు.

భారతీయులంతా ఒకే జాతి అని కాంగ్రెస్ నాయకుడూ హిందువులు తలచేవారు. ముస్లిములు ముస్లిమెజారిటీ రాష్ట్రాలను కోరడం విచ్ఛిత్తికరంగా వారు భావించేవారు. ముస్లింలుకూడా తమ కోరికను తమ దృష్టిలోనే వెలిబుచ్చారు గానీ. జాతుల దృష్టిలో విడమర్చి చెప్పలేదు.

నిజానికి. ఇంగ్లాండు ఫ్రాన్సుల్లాగా భారతదేశమంటే ఒకేజాతి కాదనీ, వివిధజాతుల కుటుంబమనీ నాయకులు గుర్తించకుండా వారి పాత

అపోహలు వారికి అడ్డువచ్చాయి. ప్రతిజాతికీ ప్రత్యేకభాష, ప్రత్యేక సంస్కృతి, ప్రత్యేక సంప్రదాయాలూ....ఉన్నాయి. భారత స్వాతంత్ర్య మంటే, భారతదేశంలోని ప్రతిఒక్క జాతికీ స్వాతంత్ర్యం తక్కిన అన్ని జాతులతో సమానంగా పూర్తి అభివృద్ధి చెందడానికి ప్రతి జాతికీ గట్టి రక్షణ అన్నమాటే. అప్పుడు స్వతంత్రభారత దేశం వివిధ స్వతంత్ర రాష్ట్రాల ఐచ్ఛిక సమాఖ్యగా వుండాలి. ఇక ఆ స్వతంత్ర రాష్ట్రాలు బుద్ధిపూర్వకంగా ఇచ్చిన అధికారాలతోనే బలమైన కేంద్రప్రభుత్వం ఏర్పడాలి.

నిజంగా, భారతదేశంలోని హిందూ ముస్లిం సమస్యకు ఇదే న్యాయమైన, ప్రజాస్వామికమైన పరిష్కారమార్గం. 1926 లోనే భారత ముస్లిం విప్లవకారుడు ఒబీదుల్లాసింధీ యిదే నిర్ణయానికి రావడం గమనింపదగింది. విప్లవానంతర సోవియట్ ప్రజాస్వామ్యాన్ని చూసి, ఆయన కాన్‌స్టాంటినోపిల్‌లో ప్రవాసంలో వుండగా, ఒక భారత రాజ్యాంగవిధానాన్ని తయారుచేసాడు దానికి 'స్వరాజ్య' రాజ్యాంగం అని పేరుపెట్టాడు. ఉత్తరహిందూస్థానంలో ఆయన ప్రత్యేకభాషాప్రయుక్తములైన ఈక్రింది వివిధజాతులను గుర్తించాడు — సింధీ, బెలూచీ, పుస్తూనియా (పఠాన్ భూమి), పశ్చిమ పంజాబు, మధ్యపంజాబు, కాశ్మీరు, ఆయన ఇచ్చిన పరిష్కారంలో ముఖ్యవిషయాలు. (1) అన్నిజాతులకూ స్వయంనిర్ణయ సూత్రం; (2) స్వతంత్ర ప్రజాస్వామిక రాష్ట్రాల ఐచ్ఛికసమాఖ్యగా భారత దేశంవుండాలి; (3) జమీందారీ తత్వాన్ని రూపుమాపాలి; (4) ముఖ్య పరిశ్రమలను సంఘపరం చెయ్యాలి.

కాని 1928 లో అఖిలపక్ష మహాసభలో సమావేశమైన నాయకులకు మార్గదర్శకంగా ఇలాంటి విప్లవసూత్రాలులేవు. కనీసం, తమ అపోహలను బట్టిగాక, వాస్తవంగా భారతప్రజలు ఎలావున్నారో చూద్దామన్న ఊహకూడా వారికి లేదు.

1928 లో ఐక్యత సాధించలేకపోవడమనేది మన జాతీయోద్యమ చరిత్రకే పెదదెబ్బ. దాని ఫలితంగా జరిగిన ఘటనలు చివరకు బ్రిటీష్



సామ్రాజ్యవాదులు 1932 లో 'కమ్యూనల్ అవార్డు' మన నెత్తిన రుద్దడానికి దారితీసాయి. ఈచట్టం మన విభేదాలను మరింత పెంచింది.

నాయకులు మళ్ళీ తమతమ పక్షాల్లోని అభివృద్ధి నిరోధకులనే ఆశ్రయించారు. అలీ సోదరులు బ్రిటిష్‌వాళ్ళ కనుకూలమైన సర్ మహమ్మద్ షాఫీ ముఠాతో చేతులు కలిపారు. కాంగ్రెస్ నాయకులనుంచి న్యాయం కలుగుతుందని భావించడం పొరపాటని జిన్నా వెనుకటి అనుమానం ఇంకాబలపడి, వెనక్కు తగ్గాడు.

ముస్లింలలో డాక్టర్ అన్సారీ నాయకత్వాన కొద్దిమంది మాత్రమే కాంగ్రెసులో మిగిలారు. 1930 లో కాంగ్రెస్ శాసనోల్లంఘ నోద్యమం తేవాలని ప్రయత్నించినప్పుడు, ముందుగా ముస్లింలతో ఒడంబడిక చేసుకోవాలని డాక్టరు అన్సారీ పోరుకాడాడు; లాభం లేకపోయింది. అందువల్లనే ఆ ఉద్యమంలో 1920 లో లాగా ఎక్కువమంది ముస్లింలు పాల్గొనలేదు. చాలా కొద్దిమంది మాత్రమే పాల్గొన్నారు. సరిహద్దు రాష్ట్రాలలోని పఠాన్ ప్రజా ఉద్యమం, కాశ్మీర్ ముస్లిం ప్రజా ఉద్యమం ఆ మహోద్యమంలోనే కలిసి పోయినప్పటికీ, అవి కాంగ్రెస్ నడిపిన ఉద్యమాలుకావు; వాటంతట అవే వచ్చాయి.

## రౌండ్ టేబిల్ సమావేశం - కమ్యూనల్ అవార్డు

శాసనోల్లంఘ నోద్యమం ఆగిపోయినాక, గాంధీ-ఇర్విన్ ఒడంబడిక జరిగాక, రౌండ్ టేబుల్ సమావేశంలో మళ్ళీ హిందూ ముస్లిం సమస్య వచ్చింది, కాంగ్రెస్‌కు ప్రజల్లో ఉన్న పలుకుబడిని దృష్టిలో పెట్టుకొని, కాంగ్రెసుతో బ్రిటిష్‌వాళ్ళు రాజీకి రాక తప్పదని కాంగ్రెస్ ప్రతినిధి గాంధీజీ నమ్మాడు. దీనికి భిన్నంగా, బ్రిటిష్‌వాళ్లు (అప్పుడు కూడా లేబర్ ప్రభుత్వమే వుండేది) ఇండియాలోని పార్టీలు కనుక ఒక నిర్ణయానికివస్తే తమ 'కున్న బాధ్యతల'కు భంగం లేకుండా తాము ఆ నిర్ణయాన్ని అమలుపరుస్తామని చెప్పారు.

తీరని సమస్యలన్నీ తలెత్తాయి. ఏదోవిధంగా ఐక్యతను ప్రదర్శించడంకోసం ఆదరాబాదరా ప్రయత్నాలు జరిగాయి.

పంజాబురాష్ట్ర సరిహద్దుల్ని పునఃపరిశీలించి, హిందూ ఆధిపత్యం గల అంబాలా డివిజన్‌ను వేరుచేసి, పంజాబును ముస్లిం మెజారిటీ ప్రాంతంగా చెయ్యాలని ముస్లిం నాయకులు మైనారిటీల కమిటీలో సూచించారు. ఈసూచన త్రోసివెయ్యబడింది. బెంగాల్‌లోని ముస్లింమెజారిటీకి పూర్తి ప్రాతినిధ్యం వుండాలా లేదా అనేసమస్య తేలనేలేదు. సిక్కునాయకులదీ హిందూమహాసభా నాయకులదీ పైచెయ్యి అయింది. ఇక ఎవ్వరూ ఒక అంగీకారానికి రాలేకపోయారు. అందరూ బ్రిటిషు మంత్రి తీర్పును అర్థించారు. బ్రిటిషుమంత్రి 'న్యాయం'చేస్తాడని ప్రతి ఒక్కరూ విశ్వసించారు.

ఇక్కడ బ్రిటిష్‌వాళ్ళ పాత్ర ఏమిటో స్పష్టంగా తెలుస్తుంది. వాళ్లు కమ్యూనల్ అవార్డు ప్రసాదించారు. దాని ప్రధానాంశాలు ఇవి ;

1. బెంగాల్లోను, పంజాబులోను ముస్లిం మెజారిటీల సమస్య అంగీకరించబడింది. అదీ హిందువులకు వ్యతిరేకంగానే, కాని పూర్తిగా కాదు.

2. ముస్లింలు నూటికి 55 గురు, హిందువులు 43 గురు వున్న బెంగాల్లో ముస్లింలకు నూటికి 48 స్థానాలు, హిందువులకు 39 స్థానాలు, 7 కోట్ల జనసంఖ్య కలిగిన బెంగాల్‌రాష్ట్రంలో కంచుకాగడా వేసిచూసినా కన్పించని యూరోపియన్ మైనారిటీకి 10 స్థానాలువచ్చాయి. "సంఖ్యలో కొద్ది అయినా యూరోపియన్లకు వర్తక పారిశ్రామిక ప్రయోజనాలున్నా" యట! ఈవిధంగా బ్రిటిష్‌వాళ్ళు హిందువులకూ ముస్లింలకూ చెరి కొంచెము ఇచ్చి నిర్ణయాధికారాన్ని తమచేతుల్లో పెట్టుకున్నారు. హిందూ ముస్లింలను చీలదీసి పాలించడానికి యూరపియన్ స్థానాలను భద్రపరచుకున్నారు.

3. పంజాబులోకూడా నూటికి 57 గురున్న ముస్లింలకు నూటికి 49 స్థానాలు, 27 గురున్న హిందువులకు 27 స్థానాలు, 13 రున్న సిక్కులకు 18 స్థానాలు ఇచ్చారు. భూస్వాముల నియోజక వర్గాలు మూటిలో కూడ విజయం పొందితే ముస్లింలకే నూటికి 51 స్థానాలు లభిస్తాయని కూడా హామీ యిచ్చారు!

4. మత సంస్కృతుల రక్షణ విషయంలో ముస్లిం కోర్కెలను మొదటినుంచీ కాంగ్రెస్ అంగీకరిస్తూనే వచ్చింది. కమ్యూనల్ అవార్డు ప్రకారం, ఈ రక్షణాధికారం బ్రిటిష్‌వాళ్ళ చేతుల్లోకి పోయింది. ఇదికూడా గవర్నరుయొక్క ప్రత్యేకాధికారాల్లో చేరింది. దీంతో గవర్నర్‌జనరల్లూ, గవర్నర్లూ ప్రతివిషయంలోనూ జోక్యం కలిగించుకునే అధికారం ఏర్పడింది.

5. సింధును బొంబాయినుంచి విడదీశారు; సరిహద్దు రాష్ట్రానికి ఒక ప్రత్యేక గవర్నర్ను నియమించారు.

కమ్యూనల్ అవార్డుయొక్క స్వరూపం యిది. ఇది ఏసమస్యనూ పరిష్కరించలేదు. ఇది హిందువులను మహమ్మదీయులను అసంతృప్తి పరచింది; ఒకరి గొంతుమీద మరొకర్ని పెట్టింది. హిందూ ప్రయోజనాలు గానీ ముస్లిం ప్రయోజనాలుగానీ నెరవేరకుండా ఇద్దర్నీ బంధించి బెంగాలునూ, పంజాబునూ తీరనిసమస్యలుగా తయారుచేసింది ఈ అవార్డు.

ఈ కమ్యూనల్ అవార్డువల్ల ఉభయపక్షాలకూ కలిగిన అనర్థాన్ని హిందూ ముస్లింనాయకులిద్దరూ గమనించారు. సామ్రాజ్యవాదుల ఆట కట్టించడానికి ఐక్యతకావాలనికూడా యిద్దరూ గుర్తించారు.

1932 డిసెంబరులో అలహాబాదులో జరిగిన ఐక్యతాసమావేశంలో పండిట్ మాలవ్యా, డాక్టర్ మూంజీవంటి హిందూమహాసభానాయకులే ఈ క్రింది ముస్లిం కోర్కెలకు అంగీకరించారు; (1) సర్వాధికారాలు గల స్వతంత్రరాష్ట్రాలతో కూడిన ఐచ్ఛికభారత సమాఖ్య; (2) సింధు, సరిహద్దురాష్ట్రం, బెలూచీస్థాన్ ప్రత్యేకరాష్ట్రాలుగా వుండాలి; (3) బెంగాల్ పంజాబులలోని ముస్లిం మెజారిటీలబట్టి శాసన సభలలో ముస్లింల ప్రాతినిధ్యం వుండాలి; (4) కేంద్రంలో ముస్లింలకు నూటికి 32 స్థానాలుండాలి, మొ॥

దీనికి బదులుగా ముస్లింలు సమిష్టి నియోజక వర్గాలకు సమ్మతించారు. ఏ అభ్యర్ధిఅయినాసరే ప్రతి జాతిలోనుంచి కనీసం ఒక నిర్దిష్ట సంఖ్యగల వోట్లు సంపాదించాలనే షరతుమీద ఎన్నికల పద్ధతిలో కొద్దిగా మార్పు చేసారు.

కాని సర్ మహమ్మద్ షాఫీలాంటి ప్రభుత్వతొత్తులూ, బెంగాల్ హిందూనాయకులు కొందరూ ఈ ఒడంబడికను వ్యతిరేకించారు. కాంగ్రెస్ నాయకులు పోరాటవాదం వదలుకున్నారు. ముస్లిం నాయకులు పరిష్కారం జరుగుతుందనే ఆశలు వదలుకున్నారు.

భగ్నహృదయుడై మౌలానా మహమ్మదాలి మరణించాడు. నెహ్రూ అఖిలపక్ష సమావేశం విచ్ఛిన్నమైన తర్వాత, భారత రాజకీయాలను జనాబ్ జిన్నాకే వదలిపెట్టి ఆయన లండన్‌లో 'ప్రాక్టీసు' పెట్టుకున్నాడు

అది మన స్వాతంత్ర్యోద్యమంలో రెండవదశ. ఆదశలో అధినివేశ ప్రతిపత్తి రూపంలో వుండే 'స్వరాజ్' మన సమిష్టి ఆశయంగా ముందుకు నడిచాం. అప్పుడు హిందూముస్లింల మధ్య కొత్తకొత్త సమస్యలు రావడం, విభేదాలు పొడసూపడం మనం గమనించాం. అప్పటి ప్రధాన సమస్య ఏమంటే—ముస్లిం మెజారిటీ రాష్ట్రాలను ఏర్పరచి వాటికి తగిన రాష్ట్రాలతోపాటు సంపూర్ణ స్వాతంత్ర్యమూ, కేంద్రాధికారంలో తగిన భాగమూ ఇవ్వడం. అప్పుడుకూడా హిందూముస్లింలలో ఐక్యత లేనందువల్ల, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల 1932 కమ్యూనల్ అవార్డువచ్చింది. ఈ అవార్డుతో తీరిన సమస్య ఏదీలేదు. ఈ కమ్యూనల్ అవార్డును తొలగించడానికి కాంగ్రెస్ లీగులు ఒకనిర్ణయానికి రాలేకపోయాయి. మనలో మనకు న్యాయం కలిగేలాగా కాంగ్రెస్ లీగులు ఒక అంగీకారానికివచ్చి-నిజమైన ప్రజాస్వామిక దృష్టిలో స్వాతంత్ర్య పోరాటానికి జాతీయైక్యతను సాధించలేకపోయాయి.

1935 రాజ్యాంగచట్టాన్ని ఎదుర్కొనడానికి అప్పట్లో సూచింపబడిన సామ్రాజ్యవాదుల ఫెడరేషన్ నిర్ణయాన్ని ప్రతిఘటించడానికికూడా కాంగ్రెస్ లీగులు ఒకే వేదికమీదికి రాలేకపోయాయి. కాంగ్రెస్ లీగులు రెండూకూడా సామ్రాజ్యవాదుల ఫెడరేషన్‌ను వ్యతిరేకించాయి. కాని సర్వాధికారాలుగల స్వతంత్ర రాష్ట్రాల ఐచ్ఛిక సమాఖ్యగా భారత స్వాతంత్ర్యాన్ని నిర్వచించడంలో ఒక నిర్ణయానికి రాలేకపోయాయి. దీనికిబదులు కమ్యూనల్ అవార్డు ఇంకా చీలికలను రెచ్చగొట్టింది. కాంగ్రెస్ సామ్రాజ్యవాదుల ఫెడరేషన్‌ను వ్యతిరేకించింది. భారతదేశానికి రెండు ఫెడరేషన్లు కావాలని లీగు కోరింది. దీంతో లీగుయొక్క విడిపోయే కోరికకు పునాది ఏర్పడింది.



## సామ్రాజ్యవాదుల సమాఖ్యకు వ్యతిరేకంగా పోరాటం

1935 లో బ్రిటిష్‌వాళ్లు తమ ఫెడరేషన్‌ను ఇండియామీద రుద్దాలని ప్రయత్నించారు. ఆ ఫెడరేషను భారతీయులకు ప్రజాస్వామ్యం ఇచ్చినట్లుగానే కన్పిస్తుంది. కాని బ్రిటిష్‌వాళ్ళ నిరంకుశత్వాన్ని సంరక్షిస్తుంది. తమ తొత్తులైన సంస్థానాధిపతులను అడ్డం పెట్టుకొని కేంద్ర శాసనసభలో తమ పెత్తనం చెలాయిద్దామని బ్రిటిష్‌వాళ్ళ ఆలోచన.

ఈ ఇండియా కొత్తచట్టంమీద చర్చలో లార్డు రీడింగు ఈ చట్టంవల్ల తమకు పొయ్యేదేమీ లేదని టోరీలకు హామీ ఇచ్చాడు. రీడింగు చెప్పింది ఇది:

"మనం భయపడవలసిందేముంది ? భారతస్వాతంత్ర్యంకోసం. సామ్రాజ్యంనుంచి పోవడానికికూడా, ఆందోళనచేసే వాళ్లున్నారు. ....కనుక, ఈ అభిప్రాయానికి వ్యతిరేకంగా మనం ఎంతగట్టిపలుకుబడి సంపాదించ గలిగితే అంత సంపాదించడం ముఖ్యం. శాసనసభలో నూటికి 33 గురు సంస్థానాధిపతులుంటారు; అప్పర్ ఛేంబర్‌లో 44 గురు వుంటారు." (పామీదత్తువ్రాసిన" "ఇండియా టుడే" లో 401 వ పేజీ)

ఆదేచర్చలో బాల్డ్విన్ సామ్రాజ్యవాద నీతిని ఈ విధంగా బయటపెట్టాడు: "భారతీయులు చీలిపోయి ఉన్నంతకాలం వారిని పరిపాలించే హక్కు మనకుంది."

కాంగ్రెస్ లీగు నాయకులిద్దరూ అలాంటి ఫెడరేషనుకు వ్యతిరేకంగానే వున్నారు.

జనాబ్ జిన్నా రాజేంద్రబాబు కలుసుకొని 1935 జనవరిలో ఒక గట్టి నిర్ణయానికి వచ్చారు. ఆ నిర్ణయాన్ని కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీలోను లీగు కౌన్సిలోను ప్యాసుచేసే లోపల హిందూసిక్కు వ్యతిరేకతను అణచాలనికూడా అంగీకారానికి వచ్చారు. కాని పంజాబ్ హిందూ నాయకులు దీన్ని పూర్తిగా వ్యతిరేకించడంతో మార్చిలో జిన్నారాజేన్ బాబు. సంభాషణలు ఆగిపోయాయి. తాము గట్టి ప్రయత్నాలు చేసినప్పటికీ "అందరినీ సంతృప్తి పరచగల" ఒక నిర్ణయానికి రాలేకపోయామనీ, "దేశాభ్యుదయానికి అన్ని మతాల ఐక్యత అవసరమనీ, ముందుముందు ఈ ప్రయత్నాలను సఫలంచేయ శక్తులు పైకి వస్తాయని ఆశిస్తున్నా"మనీ జనాబ్ జిన్నా రాజేన్‌బాబులు ఒక సంయుక్త ప్రకటన చేసారు.

దీంతో అంగీకారానికై చేసిన మరొకప్రయత్నం, మళ్ళీ పంజాబు సమస్యమీదనే విఫలమైంది. కాని ఈ కాలంలో (1935—37) కాంగ్రెస్ లీగులు రెండూ అఖిలభారత కేంద్రప్రభుత్వం వుండాలని ఒప్పుకున్నాయి, ఈ సంగతి గుర్తుంచుకోవాలి. సమస్య క్లిష్టతరమైనకొద్దీ విభేదాలెక్కువైనాయి.

వయోజన వోటింగుద్వారా ఎన్నుకోబడిన శాసనసభచేత ఏర్పరచబడిన కేంద్ర ప్రభుత్వం కావాలనేది కాంగ్రెస్ లక్ష్యం. ఇందులో మైనారిటీలకు ప్రత్యేక నియోజకవర్గాలద్వారా తమ అభ్యర్థులను ఎన్నుకొనే హక్కు వుంటుంది. కాని ఎన్నికల్లో విజయంపొందడంకోసం కాంగ్రెస్ "బానిసరాజ్యాంగం రద్దుకావాలి" అనేనినాదంతో ముందడుగు వేసింది. శాసనసభల్లో కాంగ్రెస్ బలవత్తరమైన పక్షంగా ఒక్కసారి వచ్చిందా అంటే, ఇక బ్రిటిష్‌ప్రభుత్వం తమతో రాజీపడితీరాలసి వస్తుందనికాంగ్రెస్ నాయకులు ఆశపడ్డారు.



"మహమ్మదీయులయొక్క తక్కిన మైనారిటీలయొక్క హక్కులకు ప్రయోజనాలకు గట్టి రక్షణలుగల స్వతంత్ర ప్రజాస్వామికరాష్ట్రాల సమాఖ్యను భారతదేశంలో నిర్మించడం" లీగు లక్ష్యం.

(లీగు లక్నోమహాసభ, 1937)

జనాబ్ జిన్నాచే పునర్నిర్మించబడిన లీగుకూడా ఎన్నికల్లో పాల్గొన్నది. సాధ్యమైనన్ని స్థానాలు సంపాదించి, ముందు జరుగనున్న రాజీ రాయబారాలలో తమ శక్తినిచూపి మాట్లాడవచ్చునని లీగు నాయకుల ఉద్దేశ్యం.

కాంగ్రెస్ లీగులు రెండూ ఎన్నికల్లో నిలబడ్డాయి. యు.పి. వంటి రాష్ట్రాల్లో ఒకర్నొకరు పోటీ చేయకుండా వుండడానిక్కూడా పరస్పరం ఒప్పందాలు చేసుకున్నాయి. కాంగ్రెసు అమోఘ విజయం సాధించింది. జిన్నాగారు యూరపునుంచి తిరిగివచ్చాక కొత్తగా పునర్నిర్మించబడిన లీగు బలహీనమైన స్థితిలోవుంది. అంత బ్రహ్మాండమైన విజయాలను పొంద లేకపోయింది.

యు. పి. లో కూడా మంత్రివర్గం ఏర్పరచవలసి వచ్చినప్పుడు కాంగ్రెస్ లీగు సంయుక్తమంత్రివర్గాన్ని ఏర్పరచడానికి కాంగ్రెస్ నాయకులు నిరాకరించారు. ఒకేపార్టీ మంత్రివర్గం వుండాలన్నారు. శాసనసభలో తమ అసెంబ్లీపార్టీని, బయట పార్లమెంటరీబోర్డును లీగువారు రద్దుచేసుకొని, కాంగ్రెస్ ప్రమాణపత్రంమీద సంతకంపెట్టి, కాంగ్రెస్ క్రమశిక్షణకు కట్టుబడివుండడానికి ఒప్పుకొనేట్లయితే, కాంగ్రెస్ నాయకులు వారికి మంత్రివర్గంలో కొన్నిస్థానాలిస్తామన్నారు. కాంగ్రెస్‌పార్లమెంటరీ బోర్డుసభ్యుడు మౌలానా ఆజాద్ ఈషరతులను యు. పి. రాష్ట్ర ముస్లిం లీగు నాయకుడైన ఖలీకుజ్జామన్‌కు సూచించాడు.

మరొకసారి, మళ్ళీ, అంగీకారంకుదరలేదు, లీగు నాయకులు మళ్ళీ తమలోని అభివృద్ధినిరోధకుల చేతుల్లోకి పోయారు. ఏదోవిధంగా లీగు కనుకూలమైన మంత్రివర్గాలను ఏర్పరచుకోడానికి, తమ చౌకబారు రాజకీయాలకు మంత్రివర్గాలు తోడ్పడేలాగా చూచుకోడానికిగాను

జిన్నా గారు సికందర్ హయత్‌ఖాన్ వంటి బ్రిటిష్ అనుకూల ప్రధానులతోను, ఫజులుల్‌హక్‌లాంటి నీతి నియమాలులేని అవకాశ వాదులతోను రాజీ పడ్డాడు. అఖిలభారత రాజకీయాల్లో తాను లీగును బల పర్చేటట్లు పంజాబ్ అంతరంగిక రాజకీయాల్లో యూనియనిస్టుపార్టీ చర్యలలో లీగు జోక్యం కలిగించుకోకుండా వుండేటట్లు సర్ సికందర్ హయత్‌ఖాన్ షరతుపెట్టాడు. ఈ షరతుమీద సర్ సికందర్‌ముఠా తమ తమ మంత్రివర్గానికి లీగుపేరుపెట్టారు; వాళ్లకు తన లీగు ముద్ర వెయ్య డమే కాకుండా, రాష్ట్ర ముస్లింలీగు నాయకత్వాన్నికూడా వాళ్ళకే కట్ట బెట్టింది.

## ఒకరినొకరు దూషించుకోవడం

ఐక్యతా ప్రయత్నంలో వరస వరసగా వచ్చిన అపజయాలు కాంగ్రెస్ లీగు నాయకుల్లో ఒకరిమీద ఒకరికి అసంతృప్తి కలిగించాయి. ప్రతివారూ రెండోవారిని తిట్టడం ప్రారంభించారు. పండిత నెహ్రూ లీగు కోరికలను వేళాకోళంచేసి అసలు లీగుయొక్క సామ్రాజ్యవాద వ్యతిరేక స్వభావాన్నే శంకించాడు. ఆయన అన్నమాటలివి.

"లీగు దేనికోసం నిలబడుతుంది ? అది భారత స్వాతంత్ర్యంకోసం సామ్రాజ్యవాద వ్యతిరేకత కోసం నిలబడుతుందా ? నాకు నమ్మకంలేదు.... ముస్లింలీగు సభ్యుల్లో చాలమందికంటె ముస్లింప్రజలతో నాకు ఎక్కువ సంబంధం వున్నదని నేను జిన్నాగారికి సూచించవచ్చునా ? శాసనసభల్లోను ప్రభుత్వ పరిపాలనలోను నూటికిన్ని స్థానాలని అంకెలు గుణించేవారికంటె ముస్లింప్రజల ఆకలి, దారిద్ర్యం, దుర్భర పరిస్థితులు నాకు బాగా తెలుసు" (జనవరి 10, 1937 నెహ్రూ వ్రాసిన 'ఇండియాలో 18 నెలలు' అనే పుస్తకం 147వ పేజీ నుంచి).

దీనికి జిన్నాగారు ఇంతే కంటగింపుతో, ఇంతే గ్రుడ్డితనంతో జవాబు చెప్పాడు. లీగు లక్నో మహాసభలో అధ్యక్షోపన్యాసం చేస్తూ ఆయన అన్న ముక్కలివి :

"భారత జాతీయ ప్రజాస్వామిక స్వపరిపాలనకు లీగు నిలబడు తుంది......సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని గురించి మాట్లాడేవాళ్ళు కొంత మంది ఉన్నారు. చేతుల్లో 1935 ఇండియా చట్టాన్ని పెట్టుకొని, సంపూర్ణ స్వాతంత్రాన్ని ఉచ్చరించి ప్రయోజనం లేదు. పదేళ్ళబట్టి కాంగ్రెస్ నాయకత్వం భారత ముస్లింల పట్ల మరీ శత్రుత్వం వహిస్తున్నది. హిందూ తత్వాన్ని అవలంబిస్తున్నది. వారికి మెజారిటీ వున్న ఆరు రాష్ట్రాల్లో మంత్రివర్గాలను స్థాపించింది లగాయతు, ముస్లింలు వారిచేతుల్లో న్యాయం పొందజాలరనేది కాంగ్రెస్‌నాయకులు మనోవాక్కాయకర్మల ద్వారా ధ్రువపరిచారు. ఎక్కడెక్కడ వారికి మెజారిటీవుందో, ఎక్క డెక్కడ వారికి అవకాశం వుందో అక్కడక్కడల్లా వారు లీగుతో సహ కారం చెయ్యనిరాకరించారు. లీగును లొంగిపొమ్మన్నారు. చివరకు తమ ప్రమాణ పత్రాలమీద సంతకాలు కూడా చెయ్యమన్నారు."

(ఇండియన్ యాన్యుయల్ రిజిష్టర్, 1937; వాల్యూం 1 403 పేజీనుంచి)

"ఏమాత్రంఅధికారం' బాధ్యత వచ్చినప్పటికీ అధిక సంఖ్యాక జాతి అయిన హిందువులు హిందూస్థాన్ తమదే అనే ఉద్దేశం స్పష్టపరిచారు, కాంగ్రెస్ జాతీయత అనే ముసుగు వేసుకొంది. కాని, హిందూసభ ఈ విషయం దాచడంలేదు." అని చెప్పిన మాటల్లోనే జిన్నాగారి పాకిస్థాన్‌కు బీజంవుంది. ఈవిధంగా కాంగ్రెస్ లీగు నాయకులు సమస్యలను అర్థంచేసు కోలేకపోయారు, ఒక అంగీకారానికి రాలేకపోయారు. ఒకరినొకరు తిట్టు కొని దేశంలో అల్లకల్లోలం తెచ్చారు, గుడ్డిద్వేషంతో వాస్తవ పరిస్థితు లనుచూడలేకపోయారు. కాంగ్రెస్‌నాయకులు లీగును సామ్రాజ్యవాద అను కూలసంస్థ అన్నారు. లీగు నాయకులు కాంగ్రెసు మాటల్లో జాతీయ సంస్థగాని చేతల్లో హిందూసంస్థే నన్నారు.

## యుద్ధసంక్షోభం — పాకిస్థాన్ సమస్య

రెండో ప్రపంచయుద్ధం ప్రారంభం కావడంతో మన స్వాతం త్రోద్యమం చిట్టచివరి దశకు వచ్చేసింది, 'భారత స్వాతంత్ర్యాన్ని వెంటనే

గుర్తించాలి. వయోజన వోటింగు పద్ధతిమీద ఎన్నుకోబడిన రాజ్యాంగసభ ద్వారా తమ రాజ్యాంగం ఎలావుండాలో భారతప్రజలే నిర్ణయించుకోవాలి' అనే నినాదం లేచింది. ఈయుద్ధంతో సామ్రాజ్యవాదానికి అంత్యదశ వచ్చేసిందని, భారత స్వాతంత్ర్యోద్యమం ఇప్పుడే స్వాతంత్ర్యం సాధించగలదనీ గుర్తించిన కాంగ్రెస్ నాయకులు ఈ నినాదాన్ని లేపారు. కాని, మామూలు ధోరణినే బెదరించి కొన్ని సౌకర్యాలనూ అధికారాలనూ పొందాలని చూశారు. అందువల్ల మళ్ళీ బేరసారాలకు అవకాశం అట్టే పెట్టారు.

మేము సహాయ నిరాకరణోద్యమం తెస్తామని బెదరించి కాంగ్రెస్ నాయకులు ప్రస్తుతం స్వాతంత్ర్యం కావాలన్నారు. అంటే, కేంద్రంలో అధికారమిస్తే యుద్ధంలో సహాయం చేస్తారన్నమాట! కనుక యుద్ధప్రయత్నాలను భగ్నపరచకూడదనే పాలిసీని కాంగ్రెస్ అవలంబించింది. కాని మంత్రివర్గాలనుంచి తొలగి, తన షరతులమీదనే రాజీ జరగడం కోసం ఎదురుచూసింది.

1936 లో జిన్నాగారు పునర్నిర్మించిన ముస్లింలీగు ఈపాటికే ముస్లింలలో చాలా బలవత్తరంగా తయారయింది. కాంగ్రెసువారూ ముస్లింలూ కలిసి సమిష్టిగా చేసిన 'స్వరాజ్య' పోరాటాలలో నుంచి ముస్లిం జాతీయోద్యమం వెలువడింది. కాని 1924 నుంచీ కాంగ్రెస్ ముస్లింల మధ్య సమిష్టి స్వాతంత్ర్య పోరాటంకోసం ఒక అంగీకారం కుదరక పోవడంవల్ల ఐక్యతకోసం చేసిన కృషి వరసనే విఫలం కావడంవల్ల నానాటికీ ముస్లింల స్వాతంత్ర్య జాతీయోద్యమం చిన్నాభిన్నమై పోయింది. ప్రజా ఉద్యమాలన్నీ విజృంభించిన సమయంలో జిన్నా మళ్ళీ లీగును పునర్నిర్మించాడు. తర్వాత 1937 ఎన్నికల్లో లీగు అభివృద్ధికరమైన విధానాన్ని అవలంబించింది. 1937 లోనే లక్నో మహాసభలో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదించి, ముస్లింలీగు ముస్లిం స్వాతంత్ర్య చైతన్యాన్ని కేంద్రీకరించింది. ఇది ఈ కొత్తలీగు యొక్క అభివృద్ధిలో ఒక దృక్పథం. ఈకాలంలో మన స్వాతంత్ర్యోద్యమం



లోగడనుంచే వున్న కాంగ్రెస్ ముస్లిం విభేదాలను పరిష్కరించి, ఐక్యతను సాధించలేక పోవడంవల్ల లీగు అభివృద్ధిలో రెండో దృక్పథం కూడా ఏర్పడుతుంది.

సింధు, సరిహద్దు, బెలూచీస్థాన్, పంజాబ్ మొదలైన ముస్లిం మెజారిటీ రాష్ట్రాలకు సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని ముస్లింలు అంతకంతకూ గట్టిగా కోరడంలో నిజమైన అర్థమేమిటో కాంగ్రెసువాదులూ, హిందూవులూ తెలుసుకోలేక పోయారు. ఈ కోరికలో ముస్లింజాతులు తమతమ జన్మభూముల్లో స్వతంత్రంగా వుండగోరే సదుద్దేశం వుందని వారు గ్రహించలేకపోయారు. అప్పటికింకా ముస్లింలు తమ కోర్కెను విడిపోయే తత్వంలోకి దింపలేదు. 1928 లో అఖిలపక్ష సమావేశం విఫలమయినాక, స్వతంత్ర భారతదేశం, అమెరికా సంయుక్తరాష్ట్రాల పద్ధతిలో, స్వతంత్ర ప్రజాస్వామికాల కూటమిగా వుండాలని అఖిలభారత ఖిలాఫత్ మహాసభ కోరింది.

ముస్లింలీగు 1937 లో తన స్వాతంత్ర్యలక్ష్యాన్ని నిర్వచిస్తూ, భారతదేశం 'స్వతంత్రప్రజాస్వామిక రాజ్యాల సమాఖ్య'గా వుండాలని చెప్పింది. ఈ కాలంలో, రాష్ట్ర మంత్రివర్గాలు ఏర్పడ్డతరువాత, సామ్రాజ్యవాదులు సూచించిన ఫెడరేషనును దేశమంతా ఖండిస్తున్న సమయంలో వివిధస్వతంత్రరాజ్యాల ఐచ్ఛిక ప్రజాస్వామిక సమాఖ్యగా భారతదేశం వుండాలనే ప్రాతిపదిక మీద కాంగ్రెస్‌కూ ముస్లింలకూ మధ్య ఐక్యత సాధించవలసింది. కాని, 1937—39 మధ్య కాంగ్రెస్ లీగు రాయబారాలు ఎప్పుడూ ఏ ఫలితానికీ రాలేదు. కాంగ్రెస్ ముస్లింలమధ్య ఒక అంగీకారం కుదరక పోవడంవల్ల ముస్లింలలో అసంతృప్తి హెచ్చింది. ఆ అసంతృప్తి క్రమక్రమంగా విడిపోయేతత్వం క్రిందికి దిగింది. అదే ఈక్రొత్త లీగుయొక్క విశిష్టస్వభావమైంది. అదే లీగు అభివృద్ధిలో రెండో దృక్పథం.

యుద్ధం ప్రారంభంకాగానే, లీగు నాయకత్వంకూడా, కాంగ్రెసు వాళ్ళలాగానే, సామ్రాజ్యవాదులతో బేరమాడసాగింది. యుద్ధానికి సహా

కారంచేస్తామనీ, యుద్ధ ప్రయత్నాలకు భంగంకల్గించమనీ, లీగునాయకులు చెప్పారు. తమ షరతులమీద తమతో ప్రభుత్వం ప్రత్యేక పరిష్కారానికి రావాలని ఆశించారు.

వైస్రాయి, తమకు సాంప్రదాయసిద్ధమైన విధానాన్ని, అవలంబించాడు. కాంగ్రెసు, లీగు విభేదాలను వినియోగించుకొన్నాడు. రెండు పార్టీల కోర్కెలను తిరస్కరించాడు. రాష్ట్రప్రభుత్వాలను నిర్మించడం విషయంలో ముందుగా రెండు పార్టీలూ ఒక అంగీకారానికివచ్చి, తర్వాత కేంద్రాన్నిగురించిన ఒక సమిష్టిప్లానుతో తనదగ్గిరికి రావాలని అన్నాడు.

కాంగ్రెస్, లీగులు సమిష్టిగా తనకు లొంగిపోవాలని వైస్రాయి సవాలుచేశాడు. కాని దురదృష్టవశాత్తు, కాంగ్రెస్ లీగులు ఏకమై ఈ సవాలును ఎదుర్కొలేకపోయాయి.

పండిత నెహ్రూ, జనాబ్ జిన్నాలు కలుసుకున్నారు.

జిన్నా కూడా స్వాతంత్ర్యం కోసం నిలబడతాడని తెలుసుకొని నెహ్రూ ఆశ్చర్యపోయాడు. ఆయన ఇలా అన్నాడు ;

"జిన్నాగారు ముస్లింలీగు భారతదేశంయొక్క స్వాతంత్ర్య ప్రకటనకు వ్యతిరేకంగా వున్నారని వైస్రాయి ఊహిస్తున్నాడా? అయితే అతను చాలా పొరపడుతున్నాడు. జిన్నాగారికి నాకు చాల భాగం సమిష్టి లక్ష్యాలున్నాయని తెలుసుకోడానికి నేను ఆనందిస్తున్నాను....—"

(ఇండియన్ యాన్యుయల్ రిజిస్టర్, 1939: వాల్యూం 2, 417 వ పేజీ నుంచి)

కాని వచ్చిన అనర్థమంతా ఎక్కడ వున్నదంటే నెహ్రూ జిన్నాలు అంగీకారానికి అవసరమైన సమిష్టి సూత్రాలను నిర్మించుకోలేకపోయారు; అవసరానికయినా ఒక హద్దు ఉన్నదనుకున్నారు; సంభాషణలు చాలించారు.

ఈ రోజుల్లో జరిగిన రాజీ రాయబారాలన్నీ మొగ్గలోనే తునిగిపోయాయి. ముస్లిం మైనారిటీలోని అనేక సంఘాల్లో లీగుకూడా ఒకటని కాంగ్రెస్ నాయకులు పరిగణించారు. కాంగ్రెస్ అసలు ముస్లింలకే



ప్రాతినిధ్యం వహించదనీ, ఒక ప్రధానమైన హిందూపక్షమనీ జిన్నా పేచీ పెట్టాడు.

కాంగ్రెస్, లీగులు ఒక అంగీకారానికి రాలేకపోయినప్పుడల్లా ఒకళ్ళమీద ఒకళ్ళకు మంట ఎక్కువయింది. పరస్పరాంగీకారంమీది ఆశలు అడుగంటి, అది అసాధ్యమనే విశ్వాసం అధికమైంది. ఇద్దరూ తుది నిర్ణయంకోసం బ్రిటిషువాళ్ళవంక అర్రులు చాపుతూవచ్చారు.

కేంద్ర ప్రభుత్వంలో ముస్లిం మెజారిటీ జన్మభూములమీద కూడా కాంగ్రెస్ పెత్తనం చెలాయిస్తుందని లీగు నాయకులు విశ్వసించారు.

రాంఘర్ మహాసభలో కాంగ్రెస్ సంపూర్ణ స్వాతంత్ర్యాన్నీ, వయోజన వోటింగు పద్ధతిమీద రాజ్యాంగ సభనూ కోరింది.

లాహోరు మహాసభలో లీగు ముస్లిం మెజారిటీ రాష్ట్రాల సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరుతూ అవి ప్రత్యేక స్వతంత్ర రాజ్యాంగంగా నిర్మించబడాలని తీర్మానించింది.

ఈ 'ప్రత్యేకరాజ్యాంగం' అనే కోరికను సమర్థించడంకోసం జిన్నాగారు ముస్లింలు ఒక జాతి అనే నినాదం లేవదీశాడు. కాని ఈ సిద్ధాంతానికి మొదట్లోనే వాస్తవ పరిస్థితులలో సంఘర్షణ వచ్చింది. అందువల్లనే పాకిస్థాన్ రాజ్యాంగంలోని "వివిధ భాగాలు ప్రత్యేకంగాను స్వతంత్రంగాను వుండా"లని తీర్మానించడం జరిగింది.

ఈ తీర్మానంమీద ఉపన్యసిస్తూ జిన్నాగారు, అసలు తాను ఈ పాకిస్థాన్ తీర్మానానికెలావచ్చిందీ వివరిస్తూ ఇలా అన్నాడు,

"నిస్సందేహంగా మనం భారత స్వాతంత్ర్యకోసం నిలబడతాం. అది భారతదేశమంతటికీ స్వాతంత్ర్యమై వుండాలి. ఏ ఒక వర్గానికో స్వాతంత్ర్యంకాదు. అందులో కాంగ్రెసు పెత్తనంక్రింద ముస్లింలు తక్కిన అల్పసంఖ్యాకుల బానిసత్వమయితే మరీ అధ్వాన్నం."

(ఇండియన్ యాన్యుయల్ రిజిస్టర్, 1940, వాల్యూం. 1, 309 వ పేజీనుంచి)

హిందూ ముస్లిం విభేదాలయొక్క చరిత్ర ఇది. మన సమస్య పెంపొందిన చరిత్ర ఇది.

ఉభయపక్షాల నాయకులు ఈ సమస్య ఎలా పెంపొందిందీ అర్థం చేసుకోలేకపోయారు. కాబట్టి బ్రిటిష్ మితవాద భావాలను భారతదేశంలోని వాస్తవపరిస్థితుల కనుగుణంగా మార్చుకొని అన్వయించుకోలేకపోయారు కాబట్టి, ఐక్యతకోసం జరిగిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి. ఇందువల్లనే కాంగ్రెసు లీగులు ఒకదాని కొకటి దూరమైపోయాయి. ఒకరిమీద ఒకరికి నమ్మకం లేకుండా పోయింది, ఇద్దరూ బ్రిటిష్ పాలకులమీద ఆశలు పెట్టుకోడం జరిగింది.

## క్రిప్సు రాయబారం - తదనంతరం

ఇండియాకు చుట్టుకున్న దండయాత్రా ప్రమాదంతో 1942 లో కొత్త పరిస్థితి ఏర్పడింది. ఏసౌకర్యాలూ లేకుండా, ప్రభుత్వం, కాంగ్రెసును లొంగదీసుకోవల్సిన అవసరం వచ్చింది. కాంగ్రెసుకూ లీగుకూ ఆశలు పెట్టడం, సంస్థానాధిపతుల నుపయోగించుకొని అధికారం తమ చేతుల్లోనే వుంచుకోవడం - ఇదే పాత నాటకం మళ్ళీ ప్రారంభమైంది

క్రిప్సు ఎవరేది అడిగితే అదల్లా వాగ్దానం చేసాడు, కాంగ్రెసుకు అఖిలభారత రాజ్యాంగం; లీగుకు - కేంద్రాధిపత్యంతో నిమిత్తంలేకుండా ప్రత్యేక రాజ్యాంగం; సంస్థానాధిపతులకు - వారి నిరంకుశత్వంతో ఎవరూ జోక్యం కలిగించుకోకుండా....

కాంగ్రెసును బుట్టలోవేసుకోడానికి, బ్రిటిష్‌వైస్రాయి, భారతదేశం భూగోళ శాస్త్రరీత్యా ఒకే దేశమని ముచ్చటించాడు. కాని ముస్లింలకు భారతదేశ విభజనలో బ్రిటిష్‌వాళ్ళు తోడ్పడతారనే విశ్వాసం పోకుండా వుండడానికి, ఏరాజ్యాంగాన్ని కూడా బలాత్కారంగా ముస్లింల నెత్తిన రుద్దమని వాగ్దానం చేసాడు. దీంతో సామ్రాజ్యవాదులు కాంగ్రెస్ లీగును బుట్టలో వేసుకున్నారు.



అన్ని పార్టీలవారిని ఒక నిర్ణయానికి రమ్మని సామ్రాజ్య వాదులు కోరారు. ఏనిర్ణయంకూడా ఎవరిమీదా బలవంతంగా రుద్దబడదని హామీ ఇచ్చారు; కాంగ్రెసును జైల్లో పెట్టారు. యుద్ధానికి సహాయం చెయ్యడం ద్వారా ప్రత్యేక సంధికోసం ప్రయత్నించినప్పటికీ, లీగును యుద్ధానికి దూరంగా వుంచారు.

ఆగస్టు ఉద్యమం విఫలమైనాక, కేంద్రప్రభుత్వంలో లీగుకు తగిన భాగమివ్వడానికి బ్రిటిష్‌వాళ్ళు నిరాకరించాకనే, గాంధీ జిన్నాలు కలుసుకున్నారు. కాని- ఒక పరిష్కారానికి రాలేకపోయారు; 'ముస్లింలు ఒక జాతి' అనే సిద్ధాంతం వెనుక అన్నిదేశాల ముస్లింలు కలిసి భారతదేశం మీద దాడిచేసే తత్వం (పాన్-ఇస్లామిజం) ఉన్నదేమోనని గాంధీజీ అనుమానించాడు, భారతదేశ విభజనకు వ్యతిరేకంగా వాదించడంలో గాంధీజీ హిందూ ఆధిపత్యంకోసం ప్రాకులాడుతున్నాడనీ, ఆయన మాటల్లో మాత్రమే స్వయంనిర్ణయసూత్రం అంగీకరించడానికి తయారైనాడనీ జనాబ్ జిన్నా అనుమానించాడు.

కాంగ్రెసు నాయకులు జైళ్ళనుండి బయటకువచ్చి, సిమ్లాసమావేశం జరుగుతుందని ప్రకటించబడగానే, మళ్ళీ కాంగ్రెసు లీగులు ఎవరికివారు ప్రభుత్వంతో రాజీపడవచ్చునని ఆశపడ్డారు. ఉభయులూ సిమ్లాచేరారు. అదివరకు గాంధీ, జిన్నా సంభాషణలవల్ల కలిగిన అభివృద్ధి నంతటినీ కాంగ్రెసునాయకులు కాలదన్నారు.

దీనికి బదులు, లీగ్, భూలాభాయ్ లియాఖత్ సంధిని నిరాకరించింది. చివరకు ఉభయుల ఆశలూ బూడిదైనాయి. దేశానికి తీరని అవమానం జరిగింది.

ఈవాడు ఒకళ్ళమీద ఒకళ్ళు పూర్తిగా నేరం ఆరోపిస్తున్నారు.

సాధారణ నియోజకవర్గాల్లో కాంగ్రెసు, హిందూమహాసభయొక్క ముస్లిం వ్యతిరేక గర్జనల నన్నిటినీ గుత్తగొన్నది, ముస్లిం నియోజకవర్గాల్లో లీగుకు వ్యతిరేకంగా నిలబడ్డవాళ్ళనల్లా బలపరుస్తున్నది.

సీట్లు సంపాదించడం కోసం, ప్రభుత్వ గులామైనాసరే, కాంగ్రెస్‌తో పోరాటానికి కత్తికడితేసరి. ఏ ముస్లిమునైనా లీగు ఆహ్వానిస్తున్నది. ఐక్యతావాంఛ పోయి లీగులో కాంగ్రెస్‌మీద ద్వేషం పెచ్చు పెరుగుతున్నది. కాంగ్రెస్. ముస్లిం ఐక్యతను విచ్ఛిన్నంచేయ బూనుకున్నదనీ, ముస్లిం న్యాయమైన హక్కును నిరాకరించి, ముస్లింలమీద పెత్తనం చెలాయించ నిశ్చయించిదనీ ముస్లింల అభిప్రాయం.

లీగు తన ఎన్నికల ప్రచారంలో స్వాతంత్ర్యంకంటే హిందూ వ్యతిరేకతకే ప్రాధాన్య మిస్తున్నది. మళ్ళీ మతావేశం ప్రవేశించింది. ప్రభుత్వ గులాములు ముఖ్యమైన స్థానాలను ఆక్రమిస్తున్నారు.

భారతదేశం స్వతంత్రరాష్ట్రాల కూటమిగా ఒకే రాజ్యాంగంగా వుండాలనీ, అందులో మైనారిటీలకు వారివారి మత సంస్కృతుల విషయంలో పూర్తి రక్షణలుండాలనీ కాంగ్రెస్ ఊహ. వయోజనవోటింగుతో ఎన్నుకోబడ్డ రాజ్యాంగసభ స్వతంత్ర భారతరాజ్యాంగాన్ని నిర్మించాలని కాంగ్రెస్ చెబుతుంది.

భారతదేశం రెండు స్వతంత్రరాజ్యాల స్నేహకూటంగా వుండాలని, (అందులో ఒకటి ముస్లింలు అధికసంఖ్యాకులుగావున్న తూర్పు ఈశాన్య ప్రాంతం, పాకిస్తాన్; రెండవది హిందూమెజారిటీవున్నమిగతా భారతదేశం, హిందూస్థాన్) లీగు ఊహ. కనుక పాకిస్థాన్‌కూ హిందూస్థాన్‌కూ ప్రత్యేకంగా రెండు రాజ్యాంగ నిర్ణయసభలేర్పడాలని లీగు చెబుతుంది.

ఒకరిమీద ఒకరికి అనుమానం. కాంగ్రెస్ నాయకత్వానికి గానీ, లీగు నాయకత్వానికి గానీ,హిందూ ముస్లిం ఐక్యత వస్తుందనే విశ్వాసం లేదు. స్వరాజ్యానికి హిందూ ముస్లిం ఐక్యతే ప్రధానాధారమని కాంగ్రెస్ లీగు నాయకులు ఇరవై ఏళ్ళక్రిందట గమనించారు. దేశంనుంచి బ్రిటిష్ వాళ్లు వెళ్ళిపోయేదాకా హిందూ ముస్లిం ఐక్యత సాధ్యంకాదని ఇవాళ కాంగ్రెస్ నాయకులంటున్నారు! బ్రిటిష్‌వాళ్ళకంటే హిందువులూ, కాంగ్రెసూ. తమకు ప్రధానశత్రువులుగా లీగు నాయకులు పరిగణిస్తున్నారు



ఈనాడు మన స్వాతంత్ర్యోద్యమం మూడవదశలో. చివరిదశలో వుంది. తమ రాజ్యాంగాన్ని తామే నిర్మించుకోడానికి భారత ప్రజల జన్మహక్కును పురస్కరించుకొని సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరుతున్నాం. వివిధ పక్షాలు తమ తమ విభేదాలను ప్రజలముందుపెట్టి, వారి నిర్ణయాన్ని స్వీకరించాలి. అందరికీ న్యాయం జరగడానికీ, అందరియొక్క ప్రజాస్వామికం, స్వాతంత్ర్యం రక్షింపబడడానికీ, ఇదే సూత్రం. కాని మన స్వాతంత్ర్యోద్యమంలో అలాంటి సూత్రాలతో కూడిన సమిష్టి ప్లానులేదు. వయోజన వోటింగుతో కూడిన రాజ్యాంగసభ భారతదేశ మంతటికీ ఒక్కటే కావాలంటుంది కాంగ్రెసు. లీగు కలాంటిదేమీ పనికిరాదు; ముస్లిం మెజారిటీప్రాంతాలకు ప్రత్యేకరాజ్యాంగసభ కావాలంటుంది లీగు.

బ్రిటిషు సామ్రాజ్యాధిపత్యాన్ని పటాపంచలు చేయడానికీ, భారత ప్రజలందరియిష్టానికీ అనుగుణమైన కార్యక్రమంతో స్వాతంత్ర్యశక్తులన్నీ ఏకంకావాలి. దీనికిబదులు ఇవాళ మనకు పరస్పరం పోరాడుకుంటున్న రెండు మతాలు కన్పిస్తున్నాయి. అంతర్యుద్ధపు ఛాయలు అలుముకొంటున్నాయి. సమయంచూచి సామ్రాజ్యవాదులు మళ్ళీ మనకు ఇంకొక కమ్యూనల్ అవార్డు ఇవ్వడానికి సిద్ధపడుతున్నారు. దీనిప్రకారం మన దేశం (1. హిందూరాజ్యం, 2. ముస్లిం రాజ్యం, 3. సంస్థానాధిపతుల నిరంకుశరాజ్యం) మూడు రాజ్యాలుగా శాశ్వతంగా విభజింపబడుతుంది. ఈ మూటిమీద బ్రిటిషువాళ్ళ అదుపాజ్ఞల్లోవుండే 'ఏజెన్సీ సెంటర్' సర్వాధికారాలు చెలాయిస్తుంది.

కాంగ్రెస్ లీగునాయకు లిద్దరూ ఈ విషయాన్ని గమనించడమే లేదు. ఎన్నికల్లో ఎక్కువస్థానాలు సంపాదించి, బ్రిటిష్‌వాళ్ళతో ఎవరికివారు ప్రత్యేకంగా పరిష్కారం చేసుకుందామని వాళ్లు చూస్తున్నారు!

## మన శత్రువేమనుకుంటాడు!

ఇక్కడ కాంగ్రెస్ లీగులను గురించి మన పరిపాలకులేమను కొంటున్నారో, మన శత్రువుదృష్టిలో మనం ఎలా వున్నామో ఆలోచించు

కొనడంఅవసరం. యుద్ధానికిపూర్వం. యుద్ధకాలంలోను కాంగ్రెస్‌చెందిన అభివృద్ధి అంతా ఇంగ్లీషువాళ్లపోయాక మొత్తం ఇండియామీద పెత్తనం చెలాయించగోరే హిందూస్వార్ధపరులు పెంపొందడం క్రింద జమకట్టాడు ప్రొఫెసర్ కూప్లండు !

ఈ పెద్దమనిషికే లీగులో సామ్రాజ్య వాంఛలు కనిపించాయి. హిందూ ఆధిపత్యంనుంచి మళ్ళీ భారతదేశాన్నంతటినీ జయించి, ముస్లిం సామ్రాజ్యాన్ని నిర్మించాలని లీగునాయకులు కోరుతున్నారట !

మన శత్రువులు మన ఉద్యమాల్లో నీచస్వభావాలను తీసుకుంటారు; మన నాయకులు చేసిన చెడ్డపనులను మాత్రమే తీసుకుంటారు. కాంగ్రెస్ లీగులు వెనుక ఉన్న అశేష ప్రజ, సామ్రాజ్యవాదుల దృష్టిలో కన్పించదు.

కాంగ్రెసు ఎన్నికల సభల్లోగానీ పత్రికల్లోగానీ చేసే లీగు వ్యతిరేకప్రచారం చూస్తే కాంగ్రెసువాదులు లీగును తిట్టిపోసేధోరణి, పైన చెప్పిన సామ్రాజ్యవాదుల ధోరణికి నకలుగానేవుంటుంది. కాంగ్రెసుమీద లీగు ప్రచారంకూడా అదే ధోరణిలో వుంటుంది.

ఎదుటిపార్టీనాయకులు చెప్పినమాటల్లో చెడ్డవీ, వారుచేసిన చేతల్లో చెడ్డవీ ఏరి తూర్పారపట్టడం తప్పితే, ఎదుటిపార్టీ వెనుకనున్న ప్రజలను అర్ధంచేసుకోడంగానీ, వారికి తమ పంథాను నచ్చజెప్పడంగానీ లేదు.

ఇక్కడ కాంగ్రెసు, లీగు విభేదాలను సింహావలోకనంచేశాం. ఇదంతా మూడు ముక్కల్లో చెప్పాలంటే —

1. వారి రాజకీయాభిప్రాయాలనుబట్టి కాంగ్రెసు, లీగు నాయకులుభయులూ 19 శతాబ్దపు బ్రిటిష్ మితవాద ధోరణికి చెందినవారు. 20 వ శతాబ్దపు భారత ప్రజాస్వామిక వాదులుకారు.

2. తమ ప్రజల్లో ఆందోళనచేసేటప్పుడైనా, వారిలోని నీచోద్రేకాలనూ మతావేశాలను రెచ్చగొట్టడానికి వెనుకాడరు.



3. బ్రిటిష్‌వాళ్ళ మాటవస్తే, ఈ నాయకులు తమసోదరుడి కంటే, ఇద్దర్నీ బానిసల్ని చేసిన ఆ యజమానులమీద ఎక్కువ విశ్వాసం ఉంచుతారు. దీనికంతటికీ ఫలితం పెద్ద సంక్షోభం. అదే ఇవాళటి మన భారతదేశ స్వరూపం.

ఈ నాయకులు తమ ప్రజల స్వాతంత్ర్య పిపాసకు, ఒక కార్యక్రమం ఇవ్వలేకపోయారు. అందరికీ న్యాయం జరగాలనే సిద్ధాంతంమీద అందరి స్వాతంత్ర్యం కోసం ఒక స్వాతంత్ర్య కార్యక్రమాన్ని నిర్వచించలేకపోయారు. అందర్నీ బానిసల్ని చేసి అణగద్రొక్కే బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సమిష్టిపోరాటం సాగించలేకపోయారు,

# 3. సామ్రాజ్యవాదుల క్రొత్తప్లాను

వెనుకటి గుణపాఠాల నన్నిటినీ భారత నాయకులు ఇవాళ మరచి పోతున్నారు. ఒకరిమీద ఒకరు కత్తులు దూసుకుంటున్నారు. భారత దేశాన్ని "చీల్చి పాలించు"అనే పాతఎత్తుగడతోనే సామ్రాజ్య వాదులు ప్రవేశపెట్టబోతున్న కొత్తప్లానును గమనించలేకపోతున్నారు.

మన పూర్వులు. బ్రిటిష్‌వాళ్ళ ఎత్తుగడలను అర్థంచేసుకోలేక పోయారు. కనుకనే మన విభేదాలను బ్రిటిష్‌వాళ్ళు వినియోగించుకునే అవకాశం ఇచ్చారు. కనుకనే మన మాతృభూమిని కోల్పోయారు.

ఇప్పటి నాయకులుకూడా అదే తప్పుచేస్తున్నారు. కాంగ్రెస్ లీగు నాయకులలో అత్యంత ప్రముఖులైన నెహ్రూ, జిన్నాగార్లు ఇవాళ ఎన్నికల మీటింగులలో చెబుతున్న దేమిటి ? తమయందు విశ్వాసంవుంచి, తమను గెలిపిస్తే తక్కిన పంతా తామే చేసిపెడతామని చెబుతున్నారు. ఇవ్వాళ వారు ప్రజలనుకోరుతున్నదల్లా ఇదే। వాళ్లు కోరేది - తమయందు విశ్వాసం ప్రకటించమని. అంతే।

కాని, వారియందు ఇంతకాలంగా ప్రజలు అచంచల విశ్వాసం వుంచారుగదా, మరి, తమ ఆశయాన్ని ఎందుకు సాధించలేకపోయారు ? ఈ చిన్న ప్రశ్నకు వారుచెప్పే జవాబేమీలేదు. వారు తమ ఉపన్యాసాల్లో బ్రిటిష్‌వాళ్ళ ఆశయాన్ని గూర్చిగానీ, వాళ్ళ ఇవాళటి ఎత్తుగడలను గూర్చి గానీ చెప్పడంలేదు. బ్రిటిష్ పరిపాలన నశించాలని తిట్టి, బ్రిటిషువాళ్ళు తమతో రాజీకి రావాలని అంటున్నారు.

బానిస భారతదేశపు నాయకులు మనల్నింకా బానిసత్వంలో పెట్టడానికై బ్రిటిష్ సామ్రాజ్యవాదులు అవలంబిస్తున్న పంథాను అర్థంచేసుకోడానికి గట్టిగా ప్రయత్నిస్తారనీ. భారత స్వాతంత్ర్య పోరాటసైన్యాన్ని నిర్మించడానికి ఎక్కువగా కృషిచేస్తారని సాధారణంగా అనుకుంటాం. కాని ఇదే ఇవాళ కాంగ్రెస్, లీగుల్లో జరగడంలేదు. నాయకులను నమ్మి వారియందు విశ్వాసం ప్రకటించినంత మాత్రాన ప్రజలకు స్వాతంత్ర్యం వచ్చేటట్లయితే. నిజానికి సమస్య చాలా తేలికే అవుతుంది.

మా పార్టీ ఒక్కటిమాత్రమే ఎన్నికల ప్రచారంలో తన గొప్పతనాన్నిగూర్చి చెప్పుకోడంలేదు; తనకూ ఇతర పార్టీలకూ ఉన్న భేదాలనుగురించి చెప్పుకోడంలేదు; కేవలం బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలద్రోయాల్సిన అవసరాన్నిగురించిమాత్రమే చెబుతున్నది. బ్రిటిష్ సామ్రాజ్య వాదుల ఎత్తును మా పార్టీమాత్రమే స్పష్టంగా అర్థంచేసుకున్నది; దానికి పై ఎత్తువేసి మన స్వాతంత్ర్య పోరాటానికి బాట చూపుతున్నది.

## బ్రిటిష్ రాక్షస తంత్రం

"కమ్యూనిస్టుపార్టీ తన శక్తినంతటినీ సామ్రాజ్యవాదులమీదికి కేంద్రీకరిస్తున్నది. అంతఃకలహాలలో ఒక్క మాటనుగానీ, ఒక్క కామ్రేడునుగానీ కోల్పోవడం మహాపరాధమని తలుస్తున్నది.

"మా పార్టీయొక్క నినాదం ఒక్కటే — భారతీయుడు భారతీయుడితో పోరాడరాదు; భారతీయులందరుకలిసి బ్రిటిష్ పరిపాలకులతో పోరాడాలి।

"చీల్చి పాలించే విధానంతోనే బ్రిటిష్‌వాళ్ళు మనజన్మభూములను జయించారనీ, ఆవిధానంతోనే ఈ 200 సంవత్సరాలు పాలించారనీ. అదే విధానంతో ఇంకా ఇక్కడ తిష్టవెయ్యడానికి చూస్తున్నారనీ కమ్యూనిస్టుపార్టీ భారతీయులందరికీ గుర్తుకుతెస్తున్నది.

"భారతదేశాన్ని విభజించే సామ్రాజ్యవాదుల క్రొత్తప్లానుకు వ్యతిరేకంగా, భారతదేశ వ్యక్తిత్వంకోసం. సమిష్టిత్వంకోసం కమ్యూనిస్టు పార్టీమాత్రమే ప్రజలనందరినీ సమీకరిస్తున్నది.

"భారత ప్రజానీకంలో పెంపొందుతున్న బ్రిటిష్ ద్వేషాన్నీ. స్వాతంత్ర్య ప్రియులైన, ప్రపంచ ప్రజల్లో వస్తున్న నూతన చైతన్యాన్ని చూశాక, ఇక భారతీయులను వెనకటిలాగా చీలదీయడానికి అవకాశం లేదనీ, భారతదేశాన్ని బానిసదేశంగా త్రొక్కిపట్టడానికి వీలులేదనీ బ్రిటిష్ సామ్రాజ్యవాదులు గుర్తించారు.

ఇండియామీద వాళ్ళ సర్వాధికారమూ, ఇండియాలో వాళ్ల ప్రవేశపెట్టిన సాంఘిక విధానమూ పటాపంచలై పోతున్నాయి. వాళ్లను దేశం నుంచి వెళ్లగొట్టడానికి భారతీయుల మందరం ఒకటి కాక ముందు, వాళ్లు మనమీద రుద్దిన సాంఘిక విధానాన్ని మన కనుకూలమైన విధంగా మార్చి పునర్నిర్మించుకోకముందు, తమ ప్రయోజనాలను కాపాడుకోడానికి వీలైన విధంగా సామ్రాజ్యవాదులు తమ పాత ప్రభుత్వానికి కొత్త స్వరూపం కల్పించబోతున్నారు.

"వాళ్లు భారతదేశాన్ని హిందూ మెజారిటీ రాజ్యంగాను ముస్లిం మెజారిటీ రాజ్యంగాను విభజించడానికి ఎత్తులేస్తున్నారు. ఈ రెండు రాజ్యాల రాజ్యాంగ చట్టాలు బ్రిటిషువాళ్ల సహకారంతో తయారు చెయ్యాలట! వీటితోపాటు, బ్రిటిష్ ప్రభుత్వంతో స్వతంత్ర సంధి సంబంధాలు కలిగిన సంస్థానాధిపతుల రాజ్యాన్నికూడా నిలబెట్టాలని సామ్రాజ్యవాదుల పన్నాగం.

ఈ విధంగా కాంగ్రెసు, లీగు ఉద్యమాలద్వారా వచ్చిన మహత్తర ప్రజా చైతన్యాన్ని చీలదీసి, తరతరాలుగా తమ తొత్తులైన సంస్థానాధిపతుల ద్వారా తమ పెత్తనాన్ని నిలబెట్టుకోవాలని బ్రిటిష్‌వాళ్ళ ఆశ.

"మనదేశాన్ని శాశ్వతంగా విభజించడానికి, కొత్తరకం బానిసత్వం మనదేశంమీద రుద్దడానికి ఇదొక జిత్తులమారి ఎత్తు."



అని కమ్యూనిస్టుపార్టీ తన 'ఎన్నికల ప్రణాళిక'లో బ్రిటిషు సామ్రాజ్యవాదుల రాక్షస తంత్రాన్ని బట్టబయలుచేసింది.

ఇలాంటి రాక్షస తంత్రం బ్రిటిష్‌వాళ్ళకు సహజంగానే స్ఫురిస్తుంది. నీచాతినీచమైన జిత్తులతో తియ్యనిమాటలు చెప్పడంలో వారు ఆరితేరారు. వాళ్లు ఉత్తినే వంద సంవత్సరాలు నవీన ప్రపంచంమీద పెత్తనం చెయ్యలేదు.

ఖండాలకు ఖండాలనే పెద్ద పెద్ద సంక్షోభాల్లో ముంచెత్తి జాతులకు జాతులనే బానిసల్నిచేసుకొని తలెత్తిన ప్రతి స్వాతంత్ర్యోద్యమాన్ని మెడ విరుగగొట్టి ప్రపంచమంతటా చిరకాలంగా పెత్తనం చెలాయించిన బ్రిటిష్ పరిపాలకవర్గానికి ఈ రాక్షసతంత్రాలు నిత్యకృత్యాలు.

## సామ్రాజ్యవాదుల ఎత్తుగడ

వాళ్ళ ఆశయమేమిటో స్పష్టం. భారతదేశం మళ్ళీ స్వాతంత్ర్యం సంపాదించుకోవాలని వాళ్ళ ఉద్దేశంకాదు.

వాళ్ళ ఎత్తుగడకూడా మామూలు ధోరణిలోనేవుంది - ఒక పార్టీ మీదికి మరొకపార్టీని పురిగొల్పడం,

ఈవిధంగా ఇండియా నెత్తిన కూర్చోవాలని వాళ్ళు ఆలోచిస్తున్నారు. కాంగ్రెసు, లీగు నాయకులు తమ విజయాన్ని గురించి ఎంత విశ్వాసంతో వున్నారో, సామ్రాజ్యవాదులుకూడా తమ విజయాన్నిగూర్చి అంత విశ్వాసంతోనే ఉన్నారు.

లేనిపోని భ్రమలు పెట్టుకొని మనంతట మనం తెలివితక్కువ వాళ్ళం కాదలచుకోకపోతే. మనం ముందు సామ్రాజ్యవాదుల పంథాను అర్థం చేసుకోవాలి. ప్రపంచ సామ్రాజ్యవాదం నశించడం. బ్రిటిష్ సామ్రాజ్యవాదం అల్లల్లాడి పోవడం మాత్రమేచూసి, నెప్రూలాగా, మళ్ళీ తన సామ్రాజ్యవాదం తన బ్రతుకుకోసం వేసే ఎత్తుగడలను చూడకపోవడం గుడ్డితనం.

క్రిప్సు ప్రతిపాదన అప్పటికప్పుడు భారతదేశాని కిచ్చిందేమీలేదు. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వపు ఇష్టాని కనుగుణంగా యుద్ధానంతర భారత స్వాతంత్ర్యానికి ఒకప్లానుమాత్రం ఇచ్చింది. తరువాత వచ్చిన బ్రిటిష్ ప్రభుత్వం ఆ ప్లానునే పునరుద్ఘాటించింది.

1945 జూన్ 14 న లార్డు వేవెలు ఇండియాలో ఉపన్యసించిన సమయంలోనే ఇంగ్లాండులో కామన్సుసభలో ఒక ప్రకటనచేస్తూ అమెరీ యిలా అన్నాడు.

“ఏవిధమైన మార్పులు కూర్పులు లేకుండానే, 1942 మార్చిలో క్రిప్సు చేసిన ప్రతిపాదన అలాగేవుంది.....తమ సూచనలను అంగీకరించడానికి భారతనాయకులు సిద్ధపడితే, సాధ్యమైనంత ముందడుగు వెయ్యడానికి బ్రిటిష్‌వారు ఇష్టపడుతున్నారు....”

(సిమ్లాలో అధికార ప్రకటన)

టోరీలను బయటకునెట్టి లేబరు ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక ఆట్లీ మళ్ళీ పాతపాటనే పాడాడు.

“ఇండియా విషయంలో బ్రిటిష్ పాలసీయొక్క పూర్తి నిర్వచనం 1942 ప్రతిపాదనలోనే వుంది, ఈదేశం (ఇంగ్లాండు) లోని అన్ని పార్టీల ఆమోదం పొందిన ఆ ప్రతిపాదన ఇంకా అమల్లోనే వుంది” అని చెప్పి ఆట్లీ, క్రిప్సు ప్రతిపాదన మీద జార్జిరాజు చేసిన ఈ క్రింది ప్రసంగాన్ని ఉల్లేఖించాడు: “నా భారత ప్రజలకు ఇదివరకే చేసిన వాగ్దానాలకు అనుగుణంగా భారతనాయకుల ఉద్దేశాన్నిబట్టి, భారతదేశం వెంటనే సంపూర్ణ స్వపరిపాలనను పొందడానికి నా ప్రభుత్వం శాయశక్తులా పనిచేస్తుంది.”

(టైమ్సు ఆఫ్ ఇండియా సెప్టెంబరు 20. 1945)

లార్డు వేవెలు 1945 డిసెం. 10 వ తేదీన బ్రిటిష్ అసోసియేటెడ్ ఛేంబర్స్ ఆఫ్ కామర్సు (వ్యాపారస్థుల సంస్థ) లో ఉపన్యసిస్తూ, బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశం స్వాతంత్ర్యంపొందాలని కోరుతున్నదనీ, అందుకు తోడ్పడుతుందనీ మళ్ళీ హామీ యిచ్చాడు. ఆయన ఇలా అన్నాడు:



“భారత ప్రజలు రాజకీయ స్వాతంత్ర్యం పొందాలనీ, ఒక ప్రభుత్వాన్ని గానీ రెండు ప్రభుత్వాలనుగానీ తమ కిష్టమైన విధంగా ఏర్పరచుకోవాలనీ బ్రిటిష్ ప్రభుత్వమూ బ్రిటిష్ ప్రజలూ హృదయ పూర్వకంగా కోరుతున్నారు. నేను ఈవిషయం మీకు నిస్సందేహంగా చెప్పగలను”

(టైమ్సు ఆఫ్ ఇండియా, డిసెంబరు 11, 1945)

బ్రిటిష్ సామ్రాజ్యవాదులను అర్థం చేసుకోవలసిన విధంగా అర్థం చేసుకొని, మన స్వాతంత్ర్య లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని కొన్ని సమస్యలు తేల్చుకుందాం.

భారత స్వాతంత్ర్యాన్ని గుర్తిస్తూ బ్రిటిష్ ప్రభుత్వ ప్రకటనలేదు. ఏ భారతీయ పక్షానికిగానీ, లేదా ప్రజలెన్నుకున్న ప్రతినిధులకు గానీ, అధికారం అప్పచెపుతామనే నిర్దిష్టమైన ప్రకటనా లేదు.

## కాంగ్రెసును బుజ్జగించడం

భారతరాజ్యాంగ నిర్ణయసభ తన కిష్టమయితే బ్రిటిష్ సామ్రాజ్యం నుంచి విడిపోవడానికి హక్కున్నదని కాంగ్రెసును సంతృప్తి పరచడానికి క్రిప్సు ప్రకటించాడు. కాని, అప్పట్లోవున్న బ్రిటిష్ ప్రభుత్వమూ, తర్వాత వచ్చిన ప్రభుత్వాలూ, ఇండియా ఎల్లప్పుడూ బ్రిటిష్ కామన్‌వెల్తులోనే భాగస్వామినిగా వుంటుందనే విశ్వాసాన్నీ, ఆశనూ ప్రకటించాయి.

కాంగ్రెసు నింకా సంతృప్తి పరచడానికీ, లీగుకు వ్యతిరేకంగానయినా సరే బ్రిటిష్‌ప్రభుత్వం తనతో రాజీపడవచ్చునని కాంగ్రెసును భ్రమపెట్టడానికీ, వాళ్ళు భారతదేశంయొక్క ఐక్యతను కాపాడగోరుతున్నట్టు, అందుకోసం సహాయం చేయనున్నట్టు ప్రకటనలు చేశారు.

“భారతదేశంలో సాధ్యమైనంత త్వరలో స్వపరిపాలనను స్థాపించడానికి” బ్రిటిష్ ప్రభుత్వం ప్రతిపాదనలు చేసినట్లు క్రిప్సు ప్రకటనలో వుంది. “నూతన భారత సమాఖ్యను నిర్మించడమే ఆశయ”మట.

(బాంబే క్రానికల్, మార్చి 30, 1942)

కామన్సుసభ చర్చలో సిమ్లా సమావేశాన్ని గురించి ప్రకటిస్తూ, అమెరీ ఇలా అన్నాడు : "అన్ని రాజ్యాలు సంపూర్ణభాగస్వామ్యం వహించే అఖిలభారత సమాఖ్యే మొదటినుంచీ మన లక్ష్యం...." (హిందూ, జూన్ 15, 1945).

పెథిక్‌లారెన్స్ లేబర్‌ప్రభుత్వంలో ఇండియా కార్యదర్శి. ఇతన్ని భారత మిత్రుడని చెప్పి ఆకాశానికెత్తారు. ఈ 'మహానుభావుడు' 1945 డిసెం. 4 వ తేదీన ప్రభువులసభలో ఉపన్యసిస్తూ, చట్టసమ్మతం కాని ఏ స్వాతంత్ర్య పోరాటాన్నయినా బ్రిటిష్‌ప్రభుత్వం అణి చేస్తుందని బెదిరించాడు. "భారతదేశం త్వరగా బ్రిటిష్ కామన్వెల్తులో స్వతంత్ర భాగస్వామినిగా తన పూర్తిస్థానం పొందాలనే ఈదేశ (ఇంగ్లాడు) ప్రజల కోర్కెనూ, ఈ లక్ష్యసిద్ధికోసం మా చేతిలో ఉన్నదల్లా చేయగోరే పార్లమెంటు వాంఛనూ ముఖాముఖిన తెలియజేయడానికి" ఒక పార్లమెంటరీ రాయబారవర్గాన్ని భారతదేశానికి పంపుతున్నామన్నాడు.

(టైమ్సు ఆఫ్ ఇండియా, డిసెం. 5, 1945).

చిట్టచివరకు లార్డువేవెలుకూడా తాత్కాలిక కేంద్రప్రభుత్వం విషయంలో కాంగ్రెస్ నాయకులకు ఆశలుగొల్పాడు. బ్రిటిష్ ప్రభుత్వమూ, దాని ఏజెంటుగా తాను "ఒడంబడిక కుదుర్చుకొనడానికీ, భారతదేశం ఒక రాజ్యాంగం నిర్మించుకొనేలా సహాయపడ్డానికీ కేంద్ర ప్రభుత్వంలో అన్నిపార్టీల సహకారాన్ని సంపాదించడానికీ, రాజ్యాంగంలో మార్పు వచ్చేలోగా (వివిధపార్టీల) వారు దేశ పరిపాలనలో పూర్తి బాధ్యత వహించేలాగా చెయ్యడానికీ చేతనైనదల్లా చేస్తా"మని వేవెలుచెప్పాడు.

(టైమ్సు ఆఫ్ ఇండియా, డిసెంబరు 11, 1945)

## లీగుకు వాగ్దానాలు

లీగును సంతృప్తిపరచడానికీ కాంగ్రెస్ నాయకత్వం చెప్పే మాటకంటే తనమాటకే బ్రిటిష్‌ప్రభుత్వం ఎక్కువ విలువ ఇస్తుందని లీగు నాయకత్వాన్ని భ్రమపెట్టడానికీ బ్రిటిష్‌వాళ్లు రెండు పనులు చేశారు.

1. ఇష్టంలేని ఏ పార్టీమీదగానీ యే రాజ్యాంగాన్నీ రుద్దమని చెప్పడం;
2. విభజనకు అవకాశం కల్పించడం; ఇందుకు క్రిప్సుసూత్రం చూడండి:

"బ్రిటిషు ఇండియాలోని ఏ రాష్ట్రంగానీ తన ప్రస్తుత రాజ్యాంగ స్థితికి మారుగా నూతన రాజ్యాంగాన్ని అంగీకరించకపోయినట్లయితే.... (అలా భారత రాజ్యాంగంలో) ప్రవేశించని రాష్ట్రాలతో, వాటి కిష్టమయితే వాటికి భారత సమాఖ్యకిచ్చినంత పూర్తి తాహతుయిచ్చి ఒక నూతన రాజ్యాంగంమీద ఒడంబడిక కుదుర్చుకోడానికి బ్రిటిష్‌ప్రభుత్వం సిద్ధంగా వుంటుంది.

కామన్సుసభలో 1945 జూన్ 14 వ తేదీన సిమ్లా సమావేశ ప్రకటనమీద ఉపన్యసిస్తూ అమెరీ ఇలా అన్నాడు.

"ఇండియాలోని ప్రధాన జాతుల కోర్కెలకు వ్యతిరేకంగా ఎట్టి మార్పునుగాని ప్రవేశపెట్టడం బ్రిటిష్ ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యం కాదు. .... భారతదేశపు భవిష్యత్తు శాశ్వత రాజ్యాంగం, లేక రాజ్యాల స్వరూపాన్నిగూర్చి, ఇప్పుడు సూచింపబడ్డ మార్పులు . యేవిధంగాను నిర్ణయాలుకావు; అపోహలు కలిగించవు."

(ఉపన్యాసంయొక్క అధికార ముద్రిత ప్రకటన)

ప్రభువుల సభలో పెథిక్ లారెన్సు ఇలా ప్రకటించాడు :

"భారత ప్రజలెన్నుకున్న ప్రతినిధులచేతనూ, వారి సలహాతోను, బ్రిటిష్ ఇండియాయొక్క భవిష్యత్పరిపాలనకు సంబంధించిన నిర్ణయాలు తీసుకోబడవలెనని బ్రిటిష్‌ప్రభుత్వంయొక్క దృఢవిశ్వాసం"

(టైమ్సు ఆఫ్ ఇండియా, డిసెంబరు 5, 1945)

లేబరు ప్రధాని అట్లీ ఇలా ప్రసంగించాడు :

"1942 క్రిప్సు ప్రతిపాదననాటినుంచీ, ఎల్లప్పుడు భారత సంపూర్ణ స్వాతంత్ర్యం, (భారతీయులు తీసుకోడమే ఆలస్యం,) సిద్ధంగావుంది, ఇంతవరకూ వచ్చిన ఆటంక మేమంటే - చాలా పెద్ద ఆటంకమే. ఇండియాలోని జాతులు తమలోతాము ఒక అంగీకారానికి రాలేకపోవడం."

(టైమ్సు ఆఫ్ ఇండియా, నవం. 10, 1945)

చిట్టచివరకు వేవెలు, లోగడ ఉదహరించిన కలకత్తా ఉపన్యాసంలో భారతప్రజలు వారి ఇష్టానుసారం ఒక ప్రభుత్వాన్నిగానీ, (కొన్ని) ప్రభుత్వాలను గానీ" ఏర్పరచుకోవచ్చునని అన్నాడు.

బ్రిటిషు ప్రభుత్వం భారతీయుల స్వయంనిర్ణయ హక్కును గుర్తించడం ఎంత బూటకమో, ముస్లింల స్వయంనిర్ణయ హక్కును గుర్తించడంకూడా అంత బూటకమే.

వాళ్లు సూచించిన రాజ్యాంగ నిర్ణయ సభను ఆధారం చేసుకొని, పంజాబ్ బెంగాలులు ఎప్పటికీ విడిపోవడానికి వోటు చెయ్యజాలవని వాళ్లకు నమ్మకం ఉంది.

క్రింది శాసనసభ లన్నిటినీ కలిపి రాజ్యాంగ నిర్ణయసభను ఏర్పర చాలని క్రిప్సు ప్లాను. రాష్ట్ర అసెంబ్లీల సభ్యులందరూ కలిసి. రాష్ట్రానికింతమంది అని, రాజ్యాంగ నిర్ణయసభకు ప్రతినిధులను ఎన్నుకోవాలి.

ముస్లింలు అధిక సంఖ్యాకులుగాఉన్న రాష్ట్రాల్లోగూడా ఈ క్రింది పరిస్థితులున్నాయి.

| రాష్ట్రం | ముస్లింలజనసంఖ్య నూటికి ఎంతమంది | రాష్ట్రఅస్సెంబ్లీలో మొత్తం స్థానాలు | ముస్లింస్థానాలు | మొత్తంలో ముస్లింస్థానాలు నూటికి ఎన్ని ? |
|---|---|---|---|---|
| పంజాబు | 57 | 175 | 86 | 49 |
| బెంగాలు | 55 | 250 | 119 | 48 |
| సింధు | 71 | 60 | 34 | 57 |
| సరిహద్దు | 92 | 50 | 36 | 72 |
| బెలూచిస్థాన్ | 87½ | ఎన్నుకున్న అస్సెంబ్లీయే లేదు. | | |

అసెంబ్లీలో నూటికి 80 మంది విడిపోవడానికి వ్యతిరేకంగా ఓటు చేసినట్లయితే ఆ సమస్య ఇక శాశ్వతంగా తేలిపోయినట్లేనని విడిపోయే హక్కునుగురించి క్రిప్సు ప్రతిపాదన స్పష్టపరిచింది. నూటికి 60 మంది గానీ, అంతకు తక్కువమందిగానీ అలాచేస్తే ఆ సమస్యను ప్రజల వోటుకు పెట్టమని మైనారిటీ కోరవచ్చు. కాని పంజాబులో బెంగాలులో ఇప్పటి సరిహద్దుల ప్రకారం, ఇప్పటి సంకుచిత వోటింగు పద్ధతిప్రకారం అసెంబ్లీ స్థానాలు ఎవరెవరికి ఎన్నెన్నివున్నాయో చూడండి. పంజాబు బెంగాల్ శాసనసభల్లో ముస్లింలకున్న స్థానాలన్నింటిలోను లీగు విజయం పొందినప్పటికీ, మొత్తం స్థానాల్లో నూటికి 50 కంటే తక్కువస్థానాలే లీగుకు వస్తాయి. కనుక విడిపోవడానికిగాను లీగుకు పంజాబ్ బెంగాల్ అసెంబ్లీలలో ఎప్పుడూ మెజారిటీవోటు రాదు.

ఈ విధంగా, ముస్లిం మెజారిటీ జన్మభూములు విడిపోవాలంటేను తన కనుకూలమయిన సరిహద్దు లేర్పరచుకోవాలంటేను లీగు సర్వదా బ్రిటిష్ ప్రభుత్వాన్నిపట్టుకు వ్రేలాడవలసిన స్థితిలోపెట్టారు సామ్రాజ్య వాదులు.

## సంస్థానాధిపతులకు రక్షణ

తాము క్షేమంగా భారతదేశంలోనే వుండడంకోసం సామ్రాజ్య వాదులు సంస్థానాధిపతుల అండజేరారు. రాజ్యాంగ నిర్ణయ సభలో సంస్థానాధిపతులు పాల్గొనాలనీ, ఏ రాజ్యాంగంకూడా వాళ్ళమీద రుద్దడానికి వీలులేదనీ, వాళ్ళ ఇష్టంలేకుండా వాళ్ళ ప్రస్తుత హోదాను ఎంతమాత్రం మార్చడానికి అవకాశం లేదనీ బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ప్రకటించారు.

సంస్థానాధిపతులకు వారి ప్రజలమీదఉన్న అధికారం చెక్కుచెదరకూడదనీ, వారి పవిత్రమైన హక్కులను త్రోసివెయ్యరాదనీ - టోరీలుగానీ, లేబరు ప్రభుత్వంగానీ చేసిన ప్రకటనలన్నీ ఏకగ్రీవంగా నొక్కిచెప్పాయి.

రాజ్యాంగ నిర్ణయ సభలో ప్రవేశించగోరే సంస్థానాధిపతులకు క్రిప్సు ప్రతిపాదనలు ఒక హక్కు నిచ్చాయి. బ్రిటిష్ ఇండియాలో మాదిరిగానే జనసంఖ్యనుబట్టి తమ ప్రతినిధులను నియమించుకోవచ్చు. (ప్రజలు ఎన్నుకొనడం కాదు.) ఈ ప్రతినిధులకు ఎన్నుకోబడిన ప్రతినిధులతో సమానమైన అధికారాలుంటాయి:

పత్రికా విలేఖరుల సమావేశంలో క్రిప్సు ఇలా చెప్పాడు :

"ఈస్కీము ఏ భారత సంస్థానంమీదగానీ బలవంతంగా ఎట్టి మార్పును తేదలచలేదు. ఏ భారత సంస్థానాన్నిగానీ ఇందులో చేరమని బ్రిటిష్ ప్రభుత్వం బలవంతపెట్టదు."

(బొంబే క్రానికల్, మార్చి 30, 1942)

సిమ్లాసమావేశం జరుగుతూవున్న సందర్భంలో అమెరీ ఐక్య భారతదేశమే తమ ఆశయమనీ, సంస్థానాలు ఇంతవరకు ఐక్య భారత దేశంలో సముచితపాత్రనే నిర్వహించాయనీ ప్రకటించాడు. బ్రిటిషు ప్రభుత్వ నిర్ణయాన్ని పునరుద్ఘాటిస్తూ అమెరీ సంస్థానాధీశ్వరులకు ఈవిధముగా అభయహస్తం ఇచ్చాడు :

"తుదినిర్ణయం ఐక్య భారతదేశంమీద ఆధారపడినా లేక విభజిత భారతదేశంమీద ఆధారపడినా ప్రస్తుత స్థితిగతుల్లో మార్పులువచ్చినా లేక సంస్థానాధీశ్వరుల భవిష్యత్తు సంస్థానాధీశ్వరులకే వదలిపెట్టబడినా, ముందుగా సంప్రదింపులు జరుపకుండా ఈ మధ్యకాలంలో యెటువంటి మార్పులు జరుగవు."

(హౌస్ ఆఫ్ కామన్స్ డిబేట్ - హిందూ 15-6-45).

లేబర్ గవర్నమెంటు ప్రకటనలో ఇలావుంది ;

"ఎన్నిక లయినతర్వాత ఎన్నుకోబడినవారి ప్రతినిధులతోను, సంస్థానాల ప్రతినిధులతోను, రాజ్యాంగ నిర్మాణసభ తీసుకోవాలిసిన విధానాన్నిగురించి దానికి ఉండవలసిన అధికారాల్నిగురించి, కార్యక్రమాన్ని గురించి (Procedure) బ్రిటిష్ ప్రభుత్వం సంప్రతింపులు జరుపుతుంది."

(టైమ్సు ఆఫ్ ఇండియా 20–9–45)

వేవెల్ ఇటీవల తన కలకత్తా ఉపన్యాసంలో ఇలా చెప్పాడు :

"వివిధ పార్టీలు తమలో తాము ఏదోవిధంగా ఒక ఒడంబడికకు రావాలసి ఉంటుంది. (1) భారత దేశంలో ప్రధాన రాజకీయ పార్టీలైన కాంగ్రెసు, (2) అల్ప సంఖ్యాకుల్లో అత్యధిక సంఖ్యాకులుగా వుండి





ప్రధానపాత్ర నిర్వహిస్తూవున్న మహమ్మదీయులు, (3) భారత సంస్థానాధీశ్వరులు, (4) బ్రిటిషు ప్రభుత్వం. ఈ అందరి ఆశయం సర్వసౌఖ్యాలతో తులదూగే స్వతంత్ర భారతదేశాన్ని నిర్మించడమే."

సంస్థానాల స్థితిగతులు ఎలా వున్నాయో నేడు ప్రతి భారతీయునికి తెలుసు. బ్రిటిష్ ఇండియాకంటెకూడా సంస్థానాల పరిస్థితులు మరీ అధ్వాన్నంగా ఉన్నాయి. సంస్థానాధిపతులు జన్మతః భారతీయులే అయినప్పటికి బ్రిటిష్‌ప్రభుత్వం చేతిలోని కీలుబొమ్మలు. బ్రిటిష్‌వాళ్ళ సహాయంతోనే నేడు తమ నిరంకుశాధికారం చలాయించగలుగుతూ ఉన్నారు. తెల్లదొరల అండలేకపోతే ప్రజాక్రోధాగ్నికి ఎప్పుడో ఆహుతి అయిపొయ్యేవాళ్ళు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఏదోవిధంగా మసిబూసి మారేడుకాయజేసి స్వాతంత్ర్య కాముకులైన ప్రపంచప్రజల కండ్లుమూయ జూస్తున్నారు. ఇండియాకు స్వరాజ్యం ఇవ్వడానికి సిద్ధంగానే ఉన్నామనీ, భారతీయ ప్రజలు తమలో తాము ఒక ఒడంబడికకు రావడమే తరువాయి అనీ, బిగ్గరగా గొంతు చించుకుంటున్నారు.

భారతీయ ప్రజల్లో ఐక్యతరాకుండా ఉండేందుకుగాను అందరికీ లేనిపోని అనేక ఆశలు గొలుపుతూ ఉన్నారు.

అందర్నీ చివరకు తమ దయాదాక్షిణ్యాలమీద ఆధారపడేటట్లు చేసుకుంటున్నారు. భారతీయులకు స్వాతంత్ర్యాన్ని ఇవ్వడానికి తాము మనస్ఫూర్తిగా వాంఛిస్తున్నామనీ, స్వాతంత్ర్యమార్గంలో తామెటువంటి అభ్యంతరాలు కలిగించటల్లేదనీ, భారతీయులు తమలో తాము ఒక ఒడంబడికకు రావడమే ఇక ఆలస్యమని ప్రకటిస్తూ ఉన్నారు. భారతీయులు ఒకవేళ తమలో తాము ఒక ఒడంబడికకు రాలేకపోయినా అభ్యంతరాల్ని లక్ష్యపెట్టకుండా ఇక తమ ప్లానును అమల్లో పెట్టబోతున్నామని ఇవ్వాళ తామొక పెద్ద న్యాయమూర్తుల్లాగా నటిస్తూ ఉన్నారు.

పైనుదహరించిన విషయాలనుబట్టి బ్రిటిష్‌విధానం ఎలావుంటుందో స్పష్టం అవుతుంది. ఇంకా ఎవరికయినా తేటతెల్లంగా తెలియకపోతే

ప్రొఫెసర్ కూప్లాండు తయారుజేసిన "భారతరాజ్యాంగ నిర్మాణసమస్య" అనే పుస్తకాన్ని ఒకసారి చదవవలసింది. ఈ గ్రంథం పండిత భాషలో ఉన్నా (acadamic language) బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పంథాను స్పష్టంగా తెలియపరుస్తుంది. భారత సమస్యను పై అధికార ప్రకటనలో సూచించిన రీతిగా తమ కనుకూలంగా పరిష్కరించుకో దలచారని స్పష్టమవుతుంది.

తాతలనాడెప్పుడో బ్రిటిష్ ప్రభుత్వంతో సంస్థానాధీశ్వరులు చేసుకున్న సంధిపత్రాలను మన్నించాలట. బ్రిటిష్‌ప్రభుత్వం గొడుగుక్రింద కడుపులో చల్ల కదలకుండా ఈరాజాలు మహారాజాలు, నవాబులు నవాబ్‌జాదాలు ఇన్నాళ్ళనుంచి చల్లగా కాలక్షేపం జేస్తున్నారు. తమతో చేసుకున్న ఒడంబడికలకు వాగ్దానాలకు తూచా తప్పకుండా బ్రిటిష్ ప్రభుత్వం కట్టుబడి ఉంటుందని వారికి తెలుసు. కాని భారత రాజకీయ్య నాయకులు "భగవత్ప్రసాదితమైన" తమ జన్మహక్కుల్ని అంగీకరించరేమో అని సంస్థానాధీశ్వరులు సందేహిస్తున్నారు. తమ కిష్టంగాకపోతే భారతసమాఖ్యలో (ఫెడరేషన్) చేరకుండా బ్రిటనుతోనే నేరుగా సంబంధం పెట్టుకొనే అవకాశంకూడా సంస్థానాధిపతుల కివ్వబడింది.

## సంస్థానాలే బ్రిటిష్ ప్రభుత్వానికి కీలకస్థానాలు

తమ చేతులో కీలుబొమ్మలైన సంస్థానాధిపతుల్ని సామ్రాజ్యవాదులు ఏవిధంగా ఉపయోగించుకో దలచుకున్నారో కూప్లాండు ఇదివరకే వెల్లడిచేశాడు.

ఇప్పుడున్న సంస్థానాలన్నీ ఒక అవిభాజ్యభూభాగంగా (ఒక పెద్ద అతుకుల బొంతగా) ఏర్పడాలట. పడమట కోస్తాలో ఉన్న కథియవార్ సింధు రాష్ట్రాలనుంచి రాజపుతానా సెంట్రల్ ఇండియామీదుగా తూర్పుకోస్తాలో ఉన్న ఒరిస్సా సంస్థానాలు. ఉత్తరంగా హిమాలయ పర్వత పాదభూమిలో ఉన్న కాశ్మీరునుంచి రాజపుతానా, హైద్రాబాద్ మైసూరులమీదుగా దక్షిణాగ్రములో ఉన్న కొచిన్ ట్రావెన్‌కూర్ సంస్థానాలు. ఇవన్నీకలిసి ఒక ప్రిన్సిస్థాన్‌గా (సంస్థానాలకూటమి) ఏర్పడాలట.

సంస్థానాధీశ్వరులతో ఒడంబడిక చేసుకునేపక్షంలో నేడు బ్రిటిష్ ప్రభుత్వాధీనంలో ఉన్నసమస్తభారతభూమి— కరాచీనుంచి కలకత్తావరకు కాశ్మీర్‌నుంచి రామేశ్వరం వరకు ఒకే విశాలదేశంగా ఉండే అవకాశం ఉంటుందని ఆ ప్రబుద్ధుడు సూచిస్తున్నాడు.

"ఇండియన్ ఫెడరేషన్‌లో చేరడానికి ప్రిన్సిస్థాన్ అంగీకరించకపోతే బ్రిటిష్ ప్రభుత్వంతో డిఫెన్సు ట్రీటీ (రక్షణసంధి) చేసుకుంటుంది. పరిశ్రమాభి వృద్ధికి, ఆయుధాగార నిర్మాణానికి బ్రిటిష్ సహాయాన్ని అర్థిస్తుంది. బ్రిటిష్ వైమానికులచేత మధ్య భారతదేశంలో ఆక్రమించుకోబడిన విమానాశ్రయాలు బ్రిటిష్ కామన్‌వెల్తు యొక్క ప్రధాన అవసరాల్ని గుర్తిస్తాయి." అని కూడా ఆ పెద్దమనిషి సెలవిస్తున్నాడు.

వివిధ పక్షాలకు జెందిన భారతీయులందరు దీని భావ మేమిటో స్పష్టంగా తెలుసుకోవాలి. అందరికి తెలిసేటట్లు ఒక్కముక్కలో చెప్పాలంటే బ్రిటిష్‌సైన్యాలు సంస్థానాల్లో ఎప్పటిలాగా తిష్ఠవేస్తాయి. సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా జరిగే తిరుగుబాట్లను అణగ గొడతాయి. ఆసియా ఖండాన్ని అంతటినీ తన గుప్పెటలో పట్టుకోవడానికి ఈ విమానాశ్రయాలు బ్రిటనుకు చక్కగా ఉపయోగపడతాయి.

ఇందులో ముఖ్యంగా గమనించవలసిన మరో విషయంకూడా ఉంది. మిగతా భారతదేశం ఒకవేళ బ్రిటిష్ పెట్టుబడిని నిరాకరించినా, లేక బ్రిటిష్ పెట్టుబడిదార్లకు అంగీకార యోగ్యములుకాని షరతులు విధించినా, తమ చెప్పుచేతుల్లో ఉండే ఈ సంస్థానాల్లోనయినా యథేచ్ఛగా తమ పెట్టుబడిని ఉపయోగించి బ్రిటిష్ పరిశ్రమల్ని నిర్మించుకోవచ్చునని సామ్రాజ్యవాదుల ఊహ. భారత ప్రభుత్వం విధించే పన్నులు, సుంకాలు చెల్లించకుండా తప్పించుకోవడానికి బ్రిటిష్ పెట్టుబడిదార్లకు ఇదొక చక్కని మార్గం.

## బ్రిటిష్ ప్రభుత్వం హిందూ మహమ్మదీయ కలహాన్ని అపేక్షిస్తుంది

కాంగ్రెసు లీగులు తమలో తాము ఒక ఒడంబడికకు రాలేవని కూప్లాండ్ అభిప్రాయం. అందువల్ల తన ఇష్టానుసారం పాకిస్తాన్ సరిహద్దుల్ని నిర్ణయించాడు. అతని స్కీముప్రకారం పడమటి పాకిస్థాన్‌లో నేటి సింధురాష్ట్రం, సరిహద్దురాష్ట్రం, పంజాబ్ రాష్ట్రం (అంబాలా డివిజన్ను మినహాయించి) ఉంటాయి. తూర్పు పాకిస్తాన్‌లో నేటి అస్సాం, బెంగాల్ రాష్ట్రాలు (బర్ద్వాన్ డివిజన్ మినహా) ఉంటాయి. అంటే కలకత్తా మాత్రం తూర్పు పాకిస్తాన్‌లోనే ఉంటుంది. కాని బొగ్గు, ఇనుము పరిశ్రమలకు ఆధార భూతమయిన ప్రధాన పారిశ్రామిక ప్రదేశం మాత్రం హిందూస్తాన్‌లోనే ఉంటుంది.

ఈ సరిహద్దులు లీగు నాయకత్వానికి అంగీకార యోగ్యములని ఆ ప్రొఫెసరు అభిప్రాయం. కాని అన్యాయానికి తలపడిన ఏ మహమ్మదీయుడైనా ఈ పరిష్కారానికి అంగీకరిస్తాడేమో కాని, ప్రజాస్వామిక సూత్రాన్ని పాటించే ముస్లిం ప్రజా బాహుళ్యం మాత్రం యిందుకు అంగీకరించదు. సిక్కుల అభిప్రాయాన్ని పాటించకుండా నిర్బంధంగా వారిని పడమటి పాకిస్తాన్‌లో అట్టి పెట్టితే శాంతిసౌఖ్యాలకు బదులుగా ఆరాష్ట్రంలో అల్లరి. అశాంతి చెలరేగుతుంది. యుద్ధానంతరం ఏర్పడిన తూర్పు యూరప్ మధ్యయూరప్‌లాగా అంతఃకలహాలకు ఆటపట్టవుతుంది.

తూర్పు పాకిస్తానుకు కూడా ఇదేగతి పడుతుంది. అస్సామీయులు, కొండజాతులు కలిసి అస్సాం మహమ్మదీయులమీద తిరుగుబాటు చేస్తారు. బెంగాలీ మహమ్మదీయులకు బెంగాలీ హిందువులకు మధ్య ఆరని యుద్ధాగ్నిజ్వాలలు అలముకుంటాయి.

ఈ ప్రమాదాలన్నీ కూప్లాండ్ గుర్తించకపోలేదు. పైనుదహరించిన విధంగా ఏర్పడిన పాకిస్తాన్‌కు ఆత్మరక్షణకు కావలసిన శక్తి సామర్థ్యాలు ఉండవు అన్నాడు. ప్రస్తుత బడ్జెటును ఆధారంగా తీసుకొని ఈ విషయాన్ని అంకెలతోసహా రుజువు చేయడానికి ప్రయత్నించాడు; ఈ పాకిస్తాన్‌లో ముస్లిం ప్రజాసామాన్యాన్ని పీల్చి పిప్పిజేస్తూ ఉన్న నేటి ముస్లిం భూస్వాములు చెక్కుచెదరకుండా అలాగే తమ దోపిడీ విధానాన్ని కొనసాగిస్తూఉంటారు. నేడు అమల్లోఉన్న ఈఆర్థికవిధానంమీదనే కూప్లాండ్ ప్లాను ఆధారపడుతుంది.



అధిక సంఖ్యాకులుగా ఉన్న హిందువులు దేశ విభజనను వ్యతిరేకిస్తూ ఉన్నారని మరోకారణం చెప్పుతున్నాడు.

"ఈ పరిస్థితుల్లో హిందూ మహమ్మదీయ రాష్ట్రాల్లో స్నేహపూర్వక మయిన సంబంధాలు ఏర్పడడం అసంభవం. స్వయం కృతాపరాధానికి తగిన ఫలితం అనుభవించాలిసిందే. అని హిందువులు మహమ్మదీయులకు తోడ్పడరు......హిందుస్తాన్ పాకిస్తాన్‌కు సహాయం చేస్తుందనుకోవడం కలలో వార్త. కాబట్టి పైరెండు రాష్ట్రాలకు ప్రత్యేకంగా వేరే వేరే సైన్యాలుండాలి."

(కూప్లాండ్- పేజి 95, 3 వ భాగం)

"ఒక వేళ పాకిస్తాన్ ఏర్పడినా, తన్ను తాను రక్షించుకొనే స్థితిలో ఉండదు. దేశాన్ని విభజించడం తప్పనిసరి అయ్యే పక్షంలో నేడు హిందువుల్లో ఉన్న అసంతృప్తి ఆగ్రహంగా మారి యుద్ధానికి దారితీయకుండా ఉండాలని ప్రతివాడూ ఆశిస్తాడు. కాని అది ఎంతవరకు సాధ్యమవుతుందో ఎవరూ చెప్పలేరు"

హిందూస్తాన్ పాకిస్తాన్‌గా విభజించ బడిన భారత దేశంలో జరగబోయే అంతర్యుద్ధాన్ని గురించి అతడు ఇలా చెప్పుతున్నాడు. "భవిష్యత్తులో ఎక్కడ యుద్ధాగ్నిజ్వాలలు రేగినా. ప్రపంచశాంతి భద్రతలను అత్యంత సమర్థతతో కాపాడలేక పోయినా, భారతదేశంలోకూడా అంతర్యుద్ధం చెలరేగడం అని వాక్యం అవుతుంది."

ఈ సామ్రాజ్యవాద భాష్యకారుని వాదం ఇది:-

భారతీయులు తమలో తాము ఒక ఒడంబడికకు రాలేకపోతే ఇండియాను విభజించడం తప్పనిసరి అవుతుంది. అ పరిస్థితుల్లో భారతదేశం

అంతర్యుద్ధానికి గురి అవుతుంది. ఇండియాలో యుద్ధాగ్నిజ్వాలలు చెల రేగితే ఒక్క భారతదేశానికే కాకుండా యావత్ప్రపంచ శాంతి భద్రతలకు ప్రమాదం వాటిల్లుతుంది.

కాబట్టి బ్రిటిష్ ప్రభుత్వమే ఇండియా శాంతి భద్రతల్ని కాపాడాలి. ఇందువల్ల ఒక్క ప్రాచ్యదేశాలే కాకుండా యావత్ప్రపంచం యుద్ధప్రమాదాన్నుంచి రక్షింపబడుతుంది,

బ్రిటిష్ ప్రభుత్వం భారత సంస్థానాల్ని తన కీలక స్థానాలుగా ఉంచుకుంటుంది. తద్వారా ఆర్థికవిధానంమీద అధికారం సంపాదిస్తుంది. ఆ యుధాగారాల్ని నిర్మిస్తుంది. బలహీనంగా ఉన్న పాకిస్తాన్ బ్రిటిష్ ప్రభుత్వ సహాయాన్ని అర్థిస్తుంది. శాంతి భద్రతల్ని కాపాడే అందుకు ఇక్కడే తిష్ఠవేయమని బ్రిటనుకు నైతికబలాన్నిచేకూరుస్తుంది. మిగతా రాష్ట్రాలు అంగీకరిస్తే హిందూస్తాన్ ఏర్పడుతుంది. ఇది కూప్లాండ్ స్కీములో చిత్రించబడిన భారతదేశ పరిస్థితి.

## ముందు బలహీనస్థానాన్ని చేజిక్కించుకొని తద్వారా సంపూర్ణాధికారం చలాయించడం

పై నుదహరించిన విధంగా అశాస్త్రీయంగా విభజించబడిన భారతదేశం రాబోయే విషమ పరిస్థితిని ఎలా ఎదుర్కొంటుంది ? భారతీయులు తమలో తాము ఒక ఒడంబడికకు రాలేకపోవడంవల్ల పరస్పరం కలిసి ఉంటానికి అంగీకరించరు. పాకిస్తాన్ 'స్వాతంత్ర్యాన్ని' సంస్థానాధీశ్వరుల 'స్వాతంత్ర్యాన్ని' రక్షించాలి. ఇందుకుగాను ముందు బలహీన స్థానాన్ని చేజిక్కించుకుంటేనేగాని తమ ఆటలుసాగవు. కూప్లాండ్ తన గ్రంథంలో 'ఏజెన్సీ' సెంటర్ అని దీన్నే పేర్కొన్నాడు. కూప్లాండ్ ప్లాను ప్రకారం ఈ మూడు ప్రధాన శాఖలు 'ఏజెన్సీ' అధీనంకింద ఉంటాయి.

1. విదేశాంగశాఖ. రక్షణశాఖ.
2. విదేశ వ్యాపారం. పన్నులవిధానం (Tariff policy)
3. కరెన్సీ



కూప్లాండ్ పాకిస్తాన్‌లో తమ పరిస్థితులు ఎలావుంటాయో లీగు సోదరులు ఒకసారి తీవ్రంగా ఆలోచించుకోవాలి. సంస్థానాధీశ్వరులు కూడా తమతో సమానంగా భాగస్వాములయ్యే సెంటరులో ఎవరిమాట చలామణి అవుతుంతో ఎవరి ఆశయాలు నెరవేరుతాయో కాంగ్రెసు సోదరులు అతి శ్రద్ధగా ఆలోచించాలి. ఏదోవిధంగా అఖండ హిందూస్థానాన్ని నిర్మిస్తున్నామనే భ్రమలో కాంగ్రెసువాదులు పడకూడదు. బ్రిటిష్ ప్రభుత్వం వేస్తూవున్న ఎరను నమ్మి మోసపోరాదు. సామ్రాజ్యవాదులు పన్నే వలలో పడగూడదు,

బ్రిటిష్‌ప్రభుత్వం చేస్తూన్న ఈ కుట్రను తెలుసుకుంటే ప్రతి భారతీయునిరక్తం ఉడుకెత్తుతుంది. ఢిల్లీ దొరలు వైట్‌హాల్ దొరలు కలసి ఆడుతూన్న ఈ దొంగనాటకానికి నోరు మెదల్పకుండా తల ఒగ్గవలసిందేనా ? లేక ఈ పన్నాగాన్ని బద్దలుకొట్టి మన భవిష్యత్తును మన ఇష్టానుసారం నిర్మించుకోవడమా ? దీన్నిగురించి ప్రతి భారతీయుడు తీవ్రంగా ఆలోచించాలి.

భారతసమస్యమీద కూప్లాండ్ 700 పేజీల ఉద్గ్రంథాన్ని వ్రాశాడు. అయినా అతన్ని పట్టి పండిత పరిషత్తుల్లో పాల్గొనే సామాన్య విద్వాంసుడి లాగు భావించగూడదు.

వలసదేశాల రాజ్యాంగ నిర్మాణంలో అతనిది ఆరితేరిన చెయ్యి ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో వలస దేశాల చరిత్రను బోధించే ఆచార్యుడు. నప్ఫీల్డుకంపెనీ ధనసహాయంజేసి భారతదేశ పరిస్థితిని 'శాస్త్రీయంగా' పరిశీలించడానికి అతన్ని నియమించింది. మోటారుపరిశ్రమలో నప్ఫీల్డ్ కంపెనీ ప్రపంచమంతటా పేరుమ్రోగింది. ఇటీవల జరిగిన బిర్లా-నప్ఫీల్డ్ ఒడంబడిక అందరికి తెలిసిందే.

క్రిప్సు రాయబారంలో సలహాదారుడుగా జేరమని ప్రభుత్వం కూప్లాండ్‌ను కోరింది. ఇండియా ఆఫీసులో అనధికార వర్గం తరపున అతనొక సలహాదారు. వైస్రాయ్‌వేవెల్ లండన్ వెళ్ళినప్పుడు కూడా మళ్ళీ అతన్ని సలహాదారుడుగా ఉండమని కోరాడు.

1937 లో పాలెస్టయిన్ రిపోర్టుకూడా తయారుజేసి పేరు గడించింది ఈ సుప్రసిద్ధుడే. ఇందులో ఎంతనాటకం ఆడాడో చూడండి. పాలెస్టయిన్నుకూడా మూడు భాగాలుగా విభజించాడు. ఒకటి స్వతంత్ర 'అరబ్ రాజ్యం' రెండవది 'స్వతంత్ర' యూదురాజ్యం మూడవది ఈ రెంటిమధ్య క్రిష్టియన్ పవిత్ర స్థానాల్ని కాపాడడానికి నేరుగా బ్రిటిషుఅధీనంలో ఉండే ప్రదేశం.

భారతదేశం కూడా ఇదేవిధంగా మూడుగా గానీ, లేక అంతకంటే ఎక్కువ భాగాలుగా గానీ విభజింపబడుతుంది. వీటి అన్నిటిపైన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ పెత్తనం చలాయిస్తే ఉంటారు. భారతదేశానికి కూడా త్వరలోనే అదే దుర్గతి పట్టబోతూ ఉంది.

మా పార్టీ ఒక్కటే రాబోయే ఈ మహాప్రమాదాన్ని గుర్తించింది. ఈ 'కొత్తరకపు బానిసత్వాన్నుంచి మనం బైటబడాలని మా ఎన్నికల ప్రణాళికలో ముందే హెచ్చరించాం.

కండ్లున్న ప్రతివానికి ఈ నగ్నసత్యం స్పష్టంగా దృష్టిగోచరం అవుతుంది. నానాటికి ఈప్రమాదం ఇంకా హెచ్చుతూ ఉంది.

భారత రాజకీయ పార్టీలు తమలోతాము తిట్టుకుంటూ దూరమైన కొలదీ సహాయంకోసం ప్రతిపార్టీ ప్రభుత్వం వైపు అర్రుజాచి ఎదురుజూస్తుంది. ప్రాధేయపడినకొలదీ సామ్రాజ్యవాదులు ఇంకా నెత్తికెక్కుతారు.

వేవెల్ తన కలకత్తా ఉపన్యాసంలో ఇలా చెప్పాడు.

"భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వాలని మనఃపూర్వకంగా మేము అభిలషిస్తున్నాం. కాని సహేతుకమైన ఒకఒడంబడిక కుదరకుండా మేము మా బాధ్యతనుండి విరమించుకోజాలం.

వేవెల్ ఎంత అహంకార పూరితంగా మాట్లాడుతున్నాడో చూడండి. అతనికింత ఆత్మవిశ్వాసం ఎక్కడనుంచి వచ్చింది. మన రాజకీయ పార్టీలు తమలోతాము దెబ్బలాడుకుంటూ ఉంటే తాము మధ్యవర్తులుగా ఉండి తమ నిరంకుశ విధానాన్ని తేలికగా అందరి నెత్తిమీద రుద్దవచ్చు. ఇదే అతని ధైర్యం.

టోరీ వైస్రాయ్ మాటల్లో ఏధోరణి ఏవైఖరి ప్రతిబింబిస్తుందో అదే ధోరణి అదే వైఖరి లేబర్ మినిస్టర్ పెథిక్ లారెన్స్ ప్రకటనలో కూడా స్పష్టంగా కనిపిస్తుంది.

"భారత ప్రభుత్వం తనమీద ఉన్న బాధ్యతల్ని, రాష్ట్రప్రభుత్వాల మీద ఉన్న బాధ్యతల్ని వదలుకొనజాలదు. శాంతి భద్రతలను కాపాడాలి, జబరదస్తీగా రాజ్యాంగ నిర్మాణ సమస్యల్ని పరిష్కరించే ప్రయత్నాలు అరికట్టబడతాయి."

(టైమ్సు ఆఫ్ ఇండియా 6-12-45)

## బ్రిటిష్ ప్రభుత్వం వల పన్నింది

తాము వేసుకున్న ప్లాను అమల్లో బెట్టాలంటే అన్ని పార్టీలతో స్నేహంగా ఉన్నట్లు నటించాలి. సర్వాధికారాలు తమ చేతిలోనే అట్టిపెట్టుకున్నా సాధ్యమైనంతవరకు ఎక్కువ అధికారం వప్పగిస్తూ ఉన్నట్లు పైకి కనపర్చాలి.

ఈ ఉద్దేశంతోనే యీ కొత్తస్కీము తయారుజేశారు. 1944లో గాంధీజీని చూడడానికికూడా తిరస్కరించిన ఈ వేవెల్ ప్రబుద్ధుడే నేడు గాంధీ, నెహ్రూ మొదలైన కాంగ్రెసునాయకుల్ని కలుసుకోవడానికి మహా ఆదుర్దా పడుతున్నాడు. కాంగ్రెసును 'ప్రధాన రాజకీయసంస్థ' అని తెగ బొగడుతున్నాడు. 'అఖండ భారతదేశం' యొక్క ఐక్యతను కాపాడే మహానుభావుడులాగా నటిస్తున్నాడు. కాంగ్రెసునాయకుల ముందు వినయ విధేయతలతో సంచరిస్తూ ఉన్నాడు.

'వేవెల్ చాలా నిజాయితీ గలవాడు అని సిమ్లా సమావేశ సందర్భంలో మొదలుబెట్టిన పొగడ్త ఈనాటికి అవిచ్ఛిన్నంగా సాగిపోతూనే వుంది. 'రాబోయే పోరాటాన్ని' గురించి ఒకవైపు నెహ్రూ నిప్పులు

గ్రక్కుతూనే ఉన్నాడు. ఆజాద్ హింద్ ఫౌజును పొగిడిపొగిడి ఆకాశానికి ఎత్తుతూనే ఉన్నాడు. మరోవైపు న్యూఢిల్లీలో వైస్రాయిని, సైన్యాధిపతిని కలుసుకొని సంప్రదింపులు సాగిస్తూనే ఉన్నాడు. బ్రిటిష్ పరిపాలకులు కూడా పైకి సుహృద్భావం చూపుతున్నారు. దీనికి బదులుగా కాంగ్రెసు నాయకులుకూడా తమ సంతోషాన్ని వెల్లడిస్తూ ఉన్నారు. పండిట్ జీ మెత్తని మాటలతో ఆజాద్ హింద్ ఫౌజు గొప్పతనాన్ని కొనియాడాడు. కలకత్తాలో విద్యార్థి ఊరేగింపులమీద దారుణంగా కాల్పులు జరిగాయి. కాని గాంధీ, కేసీ సంభాషణలు. గాంధీ వేవెల్ సంభాషణల ఫలితం వెంటనే కన్పించింది. కాల్పుల్ని గురించి అనధికార విచారణ జరపాలని సాగించిన బ్రహ్మాండమయిన ఆందోళన చప్పగా చల్లబడింది.

బ్రిటిష్ పరిపాలకులు నేడుకూడా తమ పాతపాటనే పాడుతున్నారు. ఒకవైపు బెదరిస్తూ మరోవైపు బుజ్జగిస్తూ ఉన్నారు. పూర్వంలాగే నేటికీ కాంగ్రెసు నాయకులు సామ్రాజ్యవాదుల మీద లేనిపోని ఆశలు బెట్టుకుంటున్నారు.

నిజంగా వేవెల్ ఇందుకు ఏమయినా సందు యిచ్చాడంటే అదీ సున్నే. డిసెంబరు 10 వ తేదీన వేవెల్ తన కలకత్తా ఉపన్యాసంలో ఆజాద్ హింద్ ఫౌజును గురించి కాంగ్రెసు తీసుకున్న వైఖరిని తీవ్రంగా విమర్శించాడు. రాజభక్తి ప్రమాణానికి కట్టుబడి ధైర్యంగా తమ కర్తవ్యాన్ని నెరవేర్చిన సైనికుల్ని బ్రహ్మాండంగా కొనియాడాడు. అజాద్ హింద్ ఫౌజును తెగబొగడుతూఉన్న కాంగ్రెసునాయకుల వైఖరినిగురించి వేవెల్ ఇలా చెప్పాడు.

“మీకు ఎలాంటి రాజకీయభావాలున్నా సరే, ఆత్మగౌరవాన్ని పాటించే వీరుల్ని, వ్యతిరేక పరిస్థితుల్లోకూడా నిశ్చలంగా నిలబడి తమ కర్తవ్య పథాన్నుంచి ఏమాత్రం తొణకకుండా గొమ్ము దీసుకున్న ప్రమాణానికి కట్టుబడి ఉండే ధీరుల్ని మెచ్చుకోలేని పక్షంలో ఒకజాతిని నిర్మించడానికి కావలసిన గుణగణాల్ని మీ రేమాత్రం గ్రహించలేక పొయ్యారన్నమాట”. (టైమ్సు ఆఫ్ ఇండియా 11–12–45)

క్విట్ ఇండియా తీర్మానాన్ని గురించి ఎగతాళి జేస్తూ—

“స్వాతంత్ర్యాన్ని సాధించడం ఏమంత తేలిక పనిగాదు. క్విట్ ఇండియా ‘మంత్రాన్ని’ జపించినంత మాత్రాన స్వాతంత్ర్యం ఊడిపడదు. స్వరాజ్య మనేది ఆలీబాబా కథలోని పర్వత గుహలాంటిదికాదు. (ఈగుహ తలుపులు ఒక మంత్రం చదివితే తెరుచుకుంటాయి. మరో మంత్రం చదివితే మూసుకుంటాయి.) బలప్రదర్శనంద్వారా కూడా స్వరాజ్యాన్ని సాధించజాలరు. సాధించలేరు. (టైమ్సు ఆఫ్ ఇండియా 11-12-45)

## అహంకారానికి లొంగుబాటు

అహంకారపూరితమైన వేవెల్ సంభాషణకు ప్రతి భారతీయుడు ఆవేశపరవసుడై పొయ్యాడు. భారతీయ నాయకుల్ని భారత స్వాతంత్ర్య తీర్మానాన్ని ఈ విధంగా ఎగతాళిపాలు జేసిన వేవెల్ని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తీవ్రంగా ఖండించి జాతీయ గౌరవ ప్రతిష్ఠల్ని కాపాడుతుందని ప్రతివాడూ ఆశించాడు.

ఆగస్టు పోరాటాన్ని గురించి కాంగ్రెసు నాయకులంతా గుక్క తిరుగకుండా ఉపన్యాసాలు దంచేశారు. హఠాత్తుగా ఒక్కసారి పొంగి పొర్లిన ‘మహాపోరాటం’ అంటూ దాన్ని తెగబొగిడారు. ఈ పోరాటంలో పాల్గొననందుకుగాను కమ్యూనిస్టుల్ని ‘ద్రోహులు’ అని ఇష్టం వచ్చినట్లు ఆడిపోశారు. బొంబే ఏ. ఐ.సి.సి. లో నిప్పులుగక్కే ఉపన్యాసాలిచ్చారు. పిడుగుల్లాగా గర్జించారు. ‘అహింస’ను గురించి పల్లెత్తు మాటయినా మాట్లాడిన ‘పాపాన’ పోలేదు.

కాంగ్రెసు వైఖరిని వేవెల్ బహిరంగంగా వేళాకోళం చేసిన తర్వాత కాంగ్రెసు నాయకులు కలకత్తాలో వేవెల్ని కలుసుకొని ప్రైవేటుగా మాట్లాడారు. వేవెల్ అహంకారానికి కాంగ్రెసు నాయకత్వం లొంగి పోయింది. తమ పాత అహింసా సిద్ధాంతాన్ని పునరుద్ఘాటిస్తూ ప్రజల సాహసకృత్యాలు అనేకం మెచ్చుకోదగినవే అంటూ ఈ విధంగా తీర్మానించారు.

"అహింసా సూత్రానికి వర్తించని కొన్ని పనులుకూడా జరిగాయి .... (1920 లో అంగీకరించబడిన అహింసాసిద్ధాంతం అమల్లోనేఉంది) పబ్లిక్ భవనాల్ని తగలబెట్టడంగాని, ఆస్తి పాస్తుల్ని నష్టపరచడంకాని, టెలిగ్రాఫ్ తీగల్ని తెంచడంగాని, భయపెట్టడంగాని అహింసాసిద్ధాంతాని కనుగుణ్యమైన పనులు కావు." (టైమ్సు ఆఫ్ ఇండియా 12-12-45)

'ఈ తీర్మానానికి ఎంతో ప్రాముఖ్యత ఉంది' అని కాంగ్రెసు అధ్యక్షులు మౌలానా ఆజాద్‌గారు నొక్కి చెప్పారు. అంటే, బ్రిటిష్ ప్రభుత్వానికి ఇష్టంగాని ఏ పద్ధతిద్వారాగాని బారత స్వాతంత్ర్య సమస్యను పరిష్కరించమని కాంగ్రెసు నాయకత్వం లార్డ్ వేవెలుకు హామీ ఇచ్చింది.

ఆజాద్ హింద్ ఫౌజును గురించి ఒక తీర్మానం జేశారు. అందులో ఈ విధంగా ఉంది. ఆ॥ హిం॥ ఫౌజు సైనికులమీద జరిగే విచారణకు సానుభూతి చూపెడుతున్నామంటే - సహాయాన్ని చేస్తున్నామంటే శాంతి యుతమైన న్యాయసమ్మతమైన పద్ధతులద్వారా స్వరాజ్యాన్ని సాధించాలి' అనే కాంగ్రెసు సిద్ధాంతాన్ని జారవిడిచాం అనుకోగూడదు." ఆజాద్ హింద్‌ఫౌజు సైనికులు తమ దేశభక్తికిగాను శిక్షింపబడే అమరజీవులైన స్వాతంత్రయోధులు గాకపోయినా సామాన్యపౌరసత్వ హక్కుల సూత్రం మీదనే ఆధారపడి వారియెడల సానుభూతి చూపబడింది. బాధపడుతూ ఉన్నవారికి సహాయం చేయడం జరిగింది.

ఇదంతా చూచి కాంగ్రెసు ప్రజాసామాన్య హృదయం కలతచెంది పోయింది. కాంగ్రెసు నాయకత్వంలోని ఈ మార్పులు ఈ తిరుగుళ్ల మితవాద ధోరణిలోని ఒక భాగం మాత్రమే. బ్రిటిష్ ప్రభుత్వంతో ఒడంబడిక కుదురుతుందని ఆశించే కాంగ్రెసు నాయకత్వం ఈ పద్ధతినిగాక మరే పద్ధతి నవలంబిస్తుంది?

## లీగుమీద ప్రభుత్వదాడి

లీగునుగురించికూడా బ్రిటిష్ ప్రభుత్వం సరిగ్గా ఇదేవైఖరి నవలంబిస్తుంది.

1944 డిసెంబరులో లీగు విధానాన్ని ఎగతాళిజేస్తూ వేవెల్ తన కలకత్తా ఉపన్యాసంలో ఇలా చెప్పాడు.

"భారతదేశం అంతఃకలహమనే జబ్బుతో బాధపడుతూఉంది. పాకిస్తాన్ అనే శస్త్రవైద్యంతో తప్ప [ఆపరేషన్] ఈ జబ్బు కుదరదని భారత రాజకీయవేత్తలు నిర్ణయిస్తే ఈ సువిశాలదేశం శాంతియుతంగా సౌఖ్యప్రదంగా జీవించే సదవకాశం కోల్పోతుంది. (హిందూ 15-12-44)

ఏరాజ్యాంగ పద్ధతి అయినా సరే రక్షణశాఖను ఇంకా కట్టుదిట్టంగా ఏర్పాటు చేయవలసి ఉంటుంది అనికూడా వేవెల్ హెచ్చరించాడు "ఈ జబ్బు కుదరడానికి ఆపరేషన్ చేయవలసినంత అగత్యంకూడా లేదని నేను భావిస్తున్నాను" అని పై పెచ్చు సలహాకూడా ఇస్తున్నాడు.

ఇటీవల వేవెల్ కలకత్తాలో ఉపన్యసిస్తూ కులమతతత్వాలను రెచ్చగొట్టే వాచాలత్వం తగదంటూ లీగు నాయకత్వానికి హెచ్చరిక చేశాడు.

"మనమీఅంతఃకలహాన్ని అరికట్టాలి. మనలో మనం ఒక ఒడంబడికకు రావాలి. మనస్ఫూర్తిగా పూర్తిగా మనం ప్రయత్నిస్తే తప్పకుండా ఒక అంగీకారానికి రాగలం"

"ఈ విశాల భూమిలో హిందువులు మహమ్మదీయులు అన్యోన్యంగా కలసి మెలసి ఉండవలసిన వారే"

ఈ విధంగా వేవెల్ కాంగ్రెసు నాయకత్వాన్ని లీగు నాయకత్వాన్ని కూడా మందలించాడు.

"రాబోయే సంవత్సరంలో సంప్రదింపులు జరుగుతాయి. కులమత తత్వ పూరితమైన వాతావరణం ఆ సంప్రదింపులకు అభ్యంతరం కలిగిస్తే. ఆ వాతావరణం దౌర్జన్య చర్యలకు దారితీస్తే, భారతదేశం మహా ప్రమాదకరమైన పరిస్థితుల్ని ఎదుర్కోవాలిసి వస్తుంది"

(టైమ్సు ఆఫ్ ఇండియా 11-12-45)

"మహమ్మదీయులకిష్టంగాని పక్షంలో ఏ రాజ్యాంగ చట్టం కూడా బలాత్కారంగా వారి నెత్తిమీదవేసి రుద్దం, అని ఒక వైపు హామీఇస్తు

న్నాడు. మరోవైపు మత పిచ్చను రెచ్చగొట్టే వాచాలత్వాన్ని కట్టి పెట్టండని ఉపన్యాసాలిస్తున్నాడు "బ్రిటిష్ ప్రభుత్వం శాంతి భద్రతల్ని కాపాడి తీరుతుంది" అని బెదిరిస్తూ ఉన్నాడు.

## ఎవరికిలాభం ?

ప్రతి కాంగ్రెస్ సభ్యుడు ప్రతి లీగుసభ్యుడు ముఖ్యంగా ఒక విషయం ఆలోచించాలి, పరిస్థితులీవిధంగా నానాటికి దిగజారిపోతూఉంటే మీ మీ ఆశయాలు ఎలా నెరవేరుతాయి ? భారత నాయకులు బ్రిటిష్ మోసాన్ని తెలుసుకోలేక ఎంతఅంధకారంలో పడిపోతున్నారో చూడండి. రాబోయే ఎన్నికలలో ఒకసారి తమకున్న బలాన్నిఅంతా పూర్తిగా ప్రదర్శిస్తే బ్రిటిష్ ప్రభుత్వం తప్పకుండా రాజీ రాయబారాలకు దిగివస్తుందని ఉవ్విళ్ళూరుతున్నారు.

ఇందువల్లవచ్చే ఫలితమేమిటి ? బ్రిటిష్‌ప్రభుత్వం తన చిత్తం వచ్చిన చట్టాన్ని ఇండియా మెడకు అంటగడుతుంది. ఇది సాధ్యమా అసాధ్యమా అనే సమస్య ఇకలేదు. అక్షరాలా జరిగి తీరుతుంది.

ఇన్నాళ్ళనుంచి ఒక ఒడంబడికకు రాలేక మనలో మనం కలహించుకున్న దాని ఫలితంగా ప్రపంచ ప్రజలదృష్టిలో అధఃపతనమవుతాం. ప్రపంచ ప్రజలకు ఇదంతా గందరగోళంగా ఉంటుంది. భారత సమస్యను పరిష్కరించేఅందుకు మేమెంతో 'తోడ్పడుతున్నాం'అని బ్రిటిష్‌ప్రభుత్వం జెప్పే కల్లబొల్లికబుర్లకు లొంగిపోతారు.

ఈవిధంగా ఇప్పుడు మనలోమనం దెబ్బలాడుకోవడంవల్ల ఎదటివాడిలోఉన్న మంచిని గ్రహించలేకపోతాం. మన ప్రత్యేక ఆశయాల్ని సమిష్టి ఆశయాల్నికూడా గుర్తించలేకపోతాం,

విభజించి పాలించటమే బ్రిటిష్‌కూటనీతిలోఉన్న కిటుకనీ, సామ్రాజ్యవాదులు తమ సర్వశక్తులూ ఉపయోగించి మనలో మనకు ఐక్యత రాకుండా చీలికలు కలిగించడంకోసం కావాల్సినంత దొంగనాటకం ఆడతారని స్వాతంత్ర్యాన్ని అభిలషించే ప్రతి భారతీయుడు గమనించాలి,



ఈ క్రింది ముఖ్యవిషయాల్ని గురించి శ్రద్ధగా ఆలోచిస్తే భారతీయులందరు—హిందువులుగానీ మహమ్మదీయులుగానీ, కాంగ్రెస్ సభ్యులుగానీ, లీగుసభ్యులుగానీ - మన మాతృదేశానికి ఎక్కువ సహాయం చేయగలుతారు, తమ ప్రత్యేకాశయాలను సమిష్టి ఆశయాలను సాధించడానికి స్వాతంత్ర్య సమరంలో సక్రమపంధా నవలంబిస్తారు.

1. మనలో మనకు చీలికలుండడం వల్లనే—ప్రధాన రాజకీయ పార్టీలు ఒక ఒడంబడికకు రాలేనందువల్లనే—స్వతస్సిద్ధమైన మన హక్కుల్ని బ్రిటిష్‌ప్రభుత్వం నిరాకరించగలుగుతూఉంది. తన నిరంకుశాధికారాన్ని అవిచ్ఛిన్నంగా చలాయించ గలుగుతుంది. స్వాతంత్ర్యకాముకులైన భారతీయుల్లోని ఈ అనైక్యతే మన శాశ్వత బానిసత్వానికి దారితీస్తుంది.

2. కాంగ్రెసు లీగు నాయకుల్లోఉన్న మితవాదధోరణి ఫలితంగానే వారుబ్రిటిష్ ప్రభుత్వాన్ని గురించి ఇంకా భ్రమపడుతూనే ఉన్నారు. భారతదేశ గత చరిత్రగాని, మొన్నమొన్ననే జరిగిన సిమ్లా నాటకంగానీ నేర్పిన గుణపాఠాన్ని ఇప్పటికీ వారు గుర్తించలేకపోతున్నారు. భ్రమాత్మక మయిన మితవాద ధోరణిమీద ఆధారపడిన మన నాయకులు చివరకు నిరాశజెంది బ్రిటిష్ పన్నాగానికి తలలొగ్గవలసి వస్తుంది.

కళ్ళకుకట్టినట్టు కనబడే ఈ నగ్నసత్యాన్ని ఇకనైనా గుర్తించాలి. చరిత్రనేర్పిన గుణపాఠాన్ని నేర్చుకోవాలి.

## కాంగ్రెసులోజరిగే అంతర్నాటకం

రాష్ట్రనాయకులను గురించిగానీ, అఖిలభారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీని గురించిగాని ఇదివరకు ఏ కొంచెం తెలిసిఉన్నాసరే నేడు వారు 'విప్లవ' శబ్దజాలాన్ని ఎందువల్ల విడిచిపెట్టారో ప్రతి భారతీయుడు గమనించాలి.

ఎన్నికల్లో ఎన్నిరాష్ట్రాల్లో మనకు మెజారిటీ వస్తుంది? వ్యతిరేక పార్టీని ఓడించడానికి షాహుకార్ల దగ్గిరనుంచి జమీందార్ల దగ్గిరనుంచి

## లీగు వైఖరి

ఇండియాను విభజించడంద్వారానే ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు సంపూర్ణాధికారం లభిస్తుందని లీగునాయకత్వం భావిస్తూ ఉంది. మన అందరినెత్తి కెక్కితొక్కుతూఉన్న బ్రిటిష్‌ప్రభుత్వంయొక్క బానిసత్వాన్నుంచి బైటబడిననాడే సమస్త భారతదేశానికి స్వయం నిర్ణయాధికారం లభిస్తుంది అనే విషయాన్ని లీగు గుర్తించటంలేదు. అందువల్లనే నేటిలీగు నాయకత్వం బ్రిటిష్ యజమానులవైపు అర్రుజాచి ఎదురుజూస్తూ ఉంది. ఇండియాను విభజించ వలసిందని పరప్రభుత్వాన్ని యాచిస్తూఉంది. ఇందువల్ల ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు సంపూర్ణాధికారం లభించకపోగా బ్రిటిష్‌పెత్తనం ఇంకా బలపడుతుంది.

ఇంగ్లీషువాళ్ళతోపాటు హిందువుల్నికూడా మహామ్మదీయులు తమ శత్రువులే అనుకుంటే దీని పర్యవసానం ఎలా పరిణమిస్తుంది? ఇండియాను విభజించ వలసిందని పదేపదే బ్రిటిష్ ప్రభుత్వాన్ని యాచించ వలసి వస్తుంది. హిందువులమీద ఇంకా ద్వేషం పెరుగుతుంది. చివరకీ వైఖరి ఎక్కడికి దారి తీస్తుంది ? తమ పాలసీని అంగీకరించని వారంతా బ్రిటిష్ ప్రభుత్వ ఏజెంట్లే అని కాంగ్రెసువాదులు ఎలా ఆడిపోస్తూ ఉన్నారో సరిగ్గా అదేవిధంగా లీగు సిద్ధాంతాల్ని అంగీకరించని మహమ్మదీయులంతా హిందువుల ఏజెంట్లే అని లీగు తిట్టిపోస్తుంది. ఇందువల్ల కాంగ్రెసును దూషించే బ్రిటిష్ ప్రభుత్వ బంట్లు, నవాబులు, ఖాన్‌సాహెబులు ముస్లింలీగు ముసుగుకింద దూరుతారు. ఈ అభివృద్ధినిరోధకులంతా ఏకమై చివరకు లీగును బ్రిటిష్‌యజమానుల గుమ్మంముందుకు తీసుకవెళ్తారు.

ఈ పద్ధతి నవలంబించడం వల్ల దేశానికి స్వాతంత్రం సిద్ధించదు, ముస్లింమెజారిటీ ప్రాంతాలకు స్వయంనిర్ణయాధికారం లభించదు. హిందూ మహమ్మదీయ కలహాలు ఇంకా ఎక్కువ అవుతాయి. ఉభయులు పరస్పరం దెబ్బలాడుకుంటూఉంటే బ్రిటిష్‌ప్రభుత్వం మధ్యవర్తిగావచ్చి జోక్యం కలిగించుకుంటుంది. సామ్రాజ్యవాదుల రొట్టెముక్క నేతిలో పడుతుంది.



ఎదటివాళ్ళ బలాన్ని గుర్తించకుండా ఎవరికివారే తమ బలాన్నే గొప్పగా చెప్పుకోవడంవల్ల ఫలితంశూన్యం. ఇందువల్ల బ్రిటిష్‌ప్రభుత్వం లొంగిరాదు సరేకదా ఉభయపక్షాలు తుదకు ప్రభుత్వంవలలో బడతాయి. బ్రిటిష్‌ప్రభుత్వం ఒక పార్టీమాటమాత్రం ఎందుకు వింటుంది ? ప్రజాసామాన్యంగోరేహక్కుల్ని అంగీకరించడమా సామ్రాజ్యవాదుల ఆశయం ? అందర్నీ తమకింద బానిసలుగా ఉంచి అందరిమీద తమకర్ర పెత్తనం సాగించాలనే వాళ్ళ ఆలోచన. అందుకు కావాలసిన ప్లానునుకూడా వాళ్ళు సిద్ధంగానే ఉంచుకున్నారు.

ఈ నాటి ఈ దౌర్భాగ్య పరిస్థితుల్ని చూస్తే హృదయం తరుక్కుపోతుంది. అయినా ఈ మహాప్రమాదాన్నుంచి తప్పించుకోడానికి తగిన అవకాశం బొత్తిగా లేకపోలేదు. పరిస్థితి ఇంకా మన చేతినుంచి పూర్తిగా జారిపోలేదు. రానున్న ప్రమాదాన్ని గుర్తించి ఇకనైనా స్వాతంత్ర్య పిపాసులైన భారతీయులందరు మేల్కొనాలి. సంకుచిత భావాల్ని విడనాడి సమిష్టి ఆశయాన్ని సాధించడానికి నడుంబిగించాలి. ఈనాడు ఎవరికివారు తాముకోరే హక్కులు న్యాయసమ్మతమైనవే అనుకుంటున్నారు. అయితే. "మన న్యాయసమ్మతమైన హక్కుల్ని మన సోదరులే ఎందుకు అంగీకరించటల్లేదు." అని ప్రతిఒకరూ ఆత్మ విమర్శన జేసుకోవాలి. మన తోటి సోదరుల్ని కాదని తోసి పుచ్చుతూ పరాయి ప్రభుత్వం ఏదో తవ్వితలకెత్తుతుందనుకోవడం ఎక్కడి వివేకం ? మన అందరికి సమాన శత్రువయిన బ్రిటిష్ ప్రభుత్వాన్ని సాగనంపడానికి సాగించబోయే అంతిమ స్వాతంత్ర్య పోరాటంలో మన ఆశయంకూడా ఒక భాగంగా ఉండాలి అంటే ఏమిచెయ్యాలి ? దీన్నిగురించి వివరంగా ముందు చర్చించుదాం.

మన సిద్ధాంతాల్లో, ఆశయాల్లో సమానత్వంచేకూర్చి ఐక్యతను నిర్మించడానికి మాపార్టీ సరియైన కార్యక్రమాన్ని ఇస్తూఉంది. భారతీయులమందరం భాయీభాయీగా చేయీ చేయిగలిపి సుశిక్షిత స్వాతంత్ర్యసైన్యంవలె ఒకే అడుగుమీద విజయయాత్ర సాగించుదాం.

## భారతీయ స్వాతంత్ర్యప్రణాళిక

ప్రపంచ ప్రజాఉద్యమానికి అనుగుణ్యంగాను, మన స్వాతంత్ర్యోద్యమ సత్సాంప్రదాయాలకు సముచితంగాను, మేమొక భారతీయ స్వాతంత్ర్యప్రణాళికను తయారుజేసి మీ ముందుంచుతున్నాం.

## మన స్వాతంత్ర్యాశయం

మనం బ్రిటిష్‌ప్రభుత్వాన్నుండి మన దేశానికి స్వయంనిర్ణయాధికారం కావాలని కోరుతున్నాం. ఈ కోరిక ఎంతో సమంజసమైనది. ఈ సమంజసమైన హక్కునే మనం మన భారతీయులందరికి వర్తింపజేయాలి.

బ్రిటిషు ప్రభుత్వాన్నుంచి మనం స్వాతంత్ర్యం కోరుతున్నాం. ఈ స్వాతంత్ర్యహక్కు భారతీయులందరికీ ఉంది అని మనం అంగీకరించాలి. నామమాత్రంగా అంగీరించడంతో సరిపోదు. క్రియాపూర్వకంగా రుజువుజేసి చూపెట్టాలి.

బ్రిటిష్‌ప్రభుత్వాన్ని అసహ్యించుకున్నంత మాత్రాన ఇవ్వాళ మనం మన కర్తవ్యాన్ని నెరవేర్చిన వాళ్ళం కాజాలం. 1857లో జరిగిన ప్రథమ స్వాతంత్ర్యయుద్ధకాలంనుచి మన పూర్వులు, మన పెద్దలు బ్రిటిష్ ప్రభుత్వాన్ని అసహ్యించుకుంటూనే ఉన్నారు. తర్వాత వచ్చిన మూడు తరాల్లో ఈ బ్రిటిషువిద్వేషాగ్ని ఇంకా తీవ్రంగా ప్రజ్వరిల్లింది. ఇంత కాలం గడచిన తర్వాతకూడా మన స్వాతంత్రోద్యమం ఇంకా బ్రిటిష్ విద్వేషాన్ని బోధించడంతోనే సరిపుచ్చుకుంటే మనపూర్వుల సత్సాంప్రదాయాల్ని ముందుకు తీసుకవెళ్ళిన వాళ్ళం అవుతామా?

బ్రిటిష్ విద్వేషానికి మాపార్టీ ఒక స్వరూపం ఇచ్చి ఆచరణసాధ్యమయిన ఒక చక్కని కార్యక్రమాన్నికూడా మీముందు ఉంచుతూ ఉంది. మనల్ని బానిసలుగాజేసి మన నెత్తికెక్కి పెత్తనం చలాయిస్తూ ఉన్న సామ్రాజ్యవాదులకు మన మాతృభూమిలో బెత్తెడు జాగాకూడా ఇవ్వగూడదని మన పెద్దలునేర్పిన పాఠాన్ని ఇకనైనా ఆచరణలో పెడదాం. ఈ తెల్లవాళ్లు మనదేశానికి విజేతల్లాగా వచ్చారు. దేశాన్ని ఆక్రమించుకున్నారు. మనల్ని బానిసలుగా తయారుజేసి తమ నిరంకుశాధికారాన్ని నిరాఘాటంగా సాగిస్తూ ఉన్నారు.

ఇతరపార్టీల కార్యక్రమంలోని నిజాయితీని పరీక్షించడానికి మనం ఏ గీటురాయిని వాడుతున్నామో, అదే గీటురాయిని తమ పార్టీకికూడా వర్తింపజేసి చూడవలసిందని మాపార్టీ కోరుతూ ఉంది. మన స్వాతంత్ర్యోద్యమ కార్యక్రమం ప్రజలందరూకోరే స్వాతంత్ర్యాశయాల్ని ఏకీభవింపచేసేదిగా ఉండాలి. స్వాతంత్ర్యాన్ని అభిలషించే ప్రతి భారతీయుని హృదయంలో ఒక నూతనోత్సాహాన్ని పురికొల్పాలి. స్వాతంత్ర్యశక్తు లన్నింటినీ ఐక్యంజేసి ఒకే అడుగుమీద రణరంగంలోకి ఉరికించాలి.

'స్వాతంత్ర్యం' అనే మాటకు సరియైనఅర్థం, భారతీయు లందరి 'స్వాతంత్ర్యం' అని బోధించేది మాపార్టీ ఒక్కటే. ఇవ్వాళ కాంగ్రెసు నాయకులు దూషిస్తూ ఉన్నట్లు మా సిద్ధాంతంతో భేదించేవారిని మాపార్టీ దూషించదు. ముస్లింలీగు నేడు తనతోటి సోదరులమీద ద్వేషాన్ని రెచ్చగొడుతూఉంది. కాని మాపార్టీ ఆవిధంగా ద్వేషాన్ని రెచ్చగొట్టదు.

ఈ దిగున నుదహరించిన విషయాల్ని గురించి తీవ్రంగా ఆలోచించవలసిందని ప్రతి భారత స్వాతంత్ర్య సైనికునికి మాపార్టీ విజ్ఞప్తి చేస్తూఉంది.

బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి మనం ఏ స్వయం నిర్ణయాధికారం కోరుతున్నామో, ఆస్వయంనిర్ణయాధికారాన్నే స్వతంత్ర భారతదేశంలో కూడా వర్తింపజేయాలి. అలా చేయని పక్షంలో ఇతరపార్టీలకు చెందిన ప్రజాసామాన్యంయొక్క విశ్వాసాన్ని కాంగ్రెసు చూరగొనలేదు. సందేహాలు నానాటికి ఇంకా ఎక్కువ అవుతాయి.

లీగు తానుకోరే ముస్లిం స్వయంనిర్ణయాధికారాన్ని భారత స్వయంనిర్ణయాధికారంలో ఒకభాగంగా చేయలేకపోతే తన 'ముస్లింమెజారిటీ ప్రాంతాల స్వయంనిర్ణయాధికార సిద్ధాంతానికి' హిందువుల సహాయసాను

భూతున్ని సంపాదించలేదు. లీగునుగురించి హిందువుల్లో నానాటికి ఇంకా సందేహాలుఎక్కువ అవుతాయి.

'స్వాతంత్ర్యం' అనే మాటను అన్వయించుకోవడంలోనే మన ప్రధాన రాజకీయ పార్టీలమధ్య అభిప్రాయభేదా లేర్పడ్డాయి. అంటే జయ ప్రదంగాఅంతిమపోరాటాన్నిసాగించి, శాశ్వతంగాబ్రిటిష్‌ప్రభుత్వానికి చెల్లు చీటీయిచ్చి సాగనంపేముందు మనం ఇంకా ఎంత తీవ్రంగా ఆలోచిం చాలో ఒకళ్ళ భావాల్ని ఒకళ్లు ఎంత సుహృద్భావంతో ఓపికగా అర్థం జేసుకొవాల్సిన అవసరంఉందో స్పష్ట మవుతుంది.

## స్వాతంత్ర్య సాధనోపాయం

స్వాతంత్ర్య పోరాటానికి మేము నిర్మించే వ్యూహరచనా విధానం స్వాతంత్ర్య కాముకులయిన భారతీయులందర్నీ ఐక్యపరుస్తుంది. హిందువులు మహమ్మదీయులు అన్నదమ్ముల్లాంటివారని ఉపన్యాసాలు చెప్పినంతమాత్రానగాని, బ్రిటిష్‌ప్రభుత్వం మన అందరికీ శత్రువే అని సూచించినంతమాత్రానగాని, ముందు భారతీయులందరుకలిసి తమసమిష్టి ఆశయమైన స్వాతంత్ర్యాన్ని సాధించాలని బోధించినంత మాత్రానగాని అలాంటిసరియైన ఐక్యత - సరియైన సోదరభావం - ఏర్పడదు.

"మన భారత జాతులన్నింటికీ న్యాయం జరగాలి. అన్ని జాతులకీ సమానాధికారం ఉండాలి. అనే న్యాయసూత్రాల్ని మనమందరం అంగీక రించాలి. తమతమ ఇష్టానుసారం తమ రాజ్యాంగాన్ని నిర్మించుకోవడానికి తమకు తోచిన విధంగా తగిన అభివృద్ధిని పొందడానికి, ప్రతిజాతికి సమాన అవకాశం యివ్వాలి.

మేము సూచించే ఐక్యతావిధానం సోదరభావాన్ని గురించి వట్టినీతి సూత్రాలు వల్లెవేయడం లాంటిదికాదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల్ని ఎదిరించి పోరాడే ఐక్యసంఘటనే ఈ ఐక్యత. ఈ ఐక్యసంఘటన ద్వారానే మనం బ్రిటిష్‌ప్రభుత్వపుపెత్తుల్ని భగ్నం చేయగలం. సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించగలం. సాధించిన ఆ మహత్తర విజయాన్ని ఐక్యత ద్వారానే సురక్షితంగా కాపాడుకోగలం."

స్వాతంత్ర్యాన్ని సాధించే వ్యూహరచనావిధానం(Stratagy) ప్రజ లందర్నీ కూడగట్టుకు వచ్చేటట్లుగా ఉండాలిగాని మనలో మనకు చీలికలు కలిగించేదిగా ఉండగూడదు. ఒక్క పార్టీయొక్క స్వాతంత్ర్య పోరాట కార్యక్రమం క్రమక్రమంగా మనలో మనకున్న చీలికల్ని తగ్గించడానికి బదులుగా ఇంకా ఎక్కువజేస్తూఉంటే అది అసలు 'ఒక స్వాతంత్ర పోరాట కార్యక్రమం' అనిపించుకోదు. బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు కోరేదాన్ని మనమే చేసిపెట్టడం అవుతుంది.

సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ఐక్యసంఘటనను నిర్మించడానికి మేము కృషిచేస్తున్నాం. బ్రిటిష్‌ప్రభుత్వాన్ని యిక్కడనుంచి సాగనంప డంతోనే మన పని పూర్తిగాదు. స్వతంత్ర జాతులతోకూడిన ఒక కుటుం బంగా మన భారతభూమిని నిర్మించడమే మా ప్రధానాశయం.

మా వ్యూహరచనా పద్ధతిలోను, మా ఆశయాల్లోను అవినాభావ సంబంధం ఉంది. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఈనాడు నిర్మించబడే ఈ ఐక్యసంఘటనే స్వతంత్రభారతదేశంకూడా సమానహోదాగల స్వతంత్ర జాతులతో కూడిన ఒక సమిష్టి కుటుంబంగా ఉండవలసిన ఆవశ్యకతను తెలియపరుస్తుంది.

## మా నిర్దిష్ట సూచనలు

స్వాతంత్ర్య పోరాట పద్ధతిలోనే ప్రజలందరి స్వాతంత్ర్య ఆశ యాలు ఇమిడి ఉండాలి. అప్పుడే మనం స్పష్టమైన ఒక కార్యక్రమాన్ని అనుసరించి ఐక్యంగా పనిచేయగలం. నేటి ప్రతిష్టంభనను బ్రద్దలుచేయ గల్గుదుం. స్వాతంత్ర్యోద్యమాన్ని ఇంకా ముందుకు తీసుకపోగలం. ఇప్పటి లాగా సుడిగుండాల్లోపడి తిరగకుండా కాంగ్రెసు లీగు ఉద్యమాలు కలిసి ముందుకు సాగిపోతాయి. ఎవరికి వారే బ్రిటిష్ ప్రభుత్వంతో ప్రత్యేకపు బొడంబడికలు చేసుకోవాలసిన గతి పట్టకుండా ఉంటుంది.

కాంగ్రెసు బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి స్వయం నిర్ణయాధికారం కోరుతుంది. కాని అదే సూత్రాన్ని ప్రజలకందరికి వర్తింపజేయడానికి మాత్రం అంగీకరించటంలేదు. సోదరజాతుల స్వాతంత్ర్య హక్కును గుర్తించకుండా కాంగ్రెసు బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి స్వాతంత్ర్యం కోరుతుంది. ఈవైఖరి సోదరపార్టీలతో పోరాటానికి ప్రభుత్వంతో ప్రత్యేకపు టొడంబడికకు దారితీస్తుంది

అన్ని పార్టీలకంటె ప్రజల్లో తనకే ఎక్కువ పలుకుబడి ఉంది కాబట్టి బ్రిటిష్ ప్రభుత్వ తదనంతరం తానే వారసురాలని కాంగ్రెసు భావిస్తుంది. దేశభక్త కుటుంబంలో అన్ని పార్టీలకి అన్నగా ఉండి తనబాధ్యతను నిర్వహించటల్లేదు. తన తమ్ముల్నికూడా తనతోపాటు కలుపుకొని ఐక్యపోరాటంద్వారా స్వాతంత్ర్యాన్ని సాధించాలని గుర్తించుటల్లేదు; ఈనాడు దేశంలో కాంగ్రెసుకున్న పలుకుబడే కాంగ్రెసు నాయకుల్లో సంకుచిత భావాలు కలగడానికి కారణభూతమయింది. బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి తాను కోరే న్యాయసమ్మతమైన హక్కే ఇతరులుకోరే కోరికల్లోని న్యాయాన్ని గుర్తింపకుండా జేసింది.

ముస్లింమెజారిటీ ప్రాంతాల్లో స్వయం నిర్ణయాధికారాన్ని వర్తింపజేయడానికి లీగు ఇండియాను రెండు ఖండాలుగా విభజించవలసింది అని కోరుతూ ఉంది. ఈ కోరికను సాధించుకోడానికి బ్రిటిష్ ప్రభుత్వంతో ప్రత్యేకపుటొడంబడికకు సిద్ధపడుతూ ఉంది. మహమ్మదీయుల్లో లీగుకి పూర్తిగా బలం ఉన్నప్పటికీ లీగుకోరే స్వయం నిర్ణయాధికారానికి అభ్యంతరాలు కలిగించేది హిందువులేకదా ? అని లీగు ప్రశ్నిస్తూవుంది. భారతదేశానికి మొత్తానికి స్వయంనిర్ణయాధికారం ఇవ్వకుండా నిరాకరిస్తూ ఉన్న బ్రిటిష్ ప్రభుత్వం ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు మాత్రం ఈ హక్కునెందుకంగీకరిస్తుంది? ఈ మాత్రపు స్వల్ప విషయాన్నికూడా లీగు గుర్తించలేకుండా ఉంది.

మా ఎన్నికల ప్రణాళికలో ఈ విషయాన్ని గురించి స్పష్టంగా సూచించాం. కాంగ్రెసు లీగులు కోరే న్యాయసమ్మతమైన కోరికల్ని మా



పార్టీ బలపరుస్తుంది. ఉభయపక్షాల్లోను ఉన్న అసమంజసమైన కోరికల్ని మా పార్టీ ఖండిస్తుంది. ఉభయపార్టీల్లోను అసంపూర్తిగా వదలివేయబడిన విషయాల్ని మా పార్టీ పూర్తిచేసి తద్వారా రెంటిలోను ఐక్యత సాధిస్తుంది, ఈవిధంగా మాపార్టీ మన అందరికీ సమాన శత్రువైన బ్రిటిష్ ప్రభుత్వాన్ని నిర్మూలించడానికి కావలసిన సన్నాహాన్ని సమకూరుస్తుంది.

## బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి స్వాతంత్ర్యం— మనలో మనకు న్యాయం

మా పార్టీ ఎన్నికల ప్రణాళికలో ఈ దిగువ నిర్దిష్ట సూచనలు చేయబడ్డాయి.

1. "అఖిలభారత ప్రజాపరిషత్తుకు (కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ) అధికారం అప్పగించాలి. ఆ ప్రజాపరిషత్తు బ్రిటిష్‌వాళ్ళను ఇండియా నుండి సాగనంపే ఒడంబడికను తయారు చేస్తుంది. ఆ ఒడంబడికను బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించిందా సరే, లేనిపక్షంలో యావద్భారత సంయుక్త అంతిమ పోరాటాన్ని బ్రిటిష్ ప్రభుత్వం ఎదుర్కోవాలసి ఉంటుంది."

2. "భారత దేశంలో నివసిస్తూ ఉన్న వివిధ జాతుల మాతృభూముల నాధారంగా చేసుకొని 17 జాతీయ ప్రజాపరిషత్తు లుండాలి. ఈ 17 జాతీయ ప్రజాపరిషత్తులు అఖిల భారత ప్రజాపరిషత్తుకు ప్రతినిధులను వయోజన వోటింగు పద్ధతిపై ఎన్నుకుంటాయి, బెలూచిస్థాన్, పఠాన్‌భూమి, సింధు, పశ్చిమ పంజాబ్, సెంట్రల్ పంజాబ్, హిందూస్తాన్, రాజస్తాన్, గుజరాత్, మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్ర, కేరళ, తమిళనాడు, ఒరిస్సా, బెంగాల్, అస్సాం. బీహార్, ప్రజా స్వామ్యాలను నిర్మించాలి. ప్రస్తుతం బ్రిటిష్‌వారిచే కృత్రిమంగా విభజింపబడిన రాష్ట్రాలను శాస్త్రీయంగా పై నుదహరించిన ప్రకారం పునర్నిర్మించాలి,"

3. స్వయం నిర్ణయ హక్కును సంస్థానప్రజలకు కూడా వర్తింపజేయాలి. అది వారి జన్మహక్కు. బ్రిటిష్ ప్రభుత్వాన్ని దాని ఏజంట్లయిన సంస్థానాధిపతుల పరిపాలనను పూర్తిగా రద్దుచేయడానికీ, తద్వారా సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించడానికీ, ఆ హక్కును గుర్తించడం అత్యవసరం."

"ముందు స్వయంనిర్ణయహక్కును పొందినట్లయితే సంస్థాన ప్రజలు తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకుంటారు. తమ మాతృభూములతో (రాష్ట్రాలతో) తమ సోదరప్రజలతో కలసిపోగల్గుతారు. అఖిలభారత ప్రజాపరిషత్ ప్రతినిధులకు తమతమ జాతీయ ప్రజాపరిషత్తులకు ప్రాతినిధ్యం వహించే హక్కులు మాత్రమే (Pleni Potentiaries) ఉంటాయి."

"నిజమైన, సంపూర్ణమైన, స్వాతంత్ర్యం జాతీయ ప్రజాపరిషత్తులకు ఉంటుంది. అవి స్వతంత్రభారతదేశంతో సమాన హోదాలో రాయబారాలు సాగించడానికి, పరస్పర సంబంధాలను నిర్ణయించుకోడానికి, సర్వాధికారాలు కలిగిఉంటాయి."

"స్వతంత్రభారత రాజ్యాంగచట్టాన్ని నిర్మించే బాధ్యత ఈ వివిధ ప్రజాపరిషత్తులకు ఉంటుంది. వివిధ ప్రజాపరిషత్తులు స్వేచ్ఛగా తమ అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తూ అట్టి నిర్మాణానికి తోడ్పడవచ్చు. వివిధ జాతులయొక్క పరస్పరక్షేమానికి భంగంకానిరీతిని అవి ఆ నిర్మాణానికి తోడ్పడవచ్చు."

"చారిత్రకరీత్యా సిక్కు మాతృభూమికిచెందిన సిక్కులు ఆ ప్రదేశంలో నివసించే ప్రజలతోకలసి స్వయంనిర్ణయహక్కును పొందవచ్చునని కమ్యూనిస్టుపార్టీ గ్యారంటీచేస్తోంది. స్వతంత్రభారతదేశంలో ఐక్య–స్వతంత్ర–బెంగాల్ నిర్మాణాన్ని కమ్యూనిస్టుపార్టీ బలపరుస్తుంది."

"బెంగాల్ ముస్లిములకు, బెంగాలీ హిందువులకుగూడా బెంగాల్ మాతృభూమి. వయోజన వోటింగుతో ఎన్నుకోబడిన ప్రజాపరిషత్తుద్వారా తన స్వయంనిర్ణయహక్కును అమలుపరుచుకోడానికి, తక్కిన భారతదేశంతో సంబంధాలను ఏర్పరచుకోడానికి, బెంగాలుకే పూర్తిహక్కు ఉండాలి."



## విస్పష్టమైన కమ్యూనిస్టుపార్టీ వైఖరి

మాపార్టీ కాంగ్రెసును ఏయే విషయాల్లో బలపరుస్తుందో, లీగును ఏయే విషయాల్లో బలపరుస్తుందో, ఏయే విషయాలలో పై రెంటితో భేదిస్తుందో స్పష్టంగా గుర్తించాలి.

బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి వెంటనే అధికారం భారతీయుల చేతుల్లోకి రావాలి అనే విషయంలో కాంగ్రెసుతో పూర్తిగా ఏకీభవిస్తుంది. "భారతదేశంలోఉన్న ప్రజలందరికి (జాతులు) స్వయంనిర్ణయసూత్రం వర్తిస్తుంది అనే ప్రాతిపదికమీద స్వాతంత్రపోరాటం జరగాలి" అనే విషయంలో లీగుతో పూర్తిగా ఏకీభవిస్తుంది.

'స్వయంనిర్ణయ సూత్రాన్ని భారతజాతులన్నింటికి వర్తింపజేయాలి' అనే సూత్రాన్ని కాంగ్రెసు నిరాకరిస్తూ ఉన్నందువల్ల ఈ విషయంలో మేము కాంగ్రెసును బలపర్చం.

లీగుకోరే ఆరు రాష్ట్రాల్నిగానీ, న్యాయసమ్మతంగాని సరిహద్దుల్నిగానీ. మేము అంగీకరించము. దేశాన్ని విభజించడంవల్లనే ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు సర్వాధికారాలు లభిస్తాయి, అనేవిషయంలో లీగుతో మేముపూర్తిగా భేదిస్తున్నాం.

కాంగ్రెసు లీగు కోరికలకు, మాసూచనకు ఎక్కడ ప్రత్యేకతఉందో ఈదిగువ నుదహరిస్తాను.

1. బ్రిటిష్ప్రభుత్వంపోయి ఇండియాకు సంపూర్ణాధికారం ప్రాప్తించాలని మనమంతా కోరుతున్నాం. ఈ సంపూర్ణాధికారంలోనే అన్ని జాతులకు స్వయంనిర్ణయాధికారంకూడా ఉండాలని అన్నిజాతులకు తమతమ ఇష్టానుసారం అభివృద్ధిపొందే అవకాశం ఇవ్వాలనీ మేము గట్టిగా తెలియజేస్తున్నాం. ఏ ఒకజాతి (ప్రజలు) మీద బలాత్కారంగా ఎటువంటి ప్లాను రుద్దగూడదు.

2. బ్రిటిష్ ప్రభుత్వాన్నుంచి సంపూర్ణాధికారం లాక్కోవడంకోసం చేతులుకలిపేముందు జాతుల స్వయంనిర్ణయ సూత్రానికి దేశవిభజనే ప్రాతిపదికగా మేము అంగీకరించం. స్వయంనిర్ణయసూత్రమంటే విభజన అనుకోవడం 19వ శతాబ్దపునాటి మాట. తోటిసోదరులందరిని ఐక్యం చేసి మన అందరకి సమానశత్రువయిన ప్రభుత్వాన్ని కూలదోయడమే 20వ శతాబ్దపు స్వయంనిర్ణయసూత్రానికి మూలసిద్ధాంతం. 19వ శతాబ్దపు నాటి భావన పెట్టుబడిదారీవిధానం అభివృద్ధిచెందిన దాని ఫలితంగాను, దురాక్రమణకు తలపడిన సామ్రాజ్యవాదఫలితంగాను ఏర్పడింది. 20వ శతాబ్దపునాటి భావన సోవియట్ ప్రజాస్వామికం సుస్థిరంగా పాదుకొనడం వల్లను, నేడు కొత్తగా ఏర్పడిన యూరప్‌లో జాతీయకలహాలు అంతరించిన దాని ఫలితంగాను ఏర్పడింది.

స్వాతంత్ర్య కాముకులైన భారతీయులందరు ఈ సూచనలను గురించి చర్చించవలసిందని కోరుతున్నాం. వీటితో పూర్తిగా ఏకీభవించినా ఏకీభవించకపోయినా, ఇండియన్‌పార్టీలు తమతమ ఆశయాల్ని గుర్తించడానికి ఇదొక చక్కనిప్రాతిపదికగా ఉపయోగిస్తుందని మేము ఆశిస్తున్నాం.

మా ఎన్నికలప్రణాళికలో ఈవిధంగా సూచించబడింది.

"ముస్లిములు మెజారిటీగాఉన్న ప్రాంతాలను ఒక ప్రత్యేక ఫెడరేషన్‌గా ఏర్పరచుకోవాలి. అట్టి ముస్లింఫెడరేషన్ హిందువులు మెజారిటీగా ఉన్న ప్రాంతపు ఫెడరేషన్‌తో స్నేహసంబంధాలను పెట్టుకోవచ్చు. అంతేగాని, ఒకే అఖండ భారతదేశంలో ఉండాలని కోరగూడదు. ఇలా లీగు ప్రచారం చేసుకోవచ్చు."

"స్వపరిపాలన కలిగిన (సంపూర్ణ స్వాతంత్ర్యంకాదు) రాష్ట్రాలతో (యూనిట్లతో) కూడిన ఫెడరల్ ఇండియన్ యూనియన్ ఉండాలని కాంగ్రెసు ప్రచారంచేసుకోవచ్చు."

"ప్రజాస్వామ్య సూత్ర ప్రాతిపదికపైన, వివిధ స్వతంత్ర జాతీయ ప్రజాపరిషత్తులు తమంతటతామే ఐచ్ఛికంగాకలిసి ఉండే యూనియన్‌కై మా పార్టీ ప్రచారం చేసుకుంటుంది. అట్టి యూనియన్‌లో బాగా అభివృద్ధి



చెందిన ప్రాంతాలు తక్కువ అభివృద్ధిచెందిన ప్రాంతాలకు ఫెడరల్ కేంద్రం ద్వారా సహాయంచేయాలి"

"ప్రతిపార్టీ సూచించే విధానానికి ప్రజలే పరిష్కారమార్గాన్ని నిర్ణయించాలి. ఎందువల్లనంటే ప్రజాబలం ఉన్న వివిధపార్టీల మధ్య అపనమ్మకాలు ఉన్నప్పుడు ఇదొక్కటే మార్గం."

"మనకందరికీ శత్రువైన పరాయివానితో స్వాతంత్ర్యపోరాటాన్ని సంయుక్తంగా సాగించడానికి వివిధపార్టీలు కలవాలి. అందుకై అన్ని పార్టీలు కలిసి ఒడంబడిక గావించుకోడానికి అభిలాష, కృతనిశ్చయాన్ని చూపించాలి. కాబట్టి తీవ్రంగా వివిధపార్టీలు పరస్పరం సంప్రదింపులు సాగించి ఒక నిర్ణయానికి రావాలి."

మన పార్టీలలో అభిప్రాయభేదాలున్నాయి అనేవిషయం ఎవరు కాదంటారు? ప్రధానపార్టీలే తమలోతాము కలహించుకుంటూ ఉంటే నిర్ణయించేది ప్రజలుగాక మరెవ్వరు? ప్రజా నిర్ణయానికి ఉభయులు బద్ధులుగావడం. మినహా మరే గత్యంతరం ఉంది?

ఇంతకు మినహా మనకు మరే మార్గంలేదు. నిర్ణయించే అధికారం ప్రజలకు లేదంటే ఇక ఎవరికివారే తమది న్యాయంఅనుకొని ఒకళ్లొకళ్ళ గొంతులు కోసుకోవాలిసిందేనా?

## భారతీయ ప్రజాస్వామిక సమస్య

మన జాతీయజీవితంలో ప్రజాస్వామిక సూత్రాన్ని ఎలా వర్తింపజేయాలో సరిగా అవగాహన చేసుకోలేకపోతే ఇండియాకుగానీ, ఇండియాలో ఉన్న ఏ ప్రజలకుగానీ సంపూర్ణాధికారం లభించదు. జాతుల స్వయంనిర్ణయ సూత్రాన్ని ముందు క్షుణ్ణంగా అర్థంజేసుకోవాలి. శాస్త్రీయ సిద్ధాంతంమీద ఆధారపడిన స్వయంనిర్ణయ సూత్రంద్వారానే మనం యీ సమస్యను పరిష్కరింప గలుగుతాం.

19వ శతాబ్దారంభంనుంచి—భారతదేశంలో నవయుగ ప్రభాతం అయినప్పటినుంచి మనల్ని ఈ సమస్య ఎదుర్కొంటూనే ఉంది. మన

నాయకులు స్వాతంత్రం కోరినప్పుడల్లా బ్రిటిష్ ప్రభుత్వం ఏమని సమాధానం యిస్తూ వచ్చింది? "మనమింకా వెనకబడ్డ ప్రజలమట. మనలోమనం దెబ్బలాడు కుంటున్నామట. మనమింకా ఆధునిక జాతిగా అభివృద్ధి పొందలేదట. ప్రజాస్వామిక సూత్రంతో దేశాన్ని పరిపాలించు కోలేమట" యీ విధంగా జవాబుచెప్పుతూ వుండేది. బ్రిటిష్‌గవర్నమెంటు, 'స్వంత' పాఠశాలల్లో విద్యనార్జించిన కొద్దిమంది పైతరగతి యువకుల్ని మినహాయిస్తే మిగతాప్రజలు వోటుజేయడానికి తగరట,

మన స్వాతంత్రోద్యమం ప్రారంభమైన మొదటిరోజుల్లో బ్రిటిష్ ప్రభుత్వం ఇలాంటి సాకులే చెప్పుతూ ఉండేది. తర్వాత కాంగ్రెసు స్థాపించబడింది. ఇండియాకుకూడ ప్రజాస్వామిక సూత్రం వర్తింపజేయాలని బ్రిటిష్‌ప్రభుత్వాన్ని అడిగింది, "ప్రజాస్వామికపద్ధతి బ్రిటనుకు ఉపయోగించినప్పుడు ఇండియాకు మాత్రం ఎందుకు ఉపయోగపడదు? అని ఆరోజుల్లో కాంగ్రెసునాయకులు ప్రభుత్వంతో వాదించేవారు,

కాంగ్రెసు క్రమక్రమంగా దేశమంతటా బలపడింది. ఆర్థికంగాను వైజ్ఞానికంగాను ముందున్న హిందువులు కాంగ్రెసులో ప్రధానపాత్ర వహించారు. మహమ్మదీయుల్లో నూతన జాతీయ చైతన్యాన్ని కలిగించిన సర్ సయ్యద్ మహమ్మద్‌లాంటి ప్రముఖుడే "ఒక మనిషికి ఒకవోటు" అనే సూత్రం ఇండియాకు పనికిరాదని చెప్పాడు. 'ఒక మనిషికి ఒక వోటు' ఇవ్వడంవల్ల మొత్తందేశంలో హిందువులదే మెజారిటీకాబట్టి మహమ్మదీయులకు అన్యాయం జరుగుతుందని అయన అభిప్రాయం. ఆనాడు నాటబడిన బీజమే నేటికి ఇంకా పెరిగి పెద్దదై కాంగ్రెసు లీగు ప్రతిష్ఠంభనకు కారణభూతమయింది.

మనకువర్తించే సర్వోత్తమమైన ప్రజాస్వామిక సూత్రమేది? ఏ ప్రాతిపదికమీద మనం ఆధారపడాలి? చైతన్యవంతులయిన మహమ్మదీయులందరు సయ్యద్‌లాగే కాంగ్రెసునుజూచి భయపడ సాగారు.

భారతదేశంలో నూతన యుగానికి పునాదివేసిన ప్రముఖులు ఆ రోజుల్లో ప్రతివిషయాన్ని మతావి కన్వయించే మాట్లాడుతూ ఉండేవారు.



ఆలాగే ప్రజలకు బోధించేవారు. అది ఆనాటి యుగధర్మం. ప్రజల్లో మళ్ళీ నూతనస్ఫూర్తి రేకెత్తించడానికి మరచిపోయిన వెనుకటి మహత్తర చరిత్రను జ్ఞప్తికితెచ్చేవాళ్లు. నిరాశతో కుంగిపోయే ప్రజల్లో ఒకనూతనోత్సాహాన్ని కలిగించారు. ఈపునాదిమీదనే మనజాతీయోద్యమం నిర్మింపబడింది. క్రియాపూర్వకంగా ఏమీచేయకుండా నేడుకూడ ఆవెనుకటి 'మంత్రా'ల్నే జపిస్తూ కూర్చోవడం, మన పూర్వుల గొప్పతనాన్ని పొగుడుకోవడంతోనేప్రొద్దుబుచ్చుకోవడం ఈనాడు జాతీయ దురహంకారం అనిపించుకుంటుంది. ఈనాటిపరిస్థితుల్లోకూడా మన పూర్వుల గొప్పతనాన్ని తెగ పొగుడుకుంటూ తోటిసోదరుల్ని ద్వేషించడమంటే చివరకు మన అందరికి సమానశత్రువైన బ్రిటిష్‌ప్రభుత్వానికి దాసోహంఅనవలసివస్తుంది. కాబట్టి మనం రాబోయేభవిష్యత్తునుగురించి తీవ్రంగా ఆలోచించాలి. ప్రజల జీవిత పరిస్థితుల్ని అర్థం జేసుకోవాలి. నిజమైన చరిత్రమీద ఆధారపడాలి. స్వశక్తితో సంపూర్ణస్వాతంత్ర్యాన్ని సాధించాలి. ప్రజల ఇష్టానుసారం దాన్ని ఆచరణలోపెట్టాలి. మా స్వయంనిర్ణయసూత్రానికి ఇదే పునాది. నేటి భారతీయ ప్రజాస్వామికానికి వర్తించే సూత్రంకూడా ఇదే.

## బ్రిటిష్‌ప్రభుత్వం మన స్వాతంత్ర్యాన్ని హరించింది - మన జాతుల్ని విచ్ఛిన్నం చేసింది

తమ చెప్పుచేతల్లో మెలగే రాజాల, మహారాజాల సహాయంతోను, సైనిక బలంతోను బ్రిటిష్‌ప్రభుత్వం ఒక జాతిని మరో జాతిమీదికి కవ్వించి తన జిత్తులమారి ఎత్తుగడలతో ఇన్నాళ్లనుంచి మనమీద పెత్తనం చలాయిస్తూవుంది. కొందరిని పూర్తిగా తన తొత్తులుగా తయారు చేసుకుంది. మరికొందరిని తనమీదికి కత్తిగట్టకుండా మధ్యస్థులుగా మార్చుకోగలిగింది, 'విభజించి పాలించే' ఎత్తుగడలతో భారతదేశాన్ని జయించింది. ఆ ఎత్తుగడలతోనే ప్రతిజాతిని చీల్చి కొంతభాగాన్ని సంస్థానాధీశ్వరుల క్రింద అట్టిపెట్టింది. మరికొంత భాగాన్ని తన అధీనం క్రిందనే

ఉంచుకుంది. దీన్నే ఒకసారి గాంధీజీ 'భారతదేశానికి శాశ్వతంగా బాని సత్వం' అని వర్ణించాడు.

మన భారతదేశ పటాన్ని ఒకసారి పరిశీలించుదాం. మద్రాసు రాజధానిలో నాలుగుజాతు లున్నాయి. మలయాళీలు, తమిళులు, ఆంధ్రులు, కర్ణాటకులు. ఈ నాలుగుజాతులు మళ్ళీ చీలికలయ్యాయి.

మలయాళీజాతి మద్రాసు రాజధానిలోని ఒకజిల్లాలోను, కొచ్చిన్, ట్రావెన్‌కూర్, సంస్థానాల్లోను విభజించబడింది.

మద్రాసు రాజధానిలోని సర్కార్లలోను రాయలసీమలోను (11 జిల్లాలు) షుమారు రెండుకోట్ల ఆంధ్రులున్నారు. నైజాం నవాబు ప్రభుత్వంక్రింద 90 లక్షల ఆంధ్రులు నివసిస్తున్నారు.

కార్ణాటకుల పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది, నాలుగు ప్రాంతాల్లో మద్రాసు, బొంబే రాష్ట్రాల్లోను, హైదరాబాద్, మైసూరు సంస్థానాల్లోను— కర్ణాటకజాతి చీలికలై పోయింది. ఈ చీలికల్లోనే మళ్ళీ ఎన్నో పేలికలున్నాయి. ఒక్క బొంబేరాష్ట్రంలో ఉన్న కర్ణాటకులే జమ్‌ఖండీ, ముధోల్ రాందుర్గ్, అక్కల్‌కోట్, మొదలైన అనేక చిన్నచిన్న సంస్థానాల్లో వేరుగా ఉండిపొయ్యారు.

అసమాన ధైర్యసాహసాలు ప్రదర్శించి బ్రిటిషు వాళ్ళని ముప్పుతిప్పలు బెట్టిన మహారాష్ట్ర వీరజాతి ముక్కలు ముక్కలుగా తెగగొట్టబడింది. సి. పి. బీరార్ రాష్ట్రాల్లో 55 లక్షలు, హైదరాబాద్ స్టేటులో 36 లక్షలు, బొంబే రాజధానిలో ఒకకోటిమంది మహారాష్ట్రులు నివసిస్తూ ఉన్నారు. ఇంతవరకు ఈ చీలికలు చాలవా అన్నట్లు మహారాష్ట్ర మాతృభూమిలో ఇంకా కావలసినంతమంది చిన్నచిన్న రాజుల్ని సురక్షితంగా అట్టిపెట్టారు. ఈ చిల్లర సంస్థానాల్లో షుమారు 19 లక్షలమంది మహారాష్ట్రులున్నారు. గుజరాతీ జాతిని తీసుకొచ్చి మహారాష్ట్రులధికంగా ఉన్న బొంబేరాజధానితో ముడిపెట్టారు. గుజరాతీ జాతికూడా అనేక చీలికలై పోయింది. అనేకమంది రాజాలు మహారాజాలు గుజరాత్‌లో తమ నిరంకుశాధికారాన్ని నిరాఘటంగా సాగిస్తూ ఉన్నారు. బ్రిటిషు గుజరాత్‌లో



46½ లక్షలమంది ఉన్నారు' మిగతా గుజరాత్ రాష్ట్రం వెస్టరన్ ఇండియా ఏజెన్సీకి సంబంధించిన సంస్థానాల్లోను, కధియవార్‌లోని మూడు ఏజెన్సీలల్లోను, అసలు గుజరాత్‌కు సంబంధించిన 15 సంస్థానాల్లోను, ఇంకా ఇదేవిధంగా చిన్నచిన్న ముక్కలుగా విభజింపబడింది. బ్రిటిషు ప్రభుత్వం ఈ సరిహద్దుల్ని ఎంత దారుణంగా నిర్ణయించిందో తెలుసుకోడానికి ఈ చిన్న ఉదాహరణ ఒక్కటిచాలు. సర్గున అనే ఒక సంస్థానంలో మొత్తం జనాభా 18292.

అన్నిజాతులకు ఇలాంటి అధోగతే పట్టింది. ఈవిధంగా మన దేశం చిన్నచిన్న ముక్కలుగా తెగగొట్టివేయడం వల్ల మన జాతీయ జీవితమే ధ్వంసమై పోయింది.

## అభివృద్ధి నొందుతూ ఉన్న భారతీయ జాతులు

బ్రిటిష్‌వాళ్లు అడుగు బెట్టకపూర్వం మన దేశం ఏ స్వరూపంలో ఉందో మళ్లీ అదే స్వరూపంలో — ఇప్పటివరకు జరుగుతూఉన్న అభివృద్ధితో సహా — మన మాతృభూమిని తిరిగి సాధించాలి.

ఈ విశాల దేశంలో 17 జాతులు తమతమ ప్రత్యేక మాతృభూములలో నివసిస్తూ ఉన్నాయి, 1. బెలూచిస్తాన్, 2. పఠాన్‌భూమి, 3. సింధు, 4. పశ్చిమ పంజాబ్, 5. మధ్యపంజాబ్, 6. హిందూస్థాన్, 7. రాజస్తాన్, 8. గుజరాత్, 9. మహారాష్ట్ర, 10. కర్ణాటక, 11. ఆంధ్ర, 12, కేరళ, 13. తమిళనాడు, 14. ఒరిస్సా, 15. బెంగాల్, 16. అస్సాం, 17. బీహార్, సహజసిద్ధంగా అభివృద్ధిజెందిన ఈ 17 జాతుల్ని గుర్తించటం ఒక్కటే సరియైన పరిష్కారమార్గం. దీనివల్ల దేశం విభజించబడకపోగా సర్వసౌఖ్యాలవాలమైన స్వతంత్ర భారతదేశాన్ని నిర్మించడానికి ఇది చక్కని ప్రాతిపదికగా ఉంటుంది.

బ్రిటిష్‌వాళ్లు తయారుజేసిన నేటి కృత్రిమ సరిహద్దులు భారతీయ ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్నాయి. నేటి సరిహద్దుల్నే యధావిధిగా ఉంచాలని ప్రయత్నించడం ఒక మహాపరాధం అవుతుంది.

ఆధునిక జాతులుగా మన ప్రజలు అభివృద్ధి చెందుతూవున్న సమయంలో బ్రిటిష్‌వాళ్లు వచ్చి మన దేశాన్ని జయించుకున్నారు. మన భారతీయ జాతులు సక్రమంగా అభివృద్ధి చెందకుండా అనేక అభ్యంతరాలు కలిగించారు. మన మాతృభూముల్నిగురించి సహజంగా మనకొక అభిప్రాయం ఏర్పడింది.

బ్రిటిష్‌ప్రభుత్వాన్ని తీవ్రంగా ద్వేషిస్తున్నాం. స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్నాం. ఈ పోరాటంలో మన జాతీయాభిమానం సహజంగా మనలో ఒక నూతనోత్సాహాన్ని రగుల్కొల్పుతుంది. ఒక నూతన చైతన్యాన్ని కలిగిస్తూ ఉంది.

భారతీయులు తమతమ మాతృభాషల్లో, దేశం, రాష్ట్రం, ముల్క అని పిలుస్తూ ఉన్నారంటే అది ఆకస్మికంగా ఒకనాడు జరిగిన ఘటనకాదు.

జగత్ప్రసిద్ధి గాంచిన 'వందేమాతర గీతాన్ని' రచించిన బంకిం చంద్ 'సప్తకోటి' (7 కోట్ల బెంగాలీలు) అని పేర్కొన్నాడంటే, అది ఒకనాడు హఠాత్తుగా ఏర్పడిన భావంకాదు.

విశ్వకవి రవీంద్రనాథ్ తన 'జనగణమన అధినాయక' అనే గేయంలో 'పంజాబు సింధు గుజరాతీ మరాఠా ద్రావిడ ఉత్కళవంగా' అని వ్రాశాడంటే 'జాతి' భావం చారిత్రకంగా క్రమేణ అభివృద్ధి పొందింది గాని అమాంతంగా ఆకాశాన్నుంచి ఒక్కసారి ఊడిపడింది కాదు.

మన మాతృభూముల్ని గురించి మనం ఆలోచించేటప్పుడు సక్రమమైన సరిహద్దులతో స్వరాష్ట్రాలు ఏర్పడాలని: మన మాతృభూములు సిరిసంపదలతో పాడిపంటలతో సస్యశ్యామలంగా రాణించాలని తప్పకుండా అభిలషిస్తాం.

ఈ మాతృభూముల్లోనే మన మాతృభాషలు పుట్టి అభివృద్ధి చెందాయి. మన ఆధునిక విజ్ఞాన వికాసాలు వికసించాయి. మన దేశపటాన్ని శ్రద్ధగా ఒకసారి తిలకిస్తే మన మాతృభూములు ఎంత సహజసిద్ధంగా సరియైన భౌగోళిక సరిహద్దులతో ఏర్పడి ఉన్నాయో అందరికీ తేలికగా అర్థమవుతుంది. ఈ రాష్ట్రాలన్నీ ఆర్థికంగా స్వయంపోషకంగా ఉంటాయి.

ఈ 17 రాష్ట్రాలు వట్టి వైజ్ఞానిక సంబంధంగల ప్రాంతాలుమాత్రమే కావు. అవి ప్రత్యేకంగా అభివృద్ధి పొందుతూఉన్న జాతులు. బ్రిటిష్‌వాళ్లు రాకపూర్వమే అవి ప్రత్యేకజాతులుగా అభివృద్ధి చెందుతూఉన్నాయి. బ్రిటిష్‌వాళ్లు వచ్చి మన దేశాన్ని జయించి వాటిని చిన్నాభిన్నం చేశారు.

అనేకజాతుల కూటమిగాకుండా ఇండియాఅంతా ఒకేజాతి అనుకోవడం మన చరిత్రను సరిగ్గా అర్థం చేసుకోలేకపోవడమే అవుతుంది. సమాన హోదాలోగల అనేక జాతులతోగూడిన ఒక సమిష్టికుటుంబంగా ఇండియాను అర్థంజేసుకోగలిగి నప్పుడే మనం ఈ సుడిగుండంలోనుంచి బైటబడి దిగ్విజయంగా ముందుకు సాగిపోగలం.

స్వయంనిర్ణయాధికారం భారతదేశంలోఉన్న ప్రతి జాతికీ స్వతస్సిద్ధమైన జన్మహక్కుగా అంగీకరించాలి. ఈ స్వతంత్రజాతులు ఒకే కుటుంబంగా కలసి ఉంటానికి మనం ప్రయత్నించాలి. భారతీయ స్వాతంత్ర్యానికి భారతీయైక్యతకు ఇదొక్కటేమార్గం.

భారతస్వాతంత్ర్యమంటే భారతదేశంలోఉన్న అన్నిజాతులయొక్క స్వాతంత్ర్యం అనే ప్రాతిపదికమీద భారతీయైక్యతను నిర్మించాలి.

గత చరిత్రను సరిగ్గా అర్థంచేసుకోడానికి ప్రస్తుతం ఏర్పడిన అభిప్రాయభేదాల్ని తొలగించుకోడానికి ఇదొక్కటే శాస్త్రీయమైన చక్కని పద్ధతి. అన్నిజాతుల ఇష్టంమీద ఏర్పడిన ఐక్యతే చిరస్థాయిగా ఉంటుంది. స్వాతంత్ర్యాన్ని సాధిస్తుంది. మనలోఉన్న అభిప్రాయ భేదాల్ని పరిష్కరించుకోవడానికి ఇంతకు మినహా మరేమార్గం లేదు. మన స్వాతంత్ర్యానికి ఈ స్వయంనిర్ణయసూత్రమే పునాదిగా ఉండాలి. భారతదేశంలో ఉన్న అన్ని జాతులకు సమానహోదా ఇవ్వబడుతుంది. ప్రతి జాతి తన యిష్టప్రకారం తన భవిష్యత్తును నిర్మించుకోవచ్చు. తన విద్యా, విజ్ఞాన వికాసాల్ని పెంపొందించుకోవచ్చు.

అధిక సంఖ్యాకులుగా ఉన్న హిందువులు మహమ్మదీయులమీద పెత్తనం సాగిస్తారని లీగు భయపడుతూ ఉంది. అల్ప సంఖ్యాకులైన మహమ్మదీయులు అవిధేయతగా ప్రవర్తిస్తారేమో అని కాంగ్రెసు పందే

హిస్తూఉంది, ఈ ఉభయుల సందేహాల్ని నివారించడానికి పైన సూచించిన పద్ధతి ఒక్కటే సరియైన మార్గం. ఈ పద్ధతిని అవలంబించడం ద్వారానే భారతీయులందరం కలసి ముందడుగు వేయగలుగుతాం. అందరికి స్వాతంత్ర్యం లభిస్తుంది. నూతన ప్రపంచంలో భారతదేశానికి సముచితమైన స్థానాన్ని సంపాదించ గలుగుతాం.

భారతీయ ప్రజాస్వామికాన్ని నిర్మించుకోవడానికి ఇదొక్కటే సక్రమమైన పద్ధతి, బ్రిటిష్‌వాళ్లు పన్నే వలలో పడకుండా వుంటానికి మన ప్రజాస్వామికాన్ని మన ప్రజలే నిర్మించుకోవాలి. ఈ విధానంద్వారానే భారతీయులందరికి సంపూర్ణ స్వాతంత్ర్యం లభిస్తుంది,

ప్రజలే తమ ఇష్టప్రకారం తమ భవితవ్యాన్ని నిర్ణయించుకోవాలి. ప్రజలందరి ఇష్టంమీద కలసి మెలసి ఒక పెద్ద సమిష్టి కుటుంబంగా ఏర్పడాలి.

## ఇది ఒక్కటే పరిష్కార మార్గం

మనలో మనకు ఎలాంటి అభిప్రాయం భేదాలున్నా మనమందరం అంగీకరించే ప్రధాన విషయాలు కూడా కొన్ని వున్నాయి. ఈ సత్యాన్ని మరచిపోకూడదు అని భారతీయులందరికి మా పార్టీ హృదయపూర్వకంగా విజ్ఞప్తి చేస్తూఉంది.

1. మన అందరి హృదయాల్లో బ్రిటిషు విద్వేషాగ్ని ప్రజ్వరిల్లుతూ ఉంది. ఆ స్వాతంత్ర్య జ్వాలను ఆరిపోనివ్వకూడదు. బహిరంగంగా కానీ ఆంతరంగికంగా కానీ బ్రిటిషు సామ్రాజ్య వాదుల్ని విశ్వసించామా అంటే స్వాతంత్ర్య పోరాటంలో తమ ప్రాణాల్ని సైతం సమర్పించిన ఆదర్శమూర్తులైన హిందూ మహమ్మదీయ యోధులకు ద్రోహం చేసినవాళ్ళ మవుతాం.

2. సోదర భారతీయుల్లో స్వాతంత్ర్యాగ్నిని ఇంకా ప్రజ్వరిల్ల జేయాలి. దేశభక్తినంతా మనమే గుత్తకు తీసుకున్నామని భావించ గూడదు; దేశభక్తినంతా మన సొత్తే అనుకోవడంవల్ల స్వాతంత్ర్యాన్ని అభిలషించి స్వాతంత్ర్యం కోసం పోరాడే సోదర భారతవీరుల్ని మనతోపాటు కలుపుకొని రాలేకపోతాం. అభివృద్ధి నిరోధకులైన భారత టోరీల యాజమాన్యంక్రిందికి పోతాం.

3. మనలో మనం అన్యోన్యం విశ్వసించాలి. ఒకరిని ఒకరు నమ్మకపోవడమంటే చివరకు అంతాకలిసి ఏకంగా బ్రిటిష్‌టోరీలు పన్నిన వలలో చిక్కుకుంటాం.

మేము జేస్తూఉన్న ఈ విజ్ఞప్తి, మేము ఇస్తూఉన్న ఈ హెచ్చరిక స్వాతంత్ర్య పిపాసి అయిన ప్రతి భారతీయుని హృదయంలో ప్రతిధ్వనించాలి.

"మన దేశంలో ప్రధానపార్టీలైన కాంగ్రెసు లీగులు పరస్పరం కలహించుకుంటూ ఉంటే మీరు మాత్రం ఏమిచేయగల్గుతారు ?" అని అనేకమంది మిత్రులు మమ్మల్ని ప్రశ్నిస్తూ ఉన్నారు.

"రెండుపార్టీలు తమలో తాము అసహ్యంగా దెబ్బలాడుకుంటూ ఉంటే మూడవపార్టీ జోక్యం కలిగించుకొని ఐక్యతకోసం సర్వప్రయత్నాలు జేస్తూ ఉభయులచేత తుస్కరింప బడుతుంది" అనే విషయంగాదు మనమిప్పుడు చూడాలిసింది. మా ప్రణాళిక వెనకఉన్న బలం ఒక్క మా పార్టీదే కాదు. స్వాతంత్రాన్ని అభిలషించే ప్రతిభారతీయుడు ఇంతకు మినహా మరో గత్యంతరం లేదు. కాబట్టి క్రమేణ దీన్నే బలపరుస్తాడు.

1, తమ్ముడు తన అన్నల్ని గౌరవించినట్లే మాపార్టీకూడా కాంగ్రెసు లీగుల్ని గౌరవిస్తుంది. ఎన్నికలైన త్వరలోనే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల్నిగురించి కాంగ్రెసు లీగులకున్న భ్రమలన్నీ తొలగిపోతాయి. మరో సిమ్లానాటకం జరుగుతుంది. కాంగ్రెసు లీగులకు అప్పుడిక మరో గత్యంతరం ఉండదు. బ్రిటిష్‌ప్రభుత్వ ప్లానులకు లొంగిఅయినా పోవాలి. లేక కాంగ్రెసులీగులు తమలోతాము ఒక ఒడంబడికకైనారావాలి. మొదటినుంచి ఈతంతు జరుగుతూనేఉంది. బ్రిటిష్‌వాళ్ళమీద మొదట ఏవో ఆశలుపెట్టుకోవడం ఆశ నిరాశఅయిన తదనంతరం తమలోతాము రాజీకోసం ప్రయత్నాలు సాగించడం. ఈసారికూడా ఇంతే జరుగుతుంది.

మాపార్టీ వెనకఉన్న ప్రజలమీద మాకెంత విశ్వాసంవుందో కాంగ్రెస్ లీగుల వెనకున్న ప్రజలమీదకూడా మాకు అంతే విశ్వాసంఉంది. కాంగ్రెసు లీగుల్లోఉన్న ప్రజాసామాన్యంకూడా స్వాతంత్ర్యంకోసం తహతహ లాడుతూఉంది. ప్రజల్లోఉన్న ఆ స్వాతంత్ర్యపిపాసే మా ప్రణాళిక జయప్రదం గావడానికి సహాయభూతం అవుతుంది. ఒకవేళ మేము చెప్పేదాన్ని యివాళ పూర్తిగా అంగీకరించకపోయినా, ఇంతకు మినహా మరో గత్యంతరం లేదుగాబట్టి రేపుఅయినా అంగీకరించక తప్పదు. అప్పటికికూడ అంగీకరించకపోవడమంటే బ్రిటిష్‌సామ్రాజ్యవాదులకు బ్రతు కొనసాగనివ్వడమే అవుతుంది. స్వాతంత్ర్యానికి బదులుగా కొత్తరూపంలో మళ్ళీ బానిసత్వమే ప్రాప్తిస్తుంది. ఈనాడున్న తగాదాలు ఇంకా ఎక్కువ అవుతాయి. అప్పుడు మళ్ళీకొత్తసమస్యల్ని ఎదుర్కోవాలిసి వస్తుంది.

2. వయస్సులో మా పార్టీ కాంగ్రెసు, లీగుల కంటె చిన్నదే అయినా కాంగ్రెసు, లీగు ఉద్యమాల్లోఉన్న సత్సాంప్రదాయాన్ని మా పార్టీ ఇంకా ముందుకు తీసుకపోతూఉంది. హిందూ మహమ్మదీయ ఐక్యతను నిర్మిస్తూఉంది.

1857 ప్రథమ స్వాతంత్ర్య పోరాటంలో మన తాతలు, ముత్తాతలు హిందువులు - మహమ్మదీయులు భుజం భుజం కలిపి పోరాడిన ఆ గౌరవ ప్రతిష్ఠల్ని కాపాడాలి. హిందూ మహమ్మదీయులు కలిసి 1920 లో సాగించిన మహత్తరఉద్యమంలో మనతండ్రులు ఏ లక్ష్యాన్ని సాధించడం కోసం పాటుపడ్డారో ఆలక్ష్యాన్ని మనం మన హయాంలో సాధించాలి.

ఇందుకు కావలసిన బలాన్ని మనం తప్పకుండా చేకూర్చుకోగలం. అఖిలభారత కిసాన్‌సభ, అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్‌లో ఆదర్శప్రాయంగా హిందూ మహమ్మదీయైక్యతను నిర్మించగలిగాం. ఈ సత్సాంప్రదాయాన్నే ఇంకా ముందుకు తీసుకపోతాం.

25 సంవత్సరాలు కష్టించి, మా శక్తినంతా ధారవోసి ట్రేడ్‌యూనియన్ కిసాన్ సభలను నిర్మించాం. హిందూ మహమ్మదీయైక్యతను సాధించాం. ఈనాడు మన దేశంలో హిందూ మహమ్మదీయులు కలిసి



పనిజేస్తూఉన్న సంస్థలు ఈ రెండే అని ప్రతివాడూ అంగీకరించక తప్పదు. హిందూ మహమ్మదీయ కలహాలు నానాటికి హెచ్చు పెరిగిపోతూఉన్న సమయంలోనే మరోవైపు హిందూ మహమ్మదీయ ఐక్యతమీద ఆధారపడి ప్రజాసంస్థలు బ్రహ్మాండంగా బలపడ్డాయి. మన జాతీయ జీవితంలో ఒక భాగం అంధకారమయంగా వున్నా మరోభాగం ప్రకాశవంతంగా వుంది.

మా పార్టీ మన ప్రాచీన ఔన్నత్యాన్ని ఇంకా పెంపొందిస్తూఉంది. రైతు కూలీ ప్రజాసామాన్యంలో ఆనాడు వెలిగించిన హిందూ మహమ్మదీయ ఐక్యతా జ్యోతిని ఇతోధికంగా ప్రజ్వరిల్ల జేస్తూ ఉంది. హిందూ మహమ్మదీయ కలహాలు హెచ్చుపెరిగిపోవడమంటే, మన రాజకీయజీవితం మట్టిపాలైనట్టే. హిందూ మహమ్మదీయ ఐక్యతకోసం కృషిచేయడమంటే భారత రాజకీయ జగత్తులో ఉన్న చీకటిని పోగొట్టి వెలుతురును ప్రసరింపజేసినట్లవుతుంది. తుప్పుబట్టి పోయిన పాతపద్ధతులకు బదులు కొత్తపద్ధతుల కోసం, పరస్పర ద్వేషానికి బదులు సౌభాతృత్వంకోసం మా పార్టీ కృషి చేస్తూ ఉంది.

3. ఈ రెంటిలో చివరకు ఏపద్ధతి జయిస్తుంది? కాంగ్రెసు లీగుల ననుసరించే ప్రజాసామాన్య హృదయం స్వాతంత్ర్యభావ ప్రేరేపితం అనడంలో మాకెట్టి సందేహంలేదు. కాంగ్రెసు లీగులు కోరే న్యాయసమ్మతం గాని హక్కుల్ని తోసిపుచ్చి ఉభయులుకోరే న్యాయ సమ్మతమైన హక్కుల్ని బలపరిచేది మా పార్టీ ఒక్కటే.

బ్రిటిషు ప్రభుత్వాన్నుంచి కాంగ్రెసు కోరే భారత స్వయంనిర్ణయాధికారాన్ని మేము పూర్తిగా బలపరుస్తున్నాం. అదే లక్ష్యం కోసం మేము కూడా పోరాడుతున్నాం. మాసోదర కాంగ్రెసు వాదులకు మేము జేస్తూ ఉన్న విజ్ఞప్తి ఇది: బ్రిటిషు ప్రభుత్వాన్నుంచి భారత స్వయం నిర్ణయాధికారాన్ని కాంక్షించే మీరు అదే స్వయం నిర్ణయాధికారాన్ని భారతీయులందరికీ వర్తింప జేయడానికి ఎందుకు అంగీకరించరు?

ఈ విధంగా మాట్లాడమని లీగు మా చెవుల్లో నూరి పోసిందంటారా? మమ్మల్ని మీరు అభివృద్ధి నిరోధకులైన టోరీవర్గానికి చెందిన

ముతా అనగలరా? మాపార్టీ పుట్టినప్పటి నుంచి ఇండియాకు సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలని ఆందోళన జేస్తూనే వచ్చింది. కాబట్టి మీరు మమ్మల్ని టోరీలనలేరు. భారతదేశంలో రైతుకూలీ ఉద్యమాల్ని నిర్మించింది మేమే కాబట్టి మమ్మల్ని మధ్యయుగానికి చెందిన అభివృద్ధి నిరోధకులని కూడా మీరు అనలేరు. జాతీయోద్యమంలో అభ్యుదయభావాలతో అహోరాత్రులు కృషిచేసే నిజమయిన వర్కర్లని ప్రతివారూ అంగీకరించిన విషయమే.

ముస్లిం మెజారిటీ ప్రాంతాల్లో ముస్లిం స్వయంనిర్ణయాధికారాన్ని అంగీకరించాలని హిందువుల్లో తీవ్రంగా ప్రచారం చేసింది మా పార్టీ ఒక్కటే. లీగు నాయకులు మమ్మల్ని పూర్తిగా సందేహిస్తూఉన్నా. లీగు పత్రికలు మామీద దుమ్మెత్తి పోస్తూఉన్నా ఐక్యంచేయకుండా న్యాయమని మనస్ఫూర్తిగా నమ్మినదాన్ని మేము ప్రచారం చేశాం. మా కర్తవ్యాన్ని నిర్వర్తించాం. ఈ విషయం ప్రతి లీగుసభ్యునికి తెలిసేఉంది. అందువల్లనే లీగుసభ్యులు ఇతరపార్టీ లన్నిటికంటె కమ్యూనిస్టుపార్టీనే ఎక్కువగా గౌరవిస్తూ ఉంటారు. స్వయంనిర్ణయ సూత్రాన్ని ప్రచారం చేయడంలో మేమెన్ని యిబ్బందుల్ని ఎదుర్కొన్నామో. ఎన్నిబాధలు పడ్డామో. ప్రతి లీగు సభ్యునికి తెలుసు. మన రాజకీయాల్లో నేడు హిందూ మహమ్మదీయులు దాదాపు పూర్తిగా చీలిపొయ్యారు. కాబట్టి మహమ్మదీయులు తమ జన్మహక్కును గురించి హిందువుల్లో ప్రచారం చేయలేక పొయ్యారు. హిందువుల సహాయ సానుభూతుల్ని సంపాదించలేక పొయ్యారు. మాపార్టీ ఏ ఒక కులానికి. మతానికి' చెందని పార్టీ కాబట్టి మహమ్మదీయుల జన్మహక్కును గురించి హిందువుల్లో తీవ్రంగా ప్రచారం చేయగలిగింది. ఈ విషయాలన్నీ యదార్థంగావని ఏ ముస్లిం ముఖాముఖి నిరాకరించి మాట్లాడలేడు.

మహమ్మదీయులు కోరే స్వయం నిర్ణయాధికారంలో ఉన్న న్యాయాన్ని న్యాయబుద్ధితో మేము అంగీకరిస్తున్నాం. అదే న్యాయ బుద్ధితో అందులో వున్న లోపాల్నికూడా లీగు సభ్యులకు తెలియజేసే



అధికారం మాకుంది. ఆరు రాష్ట్రాలు మా పాకిస్థాన్ కిందికి రావాలనడం శుద్ధ అన్యాయం. 'స్వతంత్ర భారతదేశంలో ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు కూడా స్వతంత్రాధికారం' అని మేము చెప్పే న్యాయసూత్రాన్ని అంగీకరిస్తే దీన్ని స్వాతంత్ర్య కాముకుడైన ప్రతి భారతీయుడు బలపరుస్తాడు. ఇండియాను విభజించమని బ్రిటిష్ ప్రభుత్వాన్ని ప్రాధేయపడడం మానెయ్యాలి. స్వాతంత్ర్యాన్ని అభిలషించే భారతీయు లందరితో భుజం భుజం కలిపి ముందు భారత స్వయంనిర్ణయాధికారానికి పోరాడాలి. బ్రిటిష్ప్రభుత్వాన్ని నమ్ముకొని కూర్చుంటే, వచ్చేది స్వయంనిర్ణయాధికారం కాదు. కొత్తరూపంలో మళ్ళీ బానిసత్వమే సిద్ధిస్తుంది. హిందూ మహమ్మదీయ సమిష్టి పోరాటంద్వారానే స్వతంత్ర భారతదేశంలో స్వతంత్ర ముస్లిం మెజారిటీ ప్రాంతాలను సంపాదించుకోగలం.

4. కాంగ్రెసు లీగుల్లో ఉన్న నిజమైన ప్రజాస్వామిక వాదులు ఇంకా ఈ విషయాన్ని గురించి నోరు మెదపటల్లేదు. వారి కండ్లముందే మారిపోతూఉన్న పరిస్థితుల్ని వారు చూడకుండా ఉంటల్లేదు. కాని పాపం వారేమి చేస్తారు? వారి సంస్థల్లో కులతత్వవాదుల ప్రాబల్యం ఎక్కువై పోయింది. జమీందార్ల, పెట్టుబడిదార్ల పలుకుబడి నానాటికి పెరిగిపోతూ ఉంది. నిజమైన ప్రజాస్వామికవాదులు నిస్పృహాయస్థితిలో పడిపొయ్యారు.

హిందూదేశభక్త కుటుంబాల్లో పుట్టిన కమూనిస్టులు ముస్లిం వ్యతిరేక ప్రచారాన్ని ఏవిధంగా ఎదుర్కొంటారో, భారతస్వాతంత్ర్యం కోసం ఎంత నిజాయితీగా పోరాడుతూ ఉంటారో సోదర కాంగ్రెసు వాదులు గమనించాలి. ముస్లిం దేశభక్తకుటుంబాల్లో బుట్టిన కమ్యూనిస్టులు ముస్లిం మతపిచ్చను ఏవిధంగా ఎదుర్కొంటారో, 'ముస్లిం మెజారిటీ ప్రాంతాలకు స్వయంనిర్ణయాధికారం కావాలంటే ముందు భారత స్వాతంత్ర్యంకోసం భారతీయుల మందరం కలసి పోరాడాలి' అని ఎంతతీవ్రంగా ప్రచారంచేస్తూ ఉంటారో లీగుసోదరులు గమనించాలి. ఉభయపార్టీల్లో ఉన్న న్యాయసమ్మతమైన హక్కులకోసం అందరం కలసి పోరాడాలి. అలా గాని పక్షంలో మనఅందరికీ మళ్ళీ బానిసత్వమే గతి అవుతుంది.

కాంగ్రెసు లీగులతో మాకెన్ని అభిప్రాయ భేదాలున్నా కాంగ్రెస్ లీగులు మాపార్టీయెడల యెట్టి వైఖరి నవలంబించినా, మేముమాత్రం మా పార్టీ గౌరవాన్ని మాపార్టీ జెండాను రక్షించుకోవడంకోసం ఎంతతీవ్రంగా పోరాడుతామో అంతతీవ్రంగా కాంగ్రెసు లీగుకోరే న్యాయసమ్మతమైన హక్కుల్ని గాపాడడానికి ఒకళ్ళమీద ఒకళ్ళు కొనసాగించే దుష్ప్రచారాన్ని అరికట్టడానికికూడా అదేవిధంగా పోరాడుతాం. మన జాతీయ జీవితంలో ఇలాంటి అపూర్వ సంఘటన ఇంతకుపూర్వం ఎప్పుడూ జరిగియుండలేదు. మా ప్రయత్నం వృధాగాపోదు. పోవటల్లేదుకూడాను. ఉభయసంస్థల్లోను ఉన్నఉత్తమ సాంప్రదాయాల్ని కాపాడడానికి మేము కృషిచేస్తున్నాం. ఈవిషయాన్ని కాంగ్రెసు లీగుసభ్యులు కొందరు ఇది వరకే గుర్తిస్తున్నారు. ఇంకా మేము తీవ్రంగా కృషి చేసినకొలందీ మిగతా కాంగ్రెసు లీగు సభ్యులుకూడా మమ్మల్ని నిజమైన తమ సోదరులుగా భావిస్తారు. మేముసూచించే మార్గమొక్కటే అనుసరణ యోగ్యమైనదని గ్రహిస్తారు. అంతిమ పోరాటాన్ని జయప్రదంగా కొనసాగించడానికి ఈ నాడు విప్లవ కార్యక్రమం ఎంతోఅవసరం. కాంగ్రెసు లీగు సంస్థలను మా సోదర సంస్థలుగా భావించుకుంటున్నాం. భారతీయులందరికి సమానంగా న్యాయం జరగాలని విజ్ఞప్తి చేస్తున్నాం. రాజకీయ వాతావరణమంతా దూషణ ప్రతిదూషణలతో కలుషపూరితమై పోకుండా నిజాన్ని రుజువు చేయడానికి ఓర్పు వహించి పనిజేస్తున్నాం. విప్లవావశ్యకతను గుర్తించాం కాబట్టే ఈ విధంగా చేయగలుగుతున్నాం.

భారత కమ్యూనిస్టులమైన మేము మన ప్రజలు సాగించిన బ్రహ్మాండమైన స్వాతంత్ర్యోద్యమాల్లోనే జన్మించాం. "భారత స్వాతంత్ర్యం అంటే భారత ప్రజలందరి స్వాతంత్ర్యం" అనే నినాదాలతో ముందుకు సాగిపోతున్నాం. ఈనినాదంతో స్వాతంత్ర్యాగ్నిని ఇంకా తీవ్రంగా ప్రజ్వరిల్ల జేస్తున్నాం. స్వాతంత్ర్యాభిలాష ఇదివరకు మన ప్రజల్లో ఉండనే ఉంది. ఇప్పుడు కావలసిందల్లా స్వాతంత్ర్య పోరాటశక్తుల్లో ఐక్యత. ఈ వినాదాన్ని అంగీకరించడంద్వారా స్వాతంత్ర్య శక్తులన్నీ కలిసి పని



చేయడానికి ఒక చక్కని అవకాశం కలుగుతుంది. 'జెహాద్'లో మన పూర్వీకులైన మహమ్మదీయులు ఎంత గట్టి పట్టుదలతో తీవ్రంగాపోరాడే వారో 'ధర్మయుద్ధం'లో హిందూ యోధులు తమ ప్రాణాన్నికూడా తృణప్రాయంగా ఎంచి ఎటువంటి అసమాన ధైర్యసాహసాలు ప్రదర్శించేవారో టెర్రరిస్టులు ఎటువంటి వజ్ర సంకల్పంతో తమ లక్ష్యాన్ని సాధించడానికి అహోరాత్రాలు కృషిచేశారో, క్రిందటిసారి జరిగిన భారత విప్లవంలో ఎటువంటి అద్భుతమైన అపూర్వ ధైర్య త్యాగాలు ప్రదర్శించబడినవో; అటువంటి మహత్తర శక్తులన్నిటినీ సమీకరించి అంతిమ పోరాటానికి ఆయత్తంగావాలి. బ్రిటిష్ ప్రభుత్వాన్ని నిర్మూలించి స్వతంత్ర భారత ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించాలి.

మనం స్వతంత్రంగా జీవించాలన్నా, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పన్నాగాన్ని భగ్నంచేయాలన్నా, మన భవిష్యత్తును మనమే నిర్ణయించుకోవాలన్నా, కాంగ్రెసు లీగునాయకుల్లో నేడు ఎన్ని అభిప్రాయ భేదాలున్నా సరె భారతీయులందరం ఏకమై వెంటనే అంతిమపోరాటాన్ని సాగించాలి.

స్వాతంత్ర్యాన్ని సాధించడానికి వెంటనే ఆచరణ యోగ్యమైన, న్యాయసమ్మతమైన మా పార్టీ ప్రణాళికను స్వాతంత్ర్య కాముకులైన మీ ముందు ఉంచుతున్నాం. స్వతంత్ర భారతదేశంలో మన పల్లెలు పట్టణాలు విద్యావిజ్ఞానాలతో, పాడిపంటలతో, సిరిసంపదలతో తులదూగుతూ కళకళలాడుతూ ఉండాలంటే వెంటనే ఎటువంటి కార్యక్రమాన్ని అవలంబించాలో మా ఎన్నికల ప్రణాళికలో వివరంగా తెలియజేశాం. సంఘటిత కార్మికవర్గం విప్లవభావ ప్రపూరితులైన మధ్యతరగతి యువకులతో చేయి చేయి కలిపి అధికలాభపరుల దోపిడీ విధానాన్నుంచి పట్టణ ప్రజలను కాపాడాలి, ప్రజలరక్తాన్ని పీల్చిపిప్పిజేసి కరువుల్ని తెచ్చిపెడుతూ ఉన్న జమీందార్లనీ, షాహుకార్లనీ, తిండిదొంగల్నీ నిర్మూలించేఅందుకు సంఘటిత రైతుసంఘం గ్రామాల్లో ఉండే మధ్యతరగతి యువకులతో భుజంభుజంకలిపి పోరాడాలి, సర్వసౌఖ్యాల వాలంగా ఉండే గ్రామసీమల్ని నిర్మించుకోవాలి. తమ ఇష్టంవచ్చిన స్వాతంత్ర్యాన్ని నిర్మించుకోడానికి.

తమబిడ్డలు సౌఖ్యప్రదమైన జీవితాల్ని గడపడానికి, ప్రజలు కోరే న్యాయమయినహక్కుల్ని అంగీకరించి, స్వాతంత్ర్య పోరాటంలో వారిని కార్యోన్ముఖులుగా చేయడమే మాపార్టీ ప్రధానాశయం.

దేశంకోసం, మాతృభూమికోసం. తనపట్టణంకోసం. తనపల్లెకోసం తన స్వాతంత్ర్యంకోసం తన జీవితంకోసం సత్సాంప్రదాయాలు కలిగిన ప్రతి భారతీయుని హృదయం ఆరాట పడాలి.

పూర్వపు టౌన్నత్యానికి అనుగుణ్యంగా నడుచుకొనే ప్రతి భారతీయుణ్ణి ఈ మా విజ్ఞప్తి తప్పకుండా ఆకర్షిస్తుంది. స్వకీయ జీవితాన్ని అధికంగా ప్రేమించినకొలదీ ప్రతి భారతీయుడు తన ఉజ్వల భవిష్యత్తుకోసం తన బిడ్డల భవిష్యత్తుకోసం, తప్పకుండా పోరాడతాడు.

సాతంత్ర్య సైనికుడైన ప్రతి భారతీయుడు తన గత చరిత్రను ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకోవాలిసిందనీ, ఇన్నాళనుంచి కష్టపడి నిర్మించిన ఈ మహత్తర ఉద్యమాన్ని మనమే మన చేతులారా నాశనం చేయగూడదని హృదయపూర్వకంగా విజ్ఞప్తిచేస్తున్నాం. మనపూర్వపుటౌన్నత్యానికిమనం ఇంకా మెరుగుబెట్టాలి, రాబోయే తరంవారికి ఆదర్శప్రాయంగా ఉండాలి.

మనలో మనకు అంతర్యుద్ధం తగదనీ అందరం కలసి ఏకధాటిగ బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదుర్కోవాలనీ, మాపార్టీ హెచ్చరిస్తూ ఉంది. లొంగుబాటు స్వభావాన్ని మాపార్టీ తీవ్రంగా ఎదిరిస్తుంది.

ఈ భారితీయు లందరికి న్యాయం జరగాలనీ, పరమ పవిత్రమయిన భారత విప్లవ కార్యక్రమంలో భారతీయులందరూ కలసిమెలసి కదలి ముందుకురావాలనీ మాపార్టీ పిలుపు ఇస్తూవుంది,

సత్వరస్వరాజ్యసిద్ధికోపం, మన బిడ్డల యోగక్షేమాలకోసం. స్వాతంత్యపోరాటంలో తమ ప్రాణాల్ని సైతం బలిబెట్టిన విప్లవయోధుల పేరిట అంతిమపోరాటానికి కదలిరావాలిసిందని సోదర భారతీయులందర్నీ మా పార్టీ ఆహ్వానిస్తూఉంది.

---

ప్రజాశక్తిప్రెస్, మొగల్రాజపురం, బెజవాడ - కె. 13/సి. 10000 — 28-8-46

